I

G.V.P01Q114 Hi-8.4 Wi-5.4

# స్వర్ణయానం

## శ్రీ మండలి బుద్ధప్రసాద్

### అభినందన సంచిక

సంపాదకులు

గుత్తికొండ సుబ్బారావు

డా॥ జి.వి. పూర్ణచంద్

ఇమ్మడిశెట్టి రామకుమార్



ప్రచురణ

కృష్ణాజిల్లా రచయితల సంఘం



ప్రచురణ సౌజన్యం

ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు

ఛారిటబుల్ ట్రస్ట్

17

# SWARNA YAANAM

*A collection of Appreciations, Accomplishments, Achievements of*

**SRI MANDALI BUDDHA PRASAD**

Edited by :

**Guttikonda Subba Rao**

**Dr. G.V. Purnachand**

**Immadisetty Rama Kumar**

Published on 26th May, 2007

by

**KRISHNA DISTRICT WRITERS' ASSOCIATION**



Satnam Towers, Opp. Buckinghampet Post Office,

Governorpet, VIJAYAWADA - 520 002.

e mails : purnachandgv @ gmail.com

guttikondasubbarao @ yahoo.com

Cell Nos : 9440172642, 9985252616, 9441518715.



Published in Association with

**IMMADISETTI AKKESWARA RAO CHARITABLE TRUST**

Singarajuvari street, Vijayawada - 520 001.

# ఈ అయిదు పదుల పండుగ ఎందుకు?

కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు, రాష్ట్ర పశు సంవర్ధక, పాడి పరిశ్రమాభి వృద్ధి, పశువైద్య విశ్వవిద్యాలయం మరియు మత్స్యశాఖల మంత్రి శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఏభై ఒకటవ పుట్టిన రోజు సందర్భంగా జన్మదిన స్వర్ణోత్సవాభివందన సభను జరిపి ఇప్పటి వరకు జరిగిన ఆయన జీవనయానంలోని విశేషాల విశ్లేషణలు, సాధించిన విజయాలు, సమీక్షలు, అభినందనలు, అభిప్రాయాలను సమీకరించి "స్వర్ణయానం" పేరుతో ఒక గ్రంథంగా కృష్ణా జిల్లా రచయితల సంఘం తీసుకువస్తోంది.

ఈ అయిదు పదుల పండుగకు ఇంత ఆర్భాటం అవసరమా? అంటే ఎవరికైనా పూర్ణాయుర్దాయంలో సగం దాటిన సమయంలో అంతరంగ సమీక్ష అవసరమే. సామాన్యులు వారిలో వారు జరుపు కుంటారు. మాన్యుల విషయం వేరు. వారు ఇప్పటి వరకు ఏం సాధించారో లోకానికి తెలుసుకనుక ఈ పుట్టినరోజు పండుగను సమీక్షోత్సవంగా జరిపి వివిధ రంగాల్లో వారి కృషిని, పరిశ్రమను సమాజానికి వారి వలన కలిగిన ప్రయోజనాలను, వారందించిన సేవలను ప్రశంసించి అక్షరబద్ధం చేయటం ఒక సామాజిక అవసరంగా మేం భావిస్తున్నాం. భావి తరానికి ఆదర్శవంతమైన స్ఫూర్తి, ప్రేరణ, దిశానిర్దేశం చేయటానికి కల్యాణో త్సవంలో మహాసంకల్పంవలె ఇది ఉపయోగపడుతుంది. మన కృతజ్ఞతలు తెలియజేస్తూ వారి కర్తవ్యాలను గుర్తుచేసే పునరంకితోత్సవమే ఈ స్వర్ణోత్సవం.

శ్రీ మండలి బుద్ధప్రసాద్ నిబద్ధమైన ప్రజాసేవాదీక్షలో ప్రజల భౌతికాభివృద్ధికి, భాషా సాహిత్య సాంస్కృతిక చైతన్యం వలన కలిగే

మనోవికాసం తప్పనిసరి అని గమనించిన విశిష్ట నాయకుడు. స్వస్థాన వేషభాషాభిమానాలు సమైక్యతకు, సమగ్రాభివృద్ధికి దోహదం చేస్తాయని గుర్తించిన వ్యక్తి. ఆ దిశగా చిరస్మరణీయ కృషి చేసిన మహానాయకుడు కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారి బాటలో హంసలదీవి అభివృద్ధి, తుఫాను షెల్టర్లు, రోడ్లు, సాగునీటి సౌకర్యాలు, డెల్టా పరిరక్షణ ఉద్యమాలతో జనచైతన్యాన్ని సాధించగలిగారు. పులిగడ్డ -పెనుమూడి వారధి నిర్మాణం ద్వారా తడ నుంచి ఇచ్ఛాపురం కోస్తారాస్తా ప్రణాళికను సాకారం చేసి శాశ్వత ప్రయోజనాలను సాధించిన యువ నాయకుడాయన.

అదలా ఉండగా, తెలుగుభాష, సంస్కృతి, సాహిత్యం, కళలపట్ల అవగాహన, ఆసక్తితో బాల్యం నుండి పత్రికా సంపాదకుడుగా , రచయితగా ఎదిగిన వ్యక్తి. ఎన్నో సాంస్కృతిక సేవాసంస్థలలో ప్రధాన బాధ్యతతో జాతీయ తెలుగు రచయితల మహాసభలు, శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాలు వంటి విశిష్ట కార్యక్రమాలతో రాబోయే తరాలకోసం ఎన్నో గొప్ప గ్రంథాలు వెలువడటానికి పూనుకొని కృషి చేస్తున్నారు.

అందువలన పరమ వృద్ధులు, పెద్దలు, సమవయస్కులు, పిన్నలు ఎందరో ఆయనను ఆత్మీయతతో ఆశీర్వదిస్తున్నారు, అభినందిస్తున్నారు, ఆరాధిస్తున్నారు

ఎందరో పెద్దలు శ్రీ మండలిని ఆశీర్వదించడానికి విచ్చేయటం, ఎందరో కవి పండితులు, పాత్రికేయులు, కళాకారులు, సమాజ సేవకులు అసంఖ్యాకంగా తమ అనుభూతులను అక్షరబద్ధం చేసి అందజేయడం కృష్ణాజిల్లా రచయితల సంఘం అదృష్టంగా భావిస్తూ అందరికీ సవినయంగా కృతజ్ఞతలు తెలుపుతూ శ్రీ మండలి బుద్ధప్రసాద్ జీవనయానాన్ని ప్రపంచ వ్యాప్తంగా ఎదురుచూస్తున్న తెలుగువారికి సగర్వంగా సమర్పిస్తున్నాం.

- సంపాదకవర్గం

ఈ పుస్తకం రూపుదాల్చడానికి సహకరించిన

శ్రీ తాతా రమేష్ బాబు
డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్
శ్రీ గుడిసేవ విష్ణు ప్రసాద్
శ్రీ చందు
శ్రీ నరహరిశెట్టి నరసింహారావు
శ్రీ ఆలపాటి బాలసత్యసాయిరాం

ఫోటోలు అందించి సహకరించిన
**డా॥ టి. శ్రీనివాసరెడ్డి**
**ఫోటో ఇండియా, మ్యూజియంరోడ్, విజయవాడ -2**

తమ తమ రచనలు అందించిన
కవి పండితులు, సాహితీ మిత్రులు
అందరికీ కృతజ్ఞతలు

- సంపాదకవర్గం

VI



పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు

# శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి

**సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం**

## ఆశీర్వాద శ్రీముఖము

శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారు సహృదయులు, సాహితీ ప్రియులు. వారి తండ్రిగారు కృష్ణారావుగారి నుండి వారసత్వంగా సంక్రమించిన సంస్కారమిది. ఏభై సంవత్సరాలు నిండి స్వర్ణోత్సవాలు చేసుకుంటున్న ఈ శుభవేళ రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రి పదవి పొందటం సువర్ణానికి పరిమళం అబ్బినట్టుగా ఉన్నది. వారికీ వారి కుటుంబమునకు మా పీఠదేవత సిద్ధేశ్వరీ దేవి సిద్ధిపురుషులు శ్రీ మౌనస్వామి శుభములు ప్రసాదింతురు గాక!

నారాయణ స్మరణతో

సిద్ధేశ్వరానంద భారతీస్వామి
6/5/07

(సిద్ధేశ్వరానంద భారతీ స్వామి)

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణ రెడ్డి** ఎక్స్ ఎం.పి.
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
అధ్యక్షులు
**ఆంధ్ర సారస్వత పరిషత్తు**
తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001.
ఫోన్ : (ఆ) 24753724.

# అభినందన

సామర్థ్యంతో పాటు సముచిత సౌజన్యాన్ని మేళవించుకున్న ఉత్తమ వ్యక్తిత్వం శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌గారిది. కృష్ణాజిల్లాకు, ప్రత్యేకించి దివిసీమకు రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా అనేకవిధాలుగా సేవలందిస్తున్న బుద్ధ ప్రసాద్‌గారు స్థానిక శాసన సభ్యులుగా నిర్వహించిన పాత్ర గణనీయమైంది.

పూర్వ మంత్రివర్యులు, ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహా సభల ప్రధాన సూత్రధారులు మండలి వెంకట కృష్ణారావుగారి ఒరవడిలో వారి కుమారుడు శ్రీ బుద్ధప్రసాద్ చాలాకాలంగా పయనిస్తున్నారు. తండ్రి అలంకరించిన మంత్రి పదవిని తానూ ఇప్పుడు అలంకరిస్తున్నారు.

ఈ దశలో బుద్ధ ప్రసాద్ తండ్రికి తగ్గ తనయుడు. ముందు ముందు తండ్రిని మించిన తనయుడు అవుతాడనే సంపూర్ణ విశ్వాసం నాకుంది.

శాసన సభ్యుడుగా తెలుగు భాషకు ప్రాచీన హోదా కలిగించే విషయంలో కృషి చేయడంలోనూ, తెలుగు భాషా, సాహిత్యాల వికాసానికి భాగస్వామి కావడంలోనూ ఇన్నాళ్లుగా శ్రీ బుద్ధప్రసాద్ చూపుతున్న కార్యనిబద్ధత రానున్న రోజుల్లో మరింతగా దృఢపడుతుందని ఆశిస్తూ ఆత్మీయుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌కు నా హార్దికాభినందన అందజేస్తున్నాను.

(సి. నారాయణరెడ్డి)

# BLESSINGS

*Raja Achyuta DevaRayalu*
Anegondi House
NC Colony
Hospet
Bellary Dist.,
Karnataka.

Dear Sri Buddha Prasad,

I am extremely happy to learn that you have been given an opportunity to serve as Minister for Animal Husbandry, Dairy Development & Fisheries in the Govt., of Andhra Pradesh.

It is our duty to serve our Ancient National Heritage, particularly in Andhra Pradesh at the earliest. It was patronized by Great Saints, Rajas, especially sri Krishna DevaRaya of Vijayanagara Empire.

I wish all success in your sincere, honest and dedicated service to develop our Heritage.

With Regards,

Yours Sincerely,

*(Sri Achyuta DevaRayalu)*

IX

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

**Dr. A. Manjulata**
*Vice-Chancellor*

Lalitha Kala Kshetram
Public Gardens,
Hyderabad - 4 (AP)
Date : 21.5.2007.

## అభినందన

రాజకీయ రంగం ప్రజలకు సేవలందించి తరించే ఒక పవిత్రమైన రంగం. దేశ స్వాతంత్ర్యానికి పూర్వం ఎందరో మహానుభావులు తమ త్యాగాల ఫలితంగా మనకు స్వాతంత్ర్యాన్ని సముపార్జించి పెట్టారు. ఆ తరువాత దేశాన్ని అభివృద్ధి పథంలో నడిపించడానికి ఎందరో మేధావులైన రాజకీయ నాయకులు నడుం బిగించి ముందుకు వచ్చారు. వారి కృషి ఫలితంగానే ఈనాడు మన దేశం ఈ స్థాయిలో నిలిచి ఉంది.

అయితే ఇటీవలి కాలంలో రాజకీయరంగం పట్ల, రాజకీయనాయకుల పట్ల ప్రజలలో విశ్వాసం సడలిపోతుందనే అపవాదు ఒకటి ఉంది. అయితే వాటికి అతీతంగా ఈనాడు నిష్కల్మష హృదయంతో, నిస్వార్థంగా ప్రజలకు సేవలందించి, ప్రజలకోసమే జీవించే నాయకులు లేకపోలేదు. వారిలో ఒకరిగా యువనాయకులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారిని పేర్కొనవచ్చు.

వారి తండ్రిగారు కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారు మచ్చలేని రాజకీయ నాయకునిగా పేరు తెచ్చుకొని ప్రజలకు సేవలందించిన విషయం తెలుగువారందరికీ సువిదితమే. తెలుగు మహాసభల నిర్వహణలో, ప్రవాసాంధ్రుల తెలుగు భాషా సాంస్కృతిక పరిరక్షణలో, ముఖ్యంగా దివిసీమ పెనుతుఫాను బీభత్సంలో వారు సాహసంతో ముందుకు నడిచి ప్రజలకు అండగా నిలిచి సహకరించడం అందరూ ఎరిగినదే.

ఆ తండ్రిగారి స్ఫూర్తితో శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు ఈనాడు ఈ స్థాయికి ఎదిగి మంత్రిగా పదవి చేపట్టి ప్రజలసేవకు అంకితం కావడం అభినందించదగ్గ విషయం. అందుకు వారు చిన్నతనం నుంచే తండ్రిగారి వద్ద రాజకీయరంగంలోని మెళకువలను ఉగ్గుపాలతో అభ్యసించడం దోహదకారి అయింది. అన్నింటిని మించి నిస్వార్థ సేవా పరాయణత్వం, అంకిత భావం, చిత్తశుద్ధి ఇవన్నీ వారిలో స్వతహాగా పుంజీభవించి ఉన్నందువల్ల ఈనాడు వారు ఈ పదవిని పొందగలిగారు.

వారికి కేటాయించిన ఈ శాఖలో శక్తి కొద్ది ప్రజలకు సేవలందించి కీర్తి ప్రతిష్టలను ఆర్జించాలనీ, ఉజ్వల భవిష్యత్తులోకి సాగిపోవాలనీ మనసారా కోరుకుంటున్నాను.

(signature)

(ఎ. మంజులత)

X

# విషయదీపికలు

2

# MANDALI BUDDHA PRASAD, A MAN OF PEOPLE

***THE LAND***

Divi Seema is a place of civilizational significance and a cradle of human existence, since time immemorial, and the tales of yore cast a web of enchanting culture around many places in the region. This fantastic fairy tale quality of the land and its people present a deep and infinite sense of wonder, about everything related to the region.

***THE ORIGINS***

Divi Seema is now a part of the Avanigadda Mandal, and coming under Avanigadda Assembly constituency, represented by **Sri Mandali Buddha Prasad,** who is a chip of the old block Sri Mandali Venkata Krishna Rao, whose selfless services during the 1977 Devi Seema cyclonic storm, including resigning from the post of the Minister of Eduation, in order to stay close to the people dear to him in their plight, and his efforts to usher in quality and integrity in public life, have but few matches in the contemporary political scene.

Born on 26.06.1956, to parents Sri Mandali Venkata Krishna Rao, and Smt. Prabhavathi Devi , the young Prasad was groomed under the strict watch and careful tutelage of his father whose public activities and contacts with various sections of people have left him with little time for family life. Emulating his father Mandali Buddha Prasad had evinced great interest in the subjects of social work, literature and culture, right from the beginning.

Many scholars and important persons from different walks of life called on Mandali Venkata Krishna Rao, and seeing them all in flesh and blood in his formative years had left an indelible impression on Buddha Prasad.

### *SERVICE ACTIVITIES*

A graduate in arts, he had his baptism by fire in the filed of social service, when the killer cyclonic storm had struck the Krishna coast and left thousand dead and many more uprooted from their habitats, and left marooned in flood waters initially, and later on besieged with the health, livelihood and relocation problems. In the wake of this disaster, Buddha Prasad , at an young age of 21, strived with determination to render aid and help to the victims of tidal wave and cyclonic storm, that devastated Divi seema in 1977. In the process he assisted various voluntary organizations in the relief work. Since 1979, as the Secretary of Diviseema Deenajana Samkshema Samithi, Buddha Prasad is overseeing the management of an Orphans Home with 150 children and a Home for disabled with 10 inmates.

### *FIRST STEPS INTO PUBLIC LIFE*

An integrationist from the beginning, his political career was on a steady path of development and contact building in nature. A soft smile, composed conduct, steady voice, eyes taking in every detail, clad in starched whites, Buddha Prasad is a picture of inbuilt resilience and comforting harmony. A grass root worker of the party, whose career began with the post of the Executive Member of the Krishna District Youth Congress Committee, 1977-1985, with the sincerity of purpose, dedication and devotion to public causes, many posts in the party were held by him.

He was President, Avanigadda Mandal Congress Committee ( 1987-89), General Secretary, Krishna Disctict Congress Committee ( 1989-90), Executive Member, APCC, (1990-92).

### *ELECTION AS A PEOPLES'REPRESENTATIVE*

His first success at the electoral hustings was in 1999, when he was elected as the Member of Legislative Assembly, from Avanigadda constituency, where from he was returned to the Assembly during the elections in 2004 also..

He was also elected as the President of the Krishna District Congress Committee ( 1992-2005). He held the positions of the Joint Secretary, APCC during the period 1996-1997, and of the General Secretary, in the year 1997. Apart from the office of MLA, the other public office held by him are Member,

Public Accounts Committee, (2004) and Member, Delimitation Commission (2005).

*EMERGING AS A CRUSADER FOR DEVELOPMENT*

Bringing peoples' problems to the fore, was his forte from the beginning, and his sense of duty and taking up a just cause in the larger interest of people, made him a peoples' politician.

*PULIGADDA – PENUMUDI BRIDGE*

In the year 2003, protesting against the then Government's move aimed at shifting of the proposed location of the Puligadda - Penumudi Bridge, Buddha Prasad resigned to the seat of MLA and created ripples. A mass movement was initiated demanding the construction of the Bridge at the original location only, and the Government had agreed to the public demand, which was shaped and spearheaded by leaders like Buddha Prasad.

The result is the distance has come down by 152 KM by the construction of bridge saving fuel, time and travel weariness, and a National Highway 214 A came into public service from Narsapur to Ongole. This Puligadda - Penumudi Bridge was dedicated to the people and was named as Mandali Venkata Krishna Rao Vaaradhi, after his illustrious father.

*IRRIGATION PROBLEMS – KRISHNA DELTA*

In the year 2003 -04, the Krishna delta farmers faced acute shortage of water for agricultural purposes, not adequate even for one single crop. In their hour of distress and agony, Buddha Prasad coordinated the different political parties representatives at regional level, and farmers' associations, to group themselves as Delta Parirakshana Samithi. His hunger strike for five days until the government agreed to release the 10 thousand cusecs of water for agricultural purposes, and mass protests organised with ten thousand strong farmers has caught the attention of the State and made them realize the plight of the farmers in the famous rice bowl district of Andhra.

After the new Government has taken over under the leadership of Dr. Sri Y.S.Rajasekhara Reddy, necessary measures were taken to ensure adequate irrigation water for the yield of two crops. With the Pulichintala and Polavaram projects underway, the modernization of Krishna Delta is one of the priorities of the Government.

*PULIGADDA TO VIJAYAWADA - RIVER BUND ROAD DEVELOPMENT*

After considering the appeals made by Buddha Prasad, the Hon'ble Chief Minister when he visited the Tsunami hit areas, had granted 80 crores for developing the river bund road into two way from Puligadda to Vijayawada. The materialization of this road, is going to be a point of high developement for the district, increasing the connectivity between rural and urban regions of Krishna.

The Tsunami relief activities planned and undertaken by Buddha Prasad who has in depth study and experience of rural life in the lap of Krishna, had found a new helping hand from far away Germany.

*SCHOOL – CUM CYCLONE SHELTERS*

The Mayor of the Altlandsburg . a man of Telugu origins Sri Gujjala Ravindra, had funded the construction of four school-cum cyclone shelters in Divi Seema. Andhra Bank authorities have also come forward to provide four more such shelters. These multi-purpose buildings will serve as school buildings in normal times, and during the times of cyclones, people wil take shelter in these buildings.

*RELATED ACTIVITIES*

Child Welfare, Cultural activities, Gandhian constructive work, Literature and Culture, journalism, National integration and communal harmony are his active areas interest to name a few.

*CHILD WELFARE*

Believing firmly in the saying that children are our investment for tomorrow, Buddha Prasad, as President of the Diviseema Balananda Samajam since 1972, which is conducting competitions to inculcate scientific temper among children aiming at their holistic development. In pursuance of fostering the awareness on the subject of Child Welfare, he participated in the First World Telugu Conference, at Hyderabad in 1975 as a member of the Children's Cultural Committee, and he participated in a conference on the "National Policy on Children" in his formative years, on 25.08.1975, which was inaugurated by the then President of India, Fakruddin Ali Ahmad.

Buddha Prasad strived hard for the establishment of Andhra Pradesh Bala Academy, and he is on the Editorial Board of the Academy's magazine Bala. He also participated in the Third World Telugu Conference held in Mauritius in Dec. 1990.

***LANGUAGE, LITERATURE AND CULTURE***

His understanding of the importance of protecting and sustaining the Telugu bhasha ( language) reflect in his committed plan of action as the Vice-President of the Telugu Bhashodyama Samakhya, under the aegis of which many seminars and conferences were held regarding the development of Telugu language in the modern era.

Currently the President of Krishna District Writers' Association, he had planned and executed mammoth programmes of three day duration when the National conference of writers was held in October, 2006, and the mega event of Sri Krishna Raya Vaibhavam (The splendor of Krishnadeva Raya) for three days at Srikakulam. Both the programmes show cased the present challenges and summarized the historical past of language, literature and kingdoms.

***GANDHIAN ACTIVITIES***

Buddha Prasad is also equally known for his Gandhian way of social work, and is currently Secretary of the Gandhian Institute of Social Service, which has so far published ten tiles to spread the ideals of Mahatma Gandhi, apart from regular social work.

His journalistic skills are well proven in the monthly "Gandhi Kshetram" which he edited according to Gandian Philosophy.

***A NATIONALIST, A MAN OF AMITY AND PEACE***

He firmly supports National integration and communal harmony. To propagate these cherished ideals of the nation, as a founder President of the Grameena Yuvajana Vikasa Samithi, since 1982 , Buddha Prasad regularly organises Seminars, Cultural events, Exhibitions, debates, and state level drama competitions, involving people, intellectuals from various walks of the society.

***GOOD WILL TOURS & TRAVELOGUES***

He had visited Mauritius, China, Malaysia, Singapore, South Korea, Thailand, and Germany as part of the delegations of peoples' representatives, on

good will missions, to foster the amity and friendship between the peoples. Divi Itehaasika Praisodhaka Mandali, Krishna District Writers Association, and Emesco have published topical books compiled by him, his travelogues, and souvenirs brought out on the occasion of Divi Mahotsav and Krishna Mahotsav etc., which have drawn record number of crowds from all over the region.

***AWARDS***

A man of industry and hard work, a team man out and out, his leadership by example and self-less involvement in furthering the human knowledge in various branches of culture and regional significance, had brought the honour " BHARAT EXCELLENCE AWARD" his way, announced by the Friendship Forum of India, New Delhi on 29.07.1999.

Best Editor Award in 1987 from Andhra Pradesh Telugu Small Papers Association, Hyderabad

***A MAN HAVING MANY PROMISES TO KEEP....***

**Mandali Buddha Prasad**, a rare breed of politician, in the current times of turbulence, known for his gentle and suave manners is a man clearly on a mission to improve the quality in public life, through greater participation, in political, social, cultural aspects of life.

*His abilities and positive skills are now brought into more focus, with his induction into the State Cabinet, by the Hon'ble Chief Minister of Andhra Pradesh Dr. Sri Y.S. Rajasekhara Reddy. On 26.04 2007 Sri Buddha Prasad, has taken oath of office and confidentiality.*

It is the fond of hope of his countless supporters, admirers, friends, and well wishers that from this position of power, his services to the public, will receive a new depth of purpose and more identity with which the people can identify, and rally behind, proclaiming their support, for the good jobs and projects, in the interest of the State and the people of Andhra Pradesh.

○

# వారసత్వ పరంపరలో ప్రజాసేవా తిలకధారి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్

- శ్రీ కుక్కల నాగేశ్వరరావు
చైర్మన్, కృష్ణాజిల్లాపరిషత్

గౌరవనీయులు, నాకు మార్గదర్శకులు శ్రీయుత మండలి బుద్ధ ప్రసాద్ గారు ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజల మనిషి. ఇలా చెప్పేయగానే ఈ విశేషణం అందరికీ పూర్తిగా అన్వయించబడదు కానీ బుద్ధప్రసాద్ గారి విషయంలో ఈ మాట తూర్పున సూర్యుడు ఉదయించడమంత సత్యం. నిత్యం వారికి ఎటువంటి హోదాలూ లేకపోయినా తాము జీవిస్తున్న సమాజం ఉన్నత స్థితి చేరాలని తపించిన తమచుట్టూ వున్న అసంతృప్త పరిస్థితులను కేవలం నిందిస్తూ కూర్చోవడం కాక, తమకు చేతనయిన పద్ధతిలో చిరుదివ్వెలు వెలిగించిన సంస్కారులు మండలివారి తాతముత్తాతలు. వీరు సహజంగా కార్యవాదులు. 'వట్టిమాటలు కట్టిపెట్టి గట్టిమేల్ తలపెట్టవోయి" అన్న స్ఫూర్తిని స్వీకరించిన ఆచరణశీలత, వీరి కుటుంబంలో తరతరాలుగా వున్నది.

వీరి తాతగారయిన మండలి వెంట్రామయ్యగారు (1890-1969) కేవలం ఉపాధ్యాయ వృత్తిలో వుంటూ, నిస్వార్థంగా చేసిన ప్రజాసేవ, విద్యా సౌకర్యాల మెరుగుకోసం పడిన తపన, 1947 జూలై ఒకటో తేదీన వారు పదవీ విరమణ చేసినప్పుడు "ఉపాధ్యాయ పితామహ" బిరుదును తెచ్చిపెట్టాయి. పదవీ విరమణ అనంతరం చాలా మందిలా ఆధ్యాత్మికతకే పరిమితం కాకుండా, మండలి వెంకట్రామయ్యగారు 1948లో భావదేవరపల్లిలో పంచాయితీ స్థాపనకు కృషిచేసి ప్రథమాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. మూడు పర్యాయాలు అధ్యక్షులుగా వుండి గ్రామం చుట్టూ వున్న కాల్వలకు వంతెనలు, రోడ్లు, మంచినీటి బావులు పాఠశాల భవనాలు మున్నగు అనేక సౌకర్యాలు కలిగించారు. పశువుల ఆస్పత్రి, రూరల్ డిస్పెన్సరీ నెలకొల్పడానికి కృషి చేశారు. పెక్కు శ్రమల కోర్చి మోడల్ స్కూలు పెట్టించారు. ఉన్నత పాఠశాల సంఘానికి

అధ్యక్షులుగావుండి హైస్కూలు స్థాపనకు, భవన నిర్మాణానికి కృషి చేశారు. భావదేవరపల్లి, కమ్మనమోలు, మందపాకల ప్రాంతాలలో నీటి వనరులు, మురుగు కాల్వలు, రహదారి సౌకర్యాలు, పేదలకు బంజరు భూముల పంపిణీ మున్నగు ప్రజోపయోగ కార్యాలకు నిరంతరం శ్రమించారు. మండలి వెంకట కృష్ణారావు గారి సోదరులు. భావదేవరపల్లి సర్పంచ్ మండలి జనార్ధనరావుగారు తమ తండ్రిగారి గురించి "బంజరు భూములను ఆంధ్రలో మొదట పంచి పెట్టింది భావదేవరపల్లిలోనే. మా నాన్నగారు ఇంటిపనుల విషయంలో శ్రద్ధ వహించేవారు కారు. మా అమ్మ మహంకాళమ్మగారే నిర్వహించేవారు" అని తెలుపుతూ పేద రైతులకు బంజరు భూముల పంపిణీ విషయంలో వారు సాగించిన న్యాయపోరాటం కర్నూలు న్యాయస్థానంలో సఫలం అవడాన్ని విశదీకరిస్తారు.

(ఆధారం : "మానవ మాణిక్యం మండలి వెంకట కృష్ణారావు" గంధం సుబ్బారావు గారి పుస్తకం)

కేవలం ఉపాధ్యాయవృత్తిలో వుంటూ, గ్రామ ప్రాంత పరిధిలో వారి సాంఘిక చైతన్యం, సామాజిక కృషి, ఎన్నో రెట్లు ఎక్కువ స్థాయిలో జరిగిందని చెప్పుకోవచ్చు. ఇటువంటి సేవా పరాయణతగల తండ్రిగారి ప్రభావం, మండలి వెంకట కృష్ణారావు గారిపై ఎంతలా వుందో, వారు చిన్ననాటి నుంచీ ధరిస్తూ వచ్చిన వస్త్రాలగురించి చెప్పవచ్చు. 1939లోఅవనిగడ్డ బోర్డు హైస్కూ లులో ఆనాడు నేనూ, ప్రధానోపాధ్యాయుడు, మండలి వెంకట కృష్ణారావు ముగ్గురమే ఖద్దరు వస్త్రధారులు అని అవనిగడ్డ హైస్కూలు ప్రధాన తెలుగు పండితులుగా పనిచేసిన చిలకపాటి సుబ్బారావుగారు తెలిపారు. (ఆధారం : పైన పేర్కొన్న పుస్తకం)

మండలి వెంకట కృష్ణారావుగారిది బహు విశాలమయిన, గాంధీ తత్వప్రధానం అయిన సాధారణ జనకేంద్రం అయిన లోకదృష్టి. వారి క్రియాశీల కృషిని అతి దగ్గరగా గమనించే అవ కాశం గలవారు మండలి బుద్ధ ప్రసాద్‌గారు, వారి పెద్ద కుమారులు. తండ్రి, తాతల ప్రభావం, ఒక సామాజిక సంస్కారం, చేయాల్సిన పనుల పట్ల ఒక స్పష్టమైన అవగాహన, అవకాశాలను అంది పుచ్చు కుంటూ ప్రగతిశీలంగా ముందుకు సాగిపోవడం సంయమనం, ఓర్పు, నేర్పు వీటన్నిట్నీ వారి పూర్వీకుల నుంచి పుణికిపుచ్చుకున్న ఈతరం ప్రతినిధి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్.

కార్యదక్షుడు అయిన తండ్రి భుజాల మీదనుంచి ప్రపంచాన్ని అధ్యయనం చేసిన కుశలత వారిది. కాంగ్రెసు పార్టీలో కిందిస్థాయి కార్యకర్తగా మొదలయిన వారి ప్రజాసేవా జీవితం ఒక తెరిచిన పుస్తకంలా కొత్త పుటలు జతపడుతూ సాగిపోతున్నది. వారి ఇరవై ఒక్క ఏళ్ళ వయస్సులో దివిసీమ ఉప్పెన (1977) సందర్భంగా ప్రజాసేవా రంగంలోకి ప్రవేశించింది మొదలుగా, మండలి బుద్ధ ప్రసాద్ మన జిల్లా ప్రజలకు అంకిత యాత్రలా వారి ప్రజా జీవనాన్ని, తండ్రిగారి అడుగు జాడలలో మలుచుకున్నారు.

1979 నుంచి దివిసీమ దీన జన సంక్షేమ సమితి కార్యదర్శిగా నూట యాభయి మంది అనాధ బాలలు గల శరణాలయం వారి నిర్వహణలో వున్నది. కాంగ్రెసు పార్టీలో 1977-85 సంవత్సరాలలో కృష్ణాజిల్లా యువజన కాంగ్రెసు కమిటీ కార్య వర్గ సభ్యులుగా కొనసాగి రాజకీయ కార్యాచరణ, జన సమీకరణ, ప్రజాచైతన్య ప్రణాళికల చర్చచేయడంలో మండలి బుద్ధ ప్రసాద్ ప్రవీణులయ్యారు.

1987-89లో అవనిగడ్డ మండల కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా, 1989-90లో కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా, 1990-92లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ కార్యవర్గ సభ్యులుగా వారు నిర్వహించిన పదవులు, ఆయన దక్షత, సమన్వయశీలతకు గుర్తుగా వారికి లభించినవే కానీ వేరుకాదు.

1999లోనూ, 2004లోనూ అవనిగడ్డ అసెంబ్లీ నియోజక వర్గంనుంచి గెలుపు రెండుసార్లు శాసన సభ్యులుగా మండలి బుద్ధ ప్రసాద్ గారిలో విస్తార అనుభవాన్ని, సహజ పరిణతిని, నియోజక వర్గ పరిధిలోనే కాకుండా, జిల్లా అంతటా, రాష్ట్ర వ్యాప్తంగా మంచి పేరు తీసుకు వచ్చింది. ప్రజాజీవనంలో సంస్కారపు ఎల్లలు దాటి ప్రవర్తించని విలువయిన రాజకీయవేత్తలలో వీరు గుర్తింపు పొందారు.

1992-2005లో కృష్ణా జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా సేవలందించడమే కాకుండా 1996-97లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సంయుక్త కార్యదర్శిగానూ, 1997లో సాధారణ కార్యదర్శి (జనరల్ సెక్రటరీ)గా వీరు నిర్వహించిన సంస్థాగతమైన పదవులు ఎంతో కార్యకుశలతకూ, అన్ని వర్గాల వారిని కలుపుకుపోయే ప్రజాస్వామిక ధోరణికి నిదర్శనాలు.

కేవలం శాసన సభ్యులుగానే కాకుండా పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ సభ్యులుగా (2004) డిలిమిటేషన్ కమిషన్ సభ్యులుగా (2005) వీరు పదవులు నిర్వహించారు.

2003లో పులిగడ్డ-పెనుమూడి వంతెన నిర్మాణ స్థలం మార్పిడి ప్రతిపాదనలు రాగా, వాటిని సరైన కారణాలతో వ్యతిరేకిస్తూ ఎం.ఎల్.ఎ. పదవికి రాజీనామాచేసిన సందర్భం వారి ప్రజాపక్షం వహించే పోరాట పటిమకు దృష్టాంతం. ఈ వంతెనను ముందుగా ప్రతిపాదించిన చోటనే నిర్మించాలన్న జనాందోళన ఉధృతమై, ప్రభుత్వం ప్రజల న్యాయమయిన కోర్కెలకు అంగీకరించి నేషనల్ హైవే 214 ఎ గా ఈ పులిగడ్డ-పెనుమూడి వంతెనను నిర్మాణం చేసింది. ఫలితంగా 152 కి॥మీ॥చుట్టు తిరుగు ప్రయాణదూరం తగ్గి, నర్సాపూర్, ఒంగోలుల మధ్య నేరుగా రహదారి ఏర్పడింది. ఈ వంతెన మండలి వెంకట కృష్ణారావు వారధిగా ఇవాళ పిలవబడుతోంది.

కృష్ణా డెల్టా రైతుల పారునీటి సమస్యలు పరిష్కరించేందుకు 2003-2004లో, ఒక్క పంటకు కూడా తగు నీటిపారుదల సదుపాయం లోపించడంతో డెల్టా పరిరక్షణ సమితి పేరిట ప్రభుత్వం దృష్టికి తీసుకు వెళ్ళడం, పదివే మంది రైతులతో మహా ప్రదర్శన, అయిదురోజుల నిరాహారదీక్ష, మొదలగు శాంతియుత నిరసనా, ప్రతిఘటనా విధానాల ద్వారా-సరయిన నీరు సకాలంలో అందేలా పంటలు పండించే రైతుల ప్రయోజనాలు పరిరక్షించబడేలా, వీరు చేపట్టిన ఆందోళన ప్రభుత్వం స్పందించేలా చేసింది. ప్రస్తుతం డా॥ వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి గారి నేతృత్వంలో రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడ్డాక రెండు పంటలకూ తగినంతగా సాగునీరును అందించడంలో గణనీయమైన ప్రగతిని ప్రభుత్వం సాధించింది. ఇంకా పులిచింతల, పోలవరం ప్రాజెక్టుల పూర్తి ఫలితాలు, కృష్ణా డెల్టా ఆధునికీకరణ ఈ ప్రాంతానికి చెందిన ప్రభుత్వ ప్రాధమ్యాలుగా సజీవంగా వుంచడంలో మండలి బుద్ధప్రసాద్‌గారి వంటి ప్రజానాయకులు చురుకయిన పాత్ర పోషిస్తున్నారు.

ఇంకా పులిగడ్డ-విజయవాడ కృష్ణా కరకట్ట దారిని టూ-వే రోడ్డుగా అభివృద్ధి పరచడానికి గౌరవ ముఖ్యమంత్రి గారిచే ఎనభై కోట్ల రూపాయలు శాంక్షను, పాఠశాలలు మరియు తుఫాను సంరక్షణ కేంద్రాలుగా, జర్మనీకి చెందిన భారతీయ సంతతివారు శ్రీ గుజ్జల రవీంద్ర (మేయర్, ఆల్ట్‌లాండ్స్‌బర్గ్) గారి అభివృద్ధి నిధులతో దివి సీమలో నిర్మాణం పూర్తిచేయడం, అదే కోవలో ముందు కొచ్చిన ఆంధ్రాబ్యాంకు అధికారుల సౌహార్ద ప్రతిపాదనను స్వీకరించి వారిచే కూడా అటువంటి స్కూలు-కమ్-సైక్లోన్ షెల్టర్ల ఏర్పాటు జరిపించడం, ఇవన్నీ మండలి బుద్ధ ప్రసాద్‌గారి ప్రజా సేవలో అధ్యాయాలు.

మండలి బుద్ధప్రసాద్ గారు కోస్తా ఆంధ్రలో ఇవాళ తన వాణి, తన బాణీ బలంగా విన్పిస్తున్న సమైక్యవాది. వారి మూడుదశాబ్దాల ప్రజాసేవకు మరింత బాధ్యతలు అప్పగిస్తూ ముఖ్యమంత్రి డా॥ శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డిగారు ఇటీవలి మంత్రివర్గ విస్తరణలో వీరికి స్థానం కల్పించారు.

మండలి బుద్ధప్రసాద్‌గారు పశు సంవర్ధక శాఖ, పాల ఉత్పత్తులు, మత్స్యశాఖ పశు విశ్వ విద్యాలయం శాఖల మంత్రిగా పదవీ ప్రమాణ స్వీకారం చేసారు. కృష్ణాజిల్లాకు ఇదొక శుభ సందర్భం. కాలం ఒక ఆవృత్తం తిరిగినట్టే. ఒకే కుటుంబంలో తండ్రీ, తనయులు రాష్ట్ర మంత్రి పదవులు నిర్వహించడం విశేషం అయితే 1972లో శాసనసభకు ఏకగ్రీవంగా ఎన్నికయ్యాక మండలి వెంకట కృష్ణారావుగారు సాంఘిక సంక్షేమశాఖతో పాటుగా ఎంతో ప్రయోజనకరంగా మత్స్య శాఖను సైతం నిర్వహించి, మత్స్యకారుల జీవన అభ్యున్నతికి పలు పథకాలు అమలుపరిచారు. ముప్ఫయి అయిదేళ్ళ తరువాత మత్స్యశాఖ అమాత్యులుగా వారి కుమారులు మండలి బుద్ధ ప్రసాద్ పదవిని చేపట్టడంతో ఒక వృత్తం పూర్తయ్యింది. విస్తార

సముద్ర తీరంగల రాష్ట్రాలలో ఒకటిగా ఆంధ్రప్రదేశ్‌లో మత్స్యపరిశ్రమ సాధక బాధకాలను అర్థం చేసుకోవడానికి మంత్రిగారయిన బుద్ధప్రసాద్ గారికి విస్తార నేపథ్యం వున్నది. గ్రామీణ ప్రాంత జీవనానికి ఆధారభూతం అయిన పశు సంవర్ధనం, పాడి, మత్స్యశాఖ, వెటరినరీ యూనివర్సిటీ వంటి శాఖల ప్రజా ప్రయోజనశీలతను వారి దిశానిర్దేశంలో మరింతగా రాణింప చేస్తారని ఆశిస్తూ, వారి జన్మదినం 26-05-2007 సందర్భంగా కృష్ణాజిల్లా ప్రజలందరి తర పున జిల్లా పరిషత్తు అధ్యక్షునిగా, వారి విజయాన్ని, అభివృద్ధిని ఆకాంక్షించే సన్మిత్రునిగా నా హృదయపూర్వక శుభ కామనలు అందచేస్తున్నాను.

వారు సాహితీ సాంస్కృతిక పునరుజ్జీవన కార్యాచరణలో పెద్ద బాధ్యత వహిస్తున్న దార్శనికులు. తెలుగు భాషా వికాసం, భాషోద్యమ నిర్వహణ పేరిట భాషాశాస్త్రవేత్తలు, సాహిత్యకారులు, కళాకారులతో ఒక నూతన జాగృతికోసం అవిరళ కృషి చేస్తున్న దీక్షాధారి. గాంధీ క్షేత్రం పత్రిక సంపాదకులుగా, బాల సాహిత్య వికాసం కోసం పరిశ్రమిస్తున్న పూనిక వారిది. తెలుగు భాషోద్యమ సమాఖ్య ఉపాధ్యక్షులుగా వారు ఎన్నో సెమినార్లు, సభలు నిర్వహించారు. గాంధీ క్షేత్రం' పత్రిక సంపాదకత్వ నైపుణ్యాలకు 1987లో ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్న పత్రికల సంఘం వారిని ఉత్తమ సంపాదకులుగా గౌరవించింది.

పలు దేశాలు తిరిగి, వారి పర్యటనలలో అక్కడి ప్రజల జీవన రీతులను శ్రద్ధగా గమనించి, ఆయా దేశాలభివృద్ధి నమూనా లను ఆకలింపు చేసుకున్న అధ్యయన శీలత వారి సొంతం. దివి ఐతిహాసిక పరిశోధన మండలి, కృష్ణాజిల్లా రచయితల సంఘం, దివిసీమ బాలానంద సమాజం, గ్రామీణ యువజనవికాస సమితి వంటి అనేక సంస్థల అధ్యక్ష బాధ్యతలు నిర్వహిస్తున్న ప్రజ్ఞ వారిది దివిమహోత్సవాలు, కృష్ణామహోత్సవాలు జరిపి, రాష్ట్రం యావత్తు కృష్ణాజిల్లా సాంస్కృతిక చరిత్ర వైపు దృష్టిసారించేలా చేసిన సామూహిక కృషి రూపురేఖలు వారి చేతుల్లో ఆకారం సంతరించుకున్నాయి.

ఇటువంటి బహుముఖీన కృషి, నిరంతర జన జీవన పరిచయం, క్రియాశీల సంపర్కం గల ప్రజా నాయకులు రాష్ట్ర మంత్రిగా పదవి చేపట్టడం, మన జిల్లా వాసులకు, రాష్ట్ర ప్రజలకూ మేలు కల్గించేదిగా భావిస్తూ, వారి ప్రతి అడుగులోనూ విజయాల పరంపర, జన సంక్షేమం సాధించాలని వారికి నా ప్రగాఢ అభివాదాలు తెలుపుకుంటున్నాను.

○

# రాజకీయ దురంధరుడు శ్రీ బుద్ధ ప్రసాద్

- శ్రీ ఐలాపురం వెంకయ్య
శాసనమండలి సభ్యులు

ఏనాటి పుణ్య ఫలమోగాని ఆత్మీయుడైన శ్రీ బుద్ధ ప్రసాద్ నేటి రాజకీయాలలో మాకు లభించడం అదృష్టంగా భావిస్తున్నాను. నీతి నిజాయితీలుగల మచ్చలేని నాయకుడైన బుద్ధప్రసాద్ యువతరానికే కాదు వృద్ధ నేతలకు సైతం ఆదర్శ ప్రాయమైన వాడు. అతనిలోని మంచితనం, మానవత్వం, మమకారం, దరహాసం, మంచి అలవాట్లు అందరినీ కట్టిపడవేస్తాయి. నేస్తాలుగా చేస్తాయి. శ్రీ మండలి కృష్ణారావుగారు మాకు గురుతుల్యులు. నేను కాంగ్రెసు అభిమానిని గాంధీగారి సిద్ధాంతాల పట్ల ఆకర్షితుడనై స్వచ్ఛంద కార్యకర్తగా పనిచేస్తుండేవాడిని మండలి కృష్ణారావుగారు పి.సి.సి. కార్యదర్శిగా ఉన్నప్పుడు నన్ను పి.సి.సి. లోనికి తీసుకొని పి.సి.సి. మెంబరుగా నియమించారు. ఆనాటి నుండి వారితో కలసి పని చేసిన వాడిని. బుద్ధ ప్రసాద్‌గారితో నాకు అంత సాన్నిహిత్యం మొదట్లో లేదు. నా వయసుకు గౌరవం ఇస్తూనో, నాలోని ఏమి చూసోగాన్ని నాపైన ఎందుకోగాని అవ్యాజమైన అభిమానం చూపిస్తుంటారు ఆయన. అది వారి సంస్కారం. ఆయనకు సదా నేను ఋణపడి ఉన్నాను. వయస్సులో నాకన్నా చిన్నవాడైనా ఎంతో యోగ్యతగల్గిన వ్యక్తి ఆయన. ఆయనకు అన్నివర్గాల వారిని ఆదరించే మహత్తర గుణం వుండటం విశేషం.

ముఖ్యంగా నేను శాసనమండలి సభ్యునిగా ఏకగ్రీవంగా ఎన్నిక కావటానికి ముఖ్య కారకులు బుద్ధ ప్రసాద్. ఆయన పనిచేసే కార్యకర్తలను, పార్టీని నమ్మిన కార్యకర్తలను ఎంతో ఆదరణతో చూస్తూ వుంటారు.

ముఖ్యంగా బుద్ధప్రసాద్ డి.సి.సి. అధ్యక్షులుగా ఉండి పార్టీని నడిపించిన తీరు ఎంతో అనుభవం కలిగిన రాజకీయ దురంధరులకు గాని సాధ్యపడదు. ఆయనను చూసి మా వంటివారు ఎన్నో విషయాలు నేర్చుకోవాలి. రాజకీయపరంగా ప్రజలకు మేలు చేకూర్చే పనులు బుద్ధ

ప్రసాద్ ఎన్నో చేశారు. ఆయన ఏ పని చేసినా శాశ్వత ప్రణాళికతో ముందు చూపుతో చేస్తారేగాని తాత్కాలిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని చేసే మనిషికాదు. ప్రతిపనీ నిర్మాణాత్మకంగా తరతరాలు అనుభవించేలా చేస్తారు.

దశాబ్దాలుగా దివిసీమ ప్రజలు కలలుగన్న పులిగడ్డ-పెనుమూడి వారధి వేరే చోటికి తరలిపోయే ప్రమాదంరాగా ఆయన ఉద్యమాలు నడిపి శాసన సభ్యత్వానికి రాజీనామా సమర్పించి దానిని సాధించిన ఘనుడు, ఇది చాలు దివిసీమ అభివృద్ధికి ఆయన చేసిన సేవ.

కృష్ణాడెల్టా పరిరక్షణ సమితి కన్వీనర్‌గా అన్ని పార్టీలను కలుపుకొని 10 వేల మందితో ధర్నాలు నిర్వహించి ప్రకాశం బరాజ్ పై ధర్నాచేసి నిరాహారదీక్షలు చేసి కృష్ణా జిల్లా రైతాంగానికి రెండు పంటలకీ నీరు వచ్చేటట్లు చేసిన ఘనుడు శ్రీ మండలి.

అంతెందుకు పులిచింతల నిర్మాణ విషయంలో గాని, పోలవరం ప్రాజెక్టు నుంచి 80 టి.ఎం.సి.ల నీరు కృష్ణాకు రావటానికి ఏర్పాటు చేయుటగాని, విజయవాడ నుండి పులిగడ్డ వరకు 70 కి.మీ. దూరం రెండు లైన్ల రహదారి నిర్మాణానికి కృషిగాని ఈయన కృషి ఫలితమే. హంసల దీవి కృష్ణా సాగర సంగమానికి రహదారి సౌకర్యానికి 1 1/2 కోట్ల ఖర్చుతో ఏర్పాటు చేయుట ఆయన కృషే.

సునామీ విధ్వంసం తరువాత ప్రభుత్వ సహాయంతో పాటు స్వచ్ఛంద సంస్థలను సమన్వయించి తుఫాన్ షెల్టర్లు కట్టించారు. ఈయనను ఆదర్శంగా తీసుకొని నేడు ప్రభుత్వం ఇదే విధంగా రాష్ట్ర వ్యాప్తంగా చేయాలని ఆలోచిస్తున్నది.

ఇలా నిర్మాణాత్మకమైన పనులేకాక పార్టీ అభివృద్ధికి కార్యకర్తలను, నాయకులను కలుపుకుపోయే తీరుచూస్తే అందులో ఆయనకు ఆయనేసాటి. ఇటువంటి నాయకులు అరుదుగా ఉన్నప్పటికి అందరూ బుద్ధ ప్రసాద్‌ను ఆదర్శంగా తీసుకోవాలి. ఆయనకు నాలుగు శాఖలను అప్పగించిన ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డి గారికి ఆయనపైగల ప్రగాఢ విశ్వాసమునకు బుద్ధప్రసాద్ అందరూ ఆశ్చర్యపడేలా అభివృద్ధి చేసి చూపిస్తాడు. ఆయనకు నా ఆశీస్సులు.

○

# అక్షరాభినందన

- జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

అందగ సజ్జనులుండగ
నిండుగ భూమాత కరుణ నిరతము కురియన్
పండుగ జేయగ రాష్ట్రము
పండింపుము పాడి పంట పశుపతి మెచ్చన్

భువిలో దివిలో రవివై
పవివై కవివై ప్రజలకు స్వరమై వరమై
నవరీతుల పాలింపుమ
దివి మండలి నుండి తండ్రి దీవెన లీయన్

వరదుడు కాకుళ విష్ణువు
మరి మరి దీర్ఘాయు వీయ మహి మహిమలతో
సురుచిర శుభముల జయముల
తిరముగ స్వర్ణోత్సవంబు ద్విగుణంబగుతన్

○

# "ఆదర్శ యువనేత"

దివిసీమ పేరు చెప్పగానే బుద్ధప్రసాద్ గుర్తుకు వస్తారు. అవనిగడ్డ నియోజకవర్గ ప్రజలు అభిమానంగా "బాబు" అని పిలుస్తారు.

నేటి యువ నాయకుల్లో శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ విశిష్ఠ మైన వ్యక్తిత్వంకలవారు. గాంధేయవిధానాలు సేవాతత్పరత, మన సంస్కృతీ సంప్రదాయాల పట్ల ఎనలేని మక్కువ, అకుంఠిత కార్య దీక్ష, నీతి–నిజాయి తీలు ఊపిరిగా మనుగడ సాగిస్తూ ప్రజల కష్ట సుఖాల్లో పాలుపంచుకొనే సమసమాజ సేవా మూర్తి బుద్ధ ప్రసాద్. ఒక వాక్యంలో చెప్పా లంటే నేటి రాజకీయ నాయకుల్లో, అందులో యువ నాయకుల్లో శ్రీ బుద్ధప్రసాద్ అరుదైన వ్యక్తి. ఆయన వ్యక్తిత్వం అపూర్వం. ప్రజల ఆశయాలకు ప్రతిరూపం. అవనిగడ్డ నియోజక వర్గ అభివృద్ధి కోసం నిరంతరం కృషిచేస్తూ, ఉద్యమాలు నడిపిస్తూ, ప్రజా పోరాటం చేస్తున్న యువ రాజకీయ యోధుడు మండలి బుద్ధ ప్రసాద్. నిస్స్వార్థ సేవలకు నిలువుటద్దం ఆయన జీవితం.

## జననం-విద్యాభ్యాసం

గాంధేయవాది, ఆదర్శ సమాజ సేవకుడు, రాష్ట్ర మాజీ మంత్రి, మాజీ పార్లమెంటు సభ్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు–శ్రీమతి ప్రభావతీ దేవిగార్లకు ప్రథమ సంతా నంగా 26-5-1956న దివిసీమలోని నాగా యలంక గ్రామంలో శ్రీ బుద్ధప్రసాద్ జన్మించారు.

అవనిగడ్డలో ప్రాథమిక, మాధ్యమిక విద్యా భ్యాసాలు కొనసాగించి, హైద్రాబాద్‌లోని న్యూ గవర్నమెంట్ కాలేజీలో చదివి ఉస్మా నియా యూనివర్శిటీ నుంచి బి.ఏ.,డిగ్రీ పొందారు.

## బాలవీరుడు

"పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది" అన్న ట్లుగా రాజకీయ కుటుంబంలో జన్మించిన శ్రీ బుద్ధ ప్రసాద్ చిన్నప్పటి నుంచి రాజకీయాల పట్ల ఆసక్తి చూపించేవారు. తమ ఇంటికి వచ్చే గొప్ప గొప్ప రాజకీయ నాయకుల సంభాషణ లను ఆసక్తిగా వినే వారు. ప్రజలకు సేవ చేయా లనే భావనకు చిన్నతనంలోనే అంకురార్పణ జరిగింది.

## తొలి అడుగు

1972వ సంవత్సరంలో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమ సమయంలో సమైక్య వాదాన్ని చెప్ప డానికి ప్రత్యక్ష రాజకీయాలలోకి తన తొలి అడుగును వేశారు శ్రీ బుద్ధ ప్రసాద్. మండలి కృష్ణారావుగారు సమైక్యవాదిగా నిలబడటం వల్ల ప్రత్యేక ఆంధ్ర ఉద్యమకారులు శ్రీ కృష్ణా రావు కుటుంబాన్ని వెలివేసినట్లుగా కొన్ని పరిస్థితులను కల్పించారు. ఈ ఉద్యమ తీవ్రత వల్ల హైద్రాబాద్ నుంచి ఆయన కదలలేక పోయారు. శ్రీ బుద్ధ ప్రసాద్ తన తల్లి, ఇతర కుటుంబ సభ్యులతో అవనిగడ్డలోనే ఉండి పోయారు. అప్పుడే ఇంటర్మీడియెట్‌లో ప్రవే శించిన శ్రీ బుద్ధ ప్రసాద్ ఉద్యమ ఆందోళన కారులవల్ల అనేక ఇక్కట్లకు గురయ్యారు. అయినా మొక్కవోని ధైర్యంతో, సాహసంతో ఆత్మ విశ్వాసంతో, తనతోటి కార్యకర్తలను ఉత్సాహపరుస్తూ, సమైక్యవాదాన్ని బలపరుస్తూ ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు. దివి సీమలో సమైక్య ఆంధ్రజ్యోతిని ఉద్దీపనం చేశారు. 'బాలవీరుడు'గాపెద్దలచేత ప్రశంసలు పొందారు. ఏటికి ఎదురీదుతూ రాజకీయ రంగంలో సంచలనం సృష్టిస్తూ రాజకీయ జీవితాన్ని ప్రారంభించారు.

## రాజకీయ రంగ ప్రవేశం

శ్రీ బుద్ధ ప్రసాద్ రాజకీయంగా అంచెలు అంచెలుగా ఎదుగుతూ, తోటివారిని కలుపు కుంటూ ముందుకు రాసాగారు. 1977-1985 సంవత్సరాల మధ్య కృష్ణాజిల్లా యువ జన కాంగ్రెస్ కమిటీ కార్యవర్గ సభ్యునిగా వ్యవహరించారు.

1987-1989 సంవత్సరాలలో అవనిగడ్డ మండల కాంగ్రెస్ అధ్యక్షునిగా ఆ సమయంలో జరిగిన పంచాయతీ, సహకారసంఘం, మండలప్రజాపరిషత్తు ఎన్నికల్లో ప్రచార భారాన్నిమోసి, కాంగ్రెస్ పార్టీ విజయానికి కారణభూతులైనారు.

1989-90 సంవత్సరాలలో శ్రీ చను మోలు వెంట్రావు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా ఉన్న సమయంలో శ్రీ బుద్ధప్రసాద్ జిల్లా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. 1990లో వచ్చిన పెనుతుఫానులో దివిసీమలో బాధితులకు నిద్రాహారాలు లేకుండా సేవ చేశారు. ఈ సందర్భంగా ఏ.ఐ.సి.సి. అధ్య క్షుడు శ్రీ రాజీవ్‌గాంధీ చేసిన దివిసీమ పర్యటన విజయవంతంగా నిర్వ హించారు. శ్రీరాజీవ్ గాంధి అభిమానానికి పాత్రుడై ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గ సభ్యునిగా నియమింపబడ్డారు. అప్పుడు శ్రీ వి. హనుమంతరావు పి.సి.సి. అధ్యక్షులు. శ్రీ బుద్ధ ప్రసాద్ సూచన మేరకు ప్రదేశ్‌కమిటీ ఆధ్వర్యంలో 1991 మార్చి 31న విజయవాడలో "జాతీయ పతాకం" 70వ వార్షి కోత్సవాలు ఘనంగా జరిగాయి. స్వాతంత్ర్య సమరయోధుల సన్మాన కమిటీకి అధ్యక్షులుగా ఆచార్య ఎన్.జి.రంగ, గోపాలరెడ్డి మొదలగు వారితో, ప్రసిద్ధిపొందిన స్వాతంత్ర్య సమర యోధులకు ఘనసన్మానాలు చేయటం జరి గింది. అదే సమయంలో రాష్ట్ర

కాంగ్రెస్ పంచాయతీరాజ్ సెల్‌కి కన్వీనర్‌గా కూడా వ్యవహరించారు. అవనిగడ్డ ప్రజలను ఉత్తేజ పరచటానికి అవనిగడ్డ నియోజకవర్గంలో సద్భావనాయాత్ర కార్యక్రమాన్ని ఉత్సాహభరితంగా, జయప్రదంగా నిర్వహించారు.

## వరించిన అధ్యక్ష పదవి

1992 జనవరి 30న జరిగినఎన్నికల్లో కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నికై సంచలనం సృష్టించారు. రాజకీయ ధురంధరుల జీవగడ్డగా ప్రసిద్ధి పొందిన కృష్ణా జిల్లాలో పిన్న వయస్సులోనే అధ్యక్షపీఠం అధిరోహించి సుమారు 6 సంవత్సరాలపాటు ఆ పదవిలో సమన్వయవాదిగా రాణించారు. జిల్లా లోని వివిధ గ్రూపుల నాయకులను కలుపు కొంటూ "కలసి ఉంటే కలదు సుఖం"అనే నానుడిని నిజంచేస్తూ ముందుకు కొనసాగారు. పార్టీ కార్యకర్తలతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకొని వారిలో ఒకడిగా కలిసిపోయి కార్య కర్తల అభిమానాన్ని పుష్కలంగా పొందారు. అటు యువకులకు, ఇటు పెద్దలకు మధ్య వారధిలా నిలిచారు. క్విట్ ఇండియా స్వర్ణోత్స వాలను, స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలను జిల్లాలో ఘనంగా జరిపించారు. కాంగ్రెసు శ్రేణుల్లో ఉత్సాహం నింపడానికి అనేక కార్యక్రమాలను నిర్వహించారు. పార్టీ సిద్ధాంతాలను కార్య కర్తలు తెలుసుకొనే విధంగా, జిల్లా కాంగ్రెస్ నుంచి పుస్తక ప్రచురణలు గావించి, కాంగ్రెస్ శిక్షణా శిబిరాలు నిర్వహించి, పార్టీలో నూతనో త్తేజానికి శ్రీకారం చుట్టారు.

## పెద్దల ఆశీస్సులు

అప్పటి ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు, ముఖ్యమంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డిలతో పాటు పి.సి.సి. అధ్యక్షులు శ్రీయుతు వి.హనుమంతరావు, మజ్జి తులసీదాస్, కమాలుద్దీన్, కె. రోశయ్య, మల్లికార్జున్‌లకు తలలో నాలుకగా వ్యవహరించమే కాకుండా వారి ఆశీస్సులు సహాయ సహకారాలు పొందారు. రాజకీయ సహకారాలు పొందారు. రాజకీయ – రాజకీయేతర పెద్దల, మహాను భావుల దీవెనలు శ్రీ బుద్ధప్రసాద్‌కు శ్రీరామ రక్షగా నిలిచాయి.

## ప్రతిపక్షంలో ఉన్నా-ప్రజాసేవే!

1994 శాసనసభ ఎన్నికల్లో అవనిగడ్డ నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి, తెలుగుదేశం గాలిలో స్వల్ప తేడాతో ఓడిపోయినా, నిరాశ చెందకుండా ప్రజాక్షేమం కోసం పాటుపడ్డారు. అవనిగడ్డ నియోజకవర్గ ప్రజల కష్ట సుఖాలను పంచుకుంటూ ప్రజా సేవే పరమా వధిగా మున్ముందుకు నడిచారు.

1996లో శ్రీ కె.రోశయ్య అధ్యక్షతన పి.సి.సి. పునర్వ్యవస్థీకరణజరిగినప్పుడు ప్రదేశ్ కాంగ్రెస్ సహాయకార్యదర్శిగా నియ మితు లయ్యారు. జిల్లాకాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామాను అంగీక రించనందున రెండు పదవుల్లో కొనసాగుతూ పార్టీ అభివృద్ధికి నిరంతరం శ్రమించారు.

1997 జులైలో సంస్థాగత ఎన్నికల అనంతరం శ్రీ మల్లికార్జున్ అధ్యతన ఏర్పడిన రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గంలో ప్రధాన కార్యదర్శిగా నియమింపబడ్డారు. రాష్ట్ర కాంగ్రెసు సీనియర్ నాయకులు అందరితో సన్నిహిత సత్సంబంధాలు స్నేహ సౌశీల్యంతో కాంగ్రెస్ పార్టీ అభివృద్ధికి కృషిచేశారు. అవనిగడ్డ నియోజకవర్గ ప్రజల సమస్య మీద ప్రభుత్వంలో తమ వాదనలు వినిపించి, అనేక సంక్షేమ కార్యక్రమాలు అమలు జరిగే విధంగా కృషి చేశారు. జిల్లా కాంగ్రెస్‌లో నూతన చైతన్య స్ఫూర్తిని ఉద్దీపింప చేయడానికి నిద్రాహారాలు లేకుండా కృషి చేశారు. ప్రజల సమస్య పరిష్కారానికి న్యాయమైన పోరాటాలు సాగించారు.

## ఉప్పెన బీభత్సం-బుద్ధ ప్రసాద్ ఔన్నత్యం

1977 నవంబరు 19న దివిసీమ ఉప్పెన-తుపానుకు గురైంది. దాదాపు 10 వేలమంది చనిపోయారు. లక్షలాది పశుసంపద నష్టమైంది. దివిసీమంతా అల్లకల్లోలమై పోయింది. ఇటువంటి విపరీత విపత్కర పరిస్థితులలో స్వర్గీయ మండలి కృష్ణారావుగారి సేవలు అనన్య సామాన్యమైనవి-మరపురానివి. ఆ సమయంలో శ్రీ బుద్ధ ప్రసాద్ తండ్రికి చేదోడువాదోడుగా నిలిచి దివిసీమ సహాయ పునరావాస పునర్నిర్మాణ కార్యక్రమాల్లో విశేష కృషి చేసి ప్రజల ప్రశంసలకు పాత్రులైనారు. జాతీయ, అంతర్జాతీయ సేవా సంస్థలకు సహాయకంగా నిలిచి దివిసీమ కోలుకోవటానికి కృషి చేశారు. ఎక్కడ ప్రజలు ఇబ్బందులు పడుతుంటే అక్కడకు వెళ్లి అండదండగా నిలిచి సహాయ కార్యక్రమాలను చేపట్టే వారు. దయలేని సముద్రం ఉప్పొంగితే-దయ కలిగిన శ్రీ బుద్ధ ప్రసాద్ హృదయం కరిగి ప్రజల బాధలతో కలిసింది. దివి సీమకు ఉప్పెన వచ్చి 20 సంవత్సరాలు అయింది. అలనాటి ప్రకృతి ప్రళయంలో దివిసీమ కష్టాల కడలి అయింది. ఎన్నెన్నో సేవా సంస్థలు ఆ సమయంలో దివిసీమ ప్రజలకు తమ సేవలను అందించాయి. వీళ్ళందరికి కృతజ్ఞతలు తెలుపు కోవటానికి 1997 నవంబరు 20న ఆయా స్వచ్ఛంద సంస్థలను, సంఘాలను ఆహ్వానించి, సభా పూర్వకంగా వారికి సగౌరవంగా కృతజ్ఞత అభివాదాలు తెలియచేసి, దివిసీమ ప్రజలపక్షాన హృదయపూర్వకంగా సేవా సంస్థలను తగురీతిగా శ్రీ బుద్ధ ప్రసాద్ సత్కరించారు.

## వరదల భయం - ప్రజలకు అభయం

1998 అక్టోబర్‌లో దివిసీమను కృష్ణానది వరదలు చుట్టుముట్టాయి. ఏ క్షణమైనా వరద సుడిగుండంలో దివిసీమ మునిగిపోయే ప్రమాదం ఏర్పడింది. కొన్ని ప్రాంతాలు ముంపుకు గురైనాయి. ఇటువంటి సమయంలో శ్రీ బుద్ధప్రసాద్ ముందుగా కదలి బాధితులకు బాసటగా నిలిచారు. కాంగ్రెస్ కార్య కర్తలను, ప్రజలకు ఉత్తేజపరచి కరకట్టల పరిరక్షణకు కార్యోన్ముఖులుగా చేశారు. కృష్ణానది వరదనీటిలో మునిగిన "దక్షిణ చిరువోలులంక" "యండ్లంకి" తదితర

గ్రామాలకు, అధికారులు సైతం వెళ్ళటానికి భయపడుతు న్నప్పుడు ధైర్యంగా శ్రీ బుద్ధప్రసాద్ వెళ్ళి ఆ గ్రామ ప్రజలకు ధైర్యం చెప్పిన సహాయ కార్యక్రమాలు వెంటనే జరగాలని, ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకొని వచ్చారు. దివిసీమకు శ్రీ బుద్ధప్రసాద్ చేస్తున్న సేవలు చిరస్మరణీయాలు.

## "అనాథ బాలలకు - అన్న"

ఉప్పెన-తుపానులో తల్లిదండ్రులను కోల్పో యిన బాల బాలికలను తీసుకొని వచ్చి అవని గడ్డ గాంధీ క్షేత్రంలో శ్రీమండలి వెంకట కృష్ణా రావు ఒక అనాథ శరణాలయాన్ని నెల కొల్పారు. దీనిలో సుమారు 150 మంది అనా థలు ఉండేవారు. వీరందరి ఆలనాపాలనా శ్రీ బుద్ధ ప్రసాద్ చూసేవారు. ఆ పసిపిల్లలు 'అన్న'గా వాళ్ల బాగోగులను శ్రీ బుద్ధప్రసాద్ చూస్తూ వాళ్ళకు విద్యా బుద్ధులతోపాటు, చేతి వృత్తులను కూడా నేర్పించారు. ఈ రోజు ఆ పిల్లలు పెద్దవాళ్ళై తమ కాళ్ళ మీద తాము నిలబడుతున్నారు. దీనికంతటికీ శ్రీ బుద్ధ ప్రసాద్ చేసిన విశేషమైన కృషి మూలకారణము. దివిసీమ దీనజన సంక్షేమ సమితి కార్యదర్శిగా అనాథ శరణాలయ నిర్వహణ, వికలాంగుల సంక్షేమ కేంద్రాలను శ్రీ బుద్ధప్రసాద్ నిర్వహించారు.

## గాంధీజీ అడుగుజాడలలో

గాంధేయ విధానాలపై శ్రీ బుద్ధప్రసాద్‌కు గాఢమైన విశ్వాసం ఉంది. గాంధీగారి పట్ల అచంచలమైన భక్తి ప్రపత్తులున్నాయి "గాంధేయ సమాజ సేవా సంస్థ" కార్యదర్శిగా యువతలతో గాంధేయ విధానాలపట్ల ఆసక్తి కలిగించడటానికి శిక్షణా శిబిరాలు నిర్వహించారు. ఆచార్య రంగ, ప్రభాకర్‌జీ, తల్లాప్రగడ ప్రకాశరాయుడు వంటి సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధులు శిక్షణ గడిపిన వారిలో ఉన్నారు. గాంధేయతత్త్వంపై అనేక గ్రంథాలను ప్రచురింపచేశారు. వీటిల్లో ఏ ఏటుకూరి బలరామమూర్తి రచించిన "గాంధేయ దృక్పథం-తాత్త్వికత" శ్రీ తల్లాప్రగడ ప్రకాశ రాయుడు వ్రాసిన "ఆత్మకథ" "నా రట్నచక్రం" ముఖ్యమైనవి. గాంధీజీ ప్రభావంతో వెలువడిన తెలుగు కథలను ప్రసిద్ధ కథారచయిత శ్రీ మధురాంతకం రాజారాంతో సంకలనం చేయించి ప్రచురించారు. ఆ కథ సంపుటి పేరు "తాత దిగిపోయిన బండి" ఈ విధంగా తెలుగు సాహిత్యంలో అమూల్యమైన గ్రంథాలను ప్రచురించే అదృష్టం శ్రీ బుద్ధప్రసాద్‌కి దక్కటం ఒక విశేషం.

## అవనిగడ్డ పుత్రిక-గాంధీక్షేత్రం పత్రిక

గాంధేయ భావవ్యాప్తికోసం "గాంధీ క్షేత్రం" అనే మాస పత్రికను 1982లో శ్రీ బుద్ధ ప్రసాద్ ప్రారంభించారు. ఆచార్య రంగ, బెజవాడ గోపాలరెడ్డి వంటి మహానాయకుల ప్రశంస లను ఈ పత్రిక అందుకొంది. 1987లో ఆంధ్ర ప్రదేశ్ తెలుగు "చిన్న పత్రికల సంఘం" శ్రీ బుద్ధప్రసాద్‌ను ఉత్తమ సంపాదకునిగా గుర్తించి ఘనంగా సన్మానించింది.

## సరస్వతీ సేవ

సాహిత్యమంటే శ్రీ బుద్ధప్రసాద్‌కు ఎనలేని గౌరవం, భక్తిభావం ఉంది. కవులు, కళాకారులు, పండితులు, చరిత్ర పరిశోధకులు అంటే అపారమైన అభిమానం శ్రీ బుద్ధ ప్రసాద్‌కు పొంగి పొరలు తుంది. తెలుగుజాతిని తీర్చిదిద్దే మహాపురుషులుగా వీళ్ళందరినీ సాదరంగా గౌరవించటం శ్రీ బుద్ధ ప్రసాద్ సంస్కారానికి చిహ్నం. "రవి గాంచనిచో కవి కాంచును" అనే సూక్తిని ఎల్లప్పుడు గుర్తు తెచ్చుకొంటుంటారు. కృష్ణాజిల్లా రచయితల మహాసభలను అవనిగడ్డ లోను, విజయవాడలో నిర్వహించారు. దివిసీమ సాహితీసమితి పక్షాన కవితా గోష్ఠులు, సదస్సులు నిర్వహించారు. దివిసీమ సాహితీ పక్షాన కవితా గోష్ఠులు, సదస్సులు నిర్వహించారు. పుస్తక గోష్ఠులు, సదస్సులు నిర్వహించారు. పుస్తక ప్రచురణలను కూడాచేపట్టి "విశ్వనాథ కథ" "హంసల దీవి (నవల), "హంసల దీవి గోపాల శతకం" వంటి గ్రంథాలను వెలయించారు. దివిసీమ చరిత్రను సంగ్రహంగా తెలియ చేసే 'దివిదీపిక' మాన్యమహనీయులైన మండలి కృష్ణారావుగారి జీవితాన్ని 'దివిదీపం'గా అందించారు.

## తెలుగుభాషకు సేవ

"దేశ భాషలందు తెలుగు లెస్స" అని శ్రీ కృష్ణదేవరాయలు ప్రకటించాడు. అటువంటి ఉన్నతమైన తెలుగు భాష ఈనాడు అనాదరణకు, నిర్లక్ష్యానికి గురైంది. ఇటువంటి నిరాశ జనకమైన క్లిష్ట పరిస్థితులలో తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి శ్రీ బుద్ధ ప్రసాద్ విశేష కృషి చేస్తున్నారు. 1990 డిసెంబరులో మారిషస్‌లో జరిగిన తృతీయ ప్రపంచ తెలుగు మహా సభలో మనప్రతినిధిగా పాల్గొన్నారు. ఆ మహాసభల విశేషాలతో "మారిషస్‌లో తెలుగు తేజం" అనే గ్రంథాన్ని రచించారు. ఇటీవల పెదకళ్ళే పల్లిలో ప్రముఖ సినీకవి శ్రీ వేటూరి సుందర రామమూర్తితో కలసి మూడురోజుల పాటు సంగీత సాహితీ వసంతోత్సవాలు నిర్వహించారు. "తెలుగు భాషావికాసం" పై చర్చా గోష్ఠి నిర్వహించి, తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణకు సమగ్రమైన చర్చజరిపారు. మాతృభాషా వ్యాప్తికి దీక్షా కంకణము ధరించి ప్రజలను, అధికారులను ప్రోత్సాహ పరుస్తూ శ్రీ బుద్ధ ప్రసాద్ ముందుకు సాగుతున్నారు.

## చైతన్య నిలయం - గ్రంథాలయం

గ్రామాలలోని ప్రజలకు సామాజిక స్పృహ కలగాలంటే గ్రంథాలయాలు చాలా అవసరం. సమకాలీన రాజకీయాలు వాటి పరిస్థితులు తెలుసుకోలేక పోతే, ప్రజలకు చాలా ఇబ్బందులు ఏర్పడతాయి. ప్రజల్లో విజ్ఞానాన్ని పెంపొందించడానికి శ్రీ బుద్ధప్రసాద్ ఎన్నో కార్యక్రమాలు చేపట్టారు. కృష్ణరాయ గ్రంథాలయ సంఘ అధ్యక్షునిగా 10 వేల గ్రంథాలతో, అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో లైబ్రరీ స్థాపించారు. ఎన్నో అమూల్యమైన గ్రంథాలు ప్రత్యేకించి గాంధేయ సమగ్ర సాహిత్యం ఈ లైబ్రరీలోఉంది.

## ఆదర్శ కుటుంబం

శ్రీ బుద్ధ ప్రసాద్‌కి ప్రజాహిత రంగంలో అన్నివిధాల సహకరించే సహధర్మచారిణి శ్రీమతి విజయలక్ష్మి. వారికి ఇరువురు కుమార్తెలు చి.కృష్ణప్రభ, చి.అవనిజ, కుమారుడు చి.వెంకట్రామ్.

## తన జీవితం-దివిసీమకు అంకితం

దివిసీమ అభివృద్ధికి అహరహం శ్రమించే కార్యకదనశీలి శ్రీ బుద్ధ ప్రసాద్. ఏ పార్టీ చేపట్టని అనేక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టి విజయపథంవైపు అవనిగడ్డ నియోజకవర్గాన్ని నడిపిస్తున్న ప్రజానాయకులు. ఆంధ్ర దేశంలో దూరంగా విసిరివేయబడినట్లుగా ఉన్న దివి సీమను దివ్యసీమగా చేయటానికి నడుంకట్టిన పోరాట యోధాగ్రేసరులు. శ్రీ మండలి కృష్ణా రావు జయంతి ఉత్సవాల సందర్భంగా దివి సీమ చరిత్రను, సంస్కృతిని పునరుద్ధరణ చేయ టానికి మేధావులచేత వ్యాసాలు వ్రాయించి, ఉపన్యాసాలు చెప్పించి, చర్చలు నిర్వహించిన ఆధునిక దివిసీమ నిర్దేశకులు శ్రీ బుద్ధ ప్రసాద్. జాతీయ స్థాయిలో అవనిగడ్డ నియోజకవర్గానికి పేరు ప్రఖ్యాతులు తీసుకువచ్చారు. మడమ తిప్పని కాంగ్రెస్ పోరాట యోధుడిగా ప్రసిద్ధి పొందారు. పేద ప్రజల ఆశాజ్యోతిగా నిలిచారు. దివిసీమ వైభవాన్ని ఆంధ్రదేశానికి తెలియ చేస్తున్నారు. 'గానగంధర్వ' ఘంటశాల వేంకటేశ్వరరావుగారి జన్మస్థలమైన టేకుపల్లి గ్రామంలో అయన విగ్రహాన్ని శ్రీ బుద్ధప్రసాద్ ఏర్పాటు చేశారు. ప్రఖ్యాత సినీగాయకులు శ్రీ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం ఘంటశాల విగ్రహాన్ని ఆవిష్కరించారు. దివిసీమలో జన్మించిన మహామహుల విగ్రహాలనువారు జన్మించిన గ్రామాలలో ప్రతిష్ఠించాలని శ్రీ బుద్ధ ప్రసాద్ సంకల్పం. ఆ మహా పురుషుల త్యాగాలు, అందించిన సందేశాలు ప్రచారం చేయటానికి తగు ప్రణాళికలను అమలు చేస్తున్నారు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అనే వాక్యాన్ని లక్ష్యంగా పెట్టుకొని, తాను జన్మించిన దివిసీమను, అందులో భాగమైన అవనిగడ్డ నియోజక వర్గాన్ని సర్వతోముఖాభి వృద్ధి చేయటాన్ని తన జీవిత సర్వస్వాన్ని అంకితం చేస్తూ ప్రజలకు సేవచేస్తూ 'యువనేత'గా ప్రఖ్యాతినిపొంది ముందుకు సాగుతున్నారు శ్రీ బుద్ధప్రసాద్. ○

# దివిసీమ రత్నం చిరంజీవి బుద్ధప్రసాద్

- కళాప్రపూర్ణ డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

**1975**వ సంవత్సరంలో హైదరాబాద్‌లో ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. ఆ సభలకు ప్రేరణ మండలి కృష్ణారావుగారు. ఆనాడు వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా ఉండేవారు. ఆంధ్రప్రదేశ్‌చరిత్రలో అది ఒక ప్రధానఘట్టం. ప్రపంచంలో ఉన్న తెలుగు వారందర్నీ ఒకచోట సమావేశపర్చాలనీ, తెలుగు సంస్కృతిని సుసంపన్నం చేయాలని సంకల్పం. ఆ సంకల్పంతో మండలి కృష్ణారావుగారు ఆనాడు పదిహేను విదేశాలలో తెలుగు వారందరిని ఒకచోటికి చేర్చి తెలుగు సంస్కృ తికి, తెలుగు భాషకు పెద్దపీట వేయాలని ఆయాదేశాలలోఉన్న లబ్ధ ప్రతిష్టులైన తెలుగు సోదరుల్ని ప్రపంచ తెలుగు మహాసభలకు రప్పించారు. వారం రోజులపాటు ఆ ఉత్స వాలు రంగరంగ వైభవంగా జరిగాయి.

ఈ మహాసభలు జరపటానికి మీ వెనుక మేమున్నామన్న ప్రభుత్వం 16 లక్షలు మాత్రమే ఇచ్చింది. కృష్ణారావుగారు సినిమారంగానికి వచ్చి ఎన్.టి.ఆర్, ఏ.ఎన్.ఆర్, గుమ్మడి, నేను మొదలైన కళాకారుల మందరము హైదరాబాద్ నుండి బయలుదేరి విశాఖపట్నం వరకు తిరిగి దాదాపు 28 లక్షలు పోగుచేసి తెలుగు మహాసభలకు ఇచ్చాం.

ఆ సందర్భంలో కృష్ణారావుగారు మాతో కలసి బస్ ప్రయాణం చేసి తెలుగు మహాసభలను జయప్రదం చేయటం జరిగింది.

ఆ తరువాత కౌలాలంపూర్ (మలేషియాలో) రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. ఆ సభలకు నేనూ, గుమ్మడి తదితర మిత్రులం వెళ్ళాలని విమాన ప్రయాణానికి టిక్కెట్లు కొన్నాం.. ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే ఒక సంఘటన జరిగింది.. హైదరాబాద్ నుంచి కొంతమంది వచ్చి కౌలాలంపూర్ వెళ్ళిపోయారు. ఇంతలో అంజయ్యగారికి సంబంధించిన మనుష్యులువచ్చి నా టిక్కెట్, సంజీవదేవ్ టిక్కెట్ మరి కొంతమంది ప్రముఖుల టిక్కెట్లు వాళ్ళు తీసుకుని వెళ్ళిపోయారు.

అలా మేం ఆ సభలకు వెళ్ళలేకపోయాం. మాతోపాటు మండలిగారు కూడా. అంజయ్య గారి మనుషులు చేసిన అఘాయిత్యానికి ఖిన్నుడై మాతోపాటు ఉండిపోయారు కృష్ణారావుగారు. నేను కృష్ణారావుగారితో వాళ్ళ అఘాయిత్యాన్ని బయటపెట్టమని ఈ విషయం ముఖ్యమంత్రి అంజయ్యగారికి తెలియ జేయాలని ఒత్తిడిచేశాను. మహనీయుడు మండలివారు సహనంతో నన్ను ఓదార్చారు. జరిగిన విషయమంతా ఒక ప్రక్క నుంచి చూస్తూ ఒక ప్రక్క విచారిస్తూ నిల బడి ఉన్నాడు ఒక కుర్రవాడు అరమోడ్పు కన్నులతో జరిగినదంతా చూస్తున్నాడు. ఎవరండీ ఈ అబ్బాయి అన్నాను ! మా అబ్బాయేనండి అన్నాడు. అతడే బుద్ధ ప్రసాద్. ఆ విధంగా నాకు పరిచయమయ్యాడు బుద్ధప్రసాద్.

బాలబుద్ధుడులా నాన్నగారిని వెన్నంటివుంటూ కృష్ణారావుగారి పోకడలను, ఆశయాలను గమనిస్తూ ముందుకు సాగాడు. తండ్రిగారు పోయిన తర్వాత ఆ భారాన్నంతా మోశాడు.

కృష్ణారావుగారు ఆనాటినుండే అవనిగడ్డలో జరిగిన నాటక కళాపరిషత్తుకూ, ఇతర కార్య క్రమాలకూ, అలాగే బుద్ధప్రసాద్ సాంస్కృతిక సభలకు నన్ను పిలిచి సత్కరించాడు.

తండ్రి అడుగుజాడల్లో అనాటి నుండి ఈనాటి వరకూ దివిసీమ అభివృద్ధి కోసం పాటుపడిన చిరంజీవి బుద్ధప్రసాద్ అసంబద్ధంగా మిగిలిపోయిన నాన్నగారి ఆశయాలనన్నింటినీ అహో రాత్రాలు కృషిచేసి అంకిత భావంతో దివిసీమను తీర్చిదిద్దిన యువరరత్నం బుద్ధప్రసాద్.

తెలుగుభాషకోసం, తెలుగు సంస్కృతికోసం సంగీత, సాహిత్య, నృత్య నాటక రంగాల సంస్కృతికి వెన్నంటి నిలబడ్డాడు.

ఉప్పెనొచ్చినా, వరదలొచ్చినా వెంటనే స్పందించి కృష్ణారావుగారి అడుగుజాడల్లో పని చేశారు. పదవి వున్నా లేకపోయినా ప్రజాసేవే లక్ష్యంగా పనిచేశాడు. శ్రీకాకుళంలో తెలుగు భాషా మహాసభలు జరిపాడు. కృష్ణదేవరాయల కంచువిగ్రహాన్ని దేవస్థానంలో స్థాపించేశాడు.

కాంగ్రెస్ ప్రభుత్వం పది సంవత్సరాలు అధికారంలో లేనప్పుడు కృష్ణాజిల్లా కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా జిల్లా అంత కలియతిరిగి కాంగ్రెస్‌ను నిలబెట్టిన యువరత్నం బుద్ధప్రసాద్.

ఎంతోకాలం పూర్తికాని పులిగడ్డ వంతెనను పూర్తి చేయించటమేకాక, కృష్ణా గుంటూరు జిల్లాల మధ్య కృష్ణానదికి బ్రిడ్జిని తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో పూర్తిచేసి రెండు జిల్లాల ప్రజలను అనుసంధానం చేశాడు.

టూరిజం డిపార్టుమెంటు ద్వారా హంసల దీవిని నందనవనంగా చిత్రించి అవనిగడ్డ నుంచి హంసలదీవివరకు రోడ్డు నిర్మించి దానిని ఒక అందమైన టూరిస్టు కేంద్రంగా తీర్చిదిద్దటంతో పాటుపడ్డాడు.

పదవికోసం కాక ప్రజల కోసం వారి సమస్యలకోసం అలుపెరుగని యువ కార్య కర్తగా పనిచేశాడు. ప్రజల సమస్యలకోసం, వాటి పరిష్కారం కోసం నిలువెత్తుగా నిలబడిన యువ కార్యకర్త బుద్ధప్రసాద్. దేశం నాకేమిచ్చిందని కాక దేశానికి నేనేమిచ్చాననే స్ఫూర్తితో పనిచేస్తున్నాడు.

అందర్నీ కలుపుకొని పనిచేయాలనే సదాశయంతో నిలబడి తండ్రి ఆశయాలకు అద్దం పట్టిన బుద్ధప్రసాద్ మంత్రిగా మన ముందుకు వచ్చిన బుద్ధునికి మనసారా దీవెనలు అంద చేస్తున్నాను. దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్ అనే స్ఫూర్తిని ఆచరించాలని మనసారా కోరుకుంటున్నాను. బుద్ధప్రసాద్‌ను సత్కరిస్తున్న శ్రేయోభిలాషులకు నా అభినందనలు.

○

## అమృతం

- శ్రీ ముదిగొండ వీర భద్రమూర్తి

శ్లో॥ యుద్దైవత ప్రసాదోఽ హో !
స్వభావో దృశ్యతే ! వరే
నిత్యనిష్కపట స్మేరః
విశ్వశ్రేయః పరిశ్రమః

# శుభమస్తు

- కళాప్రపూర్ణ డా॥ దాశరథి, డి.లిట్.,

మేతమేయునట్టి నేతలు మనకేల ?
మంచి నేస్తమొకడు మనకు చాలు
బుద్ధిజీవి యైన బుద్ధ ప్రసాదుండు
ఆప్తమిత్రుడగుట అదియె ఘనత

యువకులెల్ల బుద్ధ ప్రసాదు వలె శాంతి
సహనముల తోడ వర్తింప జాలిరేని
జాతి మేల్కొని కులమతాతీతమైన
సమసమాజ నిర్మాణమ్ము సాధ్యపడును.

★ ★ ★

# ఆశీః

- డా॥ బోయి భీమన్న, 18-3-84

శుద్ధము, శోభస్కరము, జ
గద్ధితముగ విజయలక్ష్మిగైకొనిసాగున్
బుద్ధ ప్రసాదు డిద్ధ స
ముద్ధతుడై నవనవోత్సవోన్నతుల సదా!

# "తండ్రిని మించిన తనయుడు" శ్రీ బుద్ధ ప్రసాద్

- "పద్మశ్రీ" తుర్లపాటి కుటుంబరావు

పితృభక్తి పరాయణుడైన శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌కు తనను "తండ్రిని మించిన తనయు" డనడం ఇష్టం వుండదని నాకు తెలుసు. అందులోను పెద్దలపట్ల వినయవిధేయతలకు శ్రీ బుద్ధ ప్రసాద్ పెట్టింది పేరు.

సాధారణంగా లబ్ధ ప్రతిష్ఠులైన తండ్రుల కుమారులు కూడా తండ్రికి దీటైన వారైతే, వారిని తండ్రికి తగిన తనయుడనో, తండ్రికి దీటైన తనయుడనో అంటారు.

అయితే, చాలా మంది కుమారులు తండ్రికి తగిన వారు కాకపోగా, ఆ తండ్రి పేరు ప్రతిష్ఠలకు మసిపూసేవారు. అందువల్లనే, తండ్రికి పుత్రోత్సాహం కేవలం పుత్రుడు కలిగినంత మాత్రానే కాదని, ఆ పుత్రుడు ప్రయోజకుడైనప్పుడే నిజమైన పుత్రోత్సాహమని సుమతీశతక కారుడు బద్దెన అన్నాడు.

ఈ నాటి రాజకీయ వేత్తలు చాలామందికి "సన్‌స్ట్రోక్" సర్వసాధారణం. తమ కుమారుల వల్లనే చాలామంది రాజకీయవేత్తల పదవులకు, పేరు ప్రతిష్టలకు దెబ్బ. పేర్లు ఎందుకు కాని, అలాంటి వారు ఈనాటి రాజకీయాలలో ఎందరో మహానుభావులు!

కాని, స్వర్గవాసి శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు చాలా అదృష్టవంతులు. ఆయన ఇప్పుడు మన మధ్యవుంటే, తన కుమారుని చూచి ఆయన ఉన్నతినిచూచి ఎంత ఆనందించి వుండేవారో!

శ్రీ కృష్ణారావు ఆయనకు ఆయనే ఒక విలక్షణ రాజకీయవేత్త. అతి నిరాడంబరుడు. మంత్రిగా కూడా బస్సులో ప్రయాణించేవారు. దివిసీమ అనగానే ఆయన పేరే జ్ఞాపకం వస్తుంది. ఆయన పేరు గుర్తుకు వస్తే దివిసీమ జ్ఞప్తికి వస్తుంది. ఆయనకు "దివిసీమ గాంధి" అని పేరు. ముఖ్యంగా 1977 నవంబర్ 19న దివిసీమను ప్రళయ భయంకర సదృశ్యమైన పెను తుఫాను

ముప్పిరి గొన్నప్పుడు కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటిలో తుఫాను నీటిలో తేలియాడుతున్న సజీవ, నిర్జీవ మానవ శరీరాల మధ్య, కాళ్లలో గుచ్చుకున్న ముళ్లను కూడా తీయలేని పరిస్థితులలో ఆయన చేసిన సేవ-సేవా చరిత్రలోనే చిరస్మరణీయం!

ఇక, 1975లో ప్రపంచంలోని తెలుగు వారందరిని ఒకచోట చేర్చి, శతాబ్దాల క్రితం తెగిపోయిన వారి సంబంధబాంధవ్యాలను పునరుద్ధరించడానికి వారం రోజుల పాటు ఆయన హైదరాబాద్‌లో నిర్వహించిన ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగుజాతి, తెలుగు భాషల చరిత్రలోనే కలకాలం స్ఫూర్తి దాయకమైన గుర్తుగా మిగిలిపోతాయి!

అలాంటి కృష్ణారావు గారి కుమారుడు చిరంజీవి బుద్ధ ప్రసాద్‌కు రెండే మార్గాలున్నాయి. మొదటిది - తండ్రి పేరుప్రఖ్యాతులను, ఆయన సేవానిరతిని, ఆయన తెలుగు భాషానురక్తిని అనుసరించడం, రెండవది - చాలా మంది రాజకీయవేత్తలవలె తండ్రికి "సన్‌స్ట్రోక్" కావడం!

సార్థక నామధేయుడైన శ్రీ బుద్ధప్రసాద్ "బుద్ధి ప్రసాద్" గా నిరూపించుకున్నాడు. సేవానిరతిలో తండ్రికి తాను తీసిపోనని నిరూపించుకున్నారు. నిరాడంబరత్వంలో, నిక్కచ్చి తనంలో ఆయనకు తాను దీటైన తనయుడనని రుజువు చేశారు. ముఖ్యంగా ఈనాటి రాజకీయ వేత్తలలో తెలుగు భాషాభివృద్ధి కేతనాన్ని ఆయనే తనచేత ధరించారు. రాజకీయవేత్తలకు రాజకీయాలే తప్ప, తెలుగు భాషాభివృద్ధి పట్టదు!

కృష్ణాడెల్టాకు నీరు సరఫరా ఉద్యమంలోను, దివిసీమ అభివృద్ధి కార్యక్రమాలలోను, సాంస్కృతిక రంగంలో దివిసీమ ఘనచరిత్ర వైభవాన్ని ప్రపంచానికి ఆవిష్కరించడంలోను ఆయన నిర్వహించిన పాత్ర, వాటికి ఆయన కల్పించిన ఉద్యమ రూపాలు ఆయనకు శాసన సభ్యులలో ఒక విశిష్ట స్థానాన్ని కల్పించాయి.

ఇప్పుడు మంత్రి కావడంతో ఆయనపై మరొక గురుతర బాధ్యత పడింది. ఆదర్శ కాంగ్రెసు కార్యకర్తగా, పదమూడు సంవత్సరాలపాటు ప్రజారంజకుడైన జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా ప్రశంసనీయంగా పనిచేసిన శ్రీ బుద్ధప్రసాద్ ఆదర్శ మంత్రిగా కూడా పేరు తెచ్చుకోవాలని అభిలషిస్తున్నాను; ఆశీర్వదిస్తున్నాను.

ఆయన తండ్రి శ్రీ కృష్ణారావు నాకు సన్నిహితమిత్రులు. నా శ్రేయోభిలాషి. ఇక, శ్రీ బుద్ధ ప్రసాద్ నాకు ఆయన బాల్యం నుంచి ఆత్మీయంగా తెలుసు. ఆయన మా కుటుంబ సభ్యుడు. ఆయనను గురించి ఇంతకంటె ఎక్కువ రాస్తే నన్నుగురించి నేను రాసుకున్నట్టే కాగలదేమోనన్న భయంతో ఈ ప్రశంసా వ్యాసాన్ని ఇంతటితో ముగిస్తున్నాను.

○

# నీటి పారుదల రంగానికి శ్రీ బుద్ధ ప్రసాద్ సేవలు

- శ్రీ కె.రాజేంద్రప్రసాద్
నీటి పారుదల శాఖా నిపుణులు

నీటి పారుదల రంగానికి శ్రీ బుద్ధప్రసాద్ గారు అందించిన సేవలు చిరస్మరణీయము. ముఖ్యముగా గత ఐదు సంవత్సరముల కాలములో వారు చేసిన సేవలను ఇక్కడ పొందు పరచటమైనది.

2002వ సంవత్సరములో కృష్ణానదీ పరీవాహక ప్రాంతములో వర్షములు లేక నాగార్జున సాగరు, శ్రీశైలం జలాశయములను తగినంత నీరు చేరలేదు. దానితో కృష్ణాడెల్టా రైతులకు ఆగస్టులో నీరు వదలటమైనది. నీరుకూడా చాలనంత వదలకపోవటంతో పంటలు ఎండిపోవు స్థితికి వచ్చినవి. అప్పుడు వీరు పూనుకొని "కృష్ణా డెల్టా పరిరక్షణ సమితి"ని స్థాపించి బందరులో అమరణ నిరాహారదీక్షను రైతులతో ఇతర నాయకులతో సంయమనం చేసి ప్రారంభించిరి. దానితో అప్పటి ప్రభుత్వము దిగివచ్చి తక్షణమే జిల్లా మేజిస్ట్రేటు ఆధ్వర్యంలో పెట్రోలింగ్ టీమ్‌లును కాలవల మీద ఏర్పాటు చేసి నీటిని కూడా సరిపడా విడుదల చేయటమైనది. దాని వలన ఆ సంవత్సరం పంట దిగుబడి అధికముగా వచ్చినది. దీని వలన ఆ సంవత్సరము 10.5 లక్షల ఎకరములలో వేసిన వరి ప్రతి ఎకరమునకు సుమారు ఐదు బస్తాలు తెగబడి అధికముగా వచ్చుట వలన షుమారు 200 కోట్ల రూపాయలు రైతులకు ఆదాయము వచ్చినది. ఇది ఈ మహనీయుని కృషి ఫలితము. అలాగే 2005, 2006వ సంవత్సరములో కృష్ణానదికి వరద వచ్చిన సమయంలో ఈయన అధికారులను సమన్వయ పరచి యనమలకుదురు నుంచి హంసలదీవి వరకు ఏ ఒక్క ప్రాణనష్టము గాని, పశు నష్టముగాని కలుగకుండా చేసిన ఘనత వీరికి దక్కింది. లంకలలో వున్న ప్రజలందరిని సురక్షిత ప్రాంతములకు తరలించటమే కాకుండా, వారికి భోజనం వసతి సదుపాయములు కలిగించి వారు తిరిగి వారి ఇళ్లకు వెళ్లునప్పుడు వారికి బియ్యం సామాగ్రి ఇచ్చి పంపించిన ఘనత వారికే చెల్లును.

2005 వరదల సమయంలో ముఖ్యమంత్రి గారు వరద ప్రాంతములను సందర్శించుటకు పులిగడ్డ వచ్చినపుడు వారిని ఒప్పించి కరకట్టను పటిష్టం చేయటమే కాక, వాహనముల రాక పోకల కోసం రెండు లైన్లు రోడ్డును వారితో సభా ముఖముగా చెప్పించటం జరిగినది. దీనివలన ఎనమలకుదురు నుంచి పులిగడ్డ వరకు కరకట్ట ప్రక్కన వున్న 20 నుంచి 25 గ్రామములన్నిటికి మరియు విజయవాడతో చక్కని రవాణా సౌకర్యము ఏర్పరుచుటయే కాక పులిగడ్డ వెళ్ళుటకు షుమారు 20 కిలోమీటర్ల దూరంకూడా తగ్గటంవలన చాలా ఇంధనం ఆదా అవటము తరువాత బందరు రోడ్డుకు రద్దీ తగ్గటం జరుగుతుంది. త్వరలోనే ఈ పనులు ప్రారంభించటం జరుగుతుంది. దీని వలన ప్రతి సంవత్సరం ఇంధనం ఆదావలన సుమారు 4 నుంచి 5 కోట్లు కలసివస్తుంది. ఇదీ వీరి యొక్క ముందుచూపుకి నిదర్శనం.

2006వ సంవత్సరంలో అక్టోబరులో సంభవించిన తుఫాను మన కృష్ణా జిల్లాని అతలాకుతలం చేసిందనేది వాస్తవం. ఆ సమయంలో మురుగు కాలువలు, పంట కాలువలు ఏరులై పారి పచ్చని పంటపొలాలను, రోడ్లను ముంచి వేయటం మనందరం చూచుట జరిగినది. అయినను వారు అకుంఠిత దీక్షతో ముఖ్యమంత్రిగారితో మాట్లాడి కలక్టరు గారిని ముందు నడిపించి డ్రైన్లలో వున్న గుర్రపు డెక్కతూడును యుద్ధ ప్రాతిపదికన ప్రొక్లయిన్లు సాయంతో తీయించటం జరిగినది. దివిసీమలో రోడ్లుకుకూడా గంట్లు పెట్టించి నీటిని తక్షణమే సముద్రంలోకి పోయేటట్టు చేసిన ఘనత వారికి దక్కును. దీనివలన దివిసీమలో తక్కిన ప్రాంతములకు నష్టం చాలా తక్కువ జరిగినది.

నవంబరు 4వ తారీఖున ముఖ్యమంత్రిగారు దివిసీమకు విచ్చేసినప్పుడు గణాంకములతో సహా వారి దృష్టికి తీసుకొని వెళ్ళి ఈ డెల్టాలోని డ్రైన్లు కాలువలను ఆధునీకరణ చేయవలసిన ఆవశ్యకతను నొక్కివక్కాణించి వారిచేత ఆధునీకరణకు తమ ప్రభుత్వం 500కోట్లుతో వచ్చే మూడు సంవత్సరములలో ఖర్చు చేస్తుందని చెప్పించిన ఘనత వీరికే చెందును. సర్ ఆర్థర్ కాటన్ గారి ఆధ్వర్యంలో వెలిసిన ఈ కృష్ణాడెల్టా 1855వ సంవత్సరము నుంచి 152 సంవత్సరములు గడచినను ఇంతవరకు ఆధునికీకరణకు నోచుకోలేదు. 1996వ సంవత్సరములో ఆధునికీకరణ కోసం షుమారు 670 కోట్లు రూపాయలతో ప్రతిపాదనలు సిద్ధం చేసినను గత ప్రభుత్వం దాని మీద ప్రత్యేక శ్రద్ధ కనపరచలేదు. అటకెక్కిన దానిని ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకువెళ్ళటమే కాకుండా ఒక కమిటీని కూడా దానిమీద రిపోర్టు తయారు చేయించుటకు వేయించిన ఘనత వీరిది.

ఈ కమిటీ ముఖ్యముగా మూడు రోజులలో కురిసిన అసాధారణ వర్షములు సుమారు 900 మి.మీ. కొన్ని మండలాలలో కురిసాయి. 700 మి.మీ. అన్ని డెల్టా మండలములలో

సగటున ఆ వర్షపాతంనకు అనుగుణముగా డ్రైన్లను పునరుద్ధరించుటకు రిపోర్టులు సిద్ధం చేయటం జరిగినది. వచ్చే సంవత్సరం నుంచి డెల్టా ఆధునీకరణ పనులు మొదలు అయి షుమారు మూడు సంవత్సరములలో మొత్తం పనులు పూర్తవటానికి ప్రణాళిక సిద్ధం చేయటము జరిగినది. ఆధునీకరణ వలన చివర వున్న పొలాలకు నీరు అందటమే కాకుండా. నీటివృధా ఆపుటవలన షుమారు 30 శతకోటి ఘనపుటడుగుల నీరు ఆదా అవుతుంది.

45 శతకోటి ఘనపుటడుగుల సామర్థ్యంతో పులిచింతల ప్రాజెక్టు పనులను సాకారం చేయుటలో వీరి పాత్ర అసమానము. వీరు ముఖ్యమంత్రిగారితో ఒప్పించి 2004 అక్టోబరులో శంకుస్థాపన చేయించడం జరిగినది. కొందరు స్వార్థపరులు దానిని ఆపించాలని హైకోర్టులో పిటీషన్ వేయగా వీరు తానుకూడా ఇంప్లిమెంటు అయి మంచి లాయరుతో వాదింపచేసి కోర్టు ఆ పిటీషన్ కొట్టివేయుటకు మూలకారకులయ్యారు. దానివలన కృష్ణా డెల్టాకు ఎంతో వుపయోగ కరము. మనం పూర్వపద్ధతులలోనే జూన్‌లో కృష్ణాడెల్టాకు నీరు వదులుటకు ఎంతో వుపయోగ పడుటయేకాక, వరదలు వచ్చినప్పుడు అక్కడ రిజర్వాయర్‌లాగా వుపయోగ పడుతుంది. ఈ ప్రాజెక్టు కూడా 2009 జూన్ మాసాంతమునకు పూర్తి అగుటకు సిద్ధముగా వున్నది.

80 శతకోటిఘనపుటడుగుల నీరు పోలవం నుంచి ప్రకాశం బ్యారేజికి తరలించుటకు ఉద్దేశించిన పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో కూడా వీరి కృషి అద్వితీయం. దీనివలన కృష్ణానదిలో నీరు లేకపోయినను గోదావరిలో నీరు లభ్యత ఎక్కువ కావున ఏ ఇబ్బంది లేకుండా కృష్ణా డెల్టాకు నీరు సరఫరా చేయవచ్చును.

1977 నవంబరులో సంభవించిన తుఫానుకు దివిసీమతో పాటు కోనసీమకూడా అతలాకుతలము అయిన విషయము మనందరికీ తెలిసినదే. అప్పుడు వీరి తండ్రిగారైన మండలి వెంకట కృష్ణారావుగారు ఆ సమయంలో చేసిన సేవలు ఈ రోజుకి దివిసీమలో చెప్పుకుంటారు. షుమారు 24 కి.మీ. కరకట్టలు అప్పుడు వేయించటం జరిగినది. కాలక్రమేణా అవి బలహీనపడినప్పుడు 12వ సంవత్సరములో కొంత వరకు మాత్రం పునరుద్ధరణ జరిగినది తరువాత వాటిని పట్టించు కున్న వాళ్లులేరు. వీరు వచ్చిన తరువాత వాటికి మళ్లీ అంచనాలు తయారు చేయించి షుమారు 19 కోట్లు రూపాయలతో ఈసంవత్సరం చివరాంతంలో పనులు చేయుటకు సిద్ధముగా వున్నవి.

వీరు గత 5 సంవత్సరములలో పైన చేపట్టిన పథకములు అన్నీకూడా దీర్ఘకాలిక ప్రయోజనములు చేకూర్చేవే. ఇటువంటి వారు జిల్లాకు ఒక్కరు వున్నను ప్రజలు కోరుకొన్న దీర్ఘకాలిక ప్రయోజనాలు అన్నీకూడా తీరుట వలన వారంతా సుఖ సంతోషాలతో వుంటారు.

○

| Sl.No. | Name of the Program | No.of Villages | No.of People Benefited | Cost of the Project |
|---|---|---|---|---|
| 1. | CBDP(MPDL): To Capacitate the costal and fisher-men communities to face natural calamities like cyclones and floods. | 35 (in two phases : 15+20) | 20050 | 2100000/- |
| 2. | CBDP : Caritas India | 21 | 12000 | 1800000/- |
| 3. | **Tsunami Relief :** Distribution of Rice, Dhal, Bisqutes, Chilly Powder, onions, Tamarind, oil, Cloths, Blankets, Towels Mosquito nets for families and Medicines and Distribution of nets, Boats repair etc. | 17<br>19 | 350000 | 7500000/- |
| 4. | Mobile (boat) Despensary and School at Yesupuram. | 9 | 1500 | |
| 5. | HIV/AIDS:ASHA Program (CRS) | 20 | | 200000/- |
| 6. | Houses for Tsunami Victims (Caritas India and CRS) | 27 | 7900 | 95000000/- |
| 7. | Houses for Tsunami Victims (SODI) | 2 | 2200 | 22213800/- |
| 8. | Community Halls (CRS) | 4 | 3500 | 5000000/- |
| 9. | Mobile Medical Unit | 75 | 37500 | 1000000/- year |

# అరుదైన నాయకుడు శ్రీ బుద్ధ ప్రసాద్

- శ్రీ బొగ్గరపు వెంకట్రావు
కేంద్ర సంచాలకులు-విజయవాడ దూరదర్శన్

రాష్ట్ర అమాత్యులు శ్రీ బుద్ధప్రసాద్ హంగులు, ఆర్భాటాలు లేని సాదాసీదా వ్యక్తి. ఆయన ఎంత సామాన్యంగా ఉంటారో, ఆలోచనలు మాత్రం అంత ఉదాత్తంగా ఉండటం నేను గమనించాను. ఆయనను గూర్చి ఎవరిని కదిపినా ఇదే విషయం చెబుతారు. ప్రసార మాధ్యమాల పట్ల వారికున్న ప్రేమ ఇంతింత అనరానిది. విపత్కర సమయాలలోగాని, సామాజిక విలువలను ప్రకటించడంలో గాని వీటి పాత్ర ముఖ్యమైనదని, తెలుగు భాష ప్రసార మాధ్యమాలు ప్రాణం పోయాలని, తెలుగుభాషని నిలబెట్టాలని ఆయన కోరుతూ వుంటారు. పత్రికా సంపాదకులతో గాని విలేఖరులతో గాని దూరదర్శన్, ఆకాశవాణితో గాని వారికి ఉన్న సత్సంబంధాలు ఆయన వ్యక్తిత్వానికి నిదర్శనం.

ఆయన మంచి వక్తగా నేనెరుగుదును. ఏ విషయాన్నైనా సాధికారికంగా మాట్లాడగల మంచివక్త. అందుకు ఆయనకు గల పుస్తక పఠనమే కారణం అని చెప్పవచ్చు. రాజకీయాలలో అరుదైన వ్యక్తిగా శ్రీ బుద్ధ ప్రసాద్ వేనోళ్ళ కొనియాడబడటం సామాన్యమైన విషయం కాదు రాజకీయాలలో ఏ చెడు అలవాట్లు లేని వ్యక్తి శ్రీ బుద్ధప్రసాద్ గారినే మనం చూస్తాం. మా దూరదర్శన్‌లో నిర్మొహమాటంగా ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెప్పేతీరు ఎందరినో ఆకర్షిస్తుంది. ఎక్కడ సాహితీ వేత్తలుంటారో, ఎక్కడ కళలకు పట్టం కడతారో ఎక్కడ ఆపదలు జరుగుతాయో ఆయా ప్రదేశాలలో సాహితీ వేత్తగా, కళారాధకుడుగా అపద్బాంధవుడుగా శ్రీ బుద్ధ ప్రసాద్ ఉంటాడు. వారికి నా అభినందనలు.

39

# వర్ధిష్ణువు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ బాబు

- ఆచార్య ఎస్. గంగప్ప

"ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారుఁ బూసెజ్జపై,
నొకచో శాకములారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,
బొకచోఁ బొంతధరించు, నొక్కొక తఱిన్ యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్"

ఈ భర్తృహరి సుభాషితానికి చక్కటి ఉదాహరణ వర్ధిష్ణువు శ్రీ మండలి బుద్ధప్రసాద్ బాబు. ప్రజా సేవయే పరమాశయంగా, ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులై గావించిన కార్య కలాపాలే వారి విశిష్ట జీవితాన్ని చాటుతాయి. ప్రత్యేకించి కళాసాహిత్యాలు, భాషా సాంస్కృతిక రంగాలకు వారు చేస్తున్న కృషి మిక్కిలిగా కొనియాడదగినది. అది తండ్రి కీ.శే. మండలి వెంకట కృష్ణారావు గారి నుంచి వారసత్వంగా సంక్రమించిన గొప్పలక్షణం. 1975లో హైదరాబాద్‌లో కీ.శే. జలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రిగాను, మండలి వెంకట కృష్ణారావుగారు విద్యా సాంస్కృతిక శాఖా మాత్యులుగాను నిర్వహించిన ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగు భాషా సంస్కృతి, కళలను ప్రచంచానికి వేనోళ్ళ చాటిచెప్పాయి. ఇదే ప్రప్రథమ ప్రయత్నం.

అంతకుముందే ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ 1973 అవార్డు పొందిన నా గ్రంథం క్షేత్రయ్య పదసాహిత్యం" ఆనాటి విద్యా సాంస్కృతిక శాఖా మాత్యులైన శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారికి 1974లోనే అంకితం ఇచ్చే అవకాశం లభించింది. ఆనాటి సభాధ్య క్షులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్య క్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, క్షేత్రయ్యపద సాహిత్యం గ్రంథ పరిచయం చేసిన వారు ఆచార్య తూమాటి దొణప్ప గారు. ఎంతో వైభవంగా జరిగిందా సభ.

ఈ సందర్భంలో శ్రీ మండలి బుద్ధప్రసాద్ హైదరాబాద్, ఖైరతాబాద్ చింతలబస్తీలోని నూతన ప్రభుత్వ కళాశాలలో తెలుగు శాఖా ధ్యక్షులుగా నేనున్న సమయంలో నా విద్యార్థి విద్యార్థి దశలోనే బుద్ధ ప్రసాద్ తెలుగు సాహి త్యంపై అమితమైన ఆకాంక్షను, అభినివేశాన్ని

చాటుకొన్నారు. నన్నయ నుంచి నారాయణరెడ్డి దాకాగల మన తెలుగు సాహిత్య సంపద సారాన్ని మనసారాగ్రోలి త్రేంచిన విద్యార్థి బుద్ధ ప్రసాద్. నాబోటి అధ్యాపకులకు ఎంతో ఆనందాన్ని ఇచ్చిన విద్యార్థి. తదనంతరం అవనిగడ్డలోని 'గాంధీ క్షేత్రం' పేర సాహిత్య పత్రికను తన సంపాదకత్వంలో ప్రకటిస్తూ వచ్చిన సాహితీ ప్రియుడు. మండలి వెంకట కృష్ణారావు గారు బుద్ధప్రసాద్ ప్రయత్నంలో గాంధీ క్షేత్రంలో నిర్వహించిన మహాసభలో సినీనటి జమునతో పాటు కృష్ణారావుగారి చేతులమీదుగా సన్మాన అందుకొనే అవకాశంనాకు లభించింది. ఆనాటి సభానిర్వహణ బుద్ధ ప్రసాద్ సామర్థ్యానికి ప్రబలనిదర్శనం. తదనంతరం వెంకట కృష్ణారావుగారు పరమపదించిన వెనుక బుద్ధ ప్రసాద్ అవనిగడ్డలో తండ్రి వెంకట కృష్ణారావుగారి జయంతి వర్ధంతులనేకం జరిపి బుద్ధ ప్రసాద్ పితృఋణం తీర్చుకొన్నారు. ఆయా సభల్లో నేను, నాతోపాటు మా మిత్రులు ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావుగారు పాల్గొనే అవకాశం కలిగింది. దివిసీమ సాంస్కృతిక వైభవం –జాయపసేనాని, క్షేత్రయ్య, నారాయణ తీర్థులు, సిద్ధేంద్రయోగి, కూచిపూడి అభినయం గూర్చి వివరించే అవ కాశం లభించింది. అదే 'దివిసీమ సాంస్కృతిక వైభవం' అనే గ్రంథంగా రూపొందింది. బుద్ధ ప్రసాద్‌గారు 2005లో నిర్వహించిన దివి మహోత్సవములలో దివిసీమ సాంస్కృతిక వైభవం గ్రంథాన్ని వారికి అంకితమిచ్చే అదృష్టం లభించింది.

తెలుగుభాషా సంస్కృతులపై అభిమానంగల మండలి వెంకట కృష్ణారావుగారు ప్రపంచ తెలుగు మహాసభల ద్వారా ప్రపంచ వ్యాప్తంచేయగా, ఆ బాటలోనే నడుస్తున్న మండలి బుద్ధప్రసాద్ బాబు కూడా తెలుగుభాష అన్ని రంగాలలోను వాడుకలోకి రావాలని కోరు కోవడమేకాక, మన సంస్కృతిని పరిరక్షించు కోవాలన్న తీవ్రమైన కృషితో చేసిన తీరు మనం గమనించవచ్చు. 2002 నవంబర్ 1, 2 తేదీలలో మన తెలుగుభాషకు వస్తున్న ముప్పును విప్పిచెప్పడానికి, జాతిని చైతన్యవంతం చేయడానికి, రెండు రోజుల మహాసభలు శ్రీకా కుళంలో నిర్వహించడం, తదనంతరం మన తెలుగుభాష క్షీణించి పోకుండా 2003 ఫిబ్రవరి 21న మాతృభాషా దినోత్సవం హైదరాబాద్‌లో పెద్ద ఊరేగింపుతో సభ నిర్వహించడంలో తెలుగు భాషోద్యమ సమాఖ్య ఏర్పడింది. బోధనలో, ప్రచార, ప్రసార సాధనాలలో తెలుగుభాషకు ప్రాముఖ్యం కొనిరావడం కోసం ఈ సమాఖ్య పనిచేయనారంభించింది. ఆ స్ఫూర్తితోనే గుంటూరులో 2003 సెప్టెంబర్ 7న ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఒకరోజు సభ ఈ రచయిత అధ్యక్షతన జరుపగా సమాఖ్య అతిథిగా పాల్గొన్నారు బాబుగారు. అలాగే 2004 అక్టోబర్ 30, 31వ తేదీలలో జె.కె.సి. కళాశాల, గుంటూరులో ఈ రచయిత అధ్యక్షతన జరిగిన సభలో ముఖ్య అతిథిగా పాల్గొని 5వ తరగతి వరకు తెలుగు భాషను తప్పక బోధించాలన్న తీర్మానంచేసి, ప్రభుత్వంచేత అంగీకారింప చేయడంలో ఎంతగానో సహకరించారు.

ఇదిలా ఉండగా బుద్ధ ప్రసాద్‌లా చొరవ తీసుకొని కృష్ణాజిల్లా రచయితల సంఘం, అధ్యక్ష కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు గారు, డా. జి.వి. పూర్ణచంద్‌గార్లు, కృష్ణాజిల్లా

పరిషత్తు అధ్యక్షులు శ్రీ కుక్కల నాగేశ్వరరావు గారు-ల సహాయ సహకారాలతో తెలుగు భాషా సంస్కృతులపై రెండు రోజుల సభలో 2006 అక్టోబర్ 27, 28 తేదీలలో నిర్వహించి మరలా మరోసారి వారి తండ్రిగారు 1975లో ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించిన తీరును జ్ఞప్తికి తెచ్చేలా నిర్వహించడం విశేషాల్లో విశేషం. అలాగే మరోసారి శ్రీకాకుళంలో 2007 ఫిబ్రవరి 9, 10, 11, తేదీలలో మూడు రోజులు సభలు నిర్విఘ్నంగా నిర్వహించడమే కాదు, పలువురి సహాయసహకారాలతో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతికశాఖ, తిరుమల తిరుపతి దేవస్థానముల ఆళ్వారు దివ్యప్రబంధం ప్రాజెక్టు, కృష్ణాజిల్లా రచయితల సంఘం, కృష్ణాజిల్లా పరిషత్తు సంయుక్తంగా సాహితీ సమరాంగణా సార్వభౌముడు శ్రీ కృష్ణ దేవరాయల కాంశ్య విగ్రహాన్ని ప్రతిష్ఠించడం సర్వాంధ్ర జాతికి గర్వకారణం. ఈ సభలు సైతం మరోసారి ప్రపంచ తెలుగు సభలను గుర్తుకు తెస్తున్నాయని నేనే పలుమార్లు మండలి బుద్ధప్రసాద్ కృషిని శ్లాఘించాను. ఇదొక మరపురాని ఘట్టం.

తెలుగుజాతి వివిధ దృక్కోణాలను ప్రతిబింబించే రీతిలో కృష్ణాజిల్లా రచయితల సభల్లో 'పసిడి' బృహత్తర సంపుటి, శ్రీకాకుళం సభల సందర్భంలో 'శ్రీకృష్ణదేవరాయ వైభవం' పేర శ్రీకృష్ణదేవరాయలను వైవిధ్య భరితంగా ప్రదర్శించే రీతిలో మరో బృహత్తర వ్యాససంపుటి తీసుకొనిరావడం మండలి బుద్ధప్రసాద్‌కు తెలుగుజాతి, భాష, సాహిత్యం, సంస్కృతులపైగల అభిమానానికి ప్రబల నిదర్శనం.

ఇలాంటి ప్రజల మనిషికి జాతి, భాషా సంస్కృతులపై అభిమానం కలిగిన బుద్ధ ప్రసాద్‌గారు మూడేళ్ళుగా నిరీక్షణతో ప్రజల కోరిక నెరవేరింది అన్నట్లు డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డిగారి మంత్రివర్గంలో మంత్రిగా కూడా ప్రమాణ స్వీకారం చేయడం అమితానందాన్ని కలిగించిన అంశం. కేవలం శాసన సభాసభ్యులు గానేకాక మంత్రిగా తన బాధ్యతలను గుర్తించి మరిన్నిమంచి ప్రజాహిత కార్యాలు చేసి పేరు గడిస్తారని ఆశిస్తున్నాను.

నేను ఏప్రియల్ 2005న నా గ్రంథం "దివిసీమ సాంస్కృతిక వైభవం" బాబుకు అంకితమిస్తూ అంకిత పద్యంలో :

**అట్టి వంశమందు నావిర్భవించెను**
**తండ్రికి తగినట్టి తనయుడగుచు**
**బుద్ధిమంతుడింత బుద్ధ ప్రసాద్ బాబు**
**అతనికిత్తు కృతిని అంకితమ్ము"**

అని వ్రాశాను.

తదనంతరం ప్రస్తుతం ముద్రణలో ఉన్న బాబుకే అంకితమిచ్చిన గ్రంథం "తెలుగు భాషకు ప్రాచీన భాషా గౌరవం" అంకితంలో తండ్రిని మించిన తనయుడని పేర్కొంటూ

**"తండ్రి వెలయజేసె తరగని ప్రఖ్యాతి**
**విశ్వమందు మిగుల విజ్ఞులెరుగ**
**తండ్రిమించినట్టి తనయుడవు ప్రసాదు**
**కట్టె తెలుగు కొరకు కంకణమ్ము" -** అని పేర్కొన్నాను.

అలాంటి బాబుకు భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించి, జనతకు ఇతోధిక సేవచేయ శక్తిసామర్థ్యాలను ప్రసాదించాలని కోరుకొంటూ జన్మదిన శుభాకాంక్షలు తెలియ చేస్తున్నాను. నిండునూరేళ్ళ సేవా కార్యక్రమాల్లో పేరు ప్రఖ్యాతులు గడించాలని ఆశిస్తున్నాను. శుభం.

## పూవు పుట్టగనే పరిమళిస్తుంది

- శ్రీ కాలనాథభట్ట వీరభద్ర శాస్త్రి

పూవు పుట్టగానే పరిమళిస్తుంది
ఆఘ్రాణ శక్తికి వెంటనే తెలుస్తుంది
ఆలస్యంగా తెలిసినా విలువ గ్రహించి
సముచిత స్థానం కల్గిస్తే
ప్రతిభాపాటవాలు వెల్లి విరుస్తాయి
అనుసృతంగా తండ్రిగారి బాటలో
తెలుగు భాష, తెలుగు జాతి అభివృద్ధికి
తనదైన బాణీలో పాటుపడుతున్న
రాష్ట్ర మంత్రివర్యులు గౌరవనీయులు
మండలి బుద్ధప్రసాద్ గారికి
అభినందన చందనాలు
నేను వయస్సులోనే పెద్దవాణ్ణి గనుక
యశస్వీభవ అని ఆశీస్సులు

# శ్రీరస్తు

- శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

తన తండ్రి మంత్రిగా ఘనత కెక్కిననాడు
అణకువ నేర్చుకొన్నట్టి సుతుడు
తన తండ్రితోపాటు తాను ఉప్పెనవేళ
కన్నీటనీదిన పిన్నవాడు
తన తండ్రి అరచొక్కా తాల్చిన తానును
మారిపోవని పల్లెటూరి బిడ్డ
తన తండ్రి కీర్తి సౌధమునకు నిద్దంపు
గళలు దిద్దిన సుధాలలితమూర్తి
ప్రాజ్ఞ గోష్ఠులలోన కన్పడునుగాని.
క్లబ్బులో, బారులోగాని కానరాడు
మంత్రుల కుమారులందెల్ల మంచివాడు
తరుణమండలి జోదు బుద్ధ ప్రసాదు

ఘనులౌమంత్రి కొమార్లకీదగు
శుభాకాంక్షాదులవ్వెట్టివో!
సినిమాహాలొకటీవు కట్టుకొని
నిక్షేపంబుగా లక్షలన్
ధనమార్జింపుమటందుమేని అది
స్వార్థత్యాగి బుద్ధ ప్రసా
దునకున్ నచ్చదు గాంధితాత కత
డెంతో కూర్చువాడౌటయున్.

# తెలుగు వెలుగు

- శ్రీ వేటూరి సుందరరామమూర్తి

వేదాంతులు పాలకులైతే భూమికి స్వర్గందిగి వస్తుందని ఆర్యోక్తి. మానవతా విలువలు కొరవడుతున్న నేటి రాజకీయంలో గాంధీతత్వం గతచరిత్రకు సాక్షిగా శిథిలశిలగా మిగిలి పోయింది. కానీ దైవికంగా ఈ రోజుల్లో ఒక గాంధేయవాదిని ఒక నిష్కలంక ప్రజాసేవకుడ్ని మంత్రి పదవి వరిస్తే అది ఒక అపురూప సంఘటనగా అమృత ఘడియగా నిలిచిపోతుంది.

గాంధీతత్వానికి పట్టుగొమ్మలుగా నిలిచిన కుటుంబాలలో మండలివారి కుటుంబం కూడా ఒకటి. వారి ఇల్లు సబర్మతి, కార్యాలయం గాంధీక్షేత్రం. అవనిగడ్డకు ఆ పవిత్రతను ఆపాదించిన శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు తెలుగు భాషోద్యమం ద్వారా తెలుగు జాతికి చైతన్యం పూరించారు. వారి తనయులు శ్రీ బుద్ధప్రసాద్‌గారు సుగృహీత నామధేయులు. పదవితో నిమిత్తం లేకుండా పలు భాషా సాంస్కృతిక ఉద్యమాలు నిర్వహించినవారు. ఇటీవల శ్రీకాకుళంలో శ్రీకృష్ణదేవరాయల విగ్రహాన్ని ప్రతిష్ఠించి తెలుగుజాతికి ఆత్మజాగృతి కలిగించినారు.

దివిసీమకు శాసనసభలో ప్రతినిధిగా ఉన్నా, యావదాంధ్ర జాతి సంస్కృతికి ప్రతినిధి ఆయన. ఆయన నిర్వహించిన కృష్ణామహోత్సవాలు ఇతరేతర సాంస్కృతిక కార్యక్రమాలు ఇందుకు నిదర్శనం. నిత్య నవనీత సమానమైన నిండుమనస్సు ఆయనది. మాట మృదులమై కిన్నెర వీణ మీటినట్లుంటుంది. పసిపాపలాంటి మా బుద్ధ ప్రసాదుగార్కి పరమాత్ముడు చిరాయురారోగ్యములను కలిగించవలెనని ప్రార్థిస్తున్నాను.

○

# మినహాయింపులు తప్పనిసరి

- శ్రీ సి.ధర్మారావు

ముగ్గురు మిత్రులం ఒకసారి ఉబుసు పోకకు చిన్న చర్చ ఒకటి పెట్టుకున్నాం. మినహాయింపులంటూ ఉండని ఒక బండ సూత్రం ఉంటుందా, దాన్ని కనిపెట్టగలమా -అన్నది ఆ వేళ తేల్చవలసిన విషయం. ఎవరెవరు ఏమి చెప్పారు. ఏ వాదనలు చేశారు అన్నపేర్లు ముఖ్యం కానేకాదు. చర్చా సరళి ప్రధానం. చర్చాంశం సూచించిన భవదీయుడు సమన్వయకర్త అనుకోవచ్చు.

"నీరు పల్లానికే ప్రవహిస్తుంది"

"నా బొంద! వాష్ బేసినులో నీరు కింద నుంచి గొట్టంలో పైకి రావట్లేదా?"

"కాని అసలు నీరు పైనెక్కడో నీళ్ల టాంకులో ఉన్నది గదా. అక్కడి నుంచి పల్లంలోకి..."

"అదీ కుదరదు. ఎత్తిపోతల పథకాల్లో నీరుపైకి ఎక్కేస్తున్నది"

"అది యంత్రసాయంతో"

"అట్లా అయితే, నీరు సహజంగా పల్లానికి ప్రవహిస్తుంది-అందాం" అప్పుడు స.క. కలుగజేసుకున్నాడు. సూర్యుడు తూర్పున ఉదయించును. ఇట్లాంటివన్నీ ప్రకృతి ధర్మాలు. ప్రకృతిని వదిలేద్దాం. దానిలో ఇంకా కొన్ని బండసూత్రాలు బతికే ఉండవచ్చు. మన విషయం- మనిషి వ్యవహారప్రపంచానికి సంబంధించి ఉండాలన్నది చర్చ ఉద్దేశంగా అర్థం చేసుకోవాలి.

మళ్లా చర్చ మొదలైంది.

"మన రాజకీయవేత్తలు చచ్చినా తమంతతాము రంగం నుంచి తప్పుకోరు"

"మన రాజకీయ 'వేత్తలు' అంటున్నారు. అంటే రాజకీయ శాస్త్రం చదువుకుని, దాని లోతుపాతులు తెలిసిన వాళ్లనా నీ ఉద్దేశం?"

'ఆహా, మన మామూలు రోజువారీ రాజకీయాల్లో నేతలుగానో, కార్యకర్తలుగానో ఉంటున్న వారు".

"అట్లా అయితే, వట్టిగా 'రాజకీయాలు' అందాం. జాక్స్‌చిరాక్ ఫ్రాన్సు అధ్యక్షపదవికి మళ్లీ పోటీ చేసేది లేదు అన్నాడు"

"ఆ మాట పుతిన్ కూడా అంటున్నాడట. నేను చెప్పింది-'మన' రాజకీయాల్ని గురించి"

'అట్లా అనుకున్నా-ఆచార్య నరేంద్రదేవ్, అచ్యుత్ పట్వర్ధన్, అరవింద ఘోష్-ఇట్లాంటి వాళ్లంతా రాజకీయాల నుంచి స్వచ్ఛందంగా తప్పుకున్నవారే".

"వాళ్లంతా పాతకాలం వాళ్లు. నేనంటున్నది, వర్తమాన రాజకీయరంగం గురించి".

"వర్తమానం అంటే-ఏ సంవత్సరం, ఏ తేదీ నుంచి? పైగా చచ్చినా తప్పుకోరు అంటే, ఛస్తే వాళ్లు తప్పుకున్నట్టు కాకపోయినా విధి తప్పించినట్టు అవుతుంది".

'వర్తమానం' అన్న దగ్గర చర్చ ప్రతిష్టంభనలో పడే అవకాశం ఉందని స.క. హెచ్చరించి, వేరే అంశానికి మళ్ల వలసిందిగా సలహా ఇచ్చాడు.

"సినిమా తారలు తమ వయస్సు తెలియనివ్వరు"

"తారలంటే మగవారా, ఆడవారా?"

"ఇరు వర్గాల వారూ'నూ"

"వృద్ధాప్యం వచ్చిపడి, షష్టి పూర్తి వగైరా జరుపుకునేప్పుడు కూడా వయస్సు చెప్పుకోరా?"

"అట్లాంటి వయస్సులో వాళ్లను ఇంకా "తారలు" అనరు"

"అక్కినేని వారు తారనా, కాదా? ఆయన వయస్సు ఎప్పటి కప్పుడు నిత్యహరితుడంటూ మెప్పుగా చెబుతూనే ఉన్నారు కదా"

"సినిమాల్లో నాయికా, నాయక పాత్రలు వేసే వారు అంటే సరి"

"ఒక ముసలిపాత్ర సినిమాకు నాయకుడో, నాయికో కాకూడదా? పైగా, మధ్యలో ఒక పెద్దవాడి పాత్ర నటించి, మళ్లీ నాయక పాత్రకు వస్తే?"

చర్చ పక్కదారి పడుతున్నదంటూ స.క. అడ్డు చెప్పినా, సభ్యుడు ఆగలేదు.

"ఆగండాగండి. సూత్రం వద్దకు వచ్చేస్తున్నాం. 'సినిమా తారలు సాధారణంగా తమ వయస్సు తెలియ నివ్వరు' అంటే ఇక తేడా రాదు"

ఈ మాటవిని మిగత ఇద్దరూ పకపకా నవ్వేశారు. 'సాధార ణంగా'అని ఎప్పుడైతే అన్నామో, అసాధారణ పరిస్థితి ఉండవచ్చుని, అంటే మినహాయింపులు ఉన్నవని ఒప్పుకున్నట్టే గదా.

ఆ సభ్యుడూ ఒప్పుకుని నవ్వులో కలిశాడు. ఇంతలోనే సీరియస్‌గా ముఖంపెట్టి కొత్త అంశం ఎత్తుకున్నాడు.

"వారసత్వ రాజకీయాలు దేశానికి అనర్థం"

"కొంచెం వివరించాలి. వారసత్వ మంటే-కొడుకూ, కూతురూ, భార్య లేక భర్తేనా? బావ మరదులు, అల్లుళ్లూ కూడ వారసులనవచ్చా?"

"చట్టపరంగా ఎవరు వారసులైతే, వారే"

"ఒప్పుకుందాం. వారసుడు కూడ రాజకీయంలోకి వచ్చినంత మాత్రాన అనర్థం జరుగుతున్నదని ఎట్లా నిర్ధారిస్తాం?"

"అధికారమే అసలు అనర్థం తెస్తుందని, సర్వం సహా అధికారం ఇక సర్వనాశహేతువని పెద్దలు చెప్పనే చెప్పారుకదా. వారసత్వంగా ఒకే కుటుంబంలో తరాల పర్యంతం రాజకీయాధికారం ఉండకూడదు".

"అట్లా అయితే, దీన్నే బంద సూత్రంగా ఒప్పేసుకుంటేసరి. మనం ఎట్లాగూ కొత్త బందని తిరగనియ్యలేమేమో"

ఇక్కడ మళ్లీ స.క. కలుగజేసుకున్నాడు.

"మోతీలాల్‌గారి నుంచి జవహర్లాల్, ఆయన్నుంచి ఇందిరమ్మ, ఆమె నుంచి రాజీవ్, ఆ తర్వాత ఇప్పుడు సోనియా వచ్చారు గదా".

"నిజమేగాని స.క.గారూ, దీనివల్ల దేశానికి కల్తీ లేని మేలే జరిగిందంటారా? అట్లా అని బల్లగుద్ది చెప్పగలమా? మధ్యలో 'ఎమర్జన్సీ' గట్రా చీకటి రోజులున్నాయి గదా".

"అట్లా అయితే, మరొక ఉదాహరణ చెపుతాను. మండలి వెంకట కృష్ణారావుగారు మన ఎరుకలోనే రెండుసార్లు రాష్ట్రంలో మంత్రిత్వం నెరిపారు. ఇప్పుడాయన కుమారుడు మళ్లీ మంత్రి అయ్యారు. ఈ వారసత్వం రాష్ట్రానికి చెరుపంటారా, లేక మేలే నంటారా?"

మేలే, మేలే అని మిగతా ఇద్దరూ గట్టిగా అరిచారు. అందుచేత, ఈ చర్చ సారాంశమేమంటే – మినహాయింపులంటూ సహించని బందసూత్రమేదీ మానవ వ్యవహారంలో సాధ్యం కాదు. కాకపోతే, మరొక్క విషయం తేలవలసి ఉంది.

ఏమి టేమిటని సభ్యులు ఆత్రపడ్డారు.

రెట్టించిన అధికారం రెట్టింపు మేలు చేస్తుందా, తగ్గుతుందా?

కాస్త వివరించమని సభ్యులు కోరారు.

మరేం లేదు. తండ్రిని ఈ తనయుడు మించుతాడా అన్నది అందరికీ ఆసక్తికరంగదా మనం వేచిచూద్దాం, శుభం అంటూ స.క. స్వస్తి పలికాడు.



# మంచి మనసుకు మంత్రిత్వము

- శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి

అభినందన మభినందన
మభినుత బుద్ధ ప్రసాద ! హార్దిక పాలా !
శుభకరమిా సచివత్వము
విభవము గడియింపుము పదవికి మన దివికిన్ !

నైతిక మార్గనిష్ఠుడు నన్య పథవ్రత ధర్మ వర్తియౌ
నేతను రాజకీయమున నేడొక వింతగ జూతు; రయ్యు నీ
వా తెగ వీడకుండ విజయమ్ము వరించుటయే విశిష్ట, మిా
జాతి వసంత శోభన రసాల మికన్ చివురాకు లెత్తెడిన్

దివి దివ్యత్వము ధారలై కురిసి యీ దివ్యద్భూమి భాగమ్ములన్
చవులన్ దేర్చెనొ యెల్లరీతులను, సచ్చారిత్రీ కాంతః శ్రుతుల్
సవరింపన్ కవిపండితాళి సచివుల్, స్వాతంత్ర్య యోధాగ్రణుల్
స్తవనీయ ప్రతిభన్ వెలార్చి రిచటన్ జాతీయ వైతాళికుల్ !

పదములన్ మువ్వక్షేత్రయ్య పాదరజము,
కూచిపూడిని రవళించె కులుకు టందె,
ఘంటసాల శిలల బౌద్ధ కథన రీతి
కావ్య నిర్మాణ దీప్తి శ్రీకాకుళమున !

ఇట్టి మట్టిలో పుట్టిన గట్టి గింజ
వట్టిపోవునే వరిమడి పెట్టకుండ ?
ఆనువంశిక సేవా మహత్వ మిట్లు
గడన కెక్కెను, దక్కెను గౌరవమ్ము !

తన తెన్గును ప్రపంచ తారాపథమ్మున
　　కెత్తి హారతు లెత్తు కృష్ణు డతడు,
తన తెన్గు వాణి స్వస్థానమున్ నిలబెట్ట
　　పోరు సల్పు ప్రశాంత బుద్ధు డితడు,
దివిసీమ యనగ గాంధీ క్షేత్రమే యన
　　త్రికరణమ్ముల జూపు కృష్ణు డతడు,
దివిసీమ యాంధ్ర విష్ణు విలాస భాష్య మా
　　ముక్త మాల్యదయను బుద్ధు డితడు,

భూ ప్రజావన సాహితీ పోషణముల
పలుకె ఆయుధమ్మగు మిత భాషణముల
తండ్రినిన్ మించె ననిపించు తనయుడితడు,
సాధుశీలుండు బుద్ధ ప్రసాదు డితడు !

ఏ సిద్ధాంత మయూఖరేఖలవి నిన్నీరీతి నిల్పెన్ తద
భ్యాసమ్మున్, మఱి యే మహామహుని దివ్యారాధనమ్ముల్ నినున్
శాసించెన్ తదుపాసనా బలము, విస్తారమ్ముగాన్, నీదు సే
వా సౌభాగ్యములందు మాకు సచివా! బౌద్ధ ప్రసాదా! సఖా!

O

# మా మండలి

- కీ॥శే॥ విశ్వనాథ పావనిశాస్త్రి

మండలి – అన్న అక్షరాలు వినబడంగానే, నాకు అప్రయత్నంగా ఒక పద్యం గుర్తుకువస్తుంది. ఆ పద్యంలోని రెండు పాదాలు వెంటనే నోటివెంట వస్తాయి. అవి –

'రావు మండలికుల కృష్ణరావొకండు
ఒగిని మేమందరము కృష్ణయొడ్డు జాతి'

ఇవి మా నాయనగారైన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన పద్యంలోని రెండు పాదాలు తన రామాయణ కల్పవృక్షం – నాల్గవ ముద్రణ యొక్క అవతారికలో కొత్తగా చేర్చిన పద్యంలోనివి. ఆముద్రణకి ఆనాటి ప్రభుత్వం (1976) ఎంతో ఆర్థిక సహాయం చేసింది. దానికి కారకులు, అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారూ, అప్పటి విద్యాశాఖా మంత్రి శ్రీ మండలి కృష్ణారావు గారూనూ! అది వాళ్ళ సహృదయత!

ఆ మహాకవి ఋణం వాళ్లిద్దరూ అలా తీర్చుకున్నారు. వారిఋణం ఈమహాకవి యిలా తీర్చుకున్నాడు. అది వాళ్ళ మధ్య ఉన్న సారస్వతానుబంధం.

మా మండలి కృష్ణారావు గారు, ఎప్పుడు కలుసుకున్నా ఎలా కలుసుకున్నా, నాచేత ఆ పద్యం చదివించుకోకుండా ఉండే వారుకాదు. ఆయన ఎంత హడావుడిలో ఉన్నా సరే, నేను కనబడం గానే–"పావని శాస్త్రిగారూ, ఆ పద్యం చదవండి!"–లేదా–"పావనీ! ఒక్కసారి ఆ పద్యం చదువు!" అని అడిగి చదివించుకునేవారు.

"మేమందరము కృష్ణ యొడ్డు జాతి–" అని తనూ ఒకసారి అనుకుని ఆనందించేవారు. ఆ చరణం ఆయనను అంతగా మురిపించింది. ఔను! కృష్ణానది, దాని తీరం, ఆ పచ్చనిచేలు, ఆ ప్రజలు! – ఓహ్! ఏమి జాతి! ఏమి సహృదయులు!!

ఆ సహృదయులలో ఒకరైన శ్రీ మండలి బుద్ధప్రసాద్‌ని నేడు ఢిల్లీ గుర్తించింది. బాగుంది. "ఎక్సలెంట్!". ఆయనలో దేశం గుర్తించవలసిన విషయాలు ఇంకా ఎన్నోఉన్నాయి. అవ్వన్నీ నేను చెపితే, నాగురించి నేను చెప్పుకున్నట్టు ఉంటుంది. అయినా కొత్తగా చెప్పేదేముంది ?

ఆనాటి సహృదయ మంత్రివర్యునికి వారసులు మా బుద్ధ ప్రసాద్!

నేను ఆ మహాకవికి వారసుడిని –
ఒగిని మేమందరము కృష్ణ ఒడ్డు జాతి !

○

# విజయోస్తు-దిగ్విజయోస్తు

- సాహిత్య తపస్వి పోలవరపు కోటేశ్వరరావు

గతంలో అనెగొంది నుండి మెండు, మండలి, బండ్రెడ్డి, భోగాది అనే నాలుగు వంశాలవారు ఎడ్లబండ్లపైన కుటుంబాలతో బయలుదేరి వచ్చారు. వీరిలో మెండువోరు బాపట్ల తాలూకా కాజీపేటలోను, మండలి వారు దివిసీమలోని పులిగడ్డలోను, భోగాది వారు భావదేవరపల్లిలోను స్థిరపడినారని చెపుతారు.

శ్రీకృష్ణదేవరాయల కళింగ యాత్రలో పాల్గొన్న అనేక వంశాల వారికి కొండవీడు, కొండపల్లి, విజయవాడ, శ్రీకాకుళం పరిచయంకావటం సర్వసాధారణం. పొట్టు త్రాడి వద్ద విజయ స్తంభం వేయించిన రాయల వారు ముందుకు సాగకుండా విజయవాడ తిరిగివచ్చి ససైన్యంగా నిలచిన ఆధారాలున్నాయి. ఆ సమయంలోనే వర్షాకాలంలో దాదాపు రెండున్నర మాసాలు రాయలు విజయవాడలో వున్నాడని మిత్రుడు ఆంజనేయులుగారు చెపుతుంటారు. అప్పుడే కావచ్చు రాయల వారు శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువును దర్శించుకోవటం, ఆముక్తమాల్యద ప్రారంభించడం జరిగింది. దేశ చరిత్ర పరిశీలిస్తే రాయలవారు కొన్ని పర్యాయాలు ఈ దండయాత్రలో ముందు వెనుకలకు కదలినట్లు తెలుస్తుంది.

ఈ యుద్ధాలలో పాల్గొన్న సైన్యాధిపతులకు దివిసీమ పరిచయం కావటంలో ఆశ్చర్యం లేదు. రాయల తదనంతరం జరిగిన రక్షసితంగడి యుద్ధంలో ఛిన్నాభిన్నమయిన రాజ్యంలోని పలు ప్రముఖులు అనేక ప్రాంతాలకు వలసవెళ్లి వుంటారు.

తరువాత కాలంలో వలసవచ్చి దివిసీమలో నిలచిన కాపు (కాంపులు) వంశాలలో మండలి వారు ప్రముఖులు. కత్తిపట్టిన ఈ వంశం హలం పట్టి వ్యవసాయం చేయసాగింది. ఐనా యుద్ధతంత్రం, నాయకత్వ లక్షణాలు తమవారిని కాపాడుకోవాలని దీక్ష ఆ జీన్సులో సాగివస్తూనే వుంది. మండలివారిలో ఆధునిక కాలంలో మండలి వెంకట కృష్ణారావుగారు (1926-1997)

తెలుగు భాషకు, దివి వాసులకు అపారమైన సేవలు అందించారు. ముఖ్యంగా 1977 తుఫాను దెబ్బకు సమూలంగా నేలకొరిగిన దివిసీమ గ్రామాలకు ఆయన అందించిన సేవలు అనితర సాధ్యమయినవి.

సేవాతత్పరత, సాహిత్య సాంస్కృతిక రంగాలలోని కృషి, అనాథ బాలురను ఆదుకోవటం, ఇంకా పలురీతుల స్వార్థరహితంగా సేవలందించటం, ప్రపంచ తెలుగు మహాసభలు నెరవేర్చటం లోని ప్రణాళిక తండ్రిగారి నుండి అందిపుచ్చుకున్నారు బుద్ధప్రసాద్ గారు.

పదవివున్నా, లేకున్నా ప్రజాసేవకు సాహిత్య సేవకు వారు ముందు నిలబడినారు. కత్తులు దూసుకొని కలబడటానికి సిద్ధమయిన అనేక సంఘటనలలో బుద్ధ ప్రసాద్‌గారు సరిదిద్ది, ప్రశాంతత కూర్చిన తీరు ఆశ్చర్యాన్ని కొలుపుతుంది. ఆశవదలు కున్న పులిగడ్డవద్ద కృష్ణా నదిపై నిర్మించాలనుకున్న వంతెనను వారు సాధించిన తీరు అనితరసాధ్యమయినది. దివిసీమ ఉత్సవాలు నడిపినా, కృష్ణాజిల్లా కాంగ్రెస్ పార్టీకి తాను నాయకత్వం వహించిన కాలంలో ప్రశాంతంగా నడిపినా, శ్రీకాకుళంలో తెలుగు భాషా సదస్సులు నిర్వహించినా, రాయలవారి విగ్రహం శ్రీకాకుళంలో వేయించినా, ఫాదర్ బాలస్వామిగారి ద్వారా పేదలకు ఉచిత గృహ వసతులు కల్పించినా, మరెన్నో సేవా కార్యక్రమాలు నెరవేర్చినా బుద్ధ ప్రసాద్ అందిపుచ్చుకున్న వారసత్వం, స్వయం కృషి, దృఢదీక్ష కారణం అని చెప్పవచ్చును. మానవసేవకు అంకితం కావటం, తెలుగు భాష పరిరక్షణకు నడుం కట్టటం అవిశ్రాంతంగా మంచిని పెంచటానికి, మానవత్వం పంచటానికి ముందు నిలచినా వారి హృదయ వికాసమే కారణం ఇంతటి మాన్యమూర్తికి సదా విజయం చేకూరాలని భవిష్యత్తులో మరిన్ని మంచిపనులు నెరవేర్చాలని, మంత్రిపదవి వరించిన యీ సమయంలో మనసారా కోరుకుంటున్నాను. మా మిత్రుడు మండలి వెంకట కృష్ణారావుగారి సుపుత్రుడు చిరంజీవి మండలి బుద్ధ ప్రసాద్ సదా విజయపథగామిగా పురోగమించాలని, పురోగమించ గలరని నమ్ముతూ విజయోస్తు, దిగ్విజయోస్తు అని దీవిస్తున్నాను.

# ఆశీరభినందనం

- శ్రీ జోశ్యుల సూర్యనారాయణ మూర్తి

చిరంజీవి శ్రీమండలి బుద్ధ ప్రసాద్‌తో నా పరిచయం ఇరవై సంవత్సరాల పైగా ఉంది. నేను అవనిగడ్డ కాలేజీకి 1970లో వచ్చి '71లో రిటైరవటం జరిగింది. ఆ కాలంలో అక్కడి విద్యార్థిగా నా దృష్టిలో అతడు గాని ఉపాధ్యాయుడుగా అతని దృష్టిలో నేనుగాని పడినగుర్తులేదు.

1976లో కవి సమ్రాట్ విశ్వనాథ పరమపదించిన సందర్భంగా ఆయనకు బహుభాషలలో శ్రద్ధాంజలి ఘటించే కవి సమ్మేళనం అప్పటి విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆధ్వ ర్యంలో హైదరాబాద్ రవీంద్ర భారతి–కళా భవనంలో ఏర్పాటుచేసి నన్ను అందులో పాల్గొ నేందుకు అవనిగడ్డ నుంచి పిలిపించారు. అప్పుడు మంత్రిగారి పిలుపు మేరకు (ఫోన్ కాల్) నేను మంత్రిగారి ఇంటికే వెళ్లాను. నన్నెం దుకు రమ్మన్నారో తెలియకుండానే వారి ఇంటికి వచ్చిన నన్ను చిరంజీవి బుద్ధప్రసాద్ ఆదరంతో విషయం నాకు తెలియజేయటం తెల్లకాగితాలిచ్చి సంతాప పద్యాలు వ్రాసుకొనేలాగ ఒక గదిలో కూర్చోపెట్టటం జరిగింది. అదే నేను చి॥ బుద్ధప్రసాదును సన్నిహితంగా ప్రథమంగా చూడటమనే చెప్పాలి.

కొంతసేపు నన్ను నిశ్శబ్దంగా ఉన్న గదిలో నిద్ర పోయేందుకు అవకాశం కల్పించి (సమ యాని)కి ప్రబోధించి వారి నాన్నగారితో బాటు నన్ను సభకు తీసుకొని వెళ్లిన బుద్ధ ప్రసాద్‌లో అప్పుడే నేను బుద్ధిమంతుని లక్షణాలు గౌరవ మర్యాదలతో పెద్దల నాదరించే స్వభావం గమనించాను. వినయ విధేయతలు విద్యావంతుని భూషణాలు. వాటితో ఆయన అన్ని రంగాల లోను పేరు పొంది గుర్తింపు పొందిన పెద్దలందరి వాత్సల్యానికి పాత్రుడు అయ్యాడు.

ఎంతమంది మంత్రులు లేరు? వారి పిల్లలు లేరు? ఎంత మందిని మనం చూడటం లేదు? తండ్రికి తగిన తనయుడు అనిపించుకొన్న చిరంజీవికి తండ్రిలాగానే గాంధీగారి యెడల ఆ తరంవారైన వినోబా భావే వంటి "సర్వే జనాః సుఖినోభవంతు", అనే భావంగల మహాను భావుల యందు గౌరవభావం, వారి జీవిత ఆదర్శాది జిజ్ఞాస పెంపొందటం వెల్లివిరిశాయి.

ఈ కాలపు యువకులలో తన విశిష్టతను తాను నిలబెట్టు కుంటూ వేష భాషా విశేషాలలో ఆంధ్రత్వం ప్రతిబింబించేలా ఎదగటం అల వాటైన బుద్ధప్రసాద్ తన పెరుగుదలలో ఎక్కడి కక్కడ మజిలీలుగా పొందిన పదవులలో నిరాడంబరంగా సమర్థంగా వ్యవహరించటము ఆయనకు అభిజాత్య సంపద అని నేను అనుకొంటూ ఉంటాను.

నేను గాంధీ క్షేత్రంలో చేరిన తరువాత నాకతడు అతనికి నేను సక్రమంగా దగ్గరై పరస్పరం ఆత్మీయులమయ్యాం. గాంధీ క్షేత్ర సంస్థల నిర్వహణలో తనపాలు బాధ్యత పెరుగుతూ ఉన్న కొద్దీ బుద్ధ ప్రసాదు బుద్ధి వికసించింది. బాలల ఎకాడమీ సభ్యత్వం, దివిసీమ బాలానంద సంఘం అధ్యక్ష్యం ఆయన యొక్క క్రియాశీలతకు నిదర్శనంగా తండ్రిగారు గాంధీ క్షేత్రంలో నెలకొల్పిన సేవా సంస్థలన్నిటితోను సాధికారికంగా కూడా సంబంధం ఉన్న బుద్ధప్రసాద్ పుస్తక ప్రచురణ కూడ ఎక్కువగానే జరిపించారు.

ఏటుకూరి బలరామమూర్తిగారు ఆకాశ వాణిలో "గాంధేయ మార్గ తాత్వికత" అనే విషయం మీద చేసిన ప్రసంగ పరంపర గ్రంథరూపంలో గాంధీక్షేత్ర పత్రికా సంపాదకులైన బుద్ధ ప్రసాద్ వల్లనే వెలుగులోకి వచ్చింది.

శ్రీ మధురాంతకం రాజారాం గారిచేత గాంధీ భావ ప్రచురణ ప్రభావంతో వచ్చిన కథలు సంకలనం చేయించిన బుద్ధప్రసాద్ సాహితీ ప్రీతి. మంచి గాంధీ మహాత్ముని మీద భక్తి అనుసరణ భావం వ్యక్తమవుతున్నాయి. శ్రీ రావూరు వెంకట సత్యనారాయణగారి నవల 'హంసల దీవి', కాసుల పురుషోత్తమ కవి కృత హంసలదీవి వేణుగోపాల శతకం మొదలైన గ్రంథాల ప్రచురణను చేపట్టిన సాహిత్య ప్రీతి, రసజ్ఞతలను బట్టి శ్రీ బుద్ధ ప్రసాదు నాకు సన్నిహితుడైనాడు.

బుద్ధ ప్రసాద్ పత్రికా సంపాదకుడై ఒక దశాబ్దం పాటు అవిచ్ఛిన్నంగా "గాంధీ క్షేత్రం" మాస పత్రికగా నడిపి తరువాత దానిని త్రై మాసిక పత్రిక చేయటం ఆయన యొక్క బహు వ్యాపకత్వానికి నిదర్శనము అనుకొంటాను.

"గాంధీ క్షేత్రం" ద్వారా సాధ్యమైనంత వఱకు ప్రతినెలా ఒక్కొక్క విశిష్ట వ్యక్తితో ఇష్టా గోష్ఠి జరిపి లోకానికి తెలియజేయుటయేకాక మన పెద్దలైన రాధాకృష్ణన్, రాజేంద్ర ప్రసాద్ లాల్ బహదూర్ శాస్త్రి మొదలైన వారిని వారి వారి జయంతులలోను, వర్ధంతులలోను స్మరించి ఆ సంస్కృతి గాంధీ క్షేత్రం దేశానికందించింది.

సర్వతోముఖ ప్రతిభనందుకొని సమాజానికి ఎంతో సంస్కార సహకారాలు పెంపొందిం చాలనే తపన బుద్ధ ప్రసాద్‌లో ప్రశాంతంగా ప్రకాశించటం విశేషం. అందుకాయన నిత్యం నిర్వహిస్తూ ఉన్న కార్యక్రమాలే సాక్ష్యం. దాని పరిణత దశ "దివిసీమ వైభవం" దేశానికి

చాటిచెప్పే సాధికారిక ప్రయత్నం చరిత్ర త్రవ్వి తలకెత్తాలనే తపన బుద్ధ ప్రసాద్‌లో ప్రబుద్ధమవుతున్నాయి. అనేక గాంధీ క్షేత్ర సంస్థలను నడుపుతూన్న బుద్ధప్రసాద్ కృష్ణరాయ గ్రంథాలయ అధ్యక్షుడుగా బహువిజ్ఞత సంపాదించిన వ్యక్తి-వేల పుస్తకాలతో తండ్రిగారు ఏర్పరిచిన ఆ గ్రంథాలయంలో ఉన్న పుస్తకాల సంగతి ఏవి ఎక్కడున్నవీ అన్న సంగతి ఇట్టే చెప్పగల స్మృతి పరిజ్ఞానం ఆయనలో గమనించి నేను ఆనందపడే వాణ్ణి.

ఆంధ్రదేశంలో ఉన్న సాహితీ సమితుల సమావేశం విజయవాడలో జరిగినప్పుడు చి॥ బుద్ధప్రసాద్ నన్ను దానికి దివిసీమ సాహితీ సమితి ప్రతినిధిగా పంపుతూ అంతకుముందు కృష్ణాజిల్లా రచయితల రాష్ట్రస్థాయి సమావేశాలు నిర్వహించిన వారి ద్వారా వాటి సమాచార విశేషాలు తెలుసుకురమ్మని ఇటుపైన మనం అవనిగడ్డలో ఆ సభలు నిర్వహిద్దామని చెప్పారు. శ్రీ గుత్తికొండ సుబ్బారావు గారి ద్వారా అవి ఎలా నిర్వహించారో నిర్వహించాలో తెలుసుకొని వచ్చాను.

5వ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు అవనిగడ్డలో నిర్వహించి అన్ని సాహితీ ప్రక్రియల మీది సదస్సులు జరపటం ఒక సంచిక ప్రచురించటం కూడా అప్పుడు జరిగింది. ఆ సభలు కవుల రచయితల మన్ననలు అందుకొన్నాయి. తరువాత ఒక కార్యవర్గము ఏర్పడి శ్రీ ముక్కామల నాగభూషణంగారి అధ్యక్షతన బుద్ధ ప్రసాద్ కూడా ఒక కార్యదర్శిగా విజయవాడలో మరో రెండు సభలు రెండేసి రోజులు నిర్వహించటంలో బుద్ధ ప్రసాద్ పాత్ర గణనీయం.

తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారిచే ఆత్మ కథ వ్రాయించి దానికి 'నా రాట్న చక్రం' అని పేరు పెట్టింది బుద్ధ ప్రసాద్. అలా పేరు సూచించినందుకు ఆయన ఎంతో ఆనందపడి వ్రాసి ఇచ్చారు. దాన్ని గాంధీక్షేత్రం ప్రెస్‌లోనే ముద్రించటం జరిగింది. మధురాంతకం రాజా రాంగారు కూడ బుద్ధ ప్రసాద్ కోరికకెంతో ఆనందపడి సేవాభావంతోనే కథల (సంపుటి) సంకలనం చేసి దానికి "తాత దిగి పోయిన బండి" అని పేరు పెట్టి (అందులో అదొక కథ కలవకొలను సదానందం దాని కథకులు) పంపించారు దానిని బుద్ధ ప్రసాద్ గాంధీ క్షేత్రం ప్రెస్‌లోనే ముద్రించారు.

ఆయన మారిషస్ వెళ్ళి వచ్చి 'మారిషస్‌లో తెలుగు తేజం' అనే పుస్తకం వ్రాశారు. అందులో తన యాత్రా విశేషాలు హృద యంగమంగా తెలియజేసిన తీరు ఆయన్ని రచయితగా పాఠకులకు పరిచయం చేసింది. దాశరథి గారన్నట్లు

**'యువకులెల్ల బుద్ధ ప్రసాదు వలె శాంతి**
**సహనములతోడ వర్తింపజాలిరేని**
**జాతి మేల్కొని కులమతాతీతమైన**
**సమసమాజ నిర్మాణమ్ము సాధ్యపడును'**

అట్టి నిర్మాణశక్తి అమాత్యుడైన చిరంజీవి బుద్ధప్రసాదుకు ప్రసాదించమని భగవంతుని కోరుతున్నాను.

○

# మంచి బుద్ధి ప్రసాద్

- డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

మండలి బుద్ధప్రసాద్ రాష్ట్ర పశుసంవర్ధక పాడిపరిశ్రమ, వెటర్నరీ, మత్స్యశాఖల మంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు. రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడినప్పటినుండి బుద్ధ ప్రసాద్‌కి కీలకపదవి వస్తుందనే ఊహాగానాలున్నాయి. మంత్రిపదవి లేదా డిప్యూటీ స్పీకర్ పదవి అని ఆనాడు అన్నారు. మూడేళ్ళుగా సాగుతున్న ఆ ఊహాగానాలు ఎట్టకేలకు నిజమయ్యాయి. ఐతే "నాకు పదవులు ఎప్పుడూ ఆలస్యంగానే వచ్చాయి...అలాగే వచ్చిన పదవులు నన్ను అంత త్వరగా వదల్లేదు" అన్నారాయన నవ్వుతూ

ఎంత బిజీగా వున్నా మంత్రిపదవి స్వీకరించిన మరుసటి రోజే మండలి బుద్ధ ప్రసాద్ 'స్వాతి'తో ముచ్చటించారు.

రాజకీయ వారసత్వం సర్వసాధారణం అవుతున్న కాలంలో వారసత్వం రాజకీయ పరంగా కాకుండా సేవారంగంతో ఆరంభం కావాలన్న ఆలోచనతో రంగంలోకొచ్చిన నాయకుడు మండలి బుద్ధ ప్రసాద్.

ఆయన తండ్రి మండలి వెంకటకృష్ణారావు 'దివిసీమ మాణిక్యం'. ఆయన చేపట్టని అభివృద్ధి పథకాలు లేవు. దివిసీమకు ఒక వెలుగు ప్రసాదించిన వ్యక్తి మండలి వెంకట కృష్ణారావు.

1972లో ఆయన పి.వి.నరసింహారావు క్యాబినెట్‌లో మంత్రిగా చేరితే 35 ఏళ్ళ తర్వాత ఇప్పుడు మండలి బుద్ధ ప్రసాద్ వై.ఎస్. మంత్రివర్గంలో మంత్రి అయ్యారు. నాడు తండ్రి నిర్వహించిన శాఖల్లో ఒకటైన మత్స్యశాఖ ఇప్పుడు బుద్ధప్రసాద్ నిర్వహించబోతున్నారు.

మండలి బుద్ధ ప్రసాద్ సాధారణ కాంగ్రెస్ కార్యకర్త స్థాయినుండి మంత్రి పదవికి ఎదిగారు. మండల స్థాయి అధ్యక్షుడిగా, కృష్ణాజిల్లా అధ్యక్షుడిగా,రాష్ట్రస్థాయి కార్యదర్శిగా కాంగ్రెస్ పార్టీకి సేవలు అందించారు.

బుద్ధ ప్రసాద్ వుంటే పార్టీని వర్గ విభేదాలకు అతీతంగా నడపగలడనే నమ్మకం అధిష్ఠాన వర్గానికుంది. పదవులు రానంత మాత్రాన అసమ్మతి ఆరంభించడనే విశ్వాసం పార్టీ పెద్దలకుంది.

అందుకే ఆయన్ని మండలి బుద్ధప్రసాద్ అనేకన్నా మంచి బుద్ధి ప్రసాద్ అనడమే సబబు.

రాష్ట్రంలో ఏ స్థాయిలో పనిచేస్తున్నా దివిసీమతో దినవారీ సంబంధాలు వదలక పోవడం మండలి కుటుంబ సాంప్రదాయం. అది గత ఆరు దశాబ్దాల కాలంనుండి వస్తున్న ఆచారం. అదే వారి ప్రజాబలం కూడా. జాతీయస్థాయిలో గాంధేయవాదులుగా, రాష్ట్రంలో సమైక్యతావాదిగా తమకంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్నారు. కష్టాలుపడినా, ఇబ్బందులు ఎదురైనా నమ్మిన సిద్ధాంతాల విషయంలో రాజీపడని వ్యక్తి.

బాల్యంలో దివిసీమ బాలానంద సంఘం అధ్యక్షుడిగా, యవ్వనంలో గాంధేయ సేవా సమాజం కార్యదర్శిగా పనిచేస్తూ అటు సాహిత్యకారులతో, ఇటు రాజకీయ ప్రముఖులతో సన్నిహితంగా మెలిగిన బుద్ధప్రసాద్‌కి ఆ రెండు రంగాల పట్ల అవగాహన, ఆసక్తి పెరిగాయి.

ఒక వైపు కాంగ్రెస్ రాజకీయాలలో మరోవైపు తెలుగుభాషా సమాఖ్యలో కూడా కీలకపాత్ర వహిస్తున్నారు. తెలుగు భాషాభిమానిగా తెలుగు భాషకు ప్రాచీన భాష హోదా కోసం కృషి చేస్తున్నారు. శ్రీకాకుళంలో తెలుగుజాతి ఉత్సవాలు జరిపించారు. దివిసీమ ఉత్సవాలు నిర్వహిస్తు న్నారు. దివి చరిత్ర వెలుగులోకి తెచ్చేందుకు ఒక సంస్థను తయారుచేశారు. కూచిపూడి నృత్య కేంద్రమైన కూచిపూడి, కృష్ణానది సాగర సంగమమైన హంసలదీవి, ఒకనాటి బౌద్ధక్షేత్రం ఘంటసాలలకు పర్యాటక ప్రాంతాలుగా గుర్తింపు తెచ్చే యత్నంచేశారు.

పదవులలో లేకున్నా దివిసీమలో జరిగిన అభివృద్ధి పథకాలలో తనవంతు కృషి చేసినందుకే దివిసీమ ప్రజలు వరుసగా రెండుసార్లు ఎమ్.ఎల్.ఎ.గా ఎన్నుకున్నారు. నేడు మంత్రిగా ప్రమాణస్వీకారంచేసి, తన ప్రజలకు మెరుగైన సేవచేసేందుకు మరింత కృషిచేస్తా నంటూ తన భావాల్ని 'స్వాతి'తో పంచుకున్నారాయన.

**మంత్రి పదవీ బాధ్యతలు స్వీకరించిన ఫీలింగ్ ఎలా వుంది ?**

ప్రత్యేకమైన ఫీలింగ్ అంటూ ఏమీలేదు. రాజకీయాలలో వున్నప్పుడు పదవులు రావడం, పోవడం సహజమే. అయితే నాకు ఒకందుకు ఆనందంగా వుంది. మా దివిసీమ సాంప్రదాయాన్ని నేను కొనసాగించగలిగాను. మా నియోజకవర్గం నుండి ఎన్నికైన ప్రతి ఒక్కరూ మంత్రిగా పనిచేశారు.

తొలి ఎమ్.ఎల్.ఎ. చల్లపల్లి రాజాతో మొదలుపెట్టి, నా తండ్రి మండలి కృష్ణారావుగారు, సింహాద్రి సత్యనారాయణరావుగారు మంత్రులయ్యారు. ఇప్పుడు ఆ అవకాశం నాకొచ్చినందుకు ఆనందంగా వుంది.

**మీకు తగిన శాఖ ఇవ్వలేదన్న భావం చాలా మందికి వుంది. మీరేమంటారు ?**

శాఖల కేటాయింపు మీద ఎవరి ఊహాగానాలు వారికి వున్నప్పటికీ చివరిగా ఎవరికి ఏ శాఖ కేటాయించాలన్నది ముఖ్యమంత్రిగారి ఇష్టం. కాబట్టి ఆ విషయంలో మనం మరోలా భావించడం అనవసరం. ఏ శాఖ వచ్చినా అది పూర్తి సమర్థతతో నిర్వహించడం ముఖ్యం.

ఆ విషయమే ముఖ్యమంత్రి అందరికీ చెప్పారు. ఆరు నెలల్లో మీరేం చేయదలచుకున్నారో చేసి ఫలితాలు తీసుకురండి అన్నారు. ఆయన మా మీద వుంచిన విశ్వాసాన్ని వమ్ముచేయకుండా చూస్తాను.

**మీకు కేటాయించిన శాఖలు అంత కీలకం కానప్పడు, ఫలితాలు ఏముంటాయి ?**

నాకు కేటాయించిన పశుసంవర్ధక, మత్స్యశాఖలు కీలకం కాదని ఎవరన్నారు. మనది వ్యవసాయ ఆధారిత రాష్ట్రం. మా ప్రభుత్వం నిర్ణయించుకున్న ప్రాథమిక లక్ష్యం జలయజ్ఞం. వ్యవసాయరంగ పక్షపాతిగా మా ప్రభుత్వ విధానాలు నడుస్తున్నాయి.

అయితే వ్యవసాయ రంగంలో ఆదాయం పెరగాలంటే పశు, పాడి అభివృద్ధులు వుండి తీరాలి. అప్పుడే జలయజ్ఞం సంపూర్ణ మవుతుంది. అటువంటి భారీ ప్రభుత్వ పథకంలో నా పశు సంవర్ధక, మత్స్య, పాడి శాఖలు కీలక పాత్ర వహించబోతున్నాయి. కాబట్టి నాకు లభించిన ఈ శాఖలు ఒక అవకాశం, ఒక సవాలు కూడా.

**బడ్జెట్ పరంగా కేటాయింపులు తగినంత ఈ శాఖలకు వుండవేమో కదా ?**

అది ఒకప్పటి మాట...ఇప్పుడు నా శాఖల ద్వారా అమలయ్యే పథకాలకు మొత్తం 2000 కోట్ల బడ్జెట్ కేటాయింపులు వున్నాయి. అదనంగా మరో ఐదు వందల కోట్లు కేటాయించ డానికి ముఖ్యమంత్రి సంసిద్ధతను తెలియజేశారు. వేల కోట్ల రూపాయలను సమర్థతతో ఖర్చు పెట్టగలగడమేకాక తగిన ఫలితాలను చూపగలిగిన వాడినని నన్ను ఎంపిక చేశానన్నారు. కాబట్టి నా శాఖకు నిధులతో పాటు బాధ్యతలూ పెరిగాయి.

**రాజకీయాలలోకి ప్రవేశించినప్పుడు ఇంతటి స్థానం అందుకోగలరని అనుకున్నారా ?**

ఇక్కడ మా నాన్నగారు నాకిచ్చిన స్ఫూర్తిగురించి చెప్పాలి. ఆయన నన్ను రాజకీయాలలోకి తేవాలని అనుకోలేదు. సేవారంగంలో కృషి చేయమన్నారు.

'సేవారంగంలో విజయం సాధిస్తే ప్రజల అభిమానం అందుకోగలుగుతాం. ప్రజల అభిమానం, వారి దీవెనలు, సహకారం వుంటే రాజకీయ రంగంలో గుర్తింపు పొందటం అంతకష్టం కాదు; రాజకీయ రంగంలో వుంటే పదవులు వచ్చి తీరతాయి. అసలు చిక్కల్లా

పదవులు అందిన తర్వాత కూడా ప్రజలతో సంబంధాలు కొనసాగించ గలగడమే' అన్నది మా నాన్నగారు చెప్పిన పాఠం. ఆయన రాష్ట్ర రాజకీయాల్లో ఎంతగా ఎదిగినా దివిసీమను తన హృదయంలో పెట్టు కున్నారు. ఆ సీమ అభివృద్ధి కోసమే అనుక్షణం కృషిచేశారు. ఆ రాజకీయస్ఫూర్తినే నేను కూడా అనుసరించాను.

**అయితే మీది రాజకీయ వారసత్వమంటారా ?**

కాదు...నన్ను రాజకీయవారసుడిగా తయారుచేయాలని మా నాన్న ఎప్పుడూ భావించ లేదు. నన్ను ముందుగా సేవారంగంలో పనిచేసేలా ప్రోత్సహించారు. దివిసీమలో పలు సేవా సమితులు ఆరంభించారు.

నేను దివిసీమ బాలానందం సేవా సంఘం అధ్యక్షుడిగా పనులు ప్రారంభించాను. ఆ సమయంలో నన్ను రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావుగారికి అప్పగించారు. ఆయన నాకు మంచి శిక్షణ నిచ్చారు. నా మాటల ధోరణిని మార్చింది ఆ శిక్షణే.

తొలి తెలుగు ప్రపంచ మహాసభల్లో మా బృందం 'ఆంధ్రకేసరి జోహార్' అనే నృత్య రూపకం ప్రదర్శించింది. అది ఒక అద్భుతమైన అనుభూతి. లక్షలాది మందిని ఆకర్షించిన కార్యక్రమం. ఆ విధంగా నేను మనుషులలోకి వెళ్ళి, ఒక కార్యక్రమం నిర్వహించ గలననే ధైర్యం నాకు కలిగింది. అవి నా జీవితంలో తొలి పాఠాలు.

**యువనాయకుడిగా మీరు ఎలాంటి ఉద్యమాల్లో పాల్గొన్నారు?**

నేను ప్రత్యక్షంగా రాజకీయ ఉద్యమాలలో కొంచెం ఆలస్యంగానే పాల్గొనడం జరిగింది. అయితే 1972లో జై ఆంధ్రా ఉద్యమం వచ్చింది. కాని మా నాన్నగారు సమైక్య ఆంధ్రవాది నన్నారు. ఫలితంగా కోస్తా ప్రజలకు మా కుటుంబం మీద ఆగ్రహం కలిగింది.

ఆయన హైదరాబాద్ వదిలి ఇటురాలేని పరిస్థితి. మేము అవనిగడ్డలో ఇల్లు కదలలేని పరిస్థితి. దాదాపుగా మా కుటుంబం సామాజిక బహిష్కరణకు గురైంది.

ఆ సమయంలోనే నేను రాజకీయ అధ్యయనం ఆరంభించాను. నాన్నగారి వెంట నిలిచిన క్యాడర్‌ని ఉత్సాహ పరిచేందుకు, వారికి ఏ కష్టాలూ కలగకుండా వుండేందుకు నాన్నగారి తరఫున పనిచేశాను. అలా నాది యువకుడిగా పరిమితమైన రాజకీయ ఉద్యమ జీవితమే.

**మత్స్యశాఖా మంత్రిగా మత్స్యకారులకు మీరు ఏం చేయాలనుకుంటున్నారు?**

మత్స్యకారుల సంక్షేమం, ఆర్థికపరమైన రక్షణ అంశాల మీద దృష్టి పెట్టాలను కుంటున్నాను. మత్స్యకారులకు బీమా సౌకర్యం కల్పించే ఆలోచన వుంది.

**మంత్రిగా మీకు మిగిలింది రెండేళ్ళే కదా...?**

రెండేళ్లు కూడా వుందనుకోను. చివరి ఆరునెలల్లో ఎప్పుడైనా ఎన్నికలు నిర్వహించవచ్చు. కాబట్టి నాకు లభించిన కాలం 18 నెలలనే నేను భావిస్తున్నాను.

నా మనసులో వున్న ఆలోచనలకు తగిన రూపం తీసుకురాగలిగిన సిబ్బంది మా శాఖలో వున్నారు. ఆరు నెలల తర్వాత ముఖ్యమంత్రి నిర్వహించబోయే సమీక్షా పరీక్షని నేను, నా శాఖ సిబ్బంది తట్టుకుని నిలబడగలుగుతామనే ధైర్యం నాకుంది.

**కృష్ణాడెల్టాలో మీరు చేపట్టిన, చేపట్టబోతున్న పథకాలు ఏమిటి ?**

కృష్ణా నదిపై పులిగడ్డ దగ్గర వారధి నిర్మాణం పూర్తయింది. కోస్తా రహదారి రూపుదిద్దుకుంటున్నది. కృష్ణానది కరకట్టని రహదారిగా మార్చే పథకం సిద్ధమైంది. అదే జరిగితే విజయవాడ నుండి అవనిగడ్డ వరకు కృష్ణానది ఒడ్డునే వాహనయానం చేయవచ్చు.

బందరు రేవు నిర్మాణానికి ముఖ్యమంత్రి పచ్చజండా ఊపారు. పోర్టువస్తే మచిలీపట్నానికి రైల్వేలైన్ డబుల్ లైన్ చేస్తామని కేంద్ర రైల్వే మంత్రి హామీ ఇచ్చారు.

విజయవాడ మచిలీపట్నం జాతీయ రహదారి నాలుగు లైన్ల రోడ్డు శాంక్షనైంది.

జలయజ్ఞంలో భాగంగా తలపెట్టిన పులిచింతల, పోలవరం ప్రాజెక్టులను త్వరితగతిన పూర్తి చేయించేలా నా వంతు కృషిచేస్తాను. అలాగే కృష్ణాడెల్టా ఆధునికీకరణ పథకం త్వరగా చేపట్టి పూర్తిచేసేలా కృషి చేస్తాను.

హంసల దీవిలోని పవిత్ర సాగరసంగమ ప్రాంతాన్ని పర్యాటక కేంద్రంగా రూపుదిద్దుతున్నారు. ఇవన్నీ జిల్లా అభివృద్ధిలో భారీ మార్పులు తీసుకువచ్చేవే.

**తెలుగు భాషా ఉద్యమంలో మీ పాత్రను ఇంకా ఇలాగే కొనసాగిస్తారా ?**

తప్పకుండా కొనసాగిస్తాను. అశాశ్వతమైన పదవుల కోసం శాశ్వతంగా నిలిచే భాషను వదులుకోలేం. తెలుగు భాషకు తగిన ప్రాచుర్యం, గుర్తింపు తెచ్చే దిశగా నా ఉద్యమాన్ని కొనసాగిస్తూనే వుంటాను. ఇటీవల జరిగిన జాతీయ తెలుగు రచయితల సభలు విజయవంతమయ్యాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘం తరపున జరగబోయే అంతర్జాతీయ స్థాయి సభలకు నా వంతు సహకారం అందుతూనే వుంటుంది.

సాహిత్య, భాష, రాజకీయ, అధికారిక రంగాలన్నింటిలో మండలి బుద్ధ ప్రసాద్ గారికి పూర్తి విజయం చేకూరాలని స్వాతి మనసారా కోరుకుంటోంది.

"స్వాతి" వారపత్రిక సౌజన్యంతో

# సువర్ణోపహారము

- సాహితీ వాచస్పతి శ్రీ మొవ్వ వృషాద్రిపతి

మండలి వంశ వార్నిధి హిమాని మయూఖుడు, సాహితీ కళా
మండన వర్తనుండు, బుధమాన్యుడు వేంకట కృష్ణారావు
పుత్రుండు, ప్రశాంత చిత్తుడు, నదోషసుధానిధి, బుద్ధిశాలి, భూ
మండల సంభృతాద్భుత సమంచిత కీర్తి విశాలు డెన్నగన్

బుద్ధప్రసాదాఖ్య పాడమె నహింసాది
ధర్మమార్గ ప్రబోధంబు కొఱకొ?
గాంధి సిద్ధాంత మాకారంబు దాల్చెనో
రాజకీయముల కర్దమ మడంప?
బుద్ధ దేవుని దివ్య బోధామృతము పొంగి
జనియించెనో శాంతి జతనుపఱుప?
సద్గుణంబులు సాధు సజ్జనావళుల సే
వింపగా నిటు లుద్భవించెనేమొ?

అనుచు కవి పండితులు మెచ్చ యనవరతము
తనదు గుణములు వర్ణింప తనరుచుండు
చతురతకు పాదు, సరసత్వగతికి బోదు
సుప్రసన్నతసాదు, బుద్ధ ప్రసాదు

నిరతము మోము చందురుని స్నిగ్ధమృదుస్మిత చంద్రికా ప్రభా
సరములు గ్రమ్మ-మాటలను సాంద్ర కదుష్ణమరంద బిందువుల్
తొరగగ లేశమైన చిరుదోసమెఱుంగని సత్క్రియారతిన్
పరహిత తృష్ణ పొంగ నిరవద్య చరిత్ర నతండు పొల్చెడున్

మండలి వంశపూర్వు లసమాన యశోలత తెచ్చి యింటిము
దుండగ నాటి నిత్యము మహోన్నత దోహదకార వర్తనన్
మెండుగ పెంచి రిప్పడది మిన్నును మన్నును మేళవించి బ్ర
హ్మాండము నిండి సాగిన దనంతముగా దెసలంట పర్వుచున్

నిరతంబున్ పర సౌఖ్య సంస్థితికినై నిష్కర్ష బుద్ధ ప్రసా
దురు యత్నంబులు సల్పుచున్ తెలుగు భాషోచ్చ ప్రభావంబు ను
ర్వర చాటింపగ తండ్రి గారి పదముద్రల్ వెంబడిన్ సాగి మే
ల్గిరుదంబొందు వహించె సార్థకత కల్మిన్ తెల్గు బుద్ధుండనన్

లలిత కళా వికాసము లెలర్పగ నిత్య తదర్చనావిధిన్
బలువురు పేరుమోసిన ప్రభారవులన్ సుకళాసుధాంశులన్
బిలువగ పంచి కన్నులకు విందుగ నాట్యముఖైక సత్కళా
విలసిత సత్సదస్సులను పెట్టును నూళుల మూరుమూలలన్

ఆశ్రయించినవారి నపురూపమగు ప్రేమ
కాంచి పోషించు నీకన్న తల్లి
రాజకీయాకాశ రవియనన్ దశదిశా
ఖ్యాతి గడించె నీకన్న తండ్రి
దానధర్మౌదార్య తత్పరుండై కీర్తి
తనరారె మిగుల నీతాతగారు
సాధ్వీ శిరోరత్న సరసవర్తన సుధీ
గేయ చరిత్ర నీగేహ లక్ష్మి

ఘనత కవితా సరస్వతి గజ్జెగట్టి
ఆడు నీయింటిముంగిట ననుదినంబు
ఎవ్వ రీయాంధ్ర దేశాన నీడు నీకు?
శరయశస్సాంద్ర! బుద్ధప్రసాదు చంద్ర!

సరసవ్యాపృతి నిన్ వరించిన పురస్కారం బలంకారమే?
వరుసన్నేనిదె నేను నేననుచు నిన్ వాంఛించి సంస్కార సుం
దరతన్ వేనకు వేలు వచ్చి నిను పొందంగా పురస్కారముల్
నెటినీ ముంగిట నిల్చునట్టి దినముల్ నేత్రాల కుందోచెడిన్

నీ వొక సవ్య సాచివని నేననుకొందును రాజకీయపుం
ద్రోవల నారి తేరిన ప్రతూర్ణపు యోద్ధవు-సాహితీ ప్రియం
భావుక చక్రవర్తివి-ప్రభావ విభాసుర భాస్కరుండ, వో
పావన భావనాశ్రయ విపశ్చిత! నిన్ కొనియాడ నేర్తునే?

పదవులు నిన్నుగా వలచి వచ్చుత-లక్ష్మికి నాటపట్టుగా
సదనము పొల్చుగా కఖిల సంపదలన్ తనుజాత పౌత్రులన్
ముదము చెలంగుగాక పరిపూర్ణ చిరాయువు తోడ దైవమిం
పొదవగ సత్కృపాగరిమయుష్మదభీష్టము లిచ్చుగావుతన్

○

# వివేకవైయాత్యుడు మా బుద్ధప్రసాద్

- ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు

**మా** బుద్ధ ప్రసాద్‌కు మంత్రి పదవి లభించింది. ఈ వార్త అతనితో ఆత్మీయతా అనుబంధం గల వారందరికీ సంతోషాన్ని కల్గించింది. పదవులు పొందిన వారిలో కొందరివలన, ఆ పదవులకు గౌరవం కలుగుతోంది. కొంద రికి వాటి వలన గౌరవం లభిస్తోంది. మరి కొందరి విషయంలో అపహాస్యం పాలవు తున్నాయి. మరి మా బుద్ధప్రసాదు పై మూడింటిలో ఏ కోవలో ఒదుగుతాడు. 'మా' అని అనడం వలన, అతడు మొదటి కోవలోకి చేరతాడని అంటే, దానికి మీకు అతనికి గల అనుబంధం మీచేత అలా అనిపిస్తోందని అనడానికి ఆస్కారమవుతుంది! నిజమే, కొన్ని సందర్భాల్లో అలా అనడానికి అవకాశము ఉంటుంది. అయితే సత్యప్రతిపాదన కూడ అలా భాసిస్తే, అలా భావించిన వారిని ఏ మనగలం! ఏమీ అనకుండా ఉపేక్షించడమే ఉత్తమం సరే! దానికేమి!

మొదలు ఎవరినైనా 'మా' అని ఎప్పుడూ సంభావిస్తాము. దగ్గరి బంధువులను, సృజన కోటిలోని వారిని, అలా సంభావించడం పరిపాటి. అలాకాక, ఆ వ్యక్తితో 'నెనరు' ఉన్నప్పుడు కూడా అంటాము. ఈ 'నెనరు' అనే దానిని నిర్వచించడం చాలా కష్టం. నిజానికి అసాధ్యం కూడా త్యాగరాజ స్వామి, శ్రీ రామ చంద్రుని 'నెనరుంచి పాలించమని' కోరుకుం టాడు. ఇది దయ కాదు. అనుగ్రహ మంత కంటె కాదు. అనురాగమూ కాదు. వీటి అన్నిం టికి అతీతమైనది, ఈ అన్నింటి సమ్మిశ్రితమై నది ఏదో అది నెనరు. ఇది వివేచింపదగ్గదే తప్ప నిర్వచింపదగ్గదికాదు. ఇది ఉండడానికి పూర్వ పరిచయమూ అక్కరలేదు. కొన్ని సందర్భాల్లో, అంతకుపూర్వం వారిని ఎరుగక పోయినా, చూచినంతనే ఎంతో పరిచయ మున్న వారివలె అన్పిస్తుంది. కారణమేమిటి, జననాంతర సౌహృదం. ఒక్కొక్కప్పుడు, అవతలివారు సుదూరంలో వున్నా, మనమేదో వ్యాపకంలో వున్నా, తటిల్లతలాగా, ఆ వ్యక్తి మనస్మృతిపథంలోనికి వస్తాడు. దానికి పూర్వాపరాలుండవు. మరికొన్ని సందర్భాల్లో మనం ఏదో భావిస్తాము. నెనరున్న వ్యక్తి, ఎంతో దూరంలోవున్నా,

మనకు కలిగినభావనే, మనకు కలిగిన సమయం లోనే అతనికి కూడా అదే భావన కలుగుతుంది. ఇలాంటి వన్నీ మన అనుభవంలో వున్నవే. అదిగో వాటికి కుదురైనది 'నెనరు'.

అయితే నెనరు ఉన్నంత మాత్రంచేత, అది కలిగిన వారి మధ్య అభిప్రాయాల మధ్య అంగీకారం ఎల్లవేళలా వుంటుందని చెప్ప లేము. అభిప్రాయభేదాలు ఉంటాయి. సాధా రణంగా అవి వైరుధ్యానికి దారితీస్తాయి. నెనరున్నచోట వైరుధ్యము ఉండదు. అభిప్రాయ భేదానికి మూలము ఎక్కడుందో – దాని కొరకు పరస్పరమూ అన్వేషిస్తారు. మూలం తెలిసినా, అంగీకారం కలుగుతుందని చెప్పలేము. అయినా, ఆ వ్యక్తుల మధ్య పరస్పర గౌరవానికి, సయోధ్యకు విఘాతము ఉండదు. అదిగో అదీనెనరు. నాకు, బుద్ధ ప్రసాదుకున్నదది. అయితే ఇప్పటివరకు అభిప్రాయ భేదమనేది మా ఇరువురి మధ్య ఏర్పడలేదు. ఇప్పటికిది పుణ్యము.

మూడేండ్లకు పూర్వం నాకు బుద్ధప్రసాదు తెలియదు. ఎందుకో–ఆయన్ని 'గారు' అని సంభావింపనీయదు మనసు. దానికేమి! తెలియదు అంటే ప్రత్యక్ష పరిచయంలేదు. మా మండలి వెంకట కృష్ణారావుగారి అబ్బాయి ఒకరు బుద్ధప్రసాదు. అంత మాత్రమే తెలుసు. ఆ మధ్య మా స్వగ్రామం పెదప్రోలులో రాష్ట్ర స్థాయిలో 'గ్రామదేవతల'పై సదస్సు నిర్వహించాను. వారికి కూడ, అంటే కృష్ణారావుగారికి కూడ ఆహ్వానం పంపాను. ఎందుకు పంపాను. ఏమో–తెలియదు. వారితోనాకుగల పూర్వ పరిచయమా! వారు మా ప్రాంతంవారై ఉండడమా! లేక వారు మంత్రి పదవి నిర్వహించి ఉండడమా! ఇవన్నీ కారణాలు కావచ్చును. ఇవేవీ కాకపోవచ్చును కూడ. వారు రాలేదు. రాలేని స్థితి అని తరువాత తెలిసింది. నిజానికి వారువస్తారని నేను ఆశించి ఉండకపోవచ్చును. కారణమేమంటే వారు తప్పకరాదగి నంతటి గొప్ప సందర్భంకాదు గనుక. అయితే వారు బుద్ధప్రసాదును వెళ్ళిరమ్మన్నారట. ఆయన వచ్చారు. ఆయన బుద్ధ ప్రసాదని నాకు ఎవ్వరూ చెప్పలేదు. చూచినంతనే, ఆయన కృష్ణారావుగారి అబ్బాయి బుద్ధ ప్రసాదు అని అన్పించింది. కారణం ముమ్మూర్తులా ఆయన తండ్రిని పోలి వుడడం. శరీరాకృతాలానే గాదు. గుణగణాల్లో కూడా తండ్రిని పోలిన వాడేనని, ఆ తరువాత నాకు కలిగిన భావన. కృష్ణారావు గారిని నేను బాగా ఎరుగుదును. ఎప్పటి నుండి 1955 సార్వత్రిక ఎన్నికల నాటినుండి. 1959లో గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్ట్యబ్ద పూర్త్యుత్సవాలు వారు ఒక్క చేతి మీదుగా జరి పారు. అప్పుడు వారి మకాము బందరు నక్కల తోటలో. నేనూ పి.యు.సి. చదువుతూ అక్కడే వున్నాను. ఆ పిదప 1976లో ఆరవ ద్రావిడ మహాసభల్లో పాల్గొన వలసిందిగా వారిని కోరాను. కాని నేను వారికి జ్ఞాపకంలో లేను. సమయానికి శ్రీ అన్నపురెడ్డి సత్యనారాయణ గారు కల్పించుకుని, నన్ను గూర్చి ఫలానా కదా అని చెప్పారు. నా కోరిక మన్నించారు. ఆ తరువాత నేను కలిసింది లేదు. మరి వారి మనసులో నేను ఎలా వున్నానో! నేను నిర్వహి స్తున్న సదస్సుకు

వెళ్ళిరమ్మని కుమారుని పంపారు. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే-ఇదొక ఘటన. ఇది కొన్నింటికి దారితీసింది. మరి ఎన్నింటికి దారి తీయ నుందో! వారు వచ్చి ఒక మాటన్నారు. ఆయన అంతకు పూర్వం నా పేరు కూడ ఎరిగి వుండక పోవచ్చు. పెదప్రోలు మీ స్వగ్రామమని కదా! ఇంతటి స్థాయిలో ఈ సదస్సు ఇక్కడ నిర్వహిస్తు న్నారు. మరి ఇదే ప్రేమ మీకు మన ప్రాం తంపై వుండవద్దా! ఈ మాటవారే అన్నారో, అలా కృష్ణారావుగారు అనమన్నారని అన్నారో స్మృతికి అందడం లేదు. ఆ మాట-ఆ ఒక్క మాట-నన్ను కదిలించి వేసింది. నిజానికి నిలు వెల్లా పులకింపజేసింది. కారణం అలాంటి తలంపు నాకంతకు పూర్వమే వుంది. కాని శక్తి యుక్తుల పరంగా నాకంత సామర్థ్యం లేదు. నాకున్నది ఉబలాటం. నేను వెంటనే అన్న మాట 'తప్పకుండా' అని అంత మాత్రమే. నామనసు సందేహించడాన్ని ఎలా గ్రహిం చారో-కార్యక్రమ నిర్వహణయే మీ వంతు. మిగతాదంతా నా వంతు అన్నారు. ఇదెలా సంభవించింది. దీనికి కారణం నెనరు. అది కార్య రూపం దాల్చడానికి-ఆ వెంటనే కుదర లేదు. అదీ దురదృష్టం. అది నెరవేరే నాటికి కృష్ణారావుగారు పుణ్య లోకాలకు తరలి వెళ్ళిపోయారు. ఉంటే అదొక అదృష్టం. అయితేనేమి. ఆయా లోకాలనుండి వారాశీర్వదించారు. లేకపోతే అంతటి మహత్తరమైన కార్యక్రమం ఘనంగా, నిర్విఘ్నంగా, కన్నవారి కళ్ళ వేడుకగా మూడు రోజలపాటు-మా చరిత్రను, మా సీమ వైభవాన్ని - చరిత్ర పూర్వ కాలాల నుండి నేటి వరకూ-మననం చేసికున్నాము. మా మాటకేమి వచ్చిన వారందరు-ప్రసంగాలు చేయడానికి వచ్చిన వారిమాట కాదు-శ్రోత లుగా వచ్చిన వారందరూ-తాము సుకృతు లము అయినామని భావించారు. ఒక విధమైన సుహృద్భావం వెల్లివిరిసింది. ఏ తద్భావ పరి మళం సీమ అంతటా నెలకొన్నది. అది చాలు ఈ జన్మకనిపించింది. దీనిని సంఘటించిన వాడు మా బుద్ధప్రసాదు. ఇదెలా సాధ్యమైంది?

ఎందరెందరు విద్వాంసులు. ఎక్కడెక్కడి నుండి తరలివచ్చారు. వారందరి అవసరాలు ఒక కంట, కార్యక్రమ సరళిని ఒకకంటా గమనిస్తూ వచ్చాడు మా బుద్ధ ప్రసాదు. దీనివలన ఆయనకు ఒరిగిందేమిటి, తరిగింది తప్ప. తరిగిన ధనాన్ని గూర్చి ఆయన వగవలేదు. వచ్చిన వారికే ఏ లోటు జరుగుతుందో ననే తహతహ తప్ప. ఈ వారసత్వం ఎక్కడిది. వచ్చిన వారికింత - కలిగిన దానిలో పెట్టడం మన జాతిలక్షణం. దానికేమి! కావాలని తలకెత్తుకున్నాక దానిని గూర్చిన విచారం లేదు. మొదలు ఈ తల కెత్తుకోవడం ఎందుకు. దీనివలన ఆయన కొచ్చే ప్రయోజనం ఏమిటి! దీనికైనా సమాధానాల వెనుక ఆయన వ్యక్తిత్వ ముంది. సంపూర్ణ మూర్తి మత్వముంది. అది తన, తనజాతి, తన ప్రాంతంపైగల మక్కువ. దానితోడిగల తాదాత్మ్యత. ఈ గుణం కృష్ణారావు గారిలో ఉంది. కనుకనే ప్రపంచ తెలుగు మహాసభలకు ఆయన రూప శిల్పి అయినాడు. 1977లో సంభవించిన ఉప్పెన ఆయన నెంత వ్యాకులపరిచింది. కాదు అన్నివిధాల క్రుంగ దీసింది. ఆయనకే ఎందుకంత బాధ, వ్యధ, నాటి నుండి ఆ విషాదఛాయలు

మరణ పర్యంతము ఆయనను వెన్నాడాయి. అంతటి ఆర్ద్రహృదయు డాయన. దీనులపట్ల సానుభూమి మాత్రమేనా ఆయనకు ఉన్నది. ఆ సహాను భూతి ఆయననే దీనునిగా మార్చివేసింది. ఈ అన్ని సన్నివేశాలలోను వెన్నంటి ఉన్నవారు బుద్ధ ప్రసాదు. కనుక ఆర్ద్రత అంటే ఏమిటో తెలిసివచ్చింది. కాకపోతే ఎక్కడో పశ్చిమ గోదావరి ప్రాంతం-తుపానుకు గురియైతే, ఈయన తల్లడిల్లిపోవడ మెందుకు. ఏ ప్రయో జనమాశించి? సంకుచిత దృష్టి, రాజకీయ దృష్టి వీటిని గూర్చి ఆలోచింపనివ్వదు కొందరిని. వారిపట్ల మనమేం చేయగలం. జాలి పడడం తప్ప. కృష్ణారావుగారి తనువు మనసూ ఆంధ్రత్వం నిండినది. ఒక్క పంచెకట్టు తప్ప-ఆ అన్నింటిని పుణికిపుచ్చుకున్నవాడు మా బుద్ధ ప్రసాదు.

శుద్ధ గాంధేయవాది కృష్ణారావుగారు. ఆయన అంతశ్చేతనకు భౌతిక రూపకల్పన గాంధీక్షేత్రం. దాని పనులకు ఎన్ని కార్యక్ర మాలు. ఎందరు మహానుభావుల పాదస్పర్శతో పునీతమైనది నా ఈ సీమ-దివిసీమ-దివ్య సీమ. దానిని దివ్యసీమ గావించాలని ఎన్ని కలలుకన్నాడు ఆ పుణ్యమూర్తి. దానిని ఫలింపజేయడానికి -ముమ్మూర్తులా ఆయన వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న బుద్ధప్రసాదు ఆయన వేసిన బాటలోనే నడుస్తున్నాడు. సాధారణంగా రాజకీయవాదులకు సాహిత్యం మీద, ఇతర లలిత కళారూపాల మీద ఆసక్తి వుండడం అరుదు. కృష్ణారావుగారు తత్భిన్నం కను కనే ఆయన రాజకీయ వాదికాదు. రాజనీతివేత్త. మరి మా బుద్ధప్రసాదు అంతే. ఆంధ్ర దేశంలో సుప్రసిద్ధులైన సాహితీ వేత్తలు అందరితో ఆయనకు పరిచయాలున్నాయి. పెదకళ్లేపల్లిలో సాహితీ వసంతోత్సవాలు, బ్రహ్మశ్రీ వేటూరి సుందర రామమూర్తిగారు, వారు కలిసి నిర్వహించిన తీరు అనితరసాధ్యం. వీటన్నింటికంటె ముఖ్యమైంది, దివి తేజస్సును నేల నాలుగు చెరగులా ప్రసరింప జేయాలని ఆయన ఆకాంక్ష. ఆయా గ్రామాలలో ప్రసిద్ధులైన వెనుకటి తరాల ప్రముఖుల శిలావిగ్రహాలను ప్రతిష్ఠింపజేయడం అందులో ఒక భాగం. ఇవన్నీ భవిష్య త్తులో నెరవేరనున్నాయి. దీనిని సమకూర్చి పెట్టడంలో, సానుకూలపర చడంలో, ఆయన కెందరో మిత్రులు ఉన్నారు. హితులున్నారు. శ్రీకాకుళాంధ్ర నాయకుని, హంసలదీవి వేణు గోపాలదేవుని, అవనిగడ్డ వీరరాజ చోడనారాయణ దేవర ఆశీస్సులు ఉన్నాయి. కొండంత నిబ్బరముంది. అయినవారిపట్ల ఆదరణ వుంది. పెద్దల పట్ల వినయముంది. కార్యనిర్వ హణంపట్ల తగు విచక్షణవుంది. కనుక అతడు వివేకవైయాత్యుడు. ఇక సర్వ శుభములు కలుగుతాయనడంలో సందేహమే లేదు. అస్తు.

○

# అమృత హృదయులు - సౌజన్య మూర్తి

- శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

గౌరవశ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారికి మంత్రి పదవి వచ్చినప్పుడు వారి అనుయాయులు, బంధు మిత్రులు పొందిన ఆనందానికి మేరలేకుండా పోయింది. దానికి కారణం ఋజుమార్గంలో ప్రవర్తించే ఒక నీతిమంతునకు, సాత్త్విక గుణ ప్రధానునకు, న్యాయ ధర్మాలను నిత్యం అను సరించే బుద్ధప్రసాద్ గారిని ముఖ్యమంత్రి గౌరవ డా॥ రాజశేఖరరెడ్డిగారు తమ మంత్రి వర్గం లోనికి తీసుకోవడమనే చెప్పాలి. వారి అనుయాయులలో చాలా మంది ముఖ్యమంత్రి బుద్ధప్రసాద్ గారికి ఏ విద్యాశాఖో, సాంస్కృతికశాఖో, సమాచార పౌర సంబంధాల శాఖో కేటాయిస్తారని ఊహించారు. దానికి భిన్నంగా వారికి ముఖ్యమంత్రి పశు సంవర్ధక శాఖ కేటాయించడం వారి ఆత్మీయులనందరిని ఆశ్చర్యపరచింది. కాని ముఖ్యమంత్రి చాలా జాగ్రత్తగా ఆలోచించి వారికీ శాఖను కేటాయించారు. మనరాష్ట్రం ప్రధానంగా వ్యావసాయిక రాష్ట్రం. మన రాష్ట్రంలో ముఖ్యంగా వ్యవసాయం – పశు పోషణ ప్రజల ముఖ్య గ్రామీణ వృత్తులు. రాష్ట్రంలో పశుసంపద వృద్ధిచేసి రైతులు, వ్యవసాయ, వ్యవసాయేతర కూలీల అభ్యున్నతికి తోడ్పడాలని ప్రభుత్వం నూతన పథకాలను రూపొందిస్తుంది. అటువంటి తరుణంలో బుద్ధప్రసాద్‌గారివంటి నీతిపరుడు, కార్య దీక్ష, దక్షత కలిగిన వ్యక్తి, మానవసేవయే మాధవసేవయని భావించే వ్యక్తికి పశు సంవర్ధక శాఖను కేటాయించటం మనందరం హర్షించదగిన సంగతి. వారే శాఖలో పనిచేసినా వారి హృదయం మాత్రం ఎల్లప్పుడు విద్య – సంస్కృతి – చరిత్రల త్రివేణీ సంగమ మందు లగ్నమై ఉంటుంది. వాటికి నిరంతరం సేవ చేస్తూనే ఉంటారు.

బుద్ధప్రసాద్‌గారితో నా అనుబంధం, మిత్రత్వం 20 సంవత్సరాల నుండి కొనసాగు తున్నది. నేను ఏలూరులో జిల్లా గ్రామీణాభి వృద్ధి సంస్థలో (డి.ఆర్.డి.ఎ) క్రెడిట్ ప్లానింగ్ ఆఫీసర్‌గా ఉద్యోగిస్తున్నప్పుడు ప్రసాద్‌గారి బంధువు నాతో ఆఫీసర్‌గా ఉద్యోగిగా ఉండేవారు. వారు బుద్ధప్రసాద్‌గారి సంపాదకత్వంలో వెలువడుతున్న "గాంధీక్షేత్రం" అనే మాసపత్రిక ఒక

కాంప్లిమెంటరీ కాపీ నాకిచ్చారు. నేను దానిని చదివి అందలి రచనలకు ఆకర్షితుడనై - దానిలో సభ్యుడుగా చేరాను. తరువాత కొంతకాలానికి నేను విజయవాడలోని "క్రిషి" (Krishna Industrial Self-help Institution) కి స్పెషల్ ఆఫీసర్‌గా బదిలీ అయ్యాను. అప్పటి నుండి నాకు బుద్ధ ప్రసాద్‌గారితో ప్రత్యక్ష పరిచయం ఏర్పడింది. క్రిషి సంస్థ ద్వారా విద్యావంతులైన యువకు లకు వివిధ వృత్తులలో శిక్షణ ఇప్పించేవాడిని. బుద్ధప్రసాద్‌గారొక రోజున నాతో మాట్లాడుతూ మా అవనిగడ్డ ప్రాంతంలో యువకులకు టి.వి. (Television) మరియు కంప్యూటర్‌లలో శిక్షణ ఏర్పాటు చేయండని కోరారు. అప్పుడు కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ ఆర్. భట్టాచారిగారు వారికి బుద్ధప్రసాద్ గారి తండ్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు, పూర్వపు విద్యాశాఖా మాత్యులు, ట్రెయినింగ్ సెంటర్ ఆవశ్యకతలను తెలియచేస్తూ ఒక లేఖ వ్రాయటం, వెంటనే నన్ను కలెక్టర్ అవనిగడ్డలో సెంటర్ ఏర్పాటు చేయమని ఆదేశించడం నేను సెంటర్ ఏర్పాటు చేయడం జరిగింది.

కృష్ణారావుగారు గొప్ప వ్యక్తి. బుద్ధ ప్రసాద్‌గారు తండ్రికి తగ్గ తనయుడు (A worthy son of a worthy father). కృష్ణారావుగారిని పండితులు, కవులు, ప్రజలు రెండు విషయాలలో శాశ్వతంగా గుర్తుంచు కుంటారు. అందులో ఒకటి వారు ప్రపంచ తెలుగు మహాసభలు పెద్ద ఎత్తులో విజయ వంతంగా సాహితీపరులు, కవులు, పండితులు, లలితకళా ప్రవీణులు ఆనందించేటట్టు హైదరాబాద్‌లో నిర్వహించడం, రెండవది 1977 చివరిలో దివిసీమలో ఉప్పెన (Tidal Wave) వచ్చినప్పుడు వారు బాధాతప్త హృదయంతో ఉన్న ప్రజలకు నిరుపమానమైన సేవ చేయడం. ఈ రెండు సంఘటనలు మన స్మృతిపథంలో శాశ్వతంగా నిలిచి ఉండేవి. ప్రజాసేవలో బుద్ధప్రసాద్‌గారికి తండ్రిగారు చక్కని శిక్షణ ఇచ్చారు.

బుద్ధప్రసాద్‌గారి ప్రోత్సాహంతో నేను వారి గాంధీక్షేత్రం మాసపత్రికలో ఐదు వ్యాసాలు వ్రాశాను. అవి శ్రీయుతులు లాల్‌బహదూర్ శాస్త్రి, దామోదరం సంజీవయ్య, కల్లూరి సుబ్బా రావు, బులుసు సాంబమూర్తి, మల్లంపల్లి సోమ శేఖర శర్మగారలపైన. మల్లంపల్లివారిపై నేను వ్రాసిన వ్యాసం బుద్ధప్రసాద్‌గారు తమ పత్రికలో ప్రకటించడమే కాకుండా వారు దానిని ఆంధ్రజ్యోతికి పంపడం వారు దానిని ప్రకటించడం కూడా జరిగింది.

ప్రసాద్‌గారు అవనిగడ్డలో ఒక సమావేశం నిర్వహించినప్పుడు నన్నాసమావేశంలో ప్రసంగిం చడమనడం - నేనూ గోరాగారి పెద్ద కుమారులు లవణం గారు ఆ సమావేశంలో ప్రసంగించడం జరిగింది. మరొక పర్యాయం - గురుతుల్యులైన డా॥ నండూరి రామకృష్ణమా చార్యులుగారు, నేను కలసి ఉయ్యూరులో ఆచార్య శ్రీవత్సవారు నిర్వహించిన రెండు రోజుల సాహిత్య సమా వేశాలలో పాల్గొన్న తరువాత బుద్ధప్రసాద్‌గారు మమ్మల్ని అవనిగడ్డ తీసుకొని వెళ్ళారు. అక్కడ

అప్పటికప్పుడే సభ ఏర్పాటు చేశారు. సభలో ముఖ్య అతిథి డా॥ నందూరి రామకృష్ణమాచార్యులు గారు. నన్ను అధ్యక్షత వహింపుమన్నారు. బుద్ధప్రసాద్‌గారు మమ్మల్ని సభకు పరిచయం చేశారు. సభలో ఇద్దరు ఉపన్యాసకులు - ఒకరు విద్వత్కవి శ్రీ జోస్యులసూర్య నారాయణమూర్తిగారు, రెండవవారు ప్రొఫెసర్ యార్లగడ్డ బాలగంగాధరరావుగారు. జోస్యుల వారు గాందీ. క్షేత్రం పత్రికా నిర్వహణలో బుద్ధప్రసాద్ గారికి చేదోదువాడదోడుగా ఉండేవారు. వారు పలు గ్రంథాలను రచించారు. అందులో విశ్వనాథ రామాయణ కల్పవృక్షంపై చక్కని గ్రంథాన్ని వెలయించారు. బాలగంగాధరరావుగారు నాగార్జున విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో ప్రొఫెసర్‌గా ఉద్యోగించారు. వారు గ్రామనామాలపై చక్కని పరిశోధన గ్రంథాన్ని రచించి ప్రకటించారు. వీరిద్దరు ఆ రోజున చక్కని ఉపన్యాసలు చేశారు. నేను, బుద్ధప్రసాద్‌గారితో నా మైత్రి, వారి సాహితీ ప్రియత్వము సౌజన్యములపై ప్రసంగిచాను.

నేను అవనిగడ్డ - మా టి.వి. ట్రెయినింగ్ కార్యక్రమం సజావుగా నడుస్తున్నదో లేదో పరిశీలించడానికి తరచు వెళ్ళేవాడిని. బుద్ధప్రసాద్ గారింట్లోనే నా భోజనం. బుద్ధప్రసాద్ గారి తల్లిగారు నాకు రుచికరమైన శాకాహారం పెడుతుంటే మహానందంతో తింటూ నా మనస్సులోనే "అన్నదాతా సుఖీభవ" అని అనుకుంటూంటేవాడిని.

బుద్ధప్రసాద్‌గారి గాంధీక్షేత్రం మాస పత్రికలు వారి నుండి స్వీకరించి వాటిని ఐదు (5) సంపుటాలుగా తయారు చేసి నా గ్రంథాలయంలో పదిలపరచుకొన్నాను. అంతేకాక బుద్ధప్రసాద్‌గారి తండ్రి వెంకట కృష్ణారావుగారి జీవిత చరిత్ర గ్రంథం, ఉప్పెన నాటి ఉదంతానికి సంబంధించిన రచన, నానాడు బుద్ధ ప్రసాద్ రచించిన గ్రంథాలు, వారు ముద్రిపించిన గ్రంథాలు, వారు నాకివ్వడం వానిని నా గ్రంథాలయంలో భద్రపరచుకోవడం జరిగింది. వారు "దివిరత్నాలు" అను గ్రంథం రూపొందించే సమయంలో నేను వారికోరిక మేరకు శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతం, కొడాలి ఆంజనేయులు, కొడాలి వెంకట సుబ్బారావుగారల సంక్షిప్త జీవిత - రచనల వివరాలు వ్రాసి పంపగా వారాగ్రంథంలో ప్రకటించారు.

నేను విజయవాడ-హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రాలలో సాహిత్యం-చరిత్రకు సంబంధించిన ప్రసంగాలు చేశాను. అవి అన్నీ "ప్రసంగ తరంగాలు" అన్న పేరుతో ఒక గ్రంథంగా రూపొందించి 2006 మే నెలలో తెలుగువిశ్వవిద్యాలయ సమావేశ మందిరంలో దానిని ఆవిష్కరించిన శుభ సమయంలో శ్రీ బుద్ధప్రసాద్‌గారు విశిష్ట అతిథిగా విచ్చేసి గ్రంథంపైన - నాపైన వారి అమృత వాక్కులు వినిపించారు.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవాల సందర్భంగా వారు విజయవాడలో రెండు రోజులు భారీ ఎత్తున సాహిత్య సభలు నిర్వహించారు. ఆ సభకు వేలలో సాహితీపరులు

రావడం-అవి ఒక ప్రక్క నేత్రపర్వం మరొక్క శ్రుతికి ఇంపు కలిగించిన సభలు. రాష్ట్రం నలుమూలల నుండే కాక మద్రాసు, మైసూరు రాష్ట్రాల నుండి కూడా సాహిత్యవేత్తలు ఆ సభలను అలంకరించారు. ఆ సభలలో నన్నొక రోజు "అర్ధశతాబ్ది కాలంలో అవధాన వికాసము" అను విషయంపై ప్రసంగించవలసిందిగా ప్రసాద్‌గారు కోరగా నేనట్లే ప్రసంగించితిని.

ఇట్లా ఎంతవ్రాసినా బుద్ధప్రసాద్‌గారిపై వ్రాయటానికి నా కలం ముందుకు సాగుతూనే ఉంటుంది. బుద్ధప్రసాద్‌గారు అమృత హృదయులు, సౌజన్యమూర్తి, మందస్మిత వదనులు. వారి మృదుమధురమైన వాక్కు సభాసదులను వశం చేసుకొంటుంది. మృదు మధురమైన కంఠం వారిది. వారి నోటివెంట ఒక్క పరుష వాక్యం కూడా మనము వినము. అట్టి పురుషులలోని పుణ్యపురుషుడైన నేటి మన మంత్రివర్యులు గౌరవ మండలి బుద్ధ ప్రసాద్ గారికి జగత్కల్యాణ మూర్తియైన సర్వేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములు, సుఖశాంతులు ప్రసాదించుగాత !

○

# పీతాంబరపు రవ్వల పోగు

- శ్రీ పూషడపు సుబ్బారావు

కృష్ణవేణి సాగర సంగమ స్థానాల పుణ్యాల ప్రోగు
సిరికా కొలనినాధుని పట్టు పీతాంబరపు రవ్వల పోగు.
కృష్ణరాయల కీర్తి మాణిక్యముల పొలములో మూడు పంటల సాగు.
అణు వణువు తెలుగు.
ఆంధ్రకీర్తి ధ్వజపు వెలుగు,
జిలుగు ఖేదమునందు పంట కాలువలను తెచ్చి మోదము నందు
దివి మహోత్సవము లొనర్చిన
మండలి వేంకట కృష్ణుని పుత్రుడు
నిత్య చైతన్య సౌమ్య సుమగాత్రుడు
సాహితీ సన్మండలికి నిత్య చెలికాడు

○

# ఆకాంక్ష

- ఆచార్య కె. సర్వోత్తమరావు

పండిత మండలి ప్రస్తుతి సేసెడి
సరస సారస్వత జలవిహారి
కవివర్య మండలి ఘనతయై నుతియించు
వాఙ్మయవేత్త సద్వన విహారి
అసమాన మండలి హర్షాన పులకించు
నయగుణ శ్రేష్ఠ మానసవిహారి
దివిసీమ మండలి స్థిరమతి కీర్తించు
తన మన లేని సుజన విహారి
పుణ్య 'వేంకట కృష్ణుని' పుత్రుడతడు

అవనిగడ్డ వారలకెల్ల ఆశ్రితుండు
మహిత పశుసంవర్ధక మంత్రివరుడు
మహిని బుద్ధ ప్రసాదు సమ్మాన్య మతికి
విజయములు కల్గ వేంకట విభుని తలతు

కనులార కృష్ణమ్మ గాంచిన చాలును
ఉత్సాహ మెవనిలో నుబుకుచుండు
'శ్రీకాకుళక్షేత్ర' సిరులను భావింప
ఆనంద మెవనిలో నలరుచుండు
దివిసీమ వైభవ తేజంబు స్ఫురియింప
మోదంబు నెవనిలో మొగ్గ తొడుగు

భాషాభిమానంబు ప్రకటింప సహజమౌ
అనురాగ మెవనిలో నల్లుకొనును

కవుల చూడంగ నెవనికి గౌరవంబు
పేదలను చూడ నెవనికి ప్రీతి కరము
సుజనులను చూత నెవనికి సోయగంబు
అట్టి బుద్ధి ప్రసాదుకు 'అభ్యుదయము'.

సమతలంబుల యందు సవ్యమై ప్రవ
జలరాశి పోలిన సాత్త్వికంబు
పలుకుపలుకులందు పరిమళము చిలుకు
పొందైన మాటల పొదుపు గుణము
సుమరాశి వనములో సొంపుగా నడయాడి
నర్తించు చిరుగాలి నగుమొగంబు
గడబిడల్ దడదడల్ కలిగెడి వేళలో
చెదరని యట్టి గంభీర గుణము

సహజ భూషణంబులనుచు చవులు కులుక
మంచి వారల ఎదలోన మనికి గొన్న
మాన్య బుద్ధప్రసాద' సన్మహిత కీర్తి'
సకల శుభములు బడయుతు సంతతంబు.

74

# సౌజన్య శిఖరం

- ఆచార్య పేర్వారం జగన్నాథం

మాన్యులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌గారు మంచి రచయిత, సాహితీవేత్త. అంతకుమించి వినయభూషితుడు, నిరాడంబరుడు, సౌజన్య మూర్తి, సంస్కార సంపన్నుడు. ఇవన్నీ ఆయనకు తన తండ్రి కీ.శే. శ్రీ మండలి వెంకట కృష్ణా రావుగారి నుండి సంక్రమించినాయని భావిస్తుంటాను. మండలి వెంకట కృష్ణారావు గారు ప్రప్రథమంగా హైదరాబాద్‌లో ప్రపంచ తెలుగు మహాసభల్ని ఘనంగా జరిపించిన క్రియాశీలి, కార్యదీక్షాపరుడు. ఆ సభలకు ఆయనే రథసారథి. ఆయన పుత్రుడుగా శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌గారు తండ్రి వారసత్వ బాధ్యతల్ని సక్రమంగా, సముచితంగా నిర్వ హిస్తూ ఆదర్శ ప్రజా ప్రతినిధిగా గుర్తింపు పొందినవారు. ప్రసాద్‌గారు నిస్వార్థ ప్రజా సేవా తత్పరులు, నిష్కలంక దేశభక్తులు. ఎన్ని ఆటుపోటులెదురైనా ఆయన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవిచ్ఛిన్నంగా ఉండాలని చిత్తశుద్ధితో కోరుకునే అలసు సిసలైన సమైక్యవాది. అందులో లౌక్యం లేదు, రాజకీయం అసలే లేదు.

బుద్ధప్రసాద్‌గారు నాకిటీవల నాలుగైదు సంవత్సరాల క్రితమే ప్రత్యక్షంగా విజయ వాడలో పరిచయమైనారు. మొదటి కలయి కలోనే వారిని చూసినప్పుడు ప్రసన్నమైన వదనం, వాత్సల్యంతో కూడిన పలకరింపు, ఆర్ద్రహృదయంతో నన్ను స్వాగతించిన విధం నన్నెంతో ఆకర్షించాయి. కృష్ణాజిల్లా శ్రీకాకు ళంలో మొట్టమొటిసారిగా శ్రీకాకుళాంధ్రదేవుని సన్నిధిలో తెలుగు భాషోద్యమం సమాలోచన మహోత్సవాలు, 1, 2 నవంబరు 2002 తేదీలలో మహావైభవంగా జరిగిన సందర్భం అది. అది వారి నేతృత్వంలోనే నిర్వహింపబడి నాయి. బుద్ధప్రసాద్‌గారే ఆ మహాసభలకు నన్ను ముఖ్య అతిథిగా ఆహ్వానించి సమాదరించినారు. తెలుగు భాషోద్యమ నాయకులు శ్రీ సి. ధర్మారావుగారు నన్ను ప్రసాద్‌గారికి పరిచయం చేసినవారు. తదాదిగా పైవారెంతో ఆదరాభిమానాల్ని ప్రదర్శిస్తుంటారు.

ఆ తరువాత మేము వరంగల్లులో తెలుగు భాషోద్యమ సంఘం తరపున రెండు రోజులు మహాసభల్ని జరిపినప్పుడు ప్రసాద్‌గారు వరంగల్లుకు వచ్చి మహాసభలకు హాజరై మమ్మల్నెంతో ప్రోత్సహించారు.

శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు ఇటీవల రాష్ట్ర మంత్రివర్యులుగా నియమితులైన సందర్భంలో నేనెంతో ఆనందిస్తున్నాను. నేనేకాదు, సకలాంధ్ర ప్రజానీకం హర్షాతిరేకంతో పులకితమవుతుందనడంలో సందేహంలేదు. వారి నేతృత్వంలో ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖ వికాసం దిశలో పయనించగలదనీ, ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక భాషారంగాలకు వారి సహకారం సమృద్ధిగా లభిస్తుందని విశ్వసిస్తున్నాను. వారికి ఈ శుభసందర్భంలో నా అభినందనలు. విజయోస్తు !

○

# పన్నీటి జల్లుల పలకరింపులు

- శ్రీ ఉమ్మడి శివలింగం

నిత్య నిర్మల మందహాసంతో పన్నీటి జల్లుల పలకరింపులతో అలరించే ఆత్మీయుడు.
తారతమ్యాలు ఎరుగని స్నేహశీలి. విరామమెరుగని శ్రమైకజీవి. కార్యోత్సాహి, క్రియాశీలి.
ఏ విషయం మీదైనా అనర్గళంగా ప్రసంగించగల వక్త.
తెలుగు భాషోద్యమానికి చేయూతనిచ్చిన అభిమాని.
కృష్ణా గుంటూరు జిల్లాలను కలిపే పులిగడ్డ వారధి నిర్మా
ణానికి అందరినీ కలుపుకుని చేసిన అవిరళ కృషి
అకుంఠిత దీక్ష, నెరపిన సారథ్యం అనితర సాధ్యం
సరసత, సదయత, సమత మమత పూచికాచినకుసుమ
వల్లరీగుచ్ఛం ఆయన.
నిరుత్సాహమెరుగని ఉత్సాహంతో అందరి మన్ననలను
పొందిన అందరూ అభిమానించే శ్రీ బుద్ధప్రసాద్
అభినందనీయుడు.
దివిసీమ జ్యోతిని ఆంధ్రావని అంతా కాంతిల్లచేసిన సహృదయునికి నమస్సుమాంజలి.

○

# మేటినాయకునకు గీటురాయి

- శ్రీ దాసి బసవయ్య

స్వాగతము మంత్రివర్య! సుస్వాగతంబు
మంత్రి పదవను పెండ్లి కుమార్తె తోడ
ప్రేమతో యేగుదెంచిన పెండ్లి కొడుక !
స్వాగతము మీకు మండలి వంశవర్య !

ప్రజకొనర్చిన సేవకు ప్రతిఫలముగ
మంత్రిపదవి వరించెను మానవతకు
విలువ కట్టిన మిమ్ము యీ విజయలక్ష్మి
వలచి వచ్చెను యొడలెల్ల పులకరింప.

మండలి వంశ మండనుడు మాన్యుడు వేంకటకృష్ణా రావుకున్
పండిన పంటవై పసిడి బాటలలో పయనించి తండ్రికిన్
నిండగు కీర్తి తెచ్చిన మనీషివి బుద్ధ ప్రసాదు! యీ ప్రజల్
అండగనుండ మీదగు మహత్తర యానము సాగి పోయెడిన్.

తండ్రిపేరును నిలబెట్టు తనయునిగను
దేశసేవలో రాణించి దివ్యమైన
కీర్తికెనయైన త్యాగ విస్ఫూర్తితోడ
సాగి పోవలె బుద్ధ ప్రసాదు సతము.

బుద్ధుని పేరులో కలుగు పూర్ణ మహత్వము మీ మనస్సులో
సిద్ధి వహించుటన్ ప్రజల సేవకు ప్రేరణ కల్గజేయుటన్
ఒద్దికతో శ్రమించి కడు నున్నతి కెక్కిన కారణాననే
ప్రొద్దును దీన మానవుల పోడిమికిన్ కృషి చేయగావలెన్.

తనయుండున్నత పీఠమెక్కెనను నుత్సాహంబు దీపింపగా
జనకుండెంతగ పొంగిపోవునో కదా! స్వర్గంబునందుండియే
జనసంక్షేమము నాయకత్వమునకున్ సార్థక్యమున్ గూర్చు, కా
రణ జన్ముండవు బుద్ధ నాముడవు మీ ప్రస్థాన మన్వర్థమౌ

అవని గడ్డ ప్రజలు ఆప్యాయతలతోడ
పలుకుచుండిరి, అభివందనములు
ప్రజల బాగుకొరకు పాటుబడుటొకటె
మేటి నాయకునకు గీటురాయి.

వయసు పెద్దది కాదు మీ వాలకంబు
రూపలావణ్యములు ప్రజన్ ప్రోదిచేయు
కాలమనెడి సంద్రమున చుక్కాని వోలె
నడుపవలె జనుల్ పయనించు నావ నెపుడు.

# సంస్కృతికి వారసుడు శ్రీ బుద్ధ ప్రసాద్

- డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

"ఏ పూర్వపుణ్యమో ఏ యోగ బలమో
జనియించినారనీ స్వర్గలోకంబున
ఏ మంచి పూలను ప్రేమించినావో
నినుమోచె ఈ తల్లి కనకగర్భమున"

అంటారు రాయప్రోలు. అలాంటి పుణ్య మూర్తి కడుపుపంటగా జన్మించిన పుణ్య మూర్తులు మండలి వెంకట కృష్ణారావుగారు, వారి కుమారుడు బుద్ధప్రసాద్ గారు.

నీ బిడ్డలు నీ బిడ్డలు కావచ్చు
నీ బుద్ధులకు వారసులు కారు"

అంటారు ఖలీల్ జిబ్రాన్ కవి. అది వాస్తవం కాదని పిస్తుంది ఈ తండ్రి కొడుకుల విషయంలో.

బుద్ధ ప్రసాద్‌గారు నూటికి నూరుపాళ్ళు తండ్రిగారికి వారసులు. మాటలో, రూపంలో, వేషభాషలలో, ఎప్పుడు చిరునవ్వుతో పలకరిం చడంలో, మమతానురాగాలు వర్షించడంలో అచ్చం తండ్రికి తగ్గ తనయుడు బుద్ధప్రసాద్ గారు. సాక్షాత్తూ కృష్ణారావుగారి ప్రతి రూపమే బుద్ధప్రసాద్. జాతీయ స్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో తెలుగువారికి తగిన గుర్తింపులేని దినాలలో కృష్ణారావుగారు ప్రపంచ తెలుగు మహాసభలు 1975లో నిర్వహించి, తెలుగువారికి ఎనలేని కీర్తిప్రతిష్ఠలు సమకూర్చి పెట్టారు. తెలుగు భాషకు గుర్తింపు తెచ్చారు. ఈ మహాసభల పూనికతో అంతర్జాతీయ తెలుగు సంస్థ హైదరాబాద్‌లో వెలసింది. ఇదే సంస్థ తదుపరి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఆవిర్భావానికి ఊపిరి లూదింది.

1979లో కృష్ణారావుగారే పూనుకొని అఖిలభారత బాలల మహాసభలను హైదరాబాద్‌లో ఆంధ్రబాలానంద సహకారంలో నిర్వహించారు. ఈ సభల నిర్వహణ ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఏర్పడింది. ఈ అకాడమీ నిర్మాణంలో సూచనలను వారు స్వీకరించారు.

ఈ విధంగా కృష్ణారావుగారి చేయూతతో ఈ రెండు ప్రసిద్ధ సభలు జరిగాయి. రెండు గొప్ప సంస్థలు వెలిశాయి. ఇలా ఎన్నో సభలు జరిగిగాయి, సంస్థలు వెలిశాయి. ఇచ్చట ప్రత్యేకంగా గమనించదవలసిన విషయం ఏమంటే బుద్ధప్రసాద్ పెరిగి పెద్దవాడయ్యాక తరచు కృష్ణారావుగారితోనే ఉంటూవచ్చారు. వారి ప్రతి కదలికనూ గమనిస్తూవచ్చారు. కృష్ణారావుగారి లోని సౌజన్యాన్ని, సౌమనస్యాన్ని, సేవాభావాన్ని, సేవాతత్పరతను పుణికి పుచ్చుకున్నారు.

వారు శాసనసభ్యులు కాకపూర్వం అయ్యాక దివి సీమలోని సంస్కృతి వైభవాన్ని వెలికి తీయడంలో విశేష కృషి చేశారు. "దివిరత్నాలు" పేరుతో 2002 లో దివిప్రాంతంలోని తెలుగు వెలుగుల పరిచయాలను సచిత్రంగా ప్రచురించారు. అంతకుముందు పెదకళ్ళేపల్లిలో జరిగిన సభకు, ఇటీవల శ్రీకాకుళంలో జరిపినసభకు, శ్రీ కృష్ణదేవరాయల విగ్రహస్థాపనకి వారి కృషికి నిదర్శనాలే. కిందటి సంవత్సరం ఫిబ్రవరిలో విజయవాడలో జరిగిన అఖిల భారత తెలుగు సాహిత్య సభలు "పసిడి" గ్రంథ ప్రచురణవారి నిర్వహణ దక్షతకు నిదర్శనాలు. వారే ఇపుడు విశ్వవ్యాప్తంగాగల తెలుగు రచయితలను ఒకవేదికపై విజయవాడలో ఆగస్టు మాసంలో చేర్చనున్నారు. ఇంకా ఎన్ని ఆలోచనలు వారి మస్తిష్కంలో ఉన్నాయో ఊహించలేము. నామటుకు నాకు ఎంతో ఆత్మీయంగా పలుకరించే కృష్ణారావు గారు మరణించలేదనిపిస్తుంది. బుద్ధప్రసాద్ రూపంలో మనమధ్యే ఉన్నారనిపిస్తుంది. అది నా అదృష్టంగా భావిస్తాను.

**ఈ జీవితంలో నా నడక ఒక్కసారే**
**ఈ జీవిత కాలంలో అంత మంచి చేయగలిగినా**
**నాతోటి జీవిపై ఇంత దయచూపగలిగినా**
**ఇందుకు తేడాగా నన్ను మన్నించకు**
**ఈ బాటలో నేను మరల కాలు పెట్టేది లేదు కదా!**

రొటెనా గెల్యర్ అనే జర్మన్ రచయిత బుద్ధప్రసాద్‌గారిలో ప్రవేశించి ఈ జీవితంలో ఇన్ని మంచి పనులు చేస్తున్నారనిపిస్తుంది. వారి జీవితం ఇలాగే కొనసాగాలని ఆకాంక్ష, ఆశీస్సు.

# నిస్వార్థ సంఘ సేవా తత్పరుడు మన బుద్ధప్రసాద్

- శ్రీ బుడ్డిగ జమిందార్

**2004** సంవత్సరము డిశెంబరునెలలో సంభవించిన సునామీ తరువాత జర్మనీలోని నా మిత్రుడు అల్ట్‌లాండ్స్‌బర్గ్ మేయరు డా॥ గుజ్జుల రవీంద్ర నాకు ఫోన్‌చేసి సునామీ బాధితులకు సహాయం నిమిత్తం నీకు రెండున్నర లక్షల నగదు పంపిస్తాను అది సునామీ బాధితులకు అందచేయమని కోరగా నేను కృష్ణాజిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి గోపాలరావుగారి సలహా మేరకు 26-01-05 తేదీన అప్పటి అవనిగడ్డ శాసనసభ్యులు, గౌరవనీయులు మండలి బుద్ధ ప్రసాద్ గారిని కలిసి విషయం తెలియ చేయటం జరిగినది. వెనువెంటనే ఆయన అక్కడున్న సంగమేశ్వర గ్రామ సునామీ బాధితులసు చూపించి ఈ సహాయమును వారికి అందిచవలసిందిగా చెప్పటం జరిగినది. మేము గ్రామస్థులకు కావలసిన వలలు, బియ్యము, వగైరాలుకొని ఫిబ్రవరి నెలలో జర్మనీ నుండి వచ్చిన డా॥ గుజ్జుల రవీంద్రగారి బృందంతో పంపిణీ చేయటం జరిగినది. ఈ చిన్నిసహాయ కార్యక్రమము సద్వినియోగపరచుకొని అప్పటి కృష్ణా జిల్లా కలెక్టరు శ్రీ ప్రభాకర్ రెడ్డి, జాయింట్ కలెక్టర్ శ్రీ సంపత్ కుమార్‌గార్లతో జర్మనీ బృందాన్ని సమావేశపరచి, దివిసీమలో శాశ్వతప్రాతిపదికన స్కూలు కమ్ సైక్లోన్ షెల్టర్లు మరియు విజయవాడ నగరంలో వీధి బాలురకు స్కూలు మరియు హాస్టలు భవన నిర్మాణ ఆవశ్యకతను వివరించి జర్మనీ సహాయమునకై శ్రీ బుద్ధప్రసాదుగారు అభ్యర్థించటం జరిగినది. పిదప 2005 సెప్టెంబరులో జర్మనీలోని అల్ట్ లాండ్స్‌బర్గ్ నగర 775వ వార్షికోత్సవ సందర్భంగా శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారిని, జాయింట్ కలెక్టరు సంత్ కుమార్ గారిని నన్ను ఆహ్వానించటం జరిగినది.

గౌరవనీయులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు, సంపత్ కుమార్ గారు చేజిక్కిన ఈ ఆహ్వానాన్ని వినోద విహార యాత్రలు కాకుండా ఒక నిర్దిష్టమైన ప్రణాళికతో అక్కడ స్వచ్ఛంద సేవాసంస్థ అయిన SODI మరియు అల్ట్ లాండ్స్ బర్గ్ కార్పొరేషన్ వారిని అక్కడ రెడ్‌క్రాస్ సంస్థలను

మరియు లయన్స్ క్లబ్ శాఖలను కలిసి దివిసీమలో సముద్రతీర గ్రామ ప్రజలకు స్కూలు కమ్ తుఫాను షెల్టర్ల నిర్మాణ ఆవశ్యకతను power point ద్వారా చూపించి షుమారు 80 లక్షల రూపాయల నిధులను అక్కడికక్కడే మంజూరు చేయించుకున్న ఘనత శ్రీ బుద్ధ ప్రసాద్ గారికే దక్కు తుంది.

అంతటిలో సరిపెట్టక, ఆ 80 లక్షల రూపాయల నిధులతో నిర్మించిన సంగమేశ్వరం, ఉల్లిపాలెం, ఊటగుండం, గ్రామంలోని భవన ప్రారంభోత్సవ కార్యక్రమానికి విచ్చేసిన జర్మనీ ప్రతినిధి బృందాలకు అక్కడి పేద ప్రజలకు పటిష్టమైన గృహనిర్మాణాల ఆవశ్యకతను వివరించి తలగడదేవి, పెద్దపాలెం గ్రామాలలో సుమారు 2 కోట్ల రూపాయల నిధులను జర్మనీ నుంచి రాబట్టిన కార్యదీక్షాపరుడు మన మండలి బుద్ధ ప్రసాద్‌గారు. ఇప్పుడు ఈ నిధులతో ప్రస్తుతము 220 గృహములను పేదప్రజలకు నిర్మించి కన్నతండ్రిలాగా అక్కడి పేద కుటుంబాలను ఇంటివారిని చేస్తున్నారు మనమండలి బుద్ద ప్రసాద్ గారు.

బుద్ధ ప్రసాద్ గారిలోని ఈ సేవాతత్పరత, పేద ప్రజల అభ్యున్నతికి ఏదో చేయాలనే ఆలోచన పటిమవారితో గల నా రెండున్నర సంవత్సరాల పరిచయంలో చూడటం జరుగుతున్నది.

జర్మనీలో వారికున్న సమయమును ఉపయోగించుకుని అక్కడ ఆల్‌బర్ట్ ఐన్‌స్టీన్ యొక్క జీవితవిశేషముల గురించి జర్మనీదేశ ప్రజల స్థితిగతుల గురించి అధ్యయనం చేయటానికి ఎక్కువ కాలం గడిపారు.

గౌరవనీయులు మండలి బుద్ధప్రసాద్ గారు తనకు ప్రస్తుతమున్న అవకాశాన్ని సద్వినియోగ పరచుకుంటూ రాగల కాలంలో భారతదేశ ప్రజలకు, జర్మనీయులకు మధ్య ఒక స్నేహ వారధి నిర్మించి తద్వారా సాహితీ సాంస్కృతిక వాణిజ్య విద్యారంగాలలో నూతన అధ్యాయానికి చుట్టిన శ్రీకారాన్ని బలోపేతం చేస్తారని ప్రగాఢంగా విశ్వశిస్తున్నాం.

ఒక ఆదర్శ కుటుంబం నుంచి వచ్చిన మండలి బుద్ధప్రసాద్ గారి నుంచి సమాజంలోని అన్ని వర్గాల ప్రజలు నేర్చుకొన వలసిన విషయాలు చాలాఉన్నాయనేది నా అభిప్రాయం. ఉదాహరణకు వారు ఒక పెద్ద రాజకీయ కుటుంబం నుంచి వచ్చానని ఎప్పుడూ బైటపడరు. వారు ఎప్పుడూ పనులుచేసి చూపించటంలో దిట్ట. అధికారులలో ఎంతో సామరస్యంగా ఉంటూ అభివృద్ధి పనులను కార్యక్రమాలను చేయించగలరు.

మండలి బుద్ధ ప్రసాద్‌గారు ఒక రచయిత. ఆంధ్ర సాంస్కృతిక అభిమాని. తెలుగుభాషాభి వృద్ధి సంస్కర్త. అన్ని రాజకీయ పార్టీలవారితోనూ కలిసి పనిచేసే కలుపుగోలుతనం కనపడు తుంటాయి. ఉదాహరణకు శ్రీ కృష్ణదేవరాయల కాంస్య విగ్రహాన్ని శ్రీకాకుళంలోని శ్రీకాకు

ళేశ్వరస్వామి దేవాలయంలో ఇటీవల ప్రతిష్ఠింపచేసి 500 సం॥ల చరిత్ర కలిగిన ఆముక్త మాల్యద గ్రంథం యొక్క విశిష్ఠతను తెలుపుతూ తెలుగు భాషీయులకు దేశభాష లందు తెలుగులెస్స అనే నానుడిని గుర్తుచేస్తూ వారు నిర్వహించిన సాహితీ సాంస్కృతిక కార్యక్రమములు చెప్పుకోతగ్గవి.

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కూచిపూడి నృత్యమునకు వారు చేస్తున్న సేవలు అమోఘమైనవి.

జర్మనీ సంస్థల తరపున ప్రాజెక్టు కోర్డి నేటర్‌గా పనిచేస్తున్న నాకు సంఘ సేవాపరులు, నిస్వార్థి, దేశాభివృద్ధి తన ధ్యేయంగా తలస్తూ నిరాడంబరంగా ఉంటూ తెలుగు గౌరవాన్ని మారుపేరుగా ఉన్న శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు ఎంతో ఆదర్శవంతులు, నిజమైన గౌరవనీయులు.



చారిత్రాత్మకమైన బెర్లిన్‌లోని బ్రాండెన్ బర్గ్ గేటు ముందు. మండలి బుద్ధ ప్రసాద్ గారితో బుడ్డిగ జమిందార్ మరియు అప్పటి జాయింట్ కలెక్టరు శ్రీ సంపత్ కుమార్ గారు.

○

# అక్షరాకాంక్ష

- విద్యావాచస్పతి శ్రీ వక్కపట్ల ఉషాద్రిపతి

జనియించినావు విశ్వఖ్యాతి గాంచిన
మండలి వంశంబు మహిమ వెలయ
వేంకట కృష్ణరావు ప్రభావతీదేవి
పున్నెంపు పంటవై పెరిగినావు
ఆ బాల్యమును మహోజ్జ్వల దివ్యచైతన్య
విద్యావివేకివై వెలసినావు
చేపట్టితివి లక్ష్మి సమాన ప్రాజ్ఞ
విజయలక్ష్మి కుటుంబ వృద్ధికోరి

కృష్ణసములు వేంకట్రాము కృష్ణప్రభ
అవనిజలు గుణశాలులై హర్షమొసగ
సకల కళ్యాణ గుణశాలి సౌమ్యశీలి
ధర్మరక్షణ జోదు బుద్ధ ప్రసాదు.

ఒక సామాన్య కుటుంబమందుదయమై ఉర్విన్ మహామంత్రి పీ
ఠికపై నెక్కి వెలింగె మీ జనకుడట్లే నీవునున్ మంత్రివై
తిక నీ సేవల తెల్గు వెల్గులు సముద్యద్దీప్తమౌ క్రాంతి వీ
చికలన్ ఆంధ్రులు మోదమున్ బొరయగా శ్రీమంత్రి చూడామణీ !

పాడిపరిశ్రమ పాలు మీగడ వెన్న
పెరుగు నేతులతోడ పెరగవలయు

పశువులానందాన పరిఢవిల్లగ పశు
సంవర్ధనము వృద్ధి జరుగవలయు
మత్స్యశాఖ సముద్రమంత విస్తారమై
రత్నరాసుల విస్తరింపవలయు
రోగముల్లేక ఆరోగ్యంబు వర్ధిల్లి
ఆబాలగోపాల మలరవలయు

చతుర గుణశీల యీ చతుశ్శాఖలందు,
ప్రజలు నిత్యంబు సంతోష పథము నంది
ప్రబలుగావుత మీ ప్రజాపథము నందు
మంత్రి మణిహార నాయక మణి విధాన.

పెనుమూడి పులిగడ్డ పెనువారధియె సాక్షి !
ప్రజల సేమమ్మె నీ పనియనుటకు
తెలుగు పసిడి దీధితులె సాక్షి ! ఆంధ్ర భా
షాభిమానమ్మె నీ శ్వాసనుటకు
కృష్ణరాయల కంచు విగ్రహంబే సాక్షి !
ఆంధ్రభోజుడవు నీవని చెబుటకు
రాత్రింబవళ్లు విశ్రాంతి లేనిదె సాక్షి !
నీ కార్యదీక్ష నిర్ఛిద్రమునకు

తీర ప్రాంత సమస్యలు తీర్చి ప్రజల
కన్నబిడ్డల వోలె రక్షణము సేయ
ధరసమర్థత రాజశేఖరులు గురిగ
నాల్గు శాఖలు నీకిచ్చె ననుటె సాక్షి.

ఆయురారోగ్య భోగ భాగ్యములనిచ్చి
ఉత్తరోత్తర మభివృద్ధి నొనరగూర్చి
తెలుగువారల ఇలువేల్పు మలయప దొర
శ్రీనివాసుండు మిమ్ము రక్షించుగాక –

# అభినందన సుమమాల

- డా॥ వి.వి.కృష్ణశాస్త్రి

గౌరవనీయులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు వ్యవసాయ పశువర్ధక శాఖామాత్యులుగా నియమింపబడటం మా బోంట్లకు అత్యంత ఆనందదాయికమైన విషయం. చాలాకాలంగా వారికి చరిత్ర సంస్కృతులపైన గల అభినివేశం ఆసక్తి నన్నువారి ఆప్తమిత్ర వర్గంలో ఒకనిగా చేర్చింది. జిహ్వాగ్రేవర్తతే లక్ష్మీర్జిహ్వాగ్రే మిత్ర బాంధవా' అనే వాక్యం బుద్ధప్రసాద్ గారికి పూర్తిగా అన్వయింప వచ్చును. ఆయన పెదవుల చివర లక్ష్మి వసిస్తుంది. ఆయన చల్లని పలుకరింపుతో జనం పులకరించిపోతారు. బాలుర నుండి వృద్ధులవరకు జనాన్ని ఆప్యాయంగా నిండు హృదయంతో పలుకరించడం బుద్ధప్రసాద్‌గారి ప్రత్యేకత. ఆయన చిరుమందహాసం ప్రసన్నత ఆయన దగ్గరున్న రెండు దివ్య సమ్మోహనాస్త్రాలు. ఎవరికి అవసరమైన విషయాన్ని వారితో మాట్లాడి చక్కటి సలహాలిచ్చి సంతృప్తి పరచిపంపడం వారి నైజగుణం. పైనచెప్పినట్లు వారికి చరిత్ర సంస్కృతులంటే అవ్యాజమైన ఆసక్తి.

కొద్ది సంవత్సరాల క్రింద బుద్ధప్రసాద్‌గారు హైదరాబాద్‌లో మా ఇంటికి వచ్చి తమ తండ్రిగారు మండలి వెంకట కృష్ణారావుగారి వర్ధంతి సందర్భంగా వారి జన్మస్థలం అవనిగడ్డలో నిర్వహిస్తున్న సభకు నన్ను ఆహ్వానించారు. వారి పిలుపే ఆజ్ఞగా భావించి అవనిగడ్డ వెళ్లడం జరిగింది. ఆ సభకు ప్రొఫెసర్ వైకుంఠం గారు, యార్లగడ్డవారు అనేకమంది ఇతర ప్రముఖులు వచ్చారు. వచ్చిన వారు తమతమ ప్రసంగాలతో సభికులను రంజింపచేశారు. సభ అనంతరం బుద్ధ ప్రసాద్ గారింట విందు భోజనం. మాకు వారు చూపిన ఆప్యాయత అనురాగాలు వారు చేసిన అతిథి మర్యాదలు ఎన్నటికి మరువలేము. అవనిగడ్డలో ఉన్నంత కాలము వారి తండ్రిగారు మండలి వెంకట కృష్ణారావు గారిని గుర్తుచేసి కుంటూ గడిపాం. వెంగళరావుగారి మంత్రి

మండలిలో కృష్ణారావుగారు విద్యాశాఖామంత్రిగా పనిచేయడం ద్వారా నాకు బాగా తెలిసున్న వ్యక్తి. నేను పనిచేసిన పురాతత్వశాఖ విద్యాశాఖకు అనుబంధంగా ఉండేది. 1976లో వారి ఆధ్వర్యంలో హైదరాబాద్ నగరంలో ఏర్పాటుచేసిన ప్రపంచ తెలుగు మహాసభలు నభూతో నభవిష్యతి అనే విధంగా జరిగాయి. సభల ప్రారంభ దశనుండి చివరివరకు కృష్ణారావుగారు తీసికున్న శ్రద్ధ నా ఈ డెబ్బది సంవత్సరాల జీవితంలో చూడలేదు. ఖమ్మంలో ముల్కి ఉద్యమం ద్వారా తెలంగాణ వేర్పాటు వాదానికి ఆజ్యం పోసినవారిలో వెంగళరావు గారు ప్రథములు. వారి మంత్రి మండలిలో ఉంటూ ప్రపంచ తెలుగు మహాసభలను అంత దిగ్విజయంగా నిర్వర్తింప గలగటం కృష్ణారావుగారి అద్భుత నైపుణ్యానికి జోహార్లు.

ఆ మరుసటి సంవత్సరం అంటే 1977లో వచ్చిన భయంకర తుఫాను దివిసీమను అతలా కుతలం చేసింది. ఆ పెను తుఫానులో లక్షలకొద్ది ప్రజలు, పశువులు, పక్షుల నష్టం జరిగింది. కోటాను కోట్ల రూపాయిల ఆస్తి నష్టం వాటిల్లింది. కృష్ణారావుగారి ఆత్మ బంధువులెందరో చని పోయారు. నవయువకుడు ఎలమంచిలి ప్రాంత ప్రజానాయకుడు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారి అనుచరుడు, నాచిట్టిచెల్లెలిభర్త ప్రయాగబ్రహ్మన్నగారు గూడ తుఫానులో మృతిచెందారు. అంతటి ప్రజానష్టాన్ని ఆస్తినష్టాన్ని చూడలేక కృష్ణారావుగారి హృదయం ద్రవించి వారు మంత్రిగా ఉండి గూడా చంటిపిల్లాడులా విలపించడం మంత్రి పదవికి రాజీనామా చేయడం నాకు బాగా గుర్తుంది. ఆనాటి మంత్రిమండలిలో ముఖ్య మంత్రిగా వెంగళరావుగారు, విద్యాశాఖామంత్రి కృష్ణారావుగార్లు మాత్రమే ప్రజల మనోఫలకాలలో నిల్చిపోయారు. ప్రకృతి వైపరీత్యాలు వచ్చి నప్పుడు కష్టాల్లో ఉన్న ప్రజల కన్నీరు తుడవగలిగిన నాయకుడే భగవత్స్వరూపుడుగా పూజిం పబడతాడు. అట్టి మహా నాయకుని అనుంగు పుత్రుడు నిజవారసుడు మన బుద్ధ ప్రసాద్‌గారు.

బుద్ధ ప్రసాద్ గారితో ఒకసారి నేను మా తమ్ముని పిలుపు మేరకు అమెరికా ప్రయాణం పెట్టుకున్నానని ఆ ప్రయాణానికి ముందు భారత దేశంలో తరతరాలుగా సంభవించిన కరువుల గురించి ఇంగ్లీషులో వ్రాసిన ఒక చిన్న పుస్తకం ప్రచురించాలని ఉందని చెప్పాను. ఆ మరుసటి రోజు ప్రసాద్‌గారు మా ఇంటికి వచ్చి ఆ పుస్తకం తాలూకు సీడిని తీసుకువెళ్ళి ఒక వారం రోజులలో 500 కాపీలు ముద్రింపించి నాకు పంపారు. వాటిలో కొన్నింటిని అమెరికాలో నా బంధువర్గంలోను స్నేహవర్గంలో వారికి పంచాను. ఈ మధ్య బుద్ధప్రసాద్ గారి ఆధ్వర్యంలో కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో జరిగిన శ్రీ కృష్ణరాయ జయంతి సందర్భంగా వారు నన్ను ఒకటి రెండు సార్లు ఫోనుద్వారా ఆహ్వానించడం జరిగింది అప్పట్లో నేను మా స్వగ్రామం కృష్ణాజిల్లా చిరివాడలో ఉన్నాను. ఆ సమయంలో విజయవాడనుండి ప్రసాద్‌గారు తానే స్వయంగా చిరివాడ వచ్చి నన్ను శ్రీకృష్ణరాయ జయంతికి ఆప్యాయంగా ఆహ్వానించి వెళ్ళారు.

శ్రీకాకుళంలోని ఆంధ్ర విష్ణు దేవాలయం క్రీస్తుశకం రెండు మూడు శతాబ్దాలలో ఒక పల్లవరాజుచేత నిర్మింపబడ్డదని కొందరి చరిత్రకారుల ఊహ. ఇప్పటి కృష్ణా జిల్లా అంటే ఆనాటి మహిషాసక ప్రాంతం పల్లవుల అధీనంలో ఉన్న ఆధారాలు లేవు. కాని అవనిగడ్డ సమీపంలోని (హంసల దీవి) కోడూరు రాజధానిగా చేసికుని పరిపాలించిన బృహత్ఫలాయనుల క్రిందనో, వేంగిని పాలించిన సాలంకాయనుల క్రిందనో పల్లవులు సామంతులుగా ఉండి ఉండవచ్చును. పల్లవరాజ వంశ మూలపురుషుడు త్రిలోచన పల్లవునికి దివిసీమకు సంబంధం ఉన్నది. త్రిలోచన పల్లవుడు తనకు అనేక యుద్ధాలలో సహకార మందించినందుకు ప్రతి ఫలంగా మల్లుడనే సేనా నాయకునికి వెలనాటికి రాజధాని అయిన ధనదపురాన్ని బహూక రించినట్లు తెలుస్తుంది. ధనదుడనే రాజు పేరుమీద ధనదపురం వెలిసింది. త్రిలోచన పల్లవునికి యుద్ధాలలో సహకరించిన మల్లుని నిజనామం ధనదుడయి ఉంటుంది. దివిసీమను నిర్మించిన వాడు ధనదుడు అని చరిత్ర చెపుతుంది. కృష్ణానది సముద్ర సంగమ ప్రాంతమే దివిసీమ. ఆ ధనదుడే శ్రీకాకుళం దేవాలయాన్ని నిర్మించి ఉండవచ్చును. ఒకనాటి ధనదపురమే నేటి కోడూరు గావచ్చు. కోడూరు ప్రాంతాన్ని కుద్రహార విషయంగా ప్రాచీన శాసనాల్లో చెప్పబడ్డది. కోడూరు సమీపంలో త్రవ్వకాలు చేపడితే చాల విషయాలు వెలికివస్తాయి.

ఈ దేవాలయంలోని దేవునిపేరు ఆంధ్ర విష్ణువుగా ఎవరు నామకరణం చేశారో తెలియదు. శ్రీ కృష్ణ దేవరాయలువారే నూతనంగా తన పాలన క్రిందకు వచ్చిన ఆంధ్ర ప్రాంతంలోని ముఖ్యమైన దేవుడు గాబట్టి అలా నామకరణం చేసి ఉంటారు. అప్పట్లో తిరుపతి ఉన్నది ఆంధ్ర ప్రాంతంగాదు. కృష్ణరాయల అధీనంలోకి రాకముందు ఈ కృష్ణాతీర ప్రాంతం ఓఢ్ర గజపతుల పాలనలో ఉండేది. ప్రప్రథమంగా ఆంధ్రలో అడుగిడిన శ్రీ కృష్ణరాయలు తన విజయపరంపరలకు కారకుడు, తనకు ఆముక్త మాల్యద మహా కావ్యాన్ని రచింపమని ప్రేరేపించిన ఆ శ్రీకాకుల మహా విష్ణువును ఆంధ్ర విష్ణువుగా పేరిడటం సహజమే.

శ్రీ బుద్ధ ప్రసాద్‌గారి ఆహ్వానాన్ని పురస్కరించుకుని శ్రీకాకుళం వెళ్ళడం జరిగింది. దూరదూర ప్రాంతాల నుండి అనేక మంది రాజకీయ నాయకులు చరిత్రకారులు, సాహితీవేత్తలు, పత్రికా రచయితలు, కళాకారులు వేంచేసి ఆ సభను దిగ్విజయం చేశారు. ఆ సభలకు వేసిన చలువ పందిళ్లు గాని, అలంకారాలుగాని, భోజన సదుపాయాలు గాని, పురావస్తు ప్రదర్శనలు గాని వేలుపెట్టి చూపనలవిగాకుండ ఉన్నాయి.

శ్రీ బుద్ధ ప్రసాద్ గారి పర్యవేక్షణలో తరతరాలు నిల్చిపోయే విధంగా తయారయిన అద్భుత కళాకృతి శ్రీకృష్ణదేవరాయల కంచు విగ్రహం ఆ సభలకు ఒక గొప్ప ఆకర్షణ. ఆ సందర్భంగానే బుద్ధ ప్రసాద్‌గారి ఆధ్వర్యంలోను, చన్ద్రశేఖర రెడ్డిగారి సంపాదకీయంలో ప్రచురింపబడ్డ చక్కని

గ్రంథం శ్రీకృష్ణ దేవరాయ వైభవం మరొక ప్రత్యేకాకర్షణ. వ్యక్తిగతంగా మన లలిత కళలు, చరిత్ర, సంస్కృతులపై అభిరుచి కలిగిన బుద్ధ ప్రసాద్ గారు ఆయా రంగాలలో అనేక సెమినార్లు, సభలు, సమావేశాలు నిర్వహించ డమే కాక అనేకపుస్తకాలను ప్రచురించి ప్రచురింపచేయడానికి చేయూత నొసగారు. సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన ఆయనకు సామాజిక సేవచేయడం, ఆపన్నులను ఆదుకోవడం వంటి సుగుణాలను వారి తండ్రిగారి వారసత్వంగా అందుకున్నారు కరువు కాటకాలలో మగ్గుతున్న రైతాంగాన్ని చూసినా నిస్సహాయులైన పేదలను చూసినా ప్రజ్ఞా విద్వత్తులు కలిగి తగిన ఆర్థిక స్తోమతలేని విద్వాంసులను అనేక మందిని ఆదుకోవడం చూశాను. వారు రాజకీయ జీవితంలో ప్రథమఘట్టాన్ని దిగ్విజయంగా పూర్తిచేసి రెండవ ఘట్టంలోకి అడుగు పెట్టిన సందర్భంగా శ్రీ బుద్ధ ప్రసాద్ గారికి శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు మరిన్ని విజయపరంపరలను, ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించి సదాశయాలను సాధించేలా చేయాలని మనసారా కోరుకుంటున్నాను.

○

## బుద్ధునికి జోతలు !

- శ్రీమతి జి. కామేశ్వరి

బద్ధ ప్రసాదు !
బుద్ధ ప్రసాదు !
సుగుణాలపాదు మా
బుద్ధ ప్రసాదు !!

నీ మంచి నడత
మార్చు నిల భవిత
కూర్చునిల సమత
నిలుపు నిల మమత

యువశక్తి పిలుపు
యువనేత గెలుపు
దివిసీమకే మలుపు
స్వేచ్ఛనిల నిలుపు

దివిసీమ నేత !
మహిమా సమేత
భువినేలు గాత !
గైకొనుము జోత !!

# ఆత్మీయతాపూర్ణుడు శ్రీ బుద్ధ ప్రసాద్

- శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు

మండలి బుద్ధప్రసాద్ పేరు వినగానే ఒక ఆత్మీయతా భావం గుర్తుకువస్తుంది. నిండైన విగ్రహం ఎప్పుడూ నవ్వుతూ ఉండేటువంటి మందస్మిత మైన వదనం అలా నడుస్తూ ఉన్నప్పుడు వాళ్ల నాన్నగారిని చూసిన వారికి మండలి కృష్ణారావుగారిని చూచినట్టుగానే అనిపిస్తుంది. మండలి కృష్ణారావుగారికి రాజకీయ వారసుడు అనతగ్గ వ్యక్తిత్వం. మండలి కృష్ణారావుగారు ఎంతటి నియమ నిబద్ధతలను అనుసరించేవారో అదేవిధంగా మండలి బుద్ధ ప్రసాద్కూడా నియమ నిబద్ధ తలను, రాజకీయ పరంపరను కొనసాగిస్తు న్నారు. మండలి కృష్ణారావుగారు దివి తాలూకాకేకాక యావత్ ఆంధ్ర ప్రదేశానికి కాంగ్రెస్వాదులలో అగ్రేసరుడుగా తాను నమ్మిన వారిని త్రికరణశుద్ధిగా అనుసరించేవారు. అదే విధంగా మండలి బుద్ధప్రసాద్ కూడా అచ్చమైన పదహారణాల కాంగ్రెస్ వాది. ఎంతటి విపత్కర పరిస్థితుల లోనైనా నవ్వుతూ ఎదుర్కొన కలిగినవారు. ఇన్ని సంవత్సరాలుగా మొక్కవోని దీక్షతో అంకిత భావంతో కాంగ్రెస్ పార్టీకి సేవచేస్తూనే ఉన్నారు. పదవుల కోసం ఆయన ఎన్నడూ తపించలేదు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడిగా అందునా కృష్ణా జిల్లాలో అన్ని వర్గాల వారిని నిభాయించుకునిరావడం అంతతేలికైన విషయం కాదు. ఈ మూడు దశాబ్దాల ఆయన రాజకీయ జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్నారు. ఎందరి పెద్దలతోనో తన సహజమైన చిరునవ్వుతో ఘర్షణలు రాకుండా కాంగ్రెస్ పార్టీని నిర్వహిస్తూనే వచ్చారు. అట్టి వారిని రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥వై.ఎస్. రాజశేఖరరెడ్డి తన మంత్రి వర్గంలోకి తీసుకుని ముఖ్యమైన బాధ్యతలను అప్పగించడం బుద్ధప్రసాద్ శక్తి సామర్థ్యాలకు నిదర్శనం. రాజకీయాలలో ఇంతటి అనుభవం కలిగిన వ్యక్తి యాభైసంవత్సరాల జీవితాన్ని పూర్తి చేసుకుంటున్నారంటే మిగతా జీవితకాలంలో ఎంతటి ఉన్నత పదవులను అధిరోహించ గలరో విజయవాడ కనకదుర్గాదేవి మాత్రమే చెప్పవలసి ఉంటుంది.

ఇటీవలనే యాభై ఏళ్ల తెలుగు భాష, సంస్కృతి, సాహిత్య పరిణామాల సమీక్షను ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవాల సందర్భంగా శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ సంపాదకులుగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురించడం వారికిగల సాహిత్య పిపాసకు అద్దం పడుతున్నది. కృష్ణాజిల్లా రచయితసంఘంవారు వారి 51వ జన్మదినోత్సవాన్ని జరుపపూనటం రచయితల సంఘం వారు తమను తాము అభినందించుకోవటం వంటిదే. శాసనసభలో నిజంగా ఎంతటి విశేషం. బుద్ధప్రసాద్ శాసన సభ్యులుగా వుండగా ఆంధ్రప్రదేశ్ స్వర్ణోత్సవాలు జరిగినాయి. తనదైన శైలిలో ఆ కార్యక్రమాలని వారు నిర్వహించారు. మండలి బుద్ధప్రసాద్ పేరు వినగానే మండలి కృష్ణారావు గుర్తుకు వస్తారు. వారిద్దరూ తండ్రి కొడుకులవలే కాకుండా మంచి స్నేహితులవలె భాసించేవారు. బుద్ధ ప్రసాద్ చిన్నతనంనుంచి కృష్ణారావు గారితో సామీప్య సాన్నిహిత్యంవలన రాజకీయాలను అవగతం చేసుకోగలిగినవారు. వారితో ఉన్న పరిచయం మూలంగా బుద్ధ ప్రసాద్‌కు కూడా ఎందరితోనో పరిచయం అయ్యింది. బుద్ధ ప్రసాద్ యొక్క వ్యవహారశైలి, దక్షత, వ్యవహారాలు సరిపెట్టడంలోనూ నేర్పరితనం మొదలైనవన్నీ కృష్ణారావుగారి వద్ద పుణికి పుచ్చుకున్నవే. అయితే బుద్ధ ప్రసాద్‌లో గల అధ్యయన సరళి చరిత్రని 'రాజకీయాలను' కృష్ణాజిల్లా స్వరూప స్వభావాలను అవగతం చేసుకొనటానికి అవకావం కలిగింది. కృష్ణారావుగారు తన జీవితాన్ని తనంతట తాను చక్కదిద్దుకున్నారు. స్వయంకృషితో రాజకీయాల్లో రాణించగలిగారు. ఆనాటి ముఖ్య మంత్రి నీలం సంజీవరెడ్డి, బ్రహ్మయ్యగారు, వెంగళరావుగారు, పి.వి.నరసింహారావు గారి నాయకత్వంలో రాణించారు. తనను తాను సరిదిద్దుకున్నారు. చరిత్రలో సువర్ణ అక్షరాలతో వ్రాయదగిన సంఘటనలకు కారకులు కాగలిగారు. ప్రపంచంలో తెలుగు వారందరనూ ఒకచోటకు చేర్చగల్గిన మహత్తరకార్యాన్ని శ్రీ కృష్ణారావుగారు వెంగళరావుగారి నాయకత్వంలో అసాధారణమైన కృషి ద్వారా సాధించగలిగారు. అంతేకాదు ఒక మంత్రిగా ఆడంబరాలు లేకుండా సాధారణ పౌరుడివలె హైదరాబాద్ నుండి అవనిగడ్డకు బస్సుద్వారా సామాన్య ప్రయాణీకులవలె ప్రయాణించ కలిగారన్న విషయాన్ని ఆ బస్సులో ఈ రచయిత కూడా ఉండటం కాకతాళీయమైన విషయంగా కనపడినా ఒకపాలకుడు ఏ విధంగా వ్యవహరించగలరు ప్రత్యక్షంగా పరిశీలించగలిగారు. అవనిడగ్గ అంటే గుర్తుకు వచ్చేది శ్రీ కృష్ణారావుగారి పేరే. 1979లో దివి మండలాన్ని అతలాకుతలం చేసిన ఉప్పెన ఆంధ్రప్రదేశ్ ప్రజలు ఎవరూకూడా మరచిపోలేని సంఘటన. రాత్రికి రాత్రి సముద్రము నుండి వచ్చిన ఉప్పెన ఎందరినో ప్రాణనష్టానికి గురి చేసింది. ఎందరి ఆస్తుల ధ్వంసంచేసింది. చెట్టు, చేమలు, పశు, పక్ష్యాదులు కోలుకోకుండా దెబ్బతిన్నాయి. ఒక సామాన్య పౌరుడులాగా ఆ ప్రజలకు రక్షకులైనారు. ఎన్నో నెలలపాటు శ్రమించారు. ఆ సమయంలో వారి కృషిని గురించి చెప్పడానికి మాటలు చాలవు. ఆనాటి పరిస్థితులలో వారిని చూచినవారికే అర్థం కాగలదు. దివి తాలూకా మండలమంతా సుభి

క్షంగాఉన్నదంటే మండలి కృష్ణా రావుగారు, మండలి బుద్ధప్రసాద్ వారితో కలిసి పనిచేసే వందలాది కార్యకర్తలు ఆ మండలంలో అనేక కుటుంబాలకు రక్షకులుగా కీర్తించ బడుతున్నారంటే అతిశయోక్తి కాదు. మండలి బుద్ధప్రసాద్ ఒక రాజకీయ నాయకుడు మాత్రమే కాదు. సాహితీవేత్త, సంస్కరణ వాది. మంచి స్నేహశీలి. కార్యకర్తలలో కార్యకర్తగా, నాయకులలో నాయకుడుగా వ్యవహరించ గలిగిన ధీశాలి.

**"అమంత్రమ్ అక్షరమ్ నాస్తి**
**నాస్తి మూల మనౌషథమ్**
**అయోగ్యో పురుషోనాస్తి**
**యోజకః తత్ర దుర్లభః"**

అంటే మంత్రం కాని అక్షరం ఉండదు. వైద్యానికి పనికి రాని చెట్టుండదు. అయోగ్యుడైన పురుషుడుండడు. అయితే వీటి నంతటినీ పనికి వచ్చినట్టుగా చేయకలిగిన ఆలోచనా పురుషుడు కావాలి అట్టి వారి కోవలోనికి శ్రీ బుద్ధప్రసాద్ వస్తారు. ఆయన తన వ్యక్తిత్వ ప్రభావంచేత ఎందరిచేతనో ఎన్నో పనులు చేయించగలిగినవారు కానీ చూడటానికి అతి సామాన్య మానవుడిలా కనపడుతారు. అసామాన్యుడు, అసాధారణ శక్తి సామర్థ్యాలు కలిగినవారు. ఈ మాటలను ఆయన మంత్రి అయినారు గనుక చెప్పడానికి ప్రయత్నం చేయడంలేదు. వారి నాన్నగారిని అనేకరకాల పదవుల్లో చూడడం సంభవించింది. వారు కాంగ్రెస్ కార్యకర్తగా ఎంతగా కృషి చేస్తున్నారో తెలుసుకున్న తర్వాతవారి పట్ల గౌరవం పెరుగుతూనే వచ్చింది. ఆ పరిచయమే బుద్ధ ప్రసాద్ సాన్నిహిత్యాన్ని పెంచింది. రాజకీయంగా కొన్ని సందర్భాలలో వ్యతిరేకించవచ్చు. స్నేహానికి ఎన్నడూ అవి ఆటంకం కాలేదు. నూరు సంవత్సరాల కృష్ణాపత్రిక అంటే వారిద్దరికీ అపారమైన గౌరవం, అభిమానం, కృష్ణాపత్రికకు శాశ్వత కీర్తిని సంపా దించిపెట్టిన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు వారి తాలూకాకు చెందిన వారవటం కృష్ణాజిల్లాలో కాంగ్రెస్ ఉద్యమానికి పాతకులు కావడం కృష్ణాపత్రిక నిర్వహించిన చారిత్రక బాధ్యతలను నేటి పరిస్థితులకు అను గుణంగా అర్థంచేసుకొనటం కూడా కారకాలుకావచ్చు. వంద సంవత్సరాల కృష్ణాపత్రిక ఉత్సవాలు జరిగినపుడు శ్రీ బుద్ధప్రసాద్ కార్యదర్శిగా పనిచేశారు. ఎన్నో కార్యక్రమాల్లో పాల్గొన్నారు. జిల్లాలో జరిగిన శతాబ్ది ఉత్సవాలను జరుపగల్గారు. అట్టి స్నేహశీలి బుద్ధప్రసాద్ ఎంత ఎదిగితే అంతగా ఒదిగి ఉండాలనే తత్వం గలవారు. వారి 51వ జన్మదినోత్సవ సందర్భంగా హృదయ పూర్వకమైన శుభాకాంక్షలు అందచేస్తున్నాను. వారి ఆలోచనలకు అనుగుణంగా వారికి సమర్థనగా చేదోడు వాదోడుగా ఉండే వారి కుటుంబానికి, వారి అనుచరులకు హృదయ పూర్వక శుభాకాంక్షలు అందచేస్తున్నాము.

O

# బుద్ధుడు సుబుద్ధుడు

- కీ॥శే॥ 'నవ్యకవి' నాదెళ్ళ

బుద్ధుడు సుబుద్ధుడు నీతినియతికి సొబద్ధుడు
అతడతడే స్వర్గీయ మండలి సుపుత్రుడు
మండలి కృష్ణరాయ వారసుడై అన్నిటను తండ్రి అడుగు జాడల్లో
ఆచి తూచి అడుగువేయు తగినతనయుడు ॥బుద్ధుడు॥

విద్దెవుంది విద్దెకు తగిన వినయముంది
మందితో కలివిడి అలవడి తిరిగే
సహజ సంపద నేర్పువుంది, ఓర్పువుంది
పదుగురి నాకట్టుకునే ఉత్సాహం ఉరకలేయు ॥బుద్ధుడు॥

తండ్రిచాటు బిడ్డగా నేర్చుకున్న అనుభవాలు
నెమరువేస్తు ముందడుగు వేస్తున్న యువకుడుగా
సేవాభావం సంతరిస్తు స్నేహ భావం ఆలపిస్తు
ఆత్మీయత రంగరించు అందరికీ అభిమాన్యుడు ॥బుద్ధుడు॥

○

# గాంధీక్షేత్రంలో ఓ 'అయస్కాంత క్షేత్రం' శ్రీ బుద్ధ ప్రసాద్

- శ్రీ చోరగుడి జాన్‌సన్

అది 2001 ఫిబ్రవరి. కృష్ణానది ఇసుక తిన్నెల మీద మొట్ట మొదటి కృష్ణామహోత్సవాల ఆరంభ సభావేదిక. ఆ వేదిక మీద రాష్ట్రమంత్రులు, పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యులు పర్యాటక శాఖ రాష్ట్ర స్థాయి అధికారులు కృష్ణాజిల్లా యంత్రాంగంలోని ఉన్నతాధికారులు ఇలా ఎంతోమంది అతిరథ మహారథులతో కొలువైన వేదిక అది. ఆ వేదిక మీదినుంచి ఒకే ఒక్క వక్త ప్రసంగం వైవిధ్యభరితంగా సాగుతూ ఉంది. సాదా సీదాగా మొదలుపెట్టి క్రమంగా ఆయన పూర్తిగా విషయం లోతుల్లోకి వెళుతున్నారు.

ఆయన మాట్లాడుతున్నది మన ప్రాచీన శిల్ప కళాసమన్వితమైన దేవాలయాలపైన ఉండే శిల్పకళల పరిరక్షణ గురించి.

'జీర్ణదేవాలయాల పునరుద్ధరణ పేరుతో ఒక పద్ధతి అంటూ లేకుండా ప్రాచీన శిల్ప కళాకృతులకు సిమ్మెంట్ ప్లాస్టింగులతో మరమ్మత్తులు చేస్తున్నారు. సంబంధిత నిపుణులు సంప్రదింపులతో చేయవలసిన పనిని కేవలం ఒక సివిల్ ఇంజనీరింగ్ పనిగా ప్రభుత్వ శాఖలు చేపట్టడం సరికాదు. .....' అంటూ వేదిక మీద ఉన్న వక్తలందరి కంటే భిన్నమైన విషయాన్ని ఆ పర్యాటక ఉత్సవాల ఆరంభ సందర్భంగా ఆయన మాట్లాడారు. ఆనాటి ఆ వక్త అవనిగడ్డ శాసన సభ్యులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్.

2001 నుండి 2003 వరకు వరసగా జరిగిన కృష్ణా మహోత్సవాల నిర్వహణలో ప్రధానపాత్ర పోషించిన నాకు 2003 ఉత్సవాలలో, ఉత్సవాల పబ్లిసిటీ కమిటీ కన్వీనర్ బాధ్యతలతో పాటు సావనీర్ కమిటీ కన్వీనర్ బాధ్యతలు కూడా, నాటి జిల్లా కలెక్టర్ ఉత్సవాల ఛైర్మన్ శ్రీ బి.ఆర్. మీనా అప్పగించారు.

శ్రీ 'మా' బుద్ధ ప్రసాద్ సావనీర్ కమిటీ ఛైర్మన్. ఆయన సలహాలు సంప్రదింపులతో చాలా 'కంఫర్ట్‌బుల్'గా (ఇక్కడ ఇంగ్లీషు పద ప్రయోగమే సందర్భోచితం అనుకుంటున్నాను) మంచి సావనీర్ తీసుకురాగలిగాము. అలా మొదలైంది వారితో నా సాన్నిహిత్యం.

మళ్లీ ఏడేళ్ల తర్వాత శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణువు ఆలయ ప్రాంగణంలో శ్రీ కృష్ణదేవరాయ విగ్రహావిష్కరణ ఆయన సారథ్యంలో జరిగింది అనే విషయం ప్రస్తుతం విశాఖ పట్టణంలో ఉంటున్న నాకు తెలిసినప్పుడు, అటువంటివి ఆయన మాత్రమే చేయగల్గిన పన్లు సుమా అన్పించింది.

ఆ తర్వాత వారంలో చెన్నై నుండి ఇండియా టుడే (తెలుగు) ఎడిటర్ శ్రీ రాజశుక మాట్లాడుతూ – 'శ్రీకాకుళం వెళ్లి వచ్చాను' అన్నారు. ఎలా జరిగింది అని అడిగితే–

'బ్రహ్మాండంగా జరిగింది అటువంటివి నిర్వహించడంలో ఆయన స్టయిల్ తెల్సిందే కదా'! అన్నారు.

శ్రీ బుద్ధ ప్రసాద్ గురించి, క్లుప్తంగా మాట్లాడే రాజశుక ప్రశంస అది.

అదే విషయం ఆ తర్వాత విశాఖలో శ్రీ బుద్ధ ప్రసాద్‌ను కల్సినపుడు అంటే చిన్నగా నవ్వి ఊరుకున్నారు. 'ఒక్కరుగా మనం ఏమి చేయగలం పదిమందిని కలుపుకుని వెళితేనే కదా ఏమైనా చేయగల్గింది' అనిమాత్రం అన్నారు. నిజానికి ఆ సూత్రాన్ని నమ్మి ఆచరించే వ్యక్తి ఆయన.

2004 కృష్ణాపుష్కరాల సమయం. అప్పటికే గోదావరి పుష్కరాల సందర్భంగా ప్రచారం-పత్రికా సంబంధాలు ప్రభుత్వ పక్షంగా పర్యవేక్షక బాధ్యతలు నిర్వహించిన నేపథ్యంలో బెజవాడ క్యాంప్ కార్యాలయంలో కృష్ణా కలెక్టరు శ్రీ కె. ప్రభాకరరెడ్డితో మాట్లాడుతూ ఉన్నాను.

అంతలో కలెక్టర్ గారికి ఫోన్. కృష్ణానది సాగరసంగమ ప్రాంతమైన హంసల దీవికి, పుష్కరాల సమయానికి రు. 25 లక్షలతో నిర్మించిన రోడ్డు వంతెన ప్రారంభోత్సవాన్ని కలెక్టర్ చేతుల మీదుగా చేయించాలని అవనిగడ్డ నుండి ఆ ప్రాంత శాసనసభ్యునిగా శ్రీ బుద్ధ ప్రసాద్ ఆహ్వానం.

'అది మీ చొరవతో మీరు చేయించుకున్న పని, దానిని మీరు ప్రారంభిస్తే బావుంటుంది' . ఇటు నుంచి కలెక్టరు గారి ప్రశంసాపూర్వక మైన అభ్యర్థన.

ఆ పుష్కరాల పని ఒత్తిడిలో బెజవాడ నుండి హంసలదీవి వెళ్ళి రావడం అంటే ఐదారు గంటల పైగా పట్టే పనిపెట్టుకొన్నట్టే. ఏమైతేనేం చివరికి ఆ హంసలదీవి రోడ్డువంతెనకు శ్రీ బుద్ధ ప్రసాద్ దగ్గర ఉండి మరీ కలెక్టరు గారితోనే ప్రారంభం చేయించారు.

వాళ్లు వీళ్లు అనికాదు. ఎవరితోనైనా తనపని. అంటే తన నియోజక వర్గ అభివృద్ధికి సంబంధించిన పనిని చేయించుకోవడం ఎలాగో తెల్సిన వ్యక్తి శ్రీ బుద్ధ ప్రసాద్. ప్రజా ప్రతినిధుల్లో

చాలా అరుదుగా కన్పించే లక్షణమిది. రాజకీయాలు కాస్త పక్కన బెడితే-వ్యక్తిగత స్థాయిలో తనకు నచ్చని వ్యక్తుల్ని సైతం విమర్శించడానికి ఆయన విముఖత చూపుతారు. వారి ప్రస్తావన వచ్చినప్పుడు మౌనంతోనే తన అభిప్రాయాన్ని మరింత సాంద్రంగా వ్యక్తంచేసే విలక్షణ వ్యక్తిత్వం ఆయనది.

ఎమ్మెల్యేల క్రియాశీలత తమ నియోజక వర్గాలకు మహా అయితే వారి జిల్లాలకు పరిమితమై ఉంటుంది. కాని ఒక శాసనసభ్యునిగా ఆయన రాష్ట్రంలో పలు ప్రాంతాలలో జరిగే కార్యక్రమాలలో కన్పించేవారు! అయితే ఆ గౌరవం ఆయనకు దక్కింది ఒక శాసన సభ్యుడిగా కాదు, ఒక బుద్ధప్రసాద్‌గా వ్యక్తిగత స్థాయిలో లభించిన గుర్తింపు అది.

ఇటీవల దివంగతురాలైన సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి గారికి ఈ ఏడాది ఆరంభంలో విశాఖలో '2007 లోక్‌నాయక్ ఫౌండేషన్' అవార్డు అందజేశారు. ఆ సభకు ముఖ్య అతిథి సుప్రసిద్ధ పాత్రికేయులు కుల్దీప్ నయ్యర్, మరో అతిథి శ్రీ బుద్ధ ప్రసాద్. డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ఆధ్వర్యంలో జరిగిన ఈ సభావేదికను చూసినప్పుడు అన్పించింది- విశాఖలో 'కృష్ణా' అని.

ఈ దశాబ్ది ఆరంభం నుండి గమనిస్తూ ఉంటే-కృష్ణా జిల్లాలోని దివిసీమ దాని కార్యస్థానం అవనిగడ్డ, అక్కడ ఉన్న గాంధీక్షేత్రం, ఈ గాంధీక్షేత్రంలో ఉన్న ఒక 'అయస్కాంత క్షేత్రం'-

ప్రపంచంలో ఎక్కడెక్కడో ఉన్న దివిసీమ దిగ్గజాలన్నీ వెతుక్కుంటూ వచ్చి మరీ దానికి అతుక్కుంటున్న వైనం! దీనిని ఏమనాలి?

అయితే-

ఆ అయిస్కాంత క్షేత్రం-వ్యక్తి చుట్టూ ఏర్పడిందికాదు.

అది ఆ వ్యక్తి ప్రాపంచిక దృష్టి చుట్టూ ఏర్పడింది !!

అటువంటి వ్యక్తుల కార్యాచరణకు విరామం ఉండదు. అది ఒక నిరంతర ప్రక్రియ.

అయితే ఇది ఒక మంచి ఆరంభం మాత్రమే.

వృక్షం పైకిఎదగడం ఎంత ముఖ్యమో లోపలికి దిగడం కూడా దాని సుస్థిరతకు అంతే ముఖ్యం. ప్రపంచీకరణ ఫలాలు గ్రామసీమల ఆర్థికతలోకి కూడా ఇంకడానికి వేస్తున్న అడ్డుకట్టలలో మన భాగస్వామ్యం కూడా క్రియాశీలంగా ఉన్నప్పుడే-సంస్కృతీ వైభవాల పట్ల మనకున్న మక్కువకు ఒక సమగ్రత చేకూరుతుంది.

సార్థకత లభిస్తుంది.

# ఆదర్శయువకుడు బుద్ధప్రసాద్

- శ్రీ లవణం

మండలి బుద్ధప్రసాదు 10 సంవత్సరాల వయసు నుంచి నాకు తెలుసు. ఆయన తండ్రి మండలి వెంకట కృష్ణారావుగారు విద్యార్థి దశ నుంచి గోరాగారికి పరిచయం. అలా 1950 దశకం నుంచి నాకు కూడా పరిచయం. రాను రాను కృష్ణారావుగారికి, నాకు మధ్యవున్న పరిచయం అన్నదమ్ముల పరిచయంగా మారింది. నేను చేసిన ప్రతీపనిలో ఆయన పాలు పంచుకోవటం, అలాగే ఆయన చేసే ప్రతీ సమాజసేవా కార్యక్రమంలో నేను కూడా భాగస్థుడ్ని కావడం జరిగింది. మా ఈ స్నేహం, సేవా రంగంలో భాగస్వామ్యం చివరివరకు కొనసాగింది. అందుచేత బుద్ధప్రసాద్ నావద్ద, కృష్ణారావుగారి అబ్బాయి అంటే మా అబ్బాయిగానే పెరిగాడు. ఆ విధంగా చిన్నప్పటి నుంచి అతడి అభివృద్ధిని గమనిస్తూవచ్చిన నేను చాలా సంతోషిస్తూ వచ్చాను. అతని ఎదుగుదల వెనుక సేవలోను, జ్ఞానంలోను తండ్రి ఇచ్చిన వారసత్వం వుంది. అంతేకాదు స్వయంగా తననుతాను రూపు దిద్దుకున్న కృషివుంది. 1977 ఉప్పెన సమయంలో తండ్రిసరసన నిలబడి దివిసీమ వాసులకు సేవను అందించడంలో యువకుడుగా బుద్ధ ప్రసాద్ కృషి అందరినీ ఆకర్షించింది. అప్పటి నుంచి కేవలం కృష్ణారావుగారి కుమారుడు గానే గాక, బుద్ధప్రసాద్ కూడా ఒక యువకార్యకర్తగా సమాజం పరిగణించింది.

కృష్ణారావుగారు వ్యక్తిగా ప్రజలందరికి చెందిన వ్యక్తి అయినా, పార్టీపరంగా ఆయన కాంగ్రెసుకు అంకితమైన వ్యక్తి, అంతేగాక ప్రభుత్వంలో కూడా ఆయన మంత్రిపదవులు నిర్వహించారు. తన వ్యక్తిత్వాన్ని తాను పెంచు కుంటూ, తండ్రిని అంటి పెట్టుకుని వుండడంలో బుద్ధప్రసాదు కాంగ్రెస్ సంస్థలో కూడా తండ్రికి అర్హుడైన వారసుడుగా గుర్తింపబడ్డాడు. ఆయనకు ఎప్పుడో రావలసిన మంత్రి పదవి ఇప్పుడు రావడంతో తండ్రివలె తాను కూడా మంత్రి అయ్యాడు. ఈ విధంగా తండ్రి నిర్వహించిన దాదాపు ప్రతీ పదవి. ఒక్క పార్ల మెంటు సభ్యత్వం మినహా, ఇప్పటివరకు బుద్ధప్రసాదుని కూడా వరించింది. ఇది ఆంధ్రదేశ రాజకీయ చరిత్రలో

ఒక విశిష్టమైన తండ్రీ కొడుకుల సంబంధం. నేను కృష్ణారావుగారితో ఎప్పుడూ అంటూ వుండేవాడిని "మా తండ్రి గారైన గోరాగారిని నేను ప్రతీ విషయంలో అనుసరిస్తూ వస్తున్నట్లే, మన బాబు (బుద్ధప్రసాద్‌ని ప్రేమగా 'బాబు' అనడం నాకు మొదటి నుంచి అలవాటు) కూడా మిమ్మల్ని అనుసరించి ముందుకు సాగుతాడని నాకు అనిపిస్తోందని". ఈరోజున తండ్రీ తనయుల మంత్రి పదవి నిర్వహణలో కూడా ఒక విచిత్రమైన సారూప్య సంబంధం చోటుచేసుకుంది. కృష్ణారావు గారు మొట్టమొదటిగా నిర్వహించిన మంత్రిత్వశాఖలో మత్స్యశాఖ ఒకటి. నేడు బుద్ధప్రసాద్ పశుసంవర్ధన శాఖతోపాటు, మత్స్య శాఖకు కూడా ప్రాతినిధ్యం వహించడం తండ్రి అడుగుజాడల్లో ముందుకు సాగడమే.

నీతి, నిజాయితీ అందరినీ కలుపుకుపోయే సౌమ్యశీలత్వం, సేవా భావంతోపాటు సాహిత్య, సాంస్కృతిక రంగాలతో కూడా తగినంత పరిచయం-ఇవన్నీ బుద్ధప్రసాద్‌ను ఒక సంస్కృతీ సంపన్నమైన ఉత్తమ మానవునిగా తీర్చిదిద్దుతున్నాయి. ఇటువంటి వ్యక్తి నుంచి మన సమాజం సేవలు అందుకోవడంలో సంతోషంతో ముందుకు రావాలి. మరిన్ని అవ కాశాలు ఇవ్వాలి. నేటి యువతకు బుద్ధప్రసాద్ ఒక చక్కటి ఆదర్శం. అటువంటి ఆదర్శ మూర్తులు ఎందరెందరో..... ఇంకా ముందుకు రావాలి. ఈ విధంగా బుద్ధప్రసాద్‌కు నా అభినందన శుభాకాంక్షలు.

○

# వాస్తవం

- డా॥ ద్వానాశాస్త్రి

తండ్రికి తగిన తనయులు
గాంధీ క్షేత్రాన్ని సుక్షేత్రంగా మలచిన వారు
నిరాడంబరత్వానికి మారుపేరు
గాంధేయవాదానికి మరోపేరు ప్రజలగుండెల్లో గూడుకట్టుకున్న కష్టజీవి

ఇష్టజీవి
సాహితీ సంస్కృతుల పరిరక్షణకు మార్గదర్శి
మాతృబాషాభిమానానికి నిలువెత్తు సంతకం
వినయానికి చిరునామా
"ప్రజల మనిషి"కి ప్రత్యక్ష సాక్షి
ఇంకెవరు ?
మన మండలి బుద్ధ ప్రసాద్.

# శుభాభినందనలు

- డా॥ గుమ్మా సాంబశివరావు

సీ॥ సాగర సంగమ సంస్థానమై యున్న
దివిసీమ నాయక తేజమతడు
మండలి వంశంపు మాణిక్యమౌ కృష్ణ
రాయని మేటి గారాబు సుతుడు
పలుకు పలుకులలో పంచదారను గూర్చి
మాటాడ నేర్చిన మహితయశుడు
దేశదేశాలలో తెలుగుల తేజమ్ము
దీపింప యత్నించు దినకరుండు

గీ॥ అతడె ఋజువర్తనుండైన ఆర్యనుతుడు
ఘనుడు కరుణార్ద్ర భావాల కల్పశాఖి
బుద్ధ నామమ్ము దీపించు బుద్ధు డతడె
అతడె బుద్ధ ప్రసాదుగా నవని వెలుగు 1

మ॥ తనయుం డీతడు తండ్రి మార్గములలో తాత్పర్య మేపారగా
వినయంబొప్పగ సంచరించు ననుచున్ వేనోళ్లు కీర్తింపగా
జనతా క్షేమమె సర్వమంచు సతమున్ సత్కార్యముల్ చేయుచున్
వినుతింబొందిన 'బుద్ధ' నామునకగున్ విశ్వంపు సత్కారముల్. 2

ఆ॥ నరము నరములోన కరము పొంగుచునుండు
తెలుగు నెత్తురెంతొ తేజమొసగి
మాటలోనె గాక మహిత కార్యములందు
ప్రతిభచూపు నతడు ప్రథితరీతి 3

ఉ॥ వేసరుచున్న వారలకు వేయి విధమ్ముల తోడు నీడయై
వాసము గ్రాసమున్ గృహము వర్తిలఁజేసిన మాన్య బాంధవా
చేసిన మంచి కార్యములు శ్రేష్ఠధనమ్ముగ నిల్చి యుండగా
వాసిగ మంత్రివర్గమున వర్తిలు నీకు శుభాభినందనల్ 4

తే॥ అర్థశతవర్షమున మంత్రివైన నీవు
ఇంక శతవత్సరమ్ముల నెసగుమయ్య
సతము ఆరోగ్య భాగ్యమ్ము సంక్రమింప
జనుల సేవకై సాగుము జవము తోడ. 5

○

---

# సాంస్కృతిక 'గోపాలుడు'

- డా॥ రావి రంగారావు

మూడేళ్ళనాటి
వసంత వేదికకు
ఇప్పుడు ప్రాణం వచ్చింది !
ఆలస్యంగా నైనా
ఒక కోకిలకు
సీటు దొరికింది !
సంస్కృతి 'వేణువు'తో
పాడే బుద్ధుడికి పశుపాలన బాధ్యత కూడా

# నేనెరిగిన బుద్ధ ప్రసాద్

-. డా॥ సిహెచ్. సుబ్బారావు

One thing will done is twice done - అన్నాడొక ఫ్రెంచి రచయిత మామూలు ధోరణిలో. నిజమే.....ఏ పనినైనా శ్రద్ధతో కావాలని చేస్తే అది రెట్టింపు ఫలితాన్నివ్వగల అవకాశము ఏర్పడుతుంది. సేవా రంగంలో సిద్ధులైన వారికే సూక్తిలో ప్రగాఢ నమ్మకము ఉంటుంది. నమ్మకమే కాదు వారికది సంస్కారం (Sacrament) గా మారి వుంటుంది. నిజానికి తన ఆలోచనల్లో నిలకడ, నిష్ఠ లోపించి ప్రదర్శించేందుకు మాత్రమే పది పనులు ప్రారంభించి, ఏ ఒక్కదానినీ పూర్తి చేయలేని దానికంటే పూనికతో ఒకటి రెండు పనులనే ప్రారంభించి వాటిని ఫలవంతం చేయగలిగినవాడు ధన్యుడుగదా. అతనే క్రియాశీలుడు, సిద్ధ సంకల్పుడు. తన జీవనాని కొక పరమార్థాన్ని ఏర్పరచుకొనినవాడు అవుతున్నాడు. రాజకీయాలు కానివ్వండి, సంఘసేవ కానివ్వండి, సాహితీ రచనలు కానివ్వండి, పత్రికా నిర్వహణ కానివ్వండి, మరేదైనా కానివ్వండి–చేయు కృషిలో స్థిరచిత్తత, క్రమబద్ధత అనేవి లోపించని వానికే చరిత్రలో స్థానం మిగులుతుంది. ఇది చరిత్ర చెపుతున్న పాఠం.

అవనిగడ్డ యందలి గాంధీ క్షేత్రాన్ని పలుసార్లు సందర్శించిన మీద ఆయాసందర్భాలలో నాకు పై ఆంగ్లసూక్తి స్ఫురణకు వస్తూంటుంది. గాంధీక్షేత్రం ఒక తపోనిష్ఠుడు చేసిన తపస్సుకు ఫలమని పిస్తుంది. మహాత్ముని ఆదర్శాలన్నిటిని మేళవించి రూపొందించిన కార్యసాధనా క్షేత్రమది. చిరంజీవి మండలి బుద్ధప్రసాద్ తన తండ్రి నుండి వారసత్వపు ఆస్తిగా స్వీకరించిన నిర్మాణ కార్యక్రమ సాధనా క్షేత్రం అది. తన డిగ్రీ చదువు పూర్తి చేసికొన్న తరువాత వేరే యితరత్రా ఉద్యోగాల కొరకు యత్నించక ఒక యువ సాధకుడుగా జాతీయ భావనా ప్రేరితుడై తన జీవితాన్ని సంఘసేవా రంగానికి అంకితం చేసిన త్యాగధనుడు బుద్ధప్రసాద్. ఆరు దశాబ్దాలపాటు సామ్రాజ్య శక్తులతో సుదీర్ఘ పోరాటాలు జరిపి అనేక కష్ట నష్టాలను సహించి, పలు త్యాగాలు చేసి యీ విశాల దేశానికి స్వరాజ్యం సంపాదించి పెట్టిన భారత జాతీయ కాంగ్రెసు సంస్థనే తన చిరు వయస్సు నుండీ ఈ నాటికీ నమ్ముకొని చరిస్తున్న స్థిరచిత్తుడాయన.

రాజకీయ రంగం పట్ల నాకు కొన్ని స్థిరమైన అభిప్రాయాలు ఉన్నాయి. నేను సమసమాజ స్థితిని గౌరవించు జాతీయాభిమానిని. వ్యక్తి శ్రేయస్సు జాతి శ్రేయస్సుకు లోబడి వుండవలెననేది నా అభిమతం. పండిత నెహ్రూ, రాజేంద్రప్రసాద్, పటేల్ ప్రభృతులు చెప్పిన Individual Liberty should not be enjoyed at the Cost of Social Liberty అను సిద్ధాంతం నన్ను ఆకర్షించింది. బుద్ధ ప్రసాద్ నిర్వహించు 'గాంధీ క్షేత్రం' మాసపత్రిక ఈ అభిప్రాయానికి బలాన్నివ్వడం నేను గమనించాను. ఆ రీత్యా నాకు బుద్ధప్రసాద్‌గారితో పరిచయ మేర్పడింది. గత 15 సంవత్సరాలుగా ఆయనను నేనెరుగుదును. నన్నాయన అమితంగా గౌరవిస్తాడు. బందరు వచ్చినప్పుడు అనేకసార్లు నా ఇంటివద్ద నన్ను కలుసుకొని పరామర్శించాడు. ఇరువురము స్వరాజ్యం తదుపరి లోకపు పోకడ గురించి చర్చించుకొనేవారము. గాంధీ క్షేత్రంలో ఆయన తలపెట్టిన కొన్ని రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య సెమినార్లకు నాచేత వ్యాసాలు వ్రాయించి నాటి సెమినార్లలో చదివించేవారు. అలా ఆయన సిద్ధాంతాలను సాటి పెద్దలకు తెలియజెప్పే అవకాశం కల్పించాడు. అంతేకాక 1986 నుండి అనేక సందర్భాలలో అనేక విషయాలపై నాచే వ్యాసాలు వ్రాయించి 'గాంధీ క్షేత్రం'లో ప్రచురింప జేయడం జరిగింది. తెలుగు-హిందీ-ఇంగ్లీషు భాషలలో నేను 1030 వరకు వ్యాసాలు రచించాను. అవి అనేక పత్రికలలో వెలువడినాయి. 'గాంధీ క్షేత్రం' మాస పత్రికను నా అభిమాన పాత్రమైన 3-4 పత్రికలలో ఒకటిగా గౌరవిస్తాను. అది రెండుదశాబ్దాలుగా తెలుగు భాషా సాహి త్యాలకు, సంస్కృతికి, రాజకీయ నియమావళికి చేసిన సేవ నిజంగా చిరస్మరణీయమైనది.

బుద్ధప్రసాద్ రాజకీయమంటే పదవుల కొరకు మాత్రమే పలుపాట్లు పడడం, పదవి లభించిన తదుపరి ప్రజలను మరచి పైకం కొరకు పరుగులుదీయడం మాత్రమే నను నికృష్ణ ధోరణి నలవరచుకున్న మనిషికాదనిపిస్తుంది. పదవిని పలువిధ సంక్షే మాలకు వినియోగించి పాటుపడగల ధీశాలి అనిపిస్తుంది. ప్రజాభ్యుదయం ఒక్క రాజకీయ వ్యవస్థ ద్వారానే కాక ప్రజలకు విద్య, సాహిత్యం, సంస్కృతి, ఆధ్యాత్మికత, విజ్ఞానం మొదలగు వివిధ విషయ పరిజ్ఞానాన్ని పలుపలు విధాలుగా అందజేయడం ద్వారా సాధ్యపడుతుందని నమ్మిన వాడాయన. అందుకు తన వంతు కృషిని నిరాడంబరంగా, నిరాటంకంగా సాగించగలవాడు. రాజకీయ నాయకుల కిటువంటి మనస్తత్వం సాధారణంగా వుండదు. కాని బుద్ధ ప్రసాద్‌కు మాత్రం యీ తత్వం చక్కగా అలవడింది. ఇది జాతికి శ్రేయస్సును ఇవ్వగల మనస్తత్వం. ఒకప్పుడు తిలక్, గోఖలే, గాంధీ, మున్షీ వంటి మహామహులు ఇటువంటి వారికి మార్గ దర్శకులు. ఆదర్శమూర్తులు కాగలిగారు.

Democracy is nothing more than absolute activity and awakening of cultured people అన్నాడు లెనిన్ మహాశయుడు. అక్షరాల నిజం.....ప్రజాస్వామ్యం అనేది

ఒక సంఘ శ్రేయోరాజ్య వ్యవస్థ. దానికి సంస్కారవంతులు, విద్యా వినయ సంపన్నులు, విజ్ఞానవంతులు, నిస్వార్ధపరులు అయిన ప్రజల సహకారం అవసరం. అది లేనిదే ప్రజాస్వామ్యం సార్థకం (Successful) కానేరదు. ప్రజాస్వామ్యం ద్వారా ప్రజలలో విద్య, వివేకం, విజ్ఞానం పెంపొందింపబడాలి. తద్వారా వారిలో దేశం పట్ల, జాతిపట్ల, జాతీయ ప్రభుత్వం పట్ల భక్తి శ్రద్ధలు, జీవితం పట్ల కర్తవ్య నిష్ఠ, నిత్య జీవితంలో పాపభీతి, చట్టభీతి, సాటివారి పట్ల స్నేహభావన, ప్రవర్తనలో నిజాయితీ మొదలగు లక్షణాలు బలపడాలి. అంతేగాని ఓట్ల కొరకు వేట (Chase for votes) మాత్రమే ప్రజాస్వామ్యం అనుకొంటే ఆ ప్రజాస్వామ్యం ప్రయోజనాన్ని కోల్పోతుంది. కనుకనే ప్రజానాయకులనదగినవారు రాజకీయాలతో పాటు విశేషించి విద్య, సాహిత్య సంస్కృతీ కళా రంగాలకుకూడా ప్రాణం పోస్తూ ఉంటారు. అది వాంఛనీయం కూడాను. అలా ప్రజలకు భావ స్ఫూర్తిని, కర్తవ్య స్ఫూర్తిని అందించడం తమ వంతు బాధ్యతగా గుర్తిస్తూ ఉంటారు వారు. ఈరీత్యా గమనించినప్పుడు మిత్రుడు మండలి బుద్ధప్రసాద్ రాజకీయ రంగంలో సముచితమైన ఆదర్శాలను పోషిస్తున్నాడనే చెప్పాలి.

శ్రీ బుద్ధ ప్రసాద్ రాజకీయ రంగంలో పార్టీ పరంగా చేయు కృషితోపాటు విజ్ఞానదాయకమైన రాజకీయ, సాంస్కృతిక సెమినార్లు నిర్వహించడం, పత్రికా సంపాదన చేపట్టడం, దివిసీమ సంక్షేమం పేర వేరు వేరు సంఘాల ద్వారా రైతులలో, కూలీలలో, యువకులలో, ఉపాధ్యాయులలో, బాల బాలికలలో, మహిళలలో, తదితర వర్గీయులైన ప్రజలలో సాంస్కృతిక చైతన్యం రాబట్టేందుకు కృషి చేయడం, ప్రత్యేకించి తెలుగు భాషా సాహిత్య వికాసం కొరకు పలు కార్యక్రమాలు చేపట్టడం, దేశపు జాతీయ భాషగా హిందీని ప్రోత్సహించడం, హిందీతోపాటు గాంధీజీ ఆదర్శాలకు అనుగుణమైన నిర్మాణ కార్యక్రమాలకు చేయూత నివ్వడం, 'గాంధీ క్షేత్రం' ద్వారా జాతీయ విధానాలతోపాటు గాంధీజీ ఆదర్శాలకు వ్యాప్తినివ్వడంవంటి ఎన్నో బాధ్యతలను భుజాలపై నిడుకొని వాటిని పూర్తి చేయడాన్ని పరమ కర్తవ్యం (essential duty)గా స్వీకరిం చిన సిసలైన జాతీయాభిమాని. ఒక రాజకీయ పార్టీలో యిటువంటి సేవాధనులైన కార్యకర్తలు, నాయకులుండడం అరుదనే చెప్పాలి.

కార్యదక్షుడైన బుద్ధప్రసాద్ ఆదర్శాలను, కృషిని గమనించి ఢిల్లీయందలి Friendship forum of India వారు గతంలో ఈయనకు ప్రతిష్ఠాత్మకమైన భారత్ ఎక్సలెన్సీ అవార్డును (Bharat Excellency Award) ప్రదానం చేయడం, తద్వారా సదరు ఫోరంవారు ఈయనకు 'ఉత్తమ భారతీయుడు' గా గుర్తింపు నివ్వడం జరిగింది. నేడు మంత్రి పదవి ఇవ్వటంలో ముఖ్యమంత్రి ఒక మంచి నాయకుని పదవిలో గౌరవించినట్లయినా బుద్ధ ప్రసాద్‌వల్ల ఆ పదవికే వన్నె పెరిగింది. ఈ పదవులకు నూటికి నూరుశాతం బుద్ధప్రసాద్ న్యాయం చేకూరుస్తారన్నది సత్యం.

– జై భారత్

# అత్యున్నత పదవికి అత్యంత అర్హుడు శ్రీ బుద్ధప్రసాద్

- శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్

నేను మండలి బుద్ధప్రసాద్ గారిని కలుసు కోవడం మొట్టమొదట 2005 బుక్ ఎగ్జిబిషన్‌లో డా. జి.వి. పూర్ణచంద్ గారి "అలనాటి పట్టణాలు', తరువాత పూర్ణచంద్‌గారిదే మరో పుస్తకం "బ్రిటిషుయుగం" పుస్తకావిష్కరణ సభల్లో !

ఈ రెండు సభల్లోనూ వారు చరిత్ర మరియు సాహిత్యపుటంచులలోనికి వెళ్ళి చాలా సునిశితంగా, సమగ్రంగా మాట్లాడటం నన్ను అబ్బుర పరచింది ! వారి సాహితీ పిపాస గురించి ఆనోటా, ఆనోటా వినటమేగానీ ప్రత్యక్షంగా ఆస్వాదించడం ఇదే మొదటిసారి

మాది గుంటూరు జిల్లా రేపల్లె ! నా చిన్న ప్పటి నుండీ కూడా రేపల్లె పక్కన ఉన్న పెను మూడి నుండి పులిగడ్డకు కృష్ణానది మీద వంతెన పడాలనీ, అలా వంతెన పడితే బందరు చేరటానికి పులిగడ్డకు నదిలో మైళ్ళు నడుచు కుంటూ రహదారి పడవలోనో, నడిచే ఓపిక లేకపోతే ఏక పడవలోనో వెళ్ళటం తప్పుతుందనీ, కానీ దీని గురించి ఎవరూ పట్టించు కోవడం లేదనీ అనుకుంటూ ఉండేవాళ్ళం ! చిన్నప్పటి నుండీ పెనుమూడి-పులిగడ్డ వంతెన మాకు ఓ సుందర స్వప్నం !

నాలుగు సంవత్సరాల క్రితం నేను వరంగల్లో పనిచేసేటప్పుడు బుద్ధప్రసాద్‌గారు పెను మూడి పులిగడ్డ వంతెన కోసం 'ఉద్యమం నిర్వహించి, అవసరమైతే శాసనసభ్యునిగా రాజీ నామా చేస్తానని ప్రకటించటం పేపర్లో చూసి ఒకరకమైన ఉద్వేగానికి లోనయ్యాను !

కేవలం ఒక అద్భుతస్వప్నాన్ని నిజం చేయటానికే కాకుండా వందల గ్రామాల ప్రజల జీవన గమనానికి ప్రగతిబాటను చూపించే వంతెన కోసం ఒంరాజకీయవేత్త అలా తపించడం ఒక అసాధారణ విషయమని నాకనిపించింది.

వరంగల్లో ఉన్నంతకాలం అంతటి స్వాప్నికుడు, సాహసికుడు అయిన మహనీయుని చూచి, నిర్మాణమయిన తరువాత ఆ వంతెన మీద ఒక్కసారి ప్రయాణం చేయాలనే కోరిక బలీయంగా ఉండేది. అదృష్టవశాత్తూ నేను ఆకాశవాణి విజయవాడ కేంద్రానికి డైరెక్టర్‌గా రావడం, రెండు సభల ద్వారా వారితో పరిచయం కలగటం యాదృచ్ఛికంగా జరిగింది.

2006 సంవత్సరం సెప్టెంబర్‌లో అనుకుంటాను బుద్ధప్రసాద్‌గారు ఒకసారి స్టూడియోకి వచ్చి ఆమాటా ఈమాటా మాట్లాడుతూ నవంబరు 19వ తేదీకి దివిసీమకు ఉప్పెన వచ్చి 29 సంవత్సరాలు నిండి, 30వ సంవత్సరంలోనికి అడుగిడుతున్నామనీ, ఆ విషాదకర దుర్ఘటన సందర్భంగా అవనిగడ్డలో ఏదైనా కార్యక్రమం చేయకూడదా అని అన్నారు.

రేడియో ప్రత్యేక ప్రచారోద్యమంలో భాగంగా అవనిగడ్డలో ఒక చక్కని రేడియో ప్రచార సభను నిర్వహించినట్లు ఉంటుందనే ఆలోచనతోనూ, పులిగడ్డ-పెనుమూడి వంతెనను చూసినట్లుంటుందనే ఆనందం తోనూ తప్పక రేడియో ప్రచార సభను నవంబరు 19వ తేదీన అవనిగడ్డలో నిర్వహిస్తానని వారికి చెప్పి ఏర్పాటు చేశాను.

రేడియో ప్రచారసభ రోజున నేనూ, సభలో పాల్గొనటానికి విజయవాడ నుండి వెళ్ళిన వాళ్ళందరం అవనిగడ్డ వెళ్ళే ముందు కొత్తగా తయారయిన వంతెన మీద పులిగడ్డనుండీ పెనుమూడి వరకూ వెళ్ళి, మళ్ళీ పులిగడ్డకు తిరిగి వచ్చి, అవగడ్డకు వెళ్ళి రేడియో ప్రచార సభను విజయవంతంగా నిర్వహించాం !

రేడియో ప్రచారసభ పూర్తి అయిన తరు వాత, ట్రావెలర్స్ బంగాళాలో బుద్ధ ప్రసాద్ గారు మా అందరితో ఆప్యాయంగా మాట్లా డుతూ ఆత్మీయతతో ఆతిథ్యమివ్వటం జీవి తంలో మరచిపోలేని ఒక చక్కని సందర్భం !

2006 అక్టోబరులో కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో విజయవాడలో జరిగిన జాతీయ, తెలుగు మహాసభల సందర్భంగా రికార్డింగుకి వచ్చినప్పుడు జాతీయ తెలుగు సభలలోని ప్రసంగాలను రికార్డు చేసి ప్రసారం చేయకూడదా అని చాలా సన్నగా, చిన్నగా కోరారు.

రేడియోని పాపులరైజ్ చేయటానికి నేను తీవ్రంగా ఆలోచిస్తున్న రోజులవి !

పెద్దలు కోరారు కాబట్టి వెంటనే రికార్డింగు ఏర్పాటుచేసి జాతీయ సభలకు వచ్చిన ప్రముఖుల ప్రసంగాలను వారానికి రెండు చొప్పున మూడు నెలలపాటు ప్రసారం చేశాను. అసంఖ్యాక సాహితీ పిపాసులు రేడియోలో ప్రసారమయిన ఈ ప్రసంగాల రికార్డింగులను విని ఆనందించారు.

బుద్ధప్రసాద్‌గారు 2007 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో శ్రీకాకుళంలో శ్రీకృష్ణదేవ రాయల ఉత్సవాలను నిర్వహించారు.

అప్పుడు నా కాలికి దెబ్బ తగలటం వలన కట్టుకట్టుకొని ఇంటివద్ద విశ్రాంతి తీసుకుం టున్నాను. బెడ్‌మీదే ఉండి రేడియోలో సభల గురించి మాట్లాడటానికి వారిని ఆహ్వా నించాను.

రికార్డింగ్ నిమిత్తం రేడియోస్టేషన్‌కు వచ్చి నన్ను పరామర్శించటానికి మూడుసార్లు మా ఇంటికి వచ్చి వెళ్ళారు.

ఒక సీనియర్ శాసనసభ్యుడు, రాజకీయ వేత్త మూడుసార్లు మా ఇంటికి రావటంతో నా గుండె ఆర్ద్రతతో నిండిపోయింది.

బుద్ధప్రసాద్‌గారు సునిశితమై మేధావి ! స్వాప్నికుడు ! సాహసికుడు ! ఉత్తమ విలు వలను కాపాడుతూ రాజకీయ ప్రస్థానం సాగిస్తున్న గొప్ప రాజనీతిజ్ఞుడు.

వారిని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పశుసంవర్ధక, పాడి పరిశ్రామాభివృద్ధి, మత్స్యశాఖల అమాత్య పదవి వరించడం మనం అందరం గర్వించదగ్గ విషయం.

వారి రాజకీయ ప్రస్థానం అప్రతిహతంగా సాగాలని హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తు న్నాను.

భవిష్యత్తులో అత్యున్నత పదవికి అభ్యర్థికొరకు ఎంపిక జరిగితే ఉత్తమ విలువలను కాపాడుతూ రాజకీయ ప్రస్థానం సాగిస్తూ అన్ని అర్హతలుగల పరమోన్నత వ్యక్తిగా మండలి బుద్ధప్రసాద్ గారి పేరే మొట్టమొదటి దవుతుందని నా ప్రగాఢ విశ్వాసం !

వారు భారతరత్నమవాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షి స్తున్నాను.

○

# అందరి హృదయాలలో ..... బుద్ధప్రసాద్

- డా. వేదాంతం రాజగోపాలచక్రవర్తి

ప్రజాచైతన్యానికి ప్రతీక ! దివిసీమకు దీపిక !
పేదలకు ప్రభుత్వ పథకాలను అందించ టంలో మేటి !
స్నేహానికి వెన్నెల రూపం ! సాహిత్యానికి చందన చర్చ !
తెలుగుభాషాభిమానం ! సాంస్కృతిక ప్రియత్వం !
రాష్ట్రమంత్రిగా గురుతర బాధ్యతలు !!
మానవతా వాదానికి మల్లెపూల వాసన !
కులంకన్నా కలం మిన్న ! మతం కన్నా సమ్మతం మిన్న !

ఇవన్నీ కలబోసుకొంటే బుద్ధ ప్రసాద్‌గారి షోడశకళాపూర్ణమైన వ్యక్తిత్వం సాక్షాత్కరిస్తుంది. నిండు హృదయంతో ప్రజాసేవకు అంకితమైన ప్రజా ప్రతినిధి, హృదయం ఆవిష్కారమవుతుంది. నిరంతర చైతన్యంతో గంగా ప్రవాహంవలె సాగే జీవితం కనుల ముందు కదలాడుతుంది. బుద్ధప్రసాద్ ఒక దార్శనికుడు - ఒక స్వాప్నికుడు. నిరంతర బాటసారి ! ప్రజా ఉద్యమ సారథి

విస్తృతమైన ప్రజా సంబంధాలు, మేధావులు - సాహితీవేత్తలు - కళాకారులతో ఆత్మీయమైన పరిచయాలు కలిగిన బుద్ధ ప్రసాద్‌గారికి మంత్రి పదవి రావటం అందరికీ ఆనందాన్ని కలిగించింది. ఇదే సమయంలో చాలా మందికి భయం ఏర్పడింది. బుద్ధ ప్రసాద్ గారు మనకు దూరమవుతారు !? అని ప్రోటోకాల్, సెక్యూరిటీ, అధికారిక కార్య క్రమాలు, రకరకాల ఒత్తిడులు, ఇంతకు ముందులాగా బుద్ధ ప్రసాద్‌గారు మనకు అంది వస్తారా? ఆప్యాయమైన పలకరింపులు, కార్యక్రమాలు ఉంటాయా అని, ఈ అనుమానాలన్నీ పటాపంచలు చేస్తూ ద్విగుణీకృతోత్సాహంతో మరింతగా అందరికీ దగ్గిరవుతున్న వివిధ కార్యక్రమాలలో పాల్గొంటున్న బుద్ధప్రసాద్ గారిని చూచి సంతోషిస్తున్నారు ఇటు ప్రజలు - అటు సాహితీ ప్రియులు. సంస్కార సౌగంధ్యము, పీయూష హృదయము, సేవా దృక్పథము, తొలకరి చినుకులు వంటి పలుకులతో

వివేక సౌజన్య గంభీర వ్యక్తిత్వంతో వర్తిల్లే బుద్ధ ప్రసాద్‌గారి వంటి రాజకీయవేత్త ఈ తరంలో మనమధ్య ఉండటం ఒక విశేషం. ఒక చిత్రమైన అంశమేమంటే సాహితీవేత్తలు కూడా రాజకీయాలు నడుపుతున్న ఈ రోజుల్లో రాజకీయాలలో ఉంటూ సాహిత్యాన్ని ప్రేమించి గౌరవించే అరుదైన విలక్షణమైన వ్యక్తి - బుద్ధ ప్రసాద్‌గారు.

బుద్ధ ప్రసాద్‌గారితో కలసి నడవటం కష్టం. ఆయన ఆలోచనలు అర్థం చేసుకోవటం ఇంకా కష్టం. వారి భావాలు - కార్యక్రమల విధానం స్పష్టంగా అర్థమవుతున్నప్పటికీ చివరగా "ట్విస్ట్" చేసే అనన్య సామాన్యమైన నేర్పు బుద్ధప్రసాద్‌గారిలో ఎప్పటి కప్పుడు నవ నవోన్మేషంగా కనిపిస్తుంది. సంకల్పసిద్ధికోసం అహరహం తపించే వ్యక్తిత్వం, ఎంత శ్రమనైనా ఓర్చుకొనే మానసిక స్థైర్యం బుద్ధ ప్రసాద్‌గారి సొత్తు. ఏదైనా ఒక కార్యక్రమం నావంటి వారికి చెప్పినపుడు దాని స్వరూం వేరు. చివరకు అది జరిగేతీరు అపరిమితంగా, అమేయంగా నిలుస్తుంది. సందర్భానుసారంగా కార్యక్ర మాన్ని రక్తి కట్టించటం బుద్ధప్రసాద్‌గారికే చెల్లు తుంది. ముచ్చటగా ఆత్మీయంగా అర్థవంతంగా ప్రజోపయోగంగా కార్యక్రమానికి శ్రీకారం చుట్టడం, ముగించడం ఒక ఆర్ట్. ఇందులో సిద్ధహస్తులు ఆత్మీయులైన బుద్ధప్రసాద్‌గారు. ఎన్నెన్నో అద్భుతమైన ఉత్సవాలు, సభలు నిర్వహించి అందరిచేత 'శభాష్' అనిపించు కున్న బుద్ధప్రసాద్‌గారు, ఏది చేసినా దానికి ఒక నిర్దుష్టమైన ప్రయోజనం ఉంటుంది. నాకు తెలిసి 1998వ సంవత్సరంలో దివిసీమ సాంస్కృతిక వైభవ సదస్సు నుంచి 2007 ఫిబ్రవరిలో జరిగిన శ్రీకృష్ణదేవరాయ వైభవ సదస్సు దాకా జరిగిన సభలు, కార్యక్రమాలు పరిశీలిస్తే బుద్ధ ప్రసాద్‌గారి ప్రణాళికల విశ్వ రూపం మనకు తెలియవస్తుంది. బుద్ధ ప్రసాద్ గారి స్ఫూర్తి ఈనాడు ఎందరెందరికో ఆదర్శ ప్రాయం. ఆధునిక కాలంలో తెలుగు సంస్కృతీ పునరుజ్జీవన ఉద్యమంలో జాతి నిర్మాతగా ఆయన ఎదుగుతున్న తీరు పోరాటపటిమ మనం గమనించతగిన అంశం.

వర్ధమాన కవులను, కళాకారులను పరి శోధకులను, సంఘ సేవా పరాయణులను, పార్టీ కార్యకర్తలను ప్రోత్సహించడంలో బుద్ధ ప్రసాద్‌గారి శైలి, వైఖరి చాలా మార్మికంగా ఉంటుంది. ఆ ఆంతర్యం గ్రహిస్తే ఆ వ్యక్తి అభివృద్ధిలోకి వచ్చినట్లే !! ఇది తెలుసుకోలేక చాలా మంది గందరగోళంలో పడుతారు. విస్పష్టంగా సరళంగా సులభంగా ఏదైనా విషయం చెప్పినప్పుడు అందులో ఒక ఆదేశం - విజ్ఞప్తి సమ్మిళితం చేయడం బుద్ధ ప్రసాద్‌గారి వాక్చాతుర్యంలో ఒక అంశం. బుద్ధ ప్రసాద్‌గారి చొరవతో ఎన్నెన్నో గ్రంథాలు వెలుగులోకి వస్తున్నాయి. 2002 దివి మహోత్సవాల సందర్భంగా బుద్ధ ప్రసాద్‌గారి అవిశ్రాంత కృషి వలన 'దివి రత్నాలు' అనే అద్భుత గ్రంథం వెలుగులోకి వచ్చింది. అప్పుడే నాతో 'దివిసీమ ఆలయదర్శిని' అనే పుస్తకాన్ని రచింపచేశారు. ఎన్ని సంచికలో, గ్రంథాలో బుద్ధ ప్రసాద్‌గారి ఆలోచనా మందిరంలో పురుళ్ళు

పోసుకొన్నాయి. కనుకనే ఈనాడు మనం అన్ని రంగాలలో లబ్ధ ప్రతిష్టులైన పాత తరాలవారిని స్మరించుకొంటున్నాం !! ప్రామాణికాంశాలను చదువుకొంటున్నాం.

కాంగ్రెస్ పార్టీ రాజకీయాలలో బుద్ధ ప్రసాద్ గారిది విలక్షణమైన ముద్ర. రాజకీయ జల ప్రవంతిని ప్రజా హృదయ కేదారాలపై ప్రవహింపచేసి అమృత ఫలాలను పండింప చేసే నిత్యకృషీవలుని ప్రవృత్తి ఆయలో మనం చూస్తాం !! ప్రజా పథాన్ని వీడకుండా సుమ నోరథాన్ని గమనిస్తూ ప్రగతి పథంవైపు వారిని నడిపించే నిజమైన ప్రజా ప్రతినిధి బుద్ధప్రసాద్‌గారు. అవనిగడ్డ నియోజకవర్గ సర్వతోముఖాభివృద్ధికి అంకితమైన ఆయన పరిశ్రమ ఇప్పుడు రాష్ట్రమంతటికీ వర్తిస్తుంది. రాష్ట్ర పశుసంవర్ధక, పాడి, మత్స్యపరిశ్రమ శాఖల మంత్రివర్యునిగా ఆయన బాధ్యత మరింత విస్తృతమైనది. ఇది రాష్ట్రానికి శుభ పరిణామం. పీడితబాధిత శ్రామిక కర్షక కార్మిక సన్నకారు రైతు వర్గాల వారికి ఇది ఉషోదయం. మంత్రి పదవి రావటంవెనుక నిరంతర నిర్విరామ, ప్రజాసేవ ఉందనే విషయం మనకందరికి తెలిసిందే !! ఉదాత్త రాజకీయాలంటే ఆయనకిష్టం. మహాత్మాగాంధీ సిద్ధాంతాల పునాదులమీద బుద్ధ ప్రసాద్ ఉద్యమాల పోరాటం సాగింది. మహనీయులైన కాంగ్రెస్‌నేతల నైతికబలం. బుద్ధప్రసాద్‌గారికి స్ఫూర్తి ! ఊపిరి ! ఎంతటి సుదీర్ఘ ప్రస్థానం అయినా ప్రారంభమయ్యేది తొలి అడుగుతోనే అనే విశ్వాసం ఆయనది !! -

రాష్ట్ర, జాతీయ స్థాయిలో సీనియర్ కాంగ్రెస్ నాయకులకు బుద్ధప్రసాద్ ప్రీతి పాత్రులు. బుద్ధ ప్రసాద్‌గారిని చూడగానే వారు సంతసించే తీరు చూడముచ్చటగా ఉంటుంది. సంభాషణలోకి దిగగానే వాళ్ళంతా నోటితోకాక మనసుతో మాట్లాడతారు. సమ వయస్కులైన నాయకులు బుద్ధ ప్రసాద్‌గారితో స్నేహంగా తిరుగుతూ ఉంటారు. జూనియర్ నాయకులకు బుద్ధ ప్రసాద్‌గారు ఒక విశిష్ట వ్యక్తిగా కనిపించడంలో ఆశ్చర్యం ఏమీలేదు.

ఇక సమన్వయ రాజకీయాలు నడపటంలో బుద్ధ ప్రసాద్‌గారికి అందెవేసిన చేయి. ఎదుటవారి బలాబలాలను చక్కగా గ్రహించే నేర్పు, ఎక్కడి విషయాలు అక్కడికే పరిమితం చేయగల సంయమనశక్తి ఆయనకు పుట్టుకతో వచ్చిన లక్షణం. గుణగ్రహణపారీణుడు కూడా ! ఎక్కడ ఒదిగి ఉండాలో, ఎక్కడ ఉవ్వెత్తున ఎగిసి విజృంభించాలో ఆయనకు తెలుసు. వ్యక్తిగత దూషణలకు, చౌకబారు రాజకీయాలకు ఆమడ దూరంలో ఉంటారు. ఏదైనా ఒక అంశంమీద వివాదం వచ్చినప్పుడు, అంతర్గతంగా తన భావాన్ని వెంటనే వ్యక్తం చేయకుండా నిగూఢంగా ఉంచుతూ, ఇతరులు చెప్పే అభిప్రాయా లని రెండు కోణాలను సానంగా అర్థం చేసుకొని ప్రవర్తించడం అనే ఉదాత్త గంభీర రాజకీయం బుద్ధప్రసాద్‌గారికి వెన్నతో పెట్టిన విద్య. ఇంకొంత మంది రాజకీయ నాయకులవలె అంత సులువుగా అవతలివారికి లొంగిపోయే తత్త్వం కాదు. ఏదైనా అలా పరిశీలనకు వస్తే దానిని సమగ్రంగా అవగాహన చేసుకొంటారు.

ఇక దానిమీద బుద్ధ ప్రసాద్‌గారి ముద్ర స్పష్టంగా మనకు తెలిసిపోతుంది. చాలా మంది అడుగుతుంటారు బుద్ధ ప్రసాద్‌గారికి కోపం రాదా? అని, నేను చెపుతుంటా ! ఆయనకోపం చూడాలని ఉందా అని, ఎందుకంటే ఆయన కోపాన్ని సజ్జనులు చూడాలని కోరుకోరు. ఆయన వ్యక్తం చేయరు. ఇక మిగతావారికి తెలుసు. ఆయనకు కోపం ఎటువంటిదో? అది సాత్త్విక రూపం ! ఒక్కొక్కసారి క్రియాశీలకం !! ఏదైనా చేయిదాటే పరిస్థితి వస్తే, తన హృదయాన్ని అర్థం చేసుకోలేకపోతే తొలుత ఆ కోపం మాటల్లో వ్యక్తమౌతుంది. మరీ తీవ్రమైతే ఆ వ్యక్తులను దూరంగా పెడతారు. ఇక ఆ తరువాత ఆ వ్యక్తులు ఆయనకు తామర తూడులోని దారంతో సమానం. ఎవ్వరినీ లెక్కచేయరు - ఇదే సమయంలో ఆయన కోపభావన బాలభానుని లేత కిరణాలవలె చురుక్కుమంటుంది. చల్లని మంచువలె కరిగి పోతుంది. భరించలేని సంపెంగ పూవుల వాసనవలె ఉంటుంది. ఆయనలో స్పష్టంగా అందరూ గమనించేది నవ్వు. రాజకీయాలలో మనసారానవ్వే వ్యక్తులలో బుద్ధప్రసాద్‌గారు ఒకరు. నిష్కల్మషంగా, నిర్మలంగా పసిపాపలవలె హాయిగా నవ్వుతారు.

చివరగా కొన్ని వాక్యాలలో. దేశ విదేశాలలో పర్యటనలు చేసినా బుద్ధ ప్రసాద్‌గారి మనస్సు మాత్రం తెలుగు గడ్డమీద ఉంటుంది. ఎన్ని సంస్కృతులు చూసినా, తెలుగు సంస్కృతిమీదనే వన్నె తగ్గని మమకారం ! తెలుగు భాషా సంస్కృతుల గుర్తింపు కోసం వ్యాప్తి కోసం నిరంతరం తపించే తపస్వి ఆయన. ఈనాటి తెలుగు సాహితీ భాషా సంస్కృతుల పునరుజ్జీవనానికి బుద్ధ ప్రసాద్‌గారి వంటి సముదాత్త వ్యక్తి ఒక చారిత్రక అవసరంగా మనం గుర్తించాలి. బుద్ధప్రసాద్ గారిని అందరూ అభిమానిస్తున్నారంటే అది ఆయనకు ఉన్న ఉత్తమ సంస్కార సుగంధం. అది అందరినీ కట్టివేసే ఆత్మీయ బంధం. రాజకీ యాలు - ప్రజాసేవ బుద్ధ ప్రసాద్‌గారికి రెండు కళ్ళు. తెలుగు సంస్కృతి ఆయనకు ప్రాణం. అక్షరాలను ఆరాధించే అర్చకుడు ! మానవతను ప్రేమించే సహృదయశేఖరుడు ! రాజకీయ పంకంలో వికసించిన సహస్రదళ పద్మం !! అన్నింటికీ మించి అచ్చమైన తెలుగుతనానికి నిలువెత్తు రూపం ! ఆ శుభకర కుంద దరహాస వదనారవింద స్నేహస్నిగ్ధ సేవాసాహితీ మూర్తికి అక్షరాభినందన మధుమందారాలు, శుభాభివందనాలు !!

○

# శుభకామనలు

- శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్

క॥ శ్రీ మండలి వంశాంబుధి
సోమా! బుద్ధ ప్రసాద! శుభమగు మీకున్
ధీమంతా! యువనేతా!
ఆ మాధవుడిచ్చు నాయురారోగ్యంబుల్

క॥ జయజయజయ విజయీభవ!
జయజయశ్రీ బుద్ధ వర్య! జయ గంభీరా!
జయజయ సద్గుణ మండలి
జయజయ శ్రీమంత్రివర్య! జయమగు నెపుడున్.

చ॥ కలియుగ దైవమే ప్రజల కామ్యములెల్లను తీర్చనెంచి తా
చెలిమి ప్రజాహితం బొనర జేయు సమర్థుడ వీవెయంచు, మా
కలిమిని మంత్రిగా నిలిపెఁ గావున పేదల జీవితాలలో
వెలుగులు నింపు మింక "దివి పెన్నిధి" వోచు నమాత్య శేఖరా!

సీ॥ చిన్నతనము నుండి శీల సంపదలను
జీర్ణించుకొన్న సచ్ఛీలు డితడు
గాంధీయ సిద్ధాంత గరిమను వదలక
ఆచరించుచునున్న అనఘుడితడు
పలు సంస్థలకు తాను బాధ్యత వహియించి
పలు సేవలందించు ప్రాజ్ఞు డితడు

కడు చిన్న వయసున "కాంగ్రెస్సు" పార్టీకి
ఘనత చేకూర్చిన ఘనుడితండు
కార్యకర్తల కెల్ల క్రమశిక్షణను నేర్పి
శాంతిని స్థాపించు శాంతుడితడు
లలిత కళలనెల్ల లాలించి ప్రేమించి
పోషించు మా "దివిభోజు" డితడు

తే॥ కార్య కుశలుడు, మితభాషి, కర్మయోగి
"విజయలక్ష్మి"ని గైకొన్న విజయుడితడు
దివ్య దివిసీమ తనయుండు ధీరవరుడు
బుధులు మెచ్చిన విజ్ఞుండు 'బుద్ధ' డితడు.

సీ॥ మంత్రివర్యా! మీకు మంగళం బగుగాక !
దివిసీమ కోర్కెలన్ తీర్చుగాక!
పశుతత్వమును దృంచి, పశు సంపదను పెంచు
పరిపాలనము జేసి వరలుగాక!
తండ్రి కోర్కెలు తీర్చు తనయుడవై నీవు
బడుగు జీవుల బాగుపరచుగాక !
తెలుగువారల కీర్తి తెలుగు భాషాదీప్తి
జగతికెల్లను మీరు చాటుగాక !

తే॥ వలచి వచ్చిన పదవికి వన్నెదెచ్చి
నిండు నూరేళ్ళు సుఖముగ నుండు గాక !
ఆది అవతారమైనట్టి ఆది విష్ణు
ఆయురారోగ్యముల నిచ్చి ఆదుకొనగ.

○

# జీవ 'మండలి'

- శ్రీ తాతా రమేశ్ బాబు

అవనిగడ్డ, మొవ్వ, కూచిపూడి గ్రామాలలో నా బాల్యం పెనవేసుకొనడానికి కారణం మా తండ్రిగారు ఈ గ్రామాలలో పాఠశాలల తనిఖీ అధికారిగా ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించడమే. ఆ మైదానాలలో ఆడుకోవడం, ఆ చెరువులలో స్నానం చెయ్యడం, కోతికొమ్మచ్చి ఆటలు, గోళీకాయలు, కబడ్డీలతో ఎంతో ఆనందంగా బాల్యాన్ని గడిపిన రోజులవి. స్నేహితులతో కలసి పౌరాణిక పాత్రల్ని అనుకరిస్తూ తోచిన డైలాగులు చెప్పుకోవడం, బొగ్గుతో చిత్రాలు గీయడం, అవనిగడ్డ కరకట్ట దాటివెళ్ళి మామిడి తోటల్లో అందిన కాయలు బొక్కడం ... కాపలాదారు కేకలేస్తే తూనీగల్లా పరుగులు తీయడం ... ఓహ్ ....

బాల్యం ఎంత అందమైనది .......
బాల్యం ఎంత అపురూపమైనది .......!!

ఏ సందర్భంలోనైనా ఇప్పుడు మొవ్వ, కూచిపూడి, అవనిగడ్డలకు వెళ్ళితే, అక్కడ ఉన్నంతసేపూ అమ్మఒడిలో ఉన్నంత అనుభూతి.

నేను ముప్పై ఎనిమిదేళ్ళక్రితం అవనిగడ్డలో 6వ తరగతి చదువుకునే రోజుల్లో మండలి వెంకట కృష్ణారావుగారితో మా నాన్నగార్కి పరిచయం ఉండేది. కాలేజీ, హైస్కూలు ఒకే ఆవరణలో ఉండడం వల్ల మండలి వెంకట కృష్ణారావుగారు ఒకసారి కాలేజీ గ్రౌండ్‌లో చూచి "ఏరా బాగా చదువుతున్నావా? మీ నాన్న ఇంటి దగ్గరే ఉన్నారా?" అని ప్రశ్నించడం, ఔనన్నట్టు తలూపి తుర్రుమనడం గుర్తుంది. కాలేజీకి కూతవేటు దూరంలో ఉన్న మండలి గారింట్లో రెండు జింకపిల్లలు ఉండేవి. ఆ జింక పిల్లల్ని చూడటానికి తరచుగా వారింటికి వెళ్ళేవాడిని. ఆ జింకలను చూడడం, తడమడం నాకు ఎంతో ఆనందాన్ని కల్గించేవి. నన్ను ఏమనేవారు కాదు. వారింటి దగ్గర ఆ రోజుల్లో 'మండలి బుద్ధప్రసాద్' నాకు పరిచయం. నేను బాగా చిన్న

పిల్లవాడ్ని అవటం వల్ల ఆయన నుంచి ఓ నవ్వు, ఓ చూపు మాత్రమే పలక రించేవి. ఆ ఇంటి మహత్యమో, ఆ గ్రామాలలో పెరగడం వల్లనో కళా, సాహితీ రంగాలపట్ల నేను తెలియకుండానే ఆకర్షితుడనయ్యాను.

కొన్ని సంవత్సరాల అనంతరం బుద్ధ ప్రసాద్ రచయితగా, ఉత్తమ సంపాదకుడిగా, సాహితీ సభలద్వారా సమాజాన్ని జాగృత పరచడం మీదు మిక్కిలి ఉత్తమ రాజకీయ నాయకుడిగా ఎదగటం జరిగిపోయాయి.

రాజకీయాలలో ఒక పార్టీ ప్రతినిధిగా పని చేసేటప్పుడు కొన్ని విధులు, విధానాలు ఉంటాయి. ఆ విధిలోకూడా స్వతంత్ర్య భావా లతో ఉండే నాయకులను వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. అందులో మొదటి స్థానంలో మండలి ఉంటారు.

ఒక రాజకీయ నాయకుడిగా ప్రజలచేత ఎన్నుకోబడినపుడు నాకు నచ్చింది, నాకు తోచింది అనుకోకుండా ప్రజలుమెచ్చింది, ఉపయోగపడేది మాత్రమే చేసేవాడు నిజమైన ప్రజా నాయకుడిలా నిలబడతాడు. ఉత్తమ నాయకుడిగా ప్రజలచేత మెచ్చుకోబడతాడు. ఈ కోవకి చెందిన నాయకుడు బుద్ధప్రసాద్. చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలపట్ల అవగాహన, గౌరవం ఉండట మనేది రాజకీయ నాయకుని లక్షణం. ఆ లక్షణాన్ని పుణికిపుచ్చుకొని వెలుగొందే బుద్ధప్రసాద్ అంటే ఎవరికి ఇష్టం ఉండదు? సహనం, సంయమనం ఆయన వ్యక్తిత్వంలోని ప్రధాన లక్షణాలు. సమున్నత ఆశయాలు, లక్ష్యాలు, నైతిక విలువలకు అంకితమై ఆదర్శప్రాయుడిగా నిలిచారు ఆయన.

కళా సాహిత్య రంగాలను సుసంపన్నం చేసేదిశగా, ఇటీవల కాలంలో ఆయన ప్రసంగాలు నన్ను ఉత్తేజితుడ్ని చేశాయి. తెలుగు సమాజాన్ని భాషాసాహిత్యాల విశ్వవేదిక మీద గౌరవ మర్యాదలతో ప్రతిఫలింపచేయడానికి కృషిచేద్దామనే ఆయన ఆకాంక్షగొప్పది.

2007 సంవత్సరం ఫిబ్రవరి 11వ తేదీన శ్రీకాకుళంలోని ఆముక్తమాల్యద మండపంలో శ్రీకృష్ణదేవరాయల విగ్రహావిష్కరణ సభలో ఆర్థిక శాఖా మంత్రి శ్రీ కొణిజేటి రోశయ్య ఉపన్యసిస్తూ "ఎమ్మెల్యేలందరూ వారి వారి రాజకీయాల గురించి ఆలోచిస్తుంటే, ఒక్క మండలి బుద్ధప్రసాద్ మాత్రమే మనచరిత్ర, సంస్కృతి, భాషల గురించి ఆలోచిస్తున్నాడు" అనటంనాకు ఎంతో సంతోషాన్నిచ్చింది. అదే వేదికపై రాష్ట్ర హిందీ అకాడమీ అధ్యక్షులు, మాజీ పార్లమెంట్ సభ్యులు శ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ప్రసంగిస్తూ, "మండలి బుద్ధప్రసాద్ నిరంతరం తెలుగుజాతి, భాష, సంస్కృతి, చరిత్ర అంటూ కార్యక్రమాలు నిర్వహిస్తూ మమ్మల్నందరినీ ఇలా ఈ మారుమూల పల్లెకు రప్పిస్తున్నాడు. ఈయనకు మంత్రి పదవిని ఇప్పిస్తే, ఆ పదవీ సంబంధమైన పనులతో కొట్టుమిట్టాడుతూ ఇహ ఇలాంటి కార్యక్రమాలు చేయటానికితీరిక దొరక్కుండా పోతుందేమో" అంటూ చమత్కరించారు.

ఇప్పుడు మంత్రి పదవి మండలిని వరించింది. అయినా ఆయన నేతృత్వంలో ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించ తలపెట్టారు.

మహాసభల్లో డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారు "ఎన్ని పదవులు చేపట్టినా తెలుగు భాష, జాతి, సంస్కృతులకు మండలి సేవ చేస్తూనే ఉంటారని అన్నాడు. విశ్వనాథ వారన్నట్లు "ఆయన జీవలక్షణం అది" అంటారని ఎదురు చూస్తున్నాను.

# అభినందనలు

- శ్రీ లంక వెంకట చలపతి

అభినందనలు నీకు
బుద్ధ ప్రసాదు !
అందుకో జేజేలు
బుద్ధ ప్రసాదు !!

నీ శక్తి, నీ యుక్తి
దేశసేవకు నిమ్ము
నీ తెలివితేటలను
దివిసీమ ప్రజకిమ్ము

శాంతి, అహింసలు
నీ రెండునేత్రములు
సత్యమ్ము, ధర్మమ్ము
నీ ఆయుధములయ్యె

గాంధీజీ, బుద్ధుండు
నీకు ఆదర్శంబు
ఛత్రపతి రాణాల
శౌర్యంబు నిల్పుమయ !

నీ పరిపాలనలో
ప్రజలు సుఖపడవలెను
కలకాలమును నీవు
భువినేల వలెనయ్య.

# "నా - సాహితీ సమరాంగణ సార్వభౌముడు"

- శ్రీ దామోదర గణపతిరావు

కళాకారుడు పెద్దల పరిచయం కావాలనుకుంటాడు. అలా అని అన్నింటిలోనూ ఆహ్వానం లేకుండా దూరడు అనేది నా అభిప్రాయం. నేను సాహితీ, కళాప్రియుణ్ణి. మండలి బుద్ధ ప్రసాద్ పరిచయం కలగాలని ఆలోచన నాకు ప్రబలంగా ఉండేది. 1999 ఫిబ్రవరి నెలలో దివిసీమ, పెదకళ్ళేపల్లిలో "పుంభావ సరస్వతి' శ్రీ వేటూరి సుందర రామ మూర్తి ఆధ్వర్యంలో శ్రీ మండలి బుద్ధప్రసాద్ నేతృత్వంలో 'సాహితీ సంగీత వసం తోత్సవ ములు'మూడు రోజులపాటు జరుగనున్నా యని ఆ కార్యక్రమానికి సేవా తత్పరులు కావాలని, నిన్ను వారిరువురకు పరిచయం చేస్తానని నా మిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి వారిని పరిచయం చేసాడు. వారికి కావలసిన విధంగా శ్రమించి వారి మన్ననలు పొందాను. నాటినుండి నేను శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ వీరాభిమానిని.

కొందరు డాంబికులు నాకు చాలామంది పెద్దలు తెలుసు అని ప్రగల్భాలు పలుకు తుంటారు. ఆ మాటకి వస్తే నాకూ అబ్దుల్ కలాం తెలుసు. కాని నేనే ఆయనకు తెలియదు. అలాంటి వాటివలన ఉపయోగం లేదు. ఎవరైనా పెద్దల పరిచయానికి ఎదురు చూడాలి. అవకాశం వచ్చినపుడు ఆ పెద్దలకు నీలో ఉన్న ప్రత్యేకతలు వారు విసుగు చెందకుండా తెలియజేయాలి. ఈ లోకంలో ఒక మనిషిని పోలిన మనస్తత్వాలు వేలకొలది మనుషులకు ఉంటాయి. అటువంటి మనుషులే ఒకటిగామారి వివిధ సంఘాలుగా ఏర్పడతారు.

ఓ వ్యాసకర్తా! మీరు బుద్ధ ప్రసాద్ గారినీ "సాహితీ సమరాంగణ సార్వభౌముడు"గా కొనియాడుదురు కదా! అసలు విషయానికి రావటం లేదని? మీరు ప్రశ్నించడానికి సిద్ధంగా ఉన్నారు. అక్కడికే వస్తున్నాను. సాహిత్యం విషయానికి వస్తే అతను చదవని కావ్యంలేదు. నాకున్న పరిచయంలో అతను ప్రస్తావించని ఆధునిక, ప్రాచీన పుస్తకములు లేవు. అతను

అవకాశము దొరికి నప్పు డల్లా పుస్తకాన్నే చదువుతారు. అతను చదివినసారాన్ని ఎన్నో వ్యాసాలలో వ్యక్తీకరించి సాహితీ ప్రియుల మన్ననలు పొదారు.

సమరం గురించి మీకు చెప్పాలా? వ్యాసకర్తగా చెప్పక తప్పదు కదా! నాడు రాజులు యుద్ధాలుచేసి రాజరికం పొందేవారు. నేడు ప్రజాస్వామ్యంలో యుద్ధం చేయడానికి ప్రజల వద్దకే వెళ్ళ మంటున్నారు. అదే ఐదేళ్ళకు ఒకసారో అనుకోకుండా రెండు సార్లో వచ్చే ఎన్నికలు.

తండ్రి వారసత్వం పుణికిపుచ్చుకున్న నా బుద్ధ ప్రసాద్ ఎన్నో జయాపజయాలను చవిచూచాడు. ఇది కూడా సమరమే కదా! ఒకానొకవేళ నేను పొందిన ఉద్వేగము అంతా ఇంతా కాదు. ఎప్పుడంటారా? అదేనండి అసెంబ్లీ ఎన్నికల కౌంటింగ్ రోజు. నేను అతని ఫలితం కోసమే రేడియోదగ్గర అతుక్కు పోయాను. అప్పుడు నా సాహితీ మిత్రునకు మూడంకెల విజయం దక్కింది. ఇది సమరం కాదా!

ఇంతవరకు నేను చెప్పవలసిన విషయం చెప్పలేక పోయాను. నా బుద్ధప్రసాద్ కళాప్రియుడు, కవి, నాట్య ప్రియుడు.

సంస్కృతిని పరిరక్షించాలనే తపన కలవాడు. ఇంతెందుకు తనకున్న పరిధిలో ఈ జిల్లా, రాష్ట్రం, దేశం ఎప్పుడు సాంస్కృతిక ఆనందం పొందుతూ ఉండాలని కోరుకునే వారిలో మొదటివాడు మా బుద్ధప్రసాద్.

"కారే రాజుల్, రాజ్యముల్ గలగవే, గర్వోన్నతిన్ పొందరే వారేరీ సిరి మూట కట్టుకొని పోవంజాలిరే" అనే పోతన పద్యం నా హృదయంలో ఎప్పుడూ బుద్ధ ప్రసాద్ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ప్రతిధ్వనిస్తుంది. ఇలా చెపుతూ ఉంటే "చర్విత చర్వణం అవుతుంది". అన్నం ఉడికిందా సామెత మీరు గుర్తుచేసు కుంటే చాలు. ఇన్ని ప్రతిభా విశేషములు కలిగిన మన- బుద్ధ ప్రసాద్ సాహితీ సమరాం గణ సార్వభౌముడు అనటంలో అతిశయోక్తి లేదని మీరు నాతో ఏకీభవిస్తారని ఆశిస్తూ ..........




అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి సోనియాగాంధి గారితో....



పులిగడ్డ పెనుమూడి వంతెన నమూనాతో... ముఖ్యమంత్రిని సత్కరిస్తూ....




పులిచింతల ప్రాజెక్ట్ సంకుస్థాపన సందర్భంగా....

H.911



పులిగడ్డ పెనుమూడి వారధి ప్రారంభ సందర్భంగా....

116.7

46. J




అవనిగడ్డ మంచినీటి సరఫరా పథకం ప్రారంభిస్తూ... గవర్నర్ శ్రీ రామేశ్వర్ ఠాకూర్.



నాటి ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు గారితో...



నాటి ముఖ్యమంత్రి డా॥ ఎన్.టి. రామారావు గారి ఆశీస్సులతో....



శ్రీ జలగం
వెంగళరావు గారి
ఆశీస్సులు అందుకొంటూ...



శ్రీ కొణిజేటి
రోశయ్య గారి
ఆశీస్సులు...



శ్రీ పి. ఉపేంద్ర, శ్రీ చేగొండి
హరిరామ జోగయ్య గార్ల
ఆశీస్సులు...



నాటి గవర్నర్
శ్రీ రామ్‌లాల్ గారి
ఆశీస్సులు ...

116.0



శ్రీ కె. కేశవరావు గారి
ఆశీస్సులు...



శ్రీ టంగుటూరి
అంజయ్య గారి
ఆశీస్సులు....



మాతృమూర్తితో కుటుంబం అందరూ కలసి....

116.P



నాటి ప్రధాని
శ్రీమతి ఇందిరాగాంధీతో...



నాటి ముఖ్యమంత్రి
శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి
గారితో ....




దర్శకరత్న
శ్రీ దాసరి నారాయణరావు
గారితో యువనాయకుడు
శ్రీ బుద్ధప్రసాద్ ...



అతిథి సేవలో
రామకృష్ణ మిషన్
స్వామీజీలతో....



శ్రీ రాజీవ్ గాంధీ తో
యువ నాయకుడు శ్రీ బుద్ధప్రసాద్ ...



నాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్
శ్రీ సుశీల్ కుమార్ షిండే గారితో....

116·R



ఒకే మాట
ఒకే బాట....



మాన్యమంత్రివర్యులు
శ్రీ మజ్జి తులసీ దాస్
గారితో...



నాటి భారత ఉపరాష్ట్రపతి
శ్రీ బి.డి. జట్టి
గారితో...



జర్మనీలో మేయర్
శ్రీ గుజ్జుల రవీంద్ర
బృందంతో
ముఖ్యమంత్రి సమక్షంలో...

116·S



విజయోత్సవ
వేళ....



లోక్‌సభ స్పీకర్ శ్రీ సురేష్ రెడ్డి,
శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ
ప్రభృతులతో...



ప్రముఖ విద్యావేత్త
శ్రీ చుక్కా రామయ్య గారితో...



ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త
జస్టిస్ ఆర్ రామానుజం,
స్వాతి సంపాదకులు
శ్రీ వేమూరి బలరామ్ గార్లతో...



శ్రీ మండలి వెంకట కృష్ణారావు విగ్రహావిష్కరణ....



కృష్ణాడెల్టా పరిరక్షణ పోరాటంలో....



సాగరసంగమంలో
మాన్యమంత్రివర్యులు
శ్రీ పొన్నాల లక్ష్మయ్య
గారితో...



పదివేల క్యూసెక్కుల
సాగునీటి విడుదల
కోరుతూ నిరవధిక
నిరాహారదీక్షలో....



వరద ప్రాంతాలలో
పర్యటన.....




నీటి కోసం, నీతి కోసం
నిరాహార దీక్ష....

116-V




వరద బాధితులకు
బాసటగా .....

వరద కట్ట మీద
నిర్వాసితులతో...





వరద ముంపులో
ఒంటరి ప్రయాణం....

సునామీ బాధితులకు
పక్కా ఇళ్ళ నిర్మాణంలో
సహకరిస్తున్న
జర్మన్ బృందంతో....



116 W



కృష్ణామహోత్సవాలలో
శ్రీమతి యద్దనపూడి
సులోచనారాణి గారికి
సత్కారం....



డా॥ అక్కినేని నాగేశ్వరరావు
గారితో...



పద్మభూషణ్ చిరంజీవి
గారితో....



శ్రీ వేటూరి
సుందరరామమూర్తి
గారితో...

116 X



నాటి మారిషస్ గవర్నర్
శ్రీ వీరాస్వామి లింగడు
గారితో....



నాటి మారిషస్ విద్యామంత్రి
శ్రీ పరశురామ్ గారితో...



శ్రీ విశ్వయోగి విశ్వంజీ
డా॥ మిక్కిలినేని
రాధాకృష్ణమూర్తి గార్ల
ఆశీస్సులు ...



తండ్రి గారి
మార్గ దర్శకత్వంలో....

116.Y



క్రైస్తవ
మత ప్రచారకురాలు
జాయిస్ మేరి గారితో...



పద్మశ్రీ
అల్లు రామలింగయ్య
గారితో...



మారిషస్‌లో
శ్రీ ఆచంట వెంకటరత్నం
నాయుడు గారితో....



శ్రీ కృష్ణదేవరాయ వంశీకులు
రాజా అచ్యుతదేవరాయలు
రాణి చంద్రమతీ దేవి
గార్లతో...

116. I



శిలాశిల్పంతో
సరిగమలు పలికిస్తూ
హంపీ సందర్శనం...



థాయిలాండ్‌లో
బంగారు బుద్ధవిగ్రహం
సన్నిధిలో....



వాటికన్ సిటీ
సందర్శనం ....



తాజ్‌మహల్ ఎదురుగా
సకుటుంబంగా....

116:II




కృష్ణాజిల్లా రచయితల
సంఘం ఆధ్వర్యంలో
జాతీయ తెలుగు
రచయితల మహాసభలు...




విజయవాడ తెలుగు భాషా
సదస్సులో డా॥ ఆవుల మంజులత,
పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు,
శ్రీ కె. రామచంద్రమూర్తి
గార్లతో...




ఉయ్యూరు తెలుగు భాషా
సదస్సులో
ముఖ్యఅతిథిగా....




తెలుగు పసిడి డాట్ కామ్
ప్రారంభిస్తూ....
డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్
గారితో...

116-III



శ్రీకాకుళం
శ్రీకృష్ణదేవరాయ
మహోత్సవాలు....
అధ్యక్షోపన్యాసం.



జానపద కళాకారులతో
కలిసి శ్రీ బుద్ధప్రసాద్,
శ్రీ కవితా ప్రసాద్
ద్వయం.



శ్రీకాకుళ ఆంధ్ర
మహా విష్ణు సేవలో
ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త
జస్టిస్ రామానుజం గారితో....



శ్రీ కృష్ణ దేవరాయల
విగ్రహావిష్కరణ....

116·17



ప్రకాశం పంతులు గారి
ఆత్మకథ నవ్యాంధ్రం
ఆవిష్కరణ సభలో
మాన్యమంత్రివర్యులు
శ్రీ యం. సత్యనారాయణరావు
గారితో...




మహామంత్రి తిమ్మరుసు
వేషధారణలో.....




శ్రీ శారదారామకృష్ణ
విద్యాలయం వారి
సత్కారం....




శ్రీ కాలనాథభట్ట
వీరభద్రశాస్త్రి
జన్మదిన వేడుకలు....

116·VI




పసిడి తెలుగు
కవి సమ్మేళనంలో
శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్,
శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్
గార్లతో...

జర్మనీ దేశంలో
తెలుగు మేయర్
డా॥ గుజ్జుల రవీంద్రుతో
ముఖాముఖి కార్యక్రమంలో...






అనూ ఫాంట్స్ అధినేత
శ్రీ మురళీ కృష్ణను
సత్కరిస్తూ...

తెలుగు పీపుల్ డాట్ కామ్
మేనేజింగ్ ఎడిటర్
శ్రీ వెంకటేశ్వరరావు
గారితో...



# "అక్షర రత్నాల హారం"

- కుమారి నల్లఘట్ల నందిని M.A., M.Phil.,

"ప్రతిభా వ్యుత్పత్తి సంయుక్తో లభతే జ్ఞాన మౌక్తికం" విశేషమైన ప్రతిభా వ్యుత్పత్తుల సమాహారము వలన స్వచ్ఛమైన విశిష్టమైన జ్ఞానమనే ముత్యాన్ని పొందుతారు.

వసంతం వస్తే కోయిల గళం విప్పి రమణీయగానం వినిపిస్తుంది.

**వానజల్లు కురిస్తే అనంత ప్రకృతి పులకిస్తుంది.**
**చల్లటి పవనాలు వీస్తే మనసు మైమరుస్తుంది.**
**తెల్లని మల్లె వికసిస్తే హృదయం పరవశిస్తుంది.**
**కాంతికిరణాలు వ్యాపిస్తే వ్యక్తావ్యక్త జీవకోటి దీపిస్తుంది.**

బిడ్డకు జన్మనిస్తే తల్లి ఆనందంతో మురుస్తుంది. ఆ బిడ్డ పెరిగి పెద్దై, మంచితనంతో, మానవత్వంతో దేశానికి సేవచేస్తే కన్ననేల ధన్యమై ప్రేమతో దీవిస్తుంది. కన్న తల్లి దండ్రులకు గర్వకారణంగా జన్మభూమి కన్న కలలను నిజంచేసి భావి భవితకు స్ఫూర్తిగా నిలిచిన మంచి మనసన్న మహోన్నత మాణిక్యం-మన తెలుగింటిరత్నం. మాన్య మంత్రివరేణ్యులు - శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారు. వారి సేవాపరిమళాలు అనన్యం - నిరుపమానం !! వారి నిరాడంబర వ్యక్తిత్వం సమోన్నతం - మార్గదర్శకం !!

శ్రీమతి ప్రభావతి, శ్రీ వెంకట కృష్ణారావు దంపతుల గర్భ శుక్తిముక్తాఫలంగా, మండలి వారి ఇంటిపంటగా 1956వ సంవత్సరము జూన్ 26న జన్మించిన దివిసీమ మణి-శ్రీ బుద్ధ ప్రసాద్ గారు.

గాంధీజీ సిద్ధాంతాలతో నిస్వార్థ రాజకీయ కుటుంబం నుండి వచ్చి నిరంతరం సేవా పరిమళాలు వెదజల్లు తున్న సాహితీ సుమం శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు అవనిగడ్డ నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తూ మూడు సార్లు శాసనసభ్యులుగా ఎన్నికైన ప్రజలమనిషి శ్రీ బుద్ధ ప్రసాద్ గారు.

1977 సంవత్సరము ఉప్పెనకి అతలాకుతలమైన దివిసీమ వాసులకు పునరావాసం కల్పించడానికి వీరుచేసిన కృషి అద్వితీయం-అపారం. దివి ప్రాంతవాసుల చిరకాల స్వప్నం, అనితర సాధ్యమైన పెనుమూడి వారధి (మండలి వెంకట కృష్ణారావువారధి) నేడు సాకారమయ్యిందంటే అందుకు ప్రధాన కారణం శ్రీ బుద్ధ ప్రసాద్ గారి స్థిర సంకల్పం, కార్యదక్షత అనేది అక్షర సత్యం.

సుదీర్ఘ రాజకీయ ప్రస్థానంలో సేవాతత్పరతతో మేటి నాయకునిగా, శాంతి సౌజన్యాల కేతనంగా ఎదిగిన స్ఫుర ద్రూపి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారు.

దివిసీమ దీనజనుల సంక్షేమ సమితికి 1979 సంవత్సరము నుండి కార్యదర్శిగా పనిచేస్తూ అనాథ బాలలకు, వికలాంగులకు చేయూత నందించిన మానవతామూర్తి శ్రీ బుద్ధ ప్రసాద్ గారు! తెలుగు భాషామ తల్లి సేవలో తెలుగు వెలుగుల పూర్ణ యశస్సుకై పరిపూర్ణ మనస్సుతో తోడ్పాటు నందిస్తున్న శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారి సాహితీ ప్రపూర్ణత్వం-శత సహస్ర రేఖా విరాజితం.

వైవిధ్య భరితమైన రాజకీయ,సామాజిక, సాహితీ సాంస్కృతిక కళారంగాలను సహజ సముపేతమైన విద్వత్ ప్రకర్షతో, వినూత్న పథంలో నడిపిస్తున్న ధీరోదాత్త చిత్తులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌గారు.

శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారూ !

అందుకోండి !!

రాష్ట్ర పశు సంవర్థక శాఖ, పాడి పరిశ్రమలు మత్స్య శాఖామాత్యులుగా నియమితులైన శుభసందర్భంగా సమర్పిస్తున్న.....

అభినందన చందన హారం !

మా ప్రేమాత్మీయ హృదయాలతో అందిస్తున్న అక్షర రత్నాల హారం !!

○

# సమాజసేవలో బుద్ధ ప్రసాద్

- శ్రీ॥ శే॥ కె.యస్. మధుసూదన్

"న త్వహం కామ యే రాజ్యం
న స్వర్గం నా పునర్భవం
కామయే దుఃఖ తప్తానాం
ప్రాణినాం ఆర్తి నాశనం"

దుఃఖితులైన జీవులకు సేవచేసి వారి ఆర్తిని తగ్గించే ప్రయత్నం ఏదైనా పుణ్య కార్యమే అవుతుంది. రాజకీయాలు వ్యాపారంగా మారి పోయిన ఈరోజులలో తన తండ్రి లాగా చిన్న వయస్సునుంచి రాజకీ యాలను సంఘసేవగా మలచుకొని సాంఘిక సేవా కార్యక్రమాలను నిర్విరామంగా చేస్తున్న యువశక్తి మా మండలి బుద్ధ ప్రసాద్. రాజకీయ నాయకులలో ఇలాంటి వ్యక్తులు అరుదుగా కనిపిస్తారు. పదవులతో సంబంధం లేకుండా నత్వహం కామయే రాజ్యం, న స్వర్గం నా పున ర్భవం అన్నట్లుగా సమాజానికి సేవ చేయాలి అనే మీదు మిక్కిలి తపనతో ఇది నా దేశం. ఇది నా సమాజం. ఈ భరత మాత అందరికీ తల్లి. ఇచట నున్న వారంతా సోదరులు అనే భావనతో తోటివారికి సహాయం చేయటం తెలియని విషయాలను అందించటం నా బాధ్యత అనే భావనతో జీవనం సాగించే విశిష్ట వ్యక్తి బుద్ధ ప్రసాద్. సమాజ సేవ, సాహితీ పోషణ మొదలైన వ్యసనాలే తప్ప ఏమాత్రం దుర్వ్యసనాలు లేని స్వచ్ఛమైన మల్లెపూవు లాంటి మనస్సు కలిగిన వ్యక్తి ప్రస్తుత రాజకీయాలలో ఉన్నారు అంటే ఆయనే బుద్ధ ప్రసాద్. స్వాతంత్ర్య సమరయోధుల దగ్గర నుంచి, ప్రసిద్ధ కవివర్యుల దగ్గర నుంచి సామా న్యుల వరకు ఆత్మీయతను పెంచుకొన్న వ్యక్తి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్, ఇందిరాగాంధీ, వినోభాబావే, రాజీవ్‌గాంధీ, దాశరధి, మధురాంతకం, మదర్ థెరిసా, ఆచార్య రంగా, సరిహద్దు గాంధీ మున్నగు వివిధ తరాలవారితో సన్నిహిత సంబంధాలను పెంచుకున్న వ్యక్తి ఆయన. ఆయనను ఒక వ్యక్తి అనేకన్న 'సంస్థ' అంటేనే సార్థక్యం వుంటుంది. గాంధీజీ ఆశయాల సాధనలో భాగంగా గాంధీజీ చెప్పినట్లు దేశానికి గ్రామాలే పట్టుగొమ్మలు అన్న సత్యాన్ని గుర్తెరిగి "గ్రామీణ యువజన వికాస సమితి"

నౌక దానిని 1982లో స్థాపించి అవనిగడ్డ గాంధీ క్షేత్రాన్ని కార్య స్థలంగా చేసుకొన్నారు శ్రీశ్రీ నవయువతను

"కొంతమంది యువకులు
ముందుతరం దూతలు
పావన నవజీవన
బృందావన నిర్మాతలు"

అని వర్ణించినట్లు యువతను ప్రోత్సహించడం లక్ష్యంగా పెట్టుకొని యువకులతో కూడిన ఒక కార్యవర్గాన్ని ఏర్పాటుచేసి అనేక కార్యక్రమాలను నిర్వహించిన విశిష్ట వ్యక్తి శ్రీ, మండలి బుద్ధ ప్రసాద్.

యువకులలో క్రమశిక్షణ; ఆత్మ గౌరవం, ఆత్మ విశ్వాసం సచ్ఛీ లతలు పెంపొందింపచేస్తూ చిత్తశుద్ధి, నిస్వార్థ పరాయణత, ఆత్మార్పణ బుద్ధి, కఠోర పరిశ్రమ, సమైక్యత, త్యాగం, సత్యం, దీక్ష, సంస్కారం, మైత్రీభావం, మానవత్వం, పరోపకారం, దైవభక్తి, దేశభక్తి, త్యాగనిరతి, మొదలగు లక్షణాలు కలిగిన స్వచ్ఛంద సేవకులను తయారు చేయుటకు కంకణం కట్టుకొని, సాంస్కృతిక, వినోద, విజ్ఞాన రంగాలలో యువజనులు అభిరుచితో పాల్గొను నట్లు చేశారు. వివిధ రకాల పోటీలు నిర్వహించి ప్రతిభావంతులను ప్రోత్సహించారు. కుల మత వైషమ్యాలను రూపుమాపి జాతీయ సమైక్యతకు దోహద పడేటట్లు ఆధ్యాత్మిక, మానసిక శక్తులను పెంపొందిం చుకుంటూ సేవా కార్యక్రమాలు నిర్వహించటం గ్రామీణయువజన వికాససమితి ముఖ్యా శయంగా స్వీకరించారు.

1982 నుంచి యువకులను జాగృతం చేయుటకై ఈత పోటీలు, పరుగు పందెములు, స్త్రీలకు ముగ్గుల పోటీలు మున్నగు వాటిని నిర్వహిస్తూ మహాత్ముల జయంతులు, వర్ధంతులను నిర్వహించి వారిని గూర్చి యువకులకు తెలియజేస్తూ కార్యోన్ముఖు లుగా తీర్చిదిద్ది, ఉచిత నేత్ర చికిత్సా శిబిరాలు, ఉచిత వైద్య శిబిరాలు నిర్వహించి వైద్య సేవలందించారు.

1987 అక్టోబరు 2, 3 తేదీలలో 'జాతీయ సమైక్యత-యువతరం పాత్ర' అన్న అంశంపై రాష్ట్ర స్థాయి మహాసభలు నిర్వహించారు. ఆ సభలలో రాష్ట్రం నలు మూలల నుంచి యువకులు, విద్యార్థులు, స్వచ్ఛంద సంస్థల యువజన సంఘాల ప్రతినిధులు, ఉపాధ్యాయులు, సంఘ సేవకులు, రాజకీయ నాయకులు దాదాపు 150మంది పూర్తి సమయం ఇచ్చి పాల్గొన్నారు. ఆ సభలో స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య, భారత మాజీ రాయబారి, ఉస్మానియా విశ్వవిద్యాలయ జర్నలిజం శాఖాధిపతి ప్రొ॥ సయ్యద్ బషీరుద్దీన్, ప్రొ॥ కె.కమల నాథన్ వేంకటేశ్వర యూనివర్సిటీ, ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు, శ్రీ టి. సూర్యనారాయణ మున్నగు ప్రముఖులు పాల్గొన్నారు.

ఈ సభలలో జాతీయ సమైక్యము-రాజకీయ దృక్పథము, జాతీయ సమైక్యము-లౌకిక దృక్పథము, జాతీయ సమైక్యము-భాషా విషయము, జాతీయ సమైక్యము-టెర్రరిజం, జాతీయ సమైక్యము-సంస్కృతి, జాతీయ సమైక్యము-యువతరం పాత్ర, గాంధీతత్త్వం-యువత, యువకులు-అహింస, అన్న విషయాల మీద విశేషమైన చర్చలు జరిగాయి. ఈ కృషికి భారత ప్రభుత్వ హోంశాఖ కూడా అభినందించి తగిన సహకారాన్ని అందించి ప్రోత్సహించింది.

అదేవిధంగా 1988-89 సం॥లో కూడా గ్రామీణ యువజన వికాస సమితి. భారత ప్రభుత్వ హోం శాఖ సహ కారంతో జాతీయ సమైక్యత-సాంస్కృతికోత్సవాలు, జాతీయ సమైక్యం-సంస్కృతి, కళలు అనే అంశాన్ని తీసుకొని యువకులలో ఒక స్ఫూర్తిని అందించింది. 1989 మార్చి 25 నుండి 29 వరకు ఐదు రోజుల పాటు వివిధ కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. ఈ సభలకు భారత ఉపరాష్ట్రపతి శ్రీ శంకర్ దయాళ్ శర్మ, ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి, అప్పటి మానవ వనరుల శాఖామాత్యులు శ్రీ పి.శివశంకర్ గార్లు సందేశాలను పంపారు.

జాతీయ సమైక్యత-సంస్కృతి-కళలు

జాతీయ సమైక్యత-సాహిత్యం

జాతీయ సమైక్యత-రంగస్థల కళలు

జాతీయ సమైక్యత-సంగీతం.

మున్నగు అంశాలమీద చర్చలు జరుపుతూ రాత్రిపూట రాష్ట్ర స్థాయి నాటికల పోటీలు నిర్వహించారు. ఈ కార్య క్రమానికి వేలాది మంది 5 రోజుల పాటు గాంధీ క్షేత్రాన్ని వీడలేదు.

ముఖ్యంగా ఈ 5 రోజుల కార్యక్రమాలు. సాంగ్ అండ్ డ్రామా డివిజన్ హైదరాబాదు, మద్రాసు కళాకారులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు ఏనాటికి దివిసీమ మరచిపోదు. అలాంటి మహత్తర కార్యక్రమాలు దివిసీమకు అందించారు.

నాకు బాగాగుర్తు. ఆనాటి నాటికల పోటీలలో రాష్ట్ర స్థాయి నుంచి మనమతం వందేమాతరం; 1 + 1 + 1 = 1, తులసి తీర్థం మున్నగునవి ఎంతో స్ఫూర్తినిచ్చాయి.

గ్రామీణ యువజన వికాస కార్యక్రమాల వివిధ పోటీలకు అల్లు రామలింగయ్య, దాసరి నారాయణరావు, జమున మున్నగు సినీ కళాకారుల నెందరినో తీసుకొనివచ్చి బహుమతులు ఇప్పించేవారు బుద్ధ ప్రసాదు.

వీరిసేవ దివిసీమకేకాకుండా రాష్ట్రానికి, దేశానికి ఉపయోగ పడాలని వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు ఇచ్చి ఉన్నత స్థానాలను అధిరోహించే విధంగా చేయాలని ఆ భగవంతుని మనసారా ప్రార్థిస్తున్నాం.

○

# మంచి పత్రికా సంపాదకుడు మండలి బుద్ధప్రసాద్

- శ్రీ జి.వి. ప్రసాద్

శ్రీ బుద్ధప్రసాద్ ఒక మంచి పత్రికా సంపాదకుడు. ఒక సాహితీమూర్తి. ఒక రచయిత. ఒక సాహితీ ప్రభంజనం. తెలుగు సంస్కృతీ ఆరాధకుడు అని అంటే సామాన్య ప్రజలు నమ్మక పోవచ్చు. మేథావులకు, రచయితలకు, కవులకు, కళాకారులకు, పాత్రికేయులకు ఆయన జగమెరిగిన బ్రాహ్మణుడు. టి.వీ. ప్రభంజనంలో గ్రంథపఠనానికి తిలోదకాలు ఒదిలిన ఈ రోజులలో తీరిక చేసుకొని మీదు మిక్కిలి గ్రంథపఠనం చేసే అలవాటు ఆయనకు ఉన్నది అంటే ఆశ్చర్యపడక తప్పదు. ఆయనకు వున్న భాషాపరిజ్ఞానం ఆయన వ్యక్తిత్వానికి గీటురాయి.

ఆయన ఇజం గాంధీయిజం. గాంధీజీ చెప్పిన నిర్మాణ కార్యక్రమాల ద్వారా గాంధీజీ ఆశయాలను ప్రజల కందించడం ద్వారా సమాజంలో మార్పును తీసుకొని రావాలనే తపన ఆయనను పత్రికా సంపాదకునిగా చేసింది. గాంధీజీ చూపిన దీపపు కాంతిలో ఆయన నడక సాగింది. గాంధీమహాత్ముని పవిత్రాశయాలను అందరూ ఆచరించే విధంగా చేయాలని, సమాజంలో మానవతా దృష్టిని పెంపొందించాలని మనసంస్కృతిని, సంప్రదాయాలను పరిపోషించాలనే సంకల్పంతో 1984 అక్టోబరు నెలలో "గాంధీ క్షేత్రం" మాసపత్రికను స్థాపించారాయన.

స్వచ్ఛమైన సంకల్పము
చతికిలబడిపోదు
అచ్ఛమైన వాక్కు కడకు
అప్రియమ్ము కాదు

అన్న గాంధీజీ సూక్తి బుద్ధ ప్రసాద్‌కు ఎంతగానో నచ్చిన సూక్తి. నిజంగానే ఆయన సంకల్పాలు అంత స్వచ్ఛమైనవి. అందుకే ఆయన "గాంధీ క్షేత్రం" ప్రారంభ సంచిక ముఖ పత్రం

మీద పై సూక్తిని ముద్రించారు. ఆ సూక్తే ఆయనను పత్రికా నిర్వహణకు కార్యోన్ముఖుడ్ని చేసింది అంటారాయన.

పత్రికా నిర్వహణలోనున్న కష్టం ఇంతింత అనరానిది. పత్రిక నిర్వహణలో సొంత ఆస్తులను సైతం అమ్ముకొనిన సంఘటనలు మనకు తెలుసు. తెలుగు వారిలో పత్రికకొని చదివే అలవాటు చాలా తక్కువ. గాంధీ క్షేత్రం పత్రి కకు ప్రకటనల ప్రోత్సాహం లేదు. అడుగడుగునా అడ్డుపడే నిరుత్సాహాన్ని అనునయించు కొని దశాబ్దకాలంపాటు అవిచ్ఛిన్నంగా నడపడం సామాన్యమైన విషయం కాదు. ఆ తరువాత "గాంధీ క్షేత్రం" మాస పత్రిక త్రైమా సిక పత్రికగా రూపుదిద్దుకొంది.

ప్రస్తుతం వస్తున్న పది పత్రికలతో "గాంధీ క్షేత్రం" పత్రిక సమానం అని ఆచార్య రంగా అన్నట్లుగా గాంధీ క్షేత్రం పత్రికకు ఒక విశిష్ట స్థానం వుంది. దానిని చదివే పాఠక లోకానికి కూడా ఒక విశిష్టత వుంది. అందులో యువకులతో పాటు విజ్ఞులు, స్వాతంత్ర్య సమర యోధులు, పెద్దతరం వారు సమాజంలో ఒక విశిష్ట స్థానాన ఉన్నవారు ఉండేవారు, పొరపాటున ఆ పత్రిక ఒక నెల ప్రచురించటం ఆలస్యమైతే వెంటనే పెద్దల దగ్గర నుంచి ఉత్తరాలు మాత్రంవచ్చేవి. పత్రికను ఆపవద్దు ప్రచురించాలి అని, అంతెందుకు స్వర్గీయ మండలి కృష్ణారావు గారికి ఆ పత్రిక అంటే ప్రాణంతో సమానం. కారణాంతరాలవల్ల కొద్ది కాలం పత్రిక ఆగిపోతే పట్టుబట్టి నన్ను కె.ఎన్. మధుసూదన్లను పిలిచి 'గాంధీ క్షేత్రం' పత్రికను ఆపవద్దు బాబుతో చెప్పి మళ్లీ ప్రచురింప చేయండి అన్నారు. అంతే తండ్రిమాట జవ దాటని బుద్ధ ప్రసాద్ వెంటనే దానిని ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో త్రై మాసిక పత్రికగా సర్వాంగ సుందరంగా ప్రత్యేక సంచికగా తీసుకొనివచ్చి తండ్రికి చూపడం జరిగింది. ఆయన ఎంతో ఆనందించారు. త్రై మాసిక పత్రిక మూడవ సంచిక వచ్చేనాటికి కృష్ణారావుగారు చూడటానికి లేరు.

అంత విశిష్ఠ స్థానాన్ని ఆక్రమించిన ఈ చిన్నపత్రిక ఆంధ్ర రాష్ట్రంలోనే కాక వివిధ దేశాలలోని ప్రవాసాంధ్రుల కరకమలాలను అలంకరించేది. త్రైమాసిక పత్రికను భారతరత్న స్వర్గీయ మదర్ థెరిసా చివరిరోజులలో శ్రీ బుద్ధప్రసాద్ కలకత్తాలో ఆమెను కలసి చూపించడం పత్రికపైనున్న గాంధీజీ సూక్తిని ఆమె ఇంగ్లీషులో అడిగి తెలుసుకోవటం, ఆనందించటం, ఆ పత్రికను ఆశీర్వదించడం జరిగింది.

గాంధీ క్షేత్రం పత్రిక మొదటి నుండీ విశేషమైన శీర్షికలతో అలరారుతుండేది. గాంధీ వాణి, గాంధీ పథం, గాంధీ ప్రయోగం, గాంధీ ప్రభావం, కవి, సాహితీ, సంస్కృతి, ఇష్టాగోష్ఠి మున్నగు శీర్షికలతోపాటు పలు సామాజిక విషయాలపై వ్యాసాలు, పుస్తక సమీ క్షలు, కథలు, కథానికలు, పద్య రచనలు మున్నగు వాటితో పాటు 17 అనుబంధ సంస్థలతో అలరారే

గాంధీ క్షేత్రంలోని విశేష కార్యక్రమాల సమీక్షలు, సమాచారాలు ప్రచురించబడేవి. గాంధీ క్షేత్రం పత్రికకు అనేకమంది మహానుభావులు అనేక సందర్భాలలో ఆశీస్సులందించారు. ఆయా ఆశీస్సులను బుద్ధ ప్రసాద్ పత్రికలో ప్రచురించేవారు. డా॥ దాశరథి ఒక సందర్భంలో గాంధీ క్షేత్రాన్ని గూర్చి "అంధకార బంధురలోకాన్ని" "గాంధీ క్షేత్రం" అను రాగంతో బంధించే అహింసా సూత్రం" అని ఆశీర్వదించారు. ఒకరేమిటి బెజవాడ గోపాలరెడ్డి, సి.నారాయణ రెడ్డి, డా॥ వెంపటి సూర్యనారాయణ, వావిలాల గోపాలకృష్ణ, ఉమ్మెత్తల కేశవరావు, పోతుకూచి సాంబ శివరావు (ఆంధ్రప్రదేశ్ చిన్న పత్రికల సంఘం) డా॥ భావరాజు నరసింహారావు (త్రివేణి సంపాదకులు) సోమంచి యజ్ఞన్న శాస్త్రి, డా॥ జి.వి.పూర్ణచంద్ వంటి లబ్ధప్రతిష్ఠులు ఆ పత్రికలో చోటు చేసుకున్నారు.

విశేష మేమిటంటే శ్రీ బుద్ధప్రసాద్ సంపాదకత్వంలో నడిచిన గాంధీ క్షేత్రం పత్రికలో వ్యాసాలను పెద్ద పెద్ద పత్రికలు గాంధీ క్షేత్రం సౌజన్యంతో ప్రచురించేవి. ప్రచురిస్తున్నవి అంటే శ్రీ బుద్ధప్రసాద్‌కు పత్రికా నిర్వహణలో ఉన్న సామర్థ్యం, అనుభవం, వ్యాసాల ఎంపిక అటువంటిది.

ప్రత్యేక సందర్భాలలో గాంధీ క్షేత్రం పత్రికను ప్రత్యేక సంచికలుగా ప్రచురిం చేవారు. '50 ఏళ్ళ స్వాతంత్ర్యం' క్విట్ ఇండియా శత జయంత్యుత్సవాలు, 70 ఏళ్ళ మువ్వన్నెల జండా మున్నగు ప్రత్యేక సంచికలు వచ్చాయి. అవి సాహితీ లోకంలో చిరస్థాయిగా నిలిచిపోయాయి. గాంధీ క్షేత్రం పత్రికతో పాటు శ్రీ బుద్ధ ప్రసాద్ 'గాంధేయ సమాజ సేవా సంస్థ' పేరుతో అనేక అమూల్య మైన పుస్తకాలను ప్రచురించి సమాజానికి అందిం చారు. ఏటుకూరి బలరామమూర్తి గారి 'గాంధేయ మార్గం–తాత్త్వికత', మండలి వెంకట కృష్ణారావుగారి గాంధీ దర్శనం, 'వయోజన విద్యా వ్యాప్తి మన కర్తవ్యం', కోటగిరి వెంకట కృష్ణారావుగారి 'స్వాతంత్ర్య, సామిధేని', 'వియోగిహం–అస్పృశ్యత', తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారి నా రాట్న చక్రం, శ్రీ జోశ్యుల సూర్యనారాయణ మూర్తిగారి, 'ఆచార్య వినోభా', 'సేవాజీవి మండలి' వంటి పుస్తకాలతో పాటు ఆయన స్వయంగా వ్రాసిన 'మారిషస్–నా అనుభవాలు', 'అహింసా మూర్తులు' 'అమరవాణి' వంటి వానిని ప్రచురించిన ప్రచురణ కర్త ఆయన.

మధురాంతకం రాజారాం, దాశరథి, కవిశేఖర గురజాడ రాఘవ శర్మ, గుంటూరు శేషేంద్ర శర్మ వంటి రచయితల, డా॥ అక్కినేని నాగేశ్వరరావు వంటి కళాకారుల, శ్రీ కాశీ నాథుని పూర్ణ మల్లికార్జునుడు, తల్లాప్రగడ ప్రకాశ రాయుడు, కనుగాంధీ (గాంధీజీ మను మడు) వంటి స్వాతంత్ర్య సమరయోధుల నెంద రెందరినో తమ ఇష్టాగోష్ఠిద్వారా పత్రికకు పరిచయం చేసిన ధీశాలి ఆయన.

మానవునిలోని శీలమును, ఆధ్యాత్మికతను పెంపొందించి మానవుని నిజమైన మానవునిగా తీర్చిదిద్దుటయే లక్ష్యంగా గలిగిన పత్రిక గాంధీ క్షేత్రం మాసపత్రిక అని శ్రీకాశీనాథుని పూర్ణ మల్లికార్జునుడు (మాజీ యం.పి. మచిలీపట్నం) అన్నారు.

ఈ పత్రికకు ఒక నిర్దిష్ట గమ్యం వుంది. గాంధీ, వినోభా లాంటి సర్వోదయ సమ దర్శనుల సిద్ధాంతాలను, అహింస, సౌహార్దం, సమభావంలాంటి మానవీయ దృక్పథాలను ఆవిష్కరించే వ్యాసాలు ఇందులో ఉన్నాయని డా॥ సి.నా.రె. వంటి మహానుభావులెందరో ఈ పత్రికను ఆశీర్వదించిన వారే.

అనతి కాలంలోనే గాంధీ క్షేత్రం మాసపత్రిక రాష్ట్ర స్థాయిలో చిన్న పత్రికలలో ఉత్తమ పత్రికగా ఎంపికై ఉత్తమ అవార్డునందుకొంది. బుద్ధ ప్రసాద్ సంకల్పము వృథాకాలేదు. 'ఇంతింతై వటుడింతయై" అన్నట్లుగా శ్రీ బుద్ధప్రసాద్ ఈనాడు పశు సంవర్ధక శాఖా మాత్యులుగా ఎదగడం ఎంతోమదావహం. ఇక జాతీయ అంతర్జాతీయ స్థాయిలో బుద్ధప్రసాద్‌గారికి గుర్తింపు లభించి సమాజసేవలో మరింత చరితార్థులుకాగలరని ఆశిద్దాం.

దివిసీమ చరితను
త్రవ్వితట్టులకెత్తు
బుద్ధప్రసాదు దివి
జనమండలి

తెలుగు భాషోద్యమ
స్ఫూర్తినిచ్చిన ఘనుడు
దివి మండలి దివి
ఘృణిమండలి

# మండలి 'బుద్ధ' ప్రసాద్ తండ్రికి తగ్గ తనయుడు

- శ్రీ వై. వేంకటేశ్వరరావు, సంపాదకులు, రైతునేస్తం.

ఏప్రిల్, 2007 చివరివారంలో జరిగిన రాష్ట్రమంత్రి వర్గ విస్తరణలో మండలి బుద్ధ ప్రసాద్ గారికి ముఖ్యమైన పశుసంవర్ధక శాఖను ముఖ్య మంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డిగారు అప్పగించిన సంగతి తెల్సిందే. మంత్రి అయిన మండలి బుద్ధ ప్రసాద్ సాత్వికవాది. అంటే వివాదాస్పద వ్యక్తి కాదన్నమాట. అనవసర వివాదాలకు, అనుచిత వ్యాఖ్యలకు, తొందరపాటు చర్యలకు దూరంగా వుంటారాయన. అందుకే ఆయన్ను అంతా అభిమానిస్తారు.

బుద్ధ ప్రసాద్ తండ్రి మండలి వెంకట కృష్ణారావుగారు గాంధేయవాది. బుద్ధప్రసాద్ కూడా తండ్రికి తగ్గ తనయుడు. బుద్ధ ప్రసాద్ గారిని గురించి తెలుసుకునే ముందు ఆయన తండ్రిగారిని గురించి తెలుసు కోవటం ఉత్తమం. ఈతరం రాష్ట్ర ప్రజలకు మండలి వెంకట కృష్ణారావుగారంటే అంతగా తెలిసి వుండకపోవచ్చు. కాని గతతరంలో ఆయన గొప్ప నాయకుడు. పి.వి. నరసింహారావు, జలగం వెంగళరావు, కోట్ల విజయ భాస్కరరెడ్డిగార్ల మంత్రివర్గాల్లో మంత్రిగా పనిచేశారు. దివిసీమలోని అవనిగడ్డ నియోజక వర్గం నుండి వరుసగా మూడుసార్లు పోటీ చేసి ఎం.ఎల్.ఎ.గా గెలుపొందారు. 1972లో ఆయన ఎకగ్రీవంగా ఎన్నికవటం చరిత్ర సృష్టించింది. ఇంతవరకూ ఆ జిల్లానుండి ఏకగ్రీవంగా ఎన్నికయినవారు లేరు.

మండలి వెంకట కృష్ణారావు గారు 33 ఏళ్ల పిన్నవయసులోనే పార్లమెంటు సభ్యుడిగా 1957లో గెలుపొందారు. రాష్ట్ర విద్యామంత్రిగా ఆయన రాష్ట్రానికి ఎనలేని సేవచేశారు. నాగార్జున, కాకతీయ విశ్వవిద్యాలయా లను నెలకొల్పడంలో ప్రముఖ పాత్ర వహిం చారు. తెలుగును అధికార భాషగా తాలూకా నుండి జిల్లాస్థాయి వరకూ ప్రవేశపెట్టిన ఘనత ఆయనదే. ప్రపంచ ప్రథమ తెలుగు మహా సభలు జరిపి విశ్వవ్యాప్తంగా వున్న తెలుగు వారిని ఒకే వేదికపై చేర్చిన ఘనత కూడా ఆయనదే. 1977 నవంబర్ 19న సంభ వించిన ఉప్పెన-తుఫానులో ఆయన చేసిన అనన్యసామాన్యమైన సేవలతో ప్రపంచ ప్రఖ్యాతి పొందారు. 'ఆర్తజన బంధువు'గా ప్రసిద్ధి కెక్కారు. మారిషస్‌లో జరిగిన తృతీయ ప్రపంచ తెలుగు మహాసభ ఈయనను ఘనంగా సత్కరించింది.

పులిగడ్డ–పెనుమూడి వారధిని నిర్మించా లని ఈయన తన జీవిత కాలంలో ఎంతగానో తపనపడ్డారు. దివిసీమ వాసుల ఈ చిన్నికల సఫలీకృతమయ్యేందుకు 40 ఏళ్లకు పైగా పట్టింది. చివరకు జూన్ 2006లో ఈ వారధి పూర్తయింది. ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డి ఈ వారధికి 'మండలి వెంకట కృష్ణారావు వారధి' అని నామకరణం చేయటం, అందుకు దివి సీమవాసులు హర్షధ్వానాలు తెలపటం మండలి కుటుంబ ప్రతిష్టను ఇనుమడింప జేసే అంశాలు.

ఆయన కుమారుడు, ప్రస్తుత రాష్ట్రమంత్రి మండలి బుద్ధప్రసాద్ కూడా తండ్రి మార్గం లోనే రాజకీయాలలో నడుస్తున్నారు. 1956లో జన్మించిన ఆయన బి.ఎ. పట్టా పుచ్చుకుని రాజకీయాల్లోకి దిగారు. అవనిగడ్డ నియోజక వర్గం నుండి 1999, 2004లలో ఎం.ఎల్.ఎ. గా ఎన్నికయ్యారు. 2004లో పబ్లిక్ అకౌంట్స్ కమిటి సభ్యులుగాను, 2005లో నియోజక వర్గాల పునర్విభజన కమిషన్ సభ్యులుగాను నియమితులయ్యారు.

కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడిగా 12 ఏళ్ల రాజకీయ చక్రం తిప్పిన ఘనత మండలి బుద్ధ ప్రసాద్‌గారిది. అవనిగడ్డ నియోజకవర్గం ప్రజలు ఆయనను అభిమానంతో 'బాబు' అని పిలుస్తారు. మరోవైపు దివిసీమ ఘనతను చాటిచెప్పేందుకు ఆయన చేయని కృషంటూ లేదు. ఇలా జిల్లా రాజకీయాలను సమర్థ వంతంగా నడుపుతూ, మరోవైపు నియోజక వర్గాన్ని నిర్లక్ష్యం చేయకుండా తన ప్రాంతమైన దివిసీమ ఘనతను కీర్తిస్తూ వస్తున్న మండలి 'బాబు' సమాజంలోని అన్నివర్గాల వారికి సన్నిహితుడు అయ్యాడు. ముఖ్యంగా ఆయన నిజాయితీ వైఖరి ఎదుటి వారినిట్టే ఆకట్టేసు కుంటుంది.

## రైతు 'నేస్తం'...

సహజంగా రైతు కుటుంబం నుండి వచ్చిన బుద్ధ ప్రసాద్ రైతు పక్షపాతి. అహర్నిశలూ రైతుల సంక్షేమం కోసం ముఖ్యంగా కృష్ణా డెల్టా రైతుల ప్రయోజనాల కోసం పోరాడుతూ వచ్చారు. కృష్ణా డెల్టా తీవ్రమైన సాగునీటి సంక్షోభంలో చిక్కుకున్నప్పుడు 'కృష్ణా డెల్టా పరిరక్షణ సమితి'ని ఏర్పరచారు. దానితో ఆయన జరిపిన పోరాటాలు డెల్టా పరిరక్షణకు దోహద పడ్డాయి. రెండు పంటలు పండించే డెల్టా రైతాంగం తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో ఒక పంటకే పరిమితమై ఆ ఒక్క పంటకు కూడా ఆగష్టు నెలలో నీటిని విడుదల చేసే పరిస్థితులు ఏర్పడినప్పుడు 10 వేల క్యూసెక్కుల నీరు విడుదల చేయాలని 7 రోజులపాటు మచిలీపట్నంలో ఆమరణ నిరాహారదీక్ష సాగించి దానిని సాధించారు. ప్రకాశం బ్యారేజి వద్ద 10 వేల మంది రైతులతో జరిపిన సామూహిక ధర్నా కార్యక్రమం ఆ రోజుల్లో రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. కృష్ణాడెల్టా రైతుల దయనీయ పరిస్థితులను రాష్ట్ర ప్రజలకు అర్థమయ్యేలా చేయడంలో ఆయన ఉద్యమాలు సఫలమయ్యాయి.

రాజకీయాలకు అతీతంగా సర్ ఆర్థర్ కాటన్ బొమ్మను పతాకంగా రూపొందించి ఉద్యమాన్ని నిర్వహించిన తీరు ప్రశంస నీయం. వివిధ రాజకీయ పార్టీలతో కలిసి ఉద్యమాన్ని నిర్వహించినా కూడా ఏ పార్టీ జెండానూ పెట్టనీయకుండా రైతు ప్రతినిధులతో కలిసి పోరాటాలు జరిపారు. ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డిగారి నాయకత్వాన కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత డెల్టాకు 2 పంటలకు నీరం దేలా కృషిచేశారు. పులిచింతల ప్రాజెక్టు కృష్ణా డెల్టాకు ఎంత అవసరమో విడమరచి చెప్పి ఆ ప్రాజెక్టు ప్రారంభానికి మార్గం సుగమం చేశారు. బుద్ధ ప్రసాద్‌గారు 'కాంగ్రెస్ కిసాన్ సెల్'లో సభ్యులు. పార్టీతరపున ప్రభుత్వానికి రాష్ట్రంలో రైతులపరిస్థితి గురించి, సమస్యల గురించి, సాగురంగంలో చేపట్టాల్సిన సంస్కరణల గురించి ఎప్పటికప్పుడు సలహాలను, సూచనలను అందిస్తుంటారు. 'రైతునేస్తం' మాసపత్రిక పోటీతత్త్వంతో రూపు దిద్దుకొంటూ రావటానికి బుద్ధ ప్రసాద్‌గారు వెనుక నుండి చేసిన కృషి అమోఘం.

పులిగడ్డ-పెనుమూడి వారధిని నిర్మించా లనే తండ్రిగారి కలను నిజం చేసేందుకు బుద్ధ ప్రసాద్‌గారు అహర్నిశలూ శ్రమించారు. ప్రతి పక్షంలోవున్నప్పుడు శాసనసభలోపలా, వెలు పలా కూడా ఈ అంశంపై చర్చలు లేవదీశారు, ఒక దశలో తన శాసన సభ్యత్వాన్ని వదులుకు నేందుకు కూడా సిద్ధపడ్డారు.

## తెలుగు నేలను చీల్చకండి...

బుద్ధ ప్రసాద్ తండ్రి మండలి కృష్ణారావు సమైక్య ఆంధ్రవాది. అయితే వేర్పాటు వాదం ప్రబలిన రోజులలో ఆయన సమైక్య వాదానికి బలం లేకుండా పోయింది. అయినా మండలి కృష్ణారావు గారు గాలికి ఎదురు నిలబడి సమైక్య రాష్ట్ర నినాదంతో ముందుకు సాగారు. అదే బాట తనయుడిది కూడా.

మండలి బుద్ధ ప్రసాద్ దివిసీమలో సమైక్య వాద బావుటాను ఎగురవేశారు. తెలుగు నేలను చీల్చటం ఆయనకు సుతరామూ ఇష్టం లేదు.

అనుకున్న విషయాన్ని ఓర్పుతో, నేర్పుతో సాధించటం బుద్ధప్రసాద్ గారి నైజం అని ఆంతరింగికులు చెబుతారు. కాని ఆయన అంతర్యం పసిగట్టడం అంత సులభమైన విషయం కాదని ఆ ఆంతరంగికులే ఒప్పేసుకుంటారు. ఎవరేమన్నా ఒకటి మాత్రం నిజం. బుద్ధ ప్రసాద్‌నీతి, నిజాయితీలతో నడుచుకునే వ్యక్తి. అడ్డుగోలు వ్యవహారాలు ఆయనకు ఎంత మాత్రం నచ్చవు. ప్రజలకోసం పనిచేసే వ్యక్తి బుద్ధ ప్రసాద్. పదవులు వున్నా లేకపోయినా ఇటు వంటివారు భావి రాజకీయతరాలకు 'మార్గదర్శకులు' అంటే అతిశయోక్తి కాదు.

ఇకపోతే 1977 నుండి 1997 వరకూ పలుపదవులను నిర్వహించారు బుద్ధ ప్రసాద్

గారు. వాటి వివరాలిలావున్నాయి.

కృష్ణాజిల్లా యువజన కాంగ్రెస్ కమిటి కార్యవర్గ సభ్యులు (1977-1985); అవనిగడ్డ మండల కాంగ్రెస్ కమిటి అధ్యక్షులు (1987-89); కృష్ణా జిల్లా కాంగ్రెస్ కమిటి ప్రధాన కార్యదర్శి (1989-90); ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి కార్యవర్గ సభ్యులు (1990-92); కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటి అధ్యక్షులుగా ఎన్నిక (1992); ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి సంయుక్త కార్యదర్శి (1996-97); ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి ప్రధానకార్యదర్శి (1997).

ఈ రాజకీయ పదవులు కాక సామాజిక పదవులను కూడా బుద్ధ ప్రసాద్‌గారు నిర్వహిస్తున్నారు. దివిసీమ దీనజన సంక్షేమ సమి తికి ఆయన కార్యదర్శి. కృష్ణా డెల్టా పరిరక్షణ సమితికి కన్వీనర్. గాంధేయ సమాజసేవా సంస్థకు కార్యదర్శి. దక్షిణ భారత హిందీ ప్రచారసభకు కార్యవర్గ సభ్యుడు.

దివిసీమ దీనజనసమితి ఒక అనాధాశ్ర మాన్ని నిర్వహి స్తున్నది. ఇందులో 150 మంది పిల్లలు, 10 మంది వికలాంగులు ఆశ్రయం పొందివున్నారు. 1977లో దివిసీమను ఉప్పెన ముంచెత్తి నప్పుడు ఈయన బాధితులకు చేసిన సేవ మరువరానిది. పలు స్వచ్ఛంద సంస్థల తరపున బాధితుల పునరావాస కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు. అలాగే ఇటీవల సునామీ వచ్చినప్పుడు కూడా బాధితులను ఆదుకోవడంలో పలు స్వచ్ఛంద సంస్థల తర పున పాల్గొన్నారు. ఇటీవల కృష్ణాజిల్లాకు వర దలు సంభవించినపుడు కూడా యుద్ధ ప్రాతి పదికన ఆయన చేపట్టిన చర్యలు గమనార్హం.

## దేశ భాషలందు తెలుగు లెస్స.....

తండ్రి బాటలోనే తెలుగు భాష అభివృద్ధికి అన్ని విధాలా కృషి చేస్తూ వచ్చారు బుద్ధ ప్రసాద్ గారు. తెలుగు భాషా పరిరక్షణ కోసం తెలుగు భాషోద్యమ సమాఖ్య ఏర్పాటులో ఆయన కీలక సూత్రధారి. నర్సరీ నుంచి 10వ తరగతి వరకు విధిగా తెలుగును బోధించాలని అసెంబ్లీలో అనధికార తీర్మానం ప్రవేశపెట్టి రాష్ట్ర ప్రభు త్వంతో జీవో జారీ చేయించారు. సచివాలయం ముంగిట అధికార భాష అయిన తెలుగులో నామ ఫలకం పెట్టలేదని తెలుగు భాషాభిమా నులతో కలిసి ఆందోళన చేసి అరెస్టయ్యారు. తెలుగు అధికార భాషా సంఘం తరపున ఇటీ వల న్యూఢిల్లీలో ప్రధానిని కలిసి తెలుగుకు ప్రాచీనభాష హోదా ఇవ్వమని కోరారు. తెలుగు భాషోద్యమ సమాఖ్యకు ఆయన ఉపాధ్యక్షుడు.

చిన్న పిల్లలంటే బుద్ధప్రసాద్ గారికి ప్రాణం, వీధి పిల్లలను చేరదీసి ఆదరించటం ఆయన సమాజ సేవలో ఒక భాగం. 1972 నుండే దివిసీమ బాలానంద సంఘం అధ్య

క్షుడు. బాలల్లో వైజ్ఞానిక శాస్త్రంపట్ల ఆసక్తిని పెంపొందించేందుకు బాలానంద సంఘం తరఫున కృషి చేశారు.

ఆంధ్రప్రదేశ్ బాల అకాడమి వ్యవస్థాపక సభ్యుడు. ఆ అకాడమి వెలువరించే 'బాల' పత్రిక సంపాదక వర్గ సభ్యుడుగా పనిచేశారు.

1975లో జరిగిన మొదటి తెలుగు ప్రపంచ మహాసభల్లో బాలల సాంస్కృతిక కమిటి సభ్యుడుగా పాల్గొన్నారు, "బాలల మీద జాతీయ విధానం" అనే సదస్సు 1975లో అప్పటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలి అహ్మద్ చేతుల మీదుగా ప్రారంభమవగా ఆ సదస్సుకు ఆంధ్ర ప్రదేశ్ ప్రతిధిగా హాజరయ్యారు.

కాగా సాహితీ పరంగా కూడా బుద్ధ ప్రసాద్ సేవచేస్తూ వస్తున్నారు. అనేక కవి సమ్మేళనాలను, సాహితీ గోష్టులను నిర్వహించారు. ఇటీ వల విజయవాడలో కృష్ణా జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జాతీయస్థాయి తెలుగు మహాసభలు జరిపారు. ఆగస్టులో ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను నిర్వహించ తలపెట్టారు. 'గాంధీ క్షేత్రం' మాస పత్రికను సంపాదక బాధ్యతలతో 1984 నుండి దశాబ్దం పాటు నిర్వహించారు. 1987లో ఆంధ్ర ప్రదేశ్ తెలుగు చిన్న పత్రికల సంఘం నుండి ఈయన 'ఉత్తమ సంపాదక బహుమతి'ని పొందారు. గ్రామీణ యువజన వికాస సమితిని స్థాపించి 1982 నుండి జాతి సమైక్యతను, సమాజ సంక్షేమాన్ని పెంపొందించే సాహితీపర కార్యక్ర మాలను నిర్వహిస్తూ వస్తున్నారు. న్యూఢిల్లీలోని ఫ్రెండ్‌షిప్ ఫోరం ఆఫ్ ఇండియా సంస్థ 1999లో బుద్ధ ప్రసాద్ గారికి 'భారత్ ఎక్స్ లెన్స్ అవార్డు'ను బహూకరించింది.

## 'దివి' సీమకు సేవలు.....

ఇటీవల శ్రీకాకుళంలో జరిపిన శ్రీకృష్ణదేవ రాయ మహోత్సవాలు, అవనిగడ్డలో జరిపిన దివి మహోత్సవాలు ఆయన కార్యదక్షతకు దర్ప ణాలుగా నిలిచాయి.

ఆంధ్రరాష్ట్రంలో దివిసీమ ఓ మూలనపడి ఉంటుంది. పెను ఉప్పెన రాకముందు చాలా మందికి దాని గురించి తెలియదు. అయితే దివిసీమ చరిత్రను, సంస్కృతిని పునరుద్ధరించి దానికి ఆంధ్ర రాష్ట్ర చరిత్రలో ఒక విశిష్ట స్థానాన్ని కల్పింపజేయడంలో 'మండలి' కుటుంబం ప్రముఖ పాత్ర వహించింది. గాన గంధర్వ ఘంటసాల వేంకటేశ్వరరావు జన్మ స్థలమైన టేకుపల్లి గ్రామంలో ఆయన విగ్ర హాన్ని బుద్ధ ప్రసాద్‌గారు ఏర్పాటుచేశారు. ఈ విగ్రహ ఆవిష్కరణను ప్రముఖ సినీ గాయకుడు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం చేతులమీదుగా జరిపించారు.

దివిసీమ నుండి రాష్ట్ర స్థాయిలో, దేశ స్థాయిలో ప్రపంచ స్థాయిలో పేరు తెచ్చుకున్న వారి విగ్రహాలను ఆయా గ్రామాలలో ఏర్పాటు చేయాలనేది బుద్ధప్రసాద్‌గారి సంకల్పం. తాను జన్మించిన దివి సీమను అందులో భాగమైన అవనిగడ్డ నియోజక వర్గాన్ని అన్నివిధాలా అభివృద్ధి చేయటానికి కంకణం కట్టుకున్నది 'మండలి' కుటుంబం.

## కృష్ణా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడిగా.....

కృష్ణా జిల్లాలో రాజకీయాలు ముఖ్యంగా కాంగ్రెస్‌లో వర్గ పోరాటాలు అందరికీ తెలిసినవే. కీలకమైన ఈ జిల్లా కాంగ్రెస్ నేతగా మండలి బుద్ధప్రసాద్ ఆరు సంవత్సరాల పాటు పనిచేశారంటే అది ఆయన సామర్థ్యానికి నిదర్శనం.

అప్పటి ఎ.ఐ.సి.సి. అధ్యక్షుడు రాజీవ్ గాంధీ దివిసీమ పర్యటన జరిపినప్పుడు దానిని విజయవంతంగా నిర్వహించిన ఘనత బుద్ధ ప్రసాద్ గారిది. జాతీయ పతాకం 70వ వార్షి కోత్సవాలను విజయవాడలో ఘనంగా జరిపిన ఘనత కూడా ఆయనదే. ఆచార్య ఎన్.జి. రంగా, గోపాలరెడ్డి మొదలగువారితో ఒక కమిటీని వేసి స్వాతంత్ర్య సరమయోధులకు సన్మానాలు చేయించారు. రాష్ట్ర కాంగ్రెస్ పంచా యతీరాజ్ సెల్‌కి కన్వీనర్‌గాకూడా ఆయన వ్యవహరించారు. జిల్లాలోని వివిధ గ్రూపుల నాయకులను కలుపుకొని అటు యువకులకు, ఇటు పెద్దలకు మధ్య వారధిలా నిలిచిన వ్యక్తి బుద్ధ ప్రసాద్. జిల్లా కాంగ్రెస్ నుంచి పుస్తక ప్రచురణలను చేసి కాంగ్రెస్ శిక్షణా శిబిరాలను నిర్వహించి 2004లో కాంగ్రెస్ పార్టీని విజయ పథం వైపు నడిపించిన కృష్ణా జిల్లా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి బుద్ధ ప్రసాద్ అభినంద నీయుడు.

కుటుంబపరంగా మండలి బుద్ధ ప్రసాద్ గారికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు, భార్య విజయలక్ష్మిగారు. ఈయనకు 50 ఏళ్ల వయస్సులో మంత్రి పదవి దక్కింది. అంటే ప్రజలకు మరింత సేవచేసే భాగ్యం కలిగింది. రైతుబిడ్డ కాబట్టి వ్యవసాయ అనుబంధ రంగమైన పశుగణాభివృద్ధి శాఖను తన ఆధ్వర్యంలో ముందుకు నడిపించగలరని ఆశిద్దాం. రైతులకు మరిన్ని ప్రయోజనాలు కలిగించే విధంగా శాఖను తీర్చిదిద్దుతారని, ముఖ్యమంత్రి ఆరునెలల తర్వాత చేయబోయే మంత్రుల పని తీరు మదింపులో అగ్రస్థానంలో వుండగలరని ఆశిద్దాం.

○

# కార్యసాధకుడు మండలి

- శ్రీ వి.వి.సత్యనారాయణ

ప్రభావతీ కృష్ణారావుల పుణ్య ఫలం
బుద్ధ ప్రసాదు ప్రభవం వేసే అడుగులు నిదానం
వ్యవహారాల తీరు సరళతరం
ఆయన పయనమే జాతిపిత మార్గం
ప్రజా సమస్యలపై - సేవా కార్యక్రమాలపై మెండైన అవగాహన
తెలుగు భాషాభివృద్ధిపై
సాంస్కృతీ సంప్రదాయాల పరిరక్షణపై ఎనలేని తపన
అమాత్య శేఖరులవ్వడం
మూగ జీవాల సుకృతం
సాహిత్య సభలు-మీ కళారాధన
పెద్దలతో సమాలోచనలు బహు ప్రశంసనీయం

పార్టీల కతీతం
నిరంతర పఠనం
విజ్ఞాన సముపార్జన
నేటి యువతకాదర్శం
దాచుకుంటే దొంగల భయం
తింటే రోగాల భయం
మరి ఎందుకో యీ తాపత్రయం
అని నమ్మే సిద్ధుడు

చీమలది అంతా ఒకే దారి
వేరువేరు దార్లు మానవులది
అట్టి "మా-నవులను" ఒకే
దారిన నడపాలనే చింతనాపరుడు

ధవళ వస్త్రధారుడు
చిఱు మందహాసుడు
సంపూర్ణ విజయుడు
ఆపద్బాంధవుడు

మీ హయంలో ప్రజలు పాడిపంటలతో కళకళలాడాలి.
జలచరాలు విరివిగా సమృద్ధిచెంది, లాభాల బాటలో పయనించాలి
నడిస్తే చీమైనా వంద యోజనాలు నడవడం తథ్యం
నడవకుండా గరుత్మంతుడు ఒక్క అడుగు వెయ్యలేడనేది సత్యం

ప్రయత్నిస్తే ! అసాధ్యం సుసాధ్యం అని
చాటి చెప్పింది మండలి వంశాంకురం
సప్తగిరి వాసుండు కంటినిండా నిద్ర
సమయపాలన, ఆహార పానీయాలతో పాటు సదా
గౌరవప్రదములైన పదవులతో సాకుగాక!

○

# నాకు తెలిసిన బుద్ధప్రసాద్

- ఎమెస్కో విజయకుమార్

ఎవరి ఉనికి ద్వారా చుట్టూవున్న సమాజం ఉత్తేజం
పొందుతుందో వారే నిజమైన నాయకులు.

– డా॥ బి.వి.పట్టాభిరామ్ *(సుప్రసిద్ధ సామాజిక మనస్తత్త్వవేత్త)*

దార్శనికుడైన తండ్రికి తనయుడవడంవల్లగాని, వివాదరహితుడైన నాయకుడు అవడం వల్లగాని, ఈ రాష్ట్ర మంత్రివర్గంలో స్థానం పొందడంవల్లగాని శ్రీ బుద్ధప్రసాద్ ఈ సమాజంలో కీలకమైన వ్యక్తిగా మనం పరిగణించవలసిన అవసరంలేదు. వీటి అన్నిటికి అతీతమైన విలక్షణమైన వ్యక్తిత్వంవల్ల మాత్రమే ఈయన ఓ విశిష్ట వ్యక్తి.

హైదరాబాదు నగరంలో పుస్తక మహోత్సవం జరుగుతోంది. అదే సమయంలో ఆంధ్రప్రదేశ్ శాసనసభా సమావేశాలు జరుగుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ శాసనసభ నుండి పుస్తక మహోత్సవ ప్రాంగణానికి పుస్తక ప్రియుల పాదయాత్రను నిర్వహించాలని మేము భావించాం. అప్పటికే వున్న స్వల్ప పరిచయంతో శ్రీ బుద్ధప్రసాద్‌ను సంప్రదించాను. ఆ కార్యక్రమం విజయవంతంగా పూర్తయింది. అలా ప్రారంభమైంది మా స్నేహం.

మృదువైన ఆయన హస్తస్పర్శ నుండి ప్రారంభమైన భావప్రసారం తెలుగు సంస్కృతికి సంబంధించి అనేక మంచి పనులకు శ్రీకారం కాగలదని ఆరోజు నేను భావించ లేదు.

పరిచయమైన తొలినాటి నుండి ఆయన నాకో నిరంతర మైన ప్రశ్న!

కవులలో కనపడే భావాత్మక అస్పష్టత, తాత్త్వికులలో కనపడే నిరంతర జిజ్ఞాస నన్నిట్టే కట్టిపడేశాయి.

ఈ లక్షణాలేవీ ఆయనని ప్రజానాయకుడిగా గుర్తింపు పొందడానికి ఉపయోగపడవు కదా!

మరి ఆయనెలా సమూహాలతో మమేకమై నాయకుడిగా ఎదిగాడు?

ఆయనలో ఉండే మధ్యేవాద దృక్పథం, ఇతరుల అభిప్రాయా లను గౌరవించే లక్షణం (గౌరవించడం అంటే ఆమోదించడం కాదు) ఆయనను సమూహాలకు దగ్గర చేసుంటుందని నాకు దొరికిన ఓ సమాధానం.

మన భాషపట్ల, సంస్కృతిపట్ల, వాటి పరి రక్షణపట్ల ఆసక్తి కనబరచిన వారందరూ శ్రీ బుద్ధ ప్రసాద్ స్నేహితులే. వారిని కలపడానికి, వారితో సంభాషించడానికి, వారిని ప్రోత్స హించడానికి ఆయనకి ఏ పని ఒత్తిడీ అడ్డం రాదు. చిత్తూరు నుండి శ్రీకాకుళంవరకు, ఆదిలాబాదు నుండి అనంతపురం వరకు తెలుగు మాట్లాడే ప్రాంతమంతా ఆయన కార్య క్షేత్రం. అక్కడకు చేరడానికి ఆయన ఏ భావ ప్రసార సాధనాన్నైనా నిస్సంకోచంగా వాడు కుంటారు. కవులు, కళాకారులు ఎక్కడున్నా ఆయనకు స్నేహితులే! ఆత్మ బంధువులే!!

మన సంకల్పం బలమైనదైతే ఆ సంకల్పం నెరవేర్చడానికి ప్రపంచంలోని శక్తులన్నీ ఏకమై సహకరిస్తాయని ఆయన బలంగా నమ్ముతారు. ఆర్థిక, మానవ వనరులలేమి ఆయన తల పెట్టిన పనులకు అడ్డంకిగా నిలవలేదు. ఈ మధ్య ఆయన నిర్వహించిన శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాలు ఇందుకు చక్కని ఉదాహరణ.

రాజకీయం ఆయన కార్యక్షేత్రం కావొచ్చు. పదవులు రాజకీయ సోపానంలో కొన్ని మెట్లు కావొచ్చు.

కానీ, ఆయన దృక్పథం వీటికి అతీతంగా కాలపరీక్షకు నిలిచేది.

నిన్నటికి, రేపటికి వారధిగా నిలిచేది. నిన్నటి పునాదులపై రేపటి సౌధాలు నిర్మిం చాలి.

తెలుగుజాతి నిన్నను మరచిపోయి, వర్త మానంలో వెర్రి గంతులు వేస్తుంటే, రేపటి గురించి ఆలోచిస్తున్న ఈ దార్శనికుడు ఓ సాంస్కృతిక నాయకుడిగా ఎదగడానికి ఎక్కువ సమయం పట్టదు.

అయితే మృదువుగా అందించే కరచాలనం మరికొంచెం గాఢతరం కావాలి. పట్టుబిగవాలి అంతే.

50 సంవత్సరాలు పూర్తిచేసుకుంటున్న మిత్రులు శ్రీ బుద్ధ ప్రసాద్ మరోనూరు సంవత్సరాలు మనతోఉండి, స్ఫూర్తి నింపాలని ఆకాంక్షిస్తున్నాను.

○

# స్నేహశీలి 'మండలి' పరిచయ శుభవేళ.....

- శ్రీమతి జగద్ధాత్రి

"నమస్కారం అమ్మా! బాగున్నారా?" కలిసిన ప్రతీసారీ అదే ఆప్యాయమైన, ఆత్మీయమైన పలకరింపు. సహృదయత, కళారాధన, కార్యదక్షతల సమాహారమైన నిండైన విశిష్ట వ్యక్తి శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు. మొదటి సారిగా ప్రసాద్‌గారి పరిచయ భాగ్యం కలిగింది పిఠాపురంలో శ్రీ ఆవంత్స సోమసుందర్‌గారు నిర్వహించిన సాహిత్య సభలో. ఆనాటి సభకు ముఖ్య అతిథి శ్రీ బుద్ధ ప్రసాద్‌గారు. సరిగ్గా సభ ప్రారంభ సమయానికి సభాస్థలికి విచ్చేసారు ప్రసాద్‌గారు. పరిచయాలు, పలకరింపులు అవుతున్నాయి. సభ ప్రారంభిద్దాం అన్న సమయానికి కరెంట్ పోయింది. విపరీతమైన ఉక్కపోత, వేడి. ఎవరం ఉండలేక పోతున్నాం. ఉస్సు రస్సు మంటున్నారు అందరూ. సరిగ్గా అప్పుడు గుర్తించాను నేను బుద్ధ ప్రసాద్‌గారి ప్రత్యేకతని. చెక్కు చెదరని, చిరునవ్వుతో, ధారాపాతంగా చెమటలు కారుతున్నా విసుగు లేకుండా, అక్కడ చేరిన పెద్దలు అందరితోనూ అభిమానంగా సంభాషిస్తున్న వారిని. సాయం త్రం గం.5.30ని॥కు మొదలయి దాదాపు ఎని మిది గంటల వరకు సాగిన సభలో ఆద్యం తమూ ఉత్సాహంగా పాల్గొని, చివరన తన ప్రసంగంలో తెలుగు సాహిత్య సంస్కృతుల పరిరక్షణ కోసం సాహితీవేత్తలు, రాజకీయ వేత్తలు, ప్రజలు అందరూ ఎంతగా కృషి చేయ వలసివున్నదో విశదీకరించిన వైనం విన్నాక, ఔరా రాజకీయవేత్తకి ఇంతటి సాహిత్యాభి మానమా! జీవితంలో మొదటిసారి చూసిన ఆశ్చర్యం, ఆనందం ముప్పిరిగొని, నా మనస్సులో ఆయనపట్ల మరింత గౌరవాన్ని పెంచాయి. ఆ రోజు రాత్రి విశాఖ తిరిగి వెళ్తున్న మా అందరి మనసుల్లోనూ, మాటల్లోనూ ఒకే వ్యక్తి గూర్చిన ప్రస్తావన, ఆయనే బుద్ధప్రసాద్ గారు.

తర్వాత కృష్ణా జిల్లా రచయితల సంఘం అక్టోబర్‌లో నిర్వహించిన జాతీయ రచయితల మహా సభల్లో, బుద్ధప్రసాద్‌గారి పునర్దర్శనం. 'ఇందుగల వాడందులేదని, సందేహము వలదు'

అన్న తీరున ఇటు సభా నిర్వహణ లోనూ, అతిథుల గౌరవ సత్కారాలలోనే గాక, అందరి సాహితీవేత్తల ప్రసంగాలను అత్యంత శ్రద్ధతో ఆలకిస్తోన్న ప్రసాద్‌గారి ఓపికచూసి అబ్బురపడ్డాను. ఇక్కడ ఒక ముఖ్యమైన సంగతిచెప్పాలి. సభలు జరుగుతోన్న ఆరెండు రోజులూ అతిథు లందరికీ అడుగడుగునా మంచినీళ్లు, టీలు అందిస్తున్న చిన్నారులను చూసి ముచ్చట పడటంతో బాటు, సాహిత్య సభల్లో పిల్లలను చూడటం ఆశ్చర్యమనిపించి వారిని పిలిచి అడిగాను. "ఎవరు తీసుకొచ్చారు నాన్నా! మీరెవరి కోసం వచ్చారన్న" నా ప్రశ్నకి 'మేం మా ఎమ్.ఎల్.ఎ.గారి కోసంవచ్చాం ఆంటీ' అన్నవారి ప్రేమగల సమాధానంవిని ఆశ్చర్యానందాలలో వుండగానే ప్రసాద్‌గారు చిన్నారులనందరినీ వేదిక మీదకి పిలిచి వారిని ప్రశంసించి, వారితో ఫొటో తీయించుకుని వారిని ఆనందపరచడం నా మనసుని మరింత ఆకట్టుకుంది.

2007 ఫిబ్రవరి తొమ్మిదవ తారీఖున విజయవాడ నుండి కట్టమీదుగా కృష్ణవేణిని చూస్తూ ప్రయాణించి ఘంటసాల మండలంలోని శ్రీకాకుళం చేరుకున్న మాకు ఒక్కక్షణం రాయల సామ్రాజ్యానికి వచ్చామా అన్న అద్భుతభావన. ఎటుచూసినా వేడుకలే. కన్నులపండుగగా అంబరాన్నంటిన సంబరాలే. చిన్నా పెద్దా అన్న తారతమ్యం చూపకుండా వచ్చిన ప్రతివ్యక్తినీ, పేరు పేరునా పలకరిస్తూ సాదరంగా ఆహ్వానిస్తూ సభను అత్యంత సమర్థ వంతంగా నిర్వహిస్తోన్న కార్యదీక్షాపరుడు బుద్ధప్రసాద్‌గారిని చూస్తే 'ఒక చో నొప్పారు పూసెజ్జపై.....' కార్యసాధకుడు పూలపాన్పుపైన పరుండినా, కటికనేలపై పవళించినా ఆహారంసేవించినా, లేకున్నా' తాను సాధించ వలసిన కార్యాన్ని మాత్రం అకుంఠిత దీక్షతో నెరవేరుస్తాడన్న పద్యానికి నిలువెత్తు నిదర్శనంగా అనిపించారు.

దివిసీమకాదది సాక్షాత్తు దివిని తలపింప జేసిన మూడు రోజులు శ్రీకాకుళాంధ్ర మహా విష్ణు సన్నిధిలో జరిగిన శ్రీకృష్ణదేవరాయ ఉత్సవాలు తిలకించి, పులకించడం నా జీవితంలో లభించిన అరుదైన ఒకవరం. సాహిత్య ప్రసంగాలు, జానపద కళాప్రదర్శ నలు, విశిష్ట అతిథుల సత్కారాలు, అన్నిటినీ మించి 'భువన విజయం' నాటక ప్రదర్శన. స్వరూపంలోనూ, స్వభావం లోనూ విస్తృత 'భువన విజయ' మది. అలనాటి రాయలి కొలువులోని అష్టదిగ్గజాలతో పాటు తరువాత తరాలవారు అయిన, కాసుల పురుషోత్తమ కవి, సిద్ధేంద్రయోగి, ముద్దు పళని, క్షేత్రయ్య పాత్రలను ప్రవేశపెట్టి అత్యంత వైభవంగా అందరి హృదయాలను రంజింప జేసిన వినూత్న భువనవిజయం మరువలేనిది.

అత్యంత కార్యశూరుడు, రాయలవారికి ప్రీతి పాత్రుడైన అమాత్యుడు అప్పాజీ పాత్రలో శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌గారు వేదిక నలంక రించిన మరుక్షణం ఆనందాశ్చర్యాలతో జన వాహిని

కరతాళధ్వనులు మిన్నంటాయి. ముగింపు సభలో తమకు సహకరించిన శ్రీకాకుళ గ్రామవాసులకి, స్కూల్ విద్యార్థులకి, చిన్నా పెద్దా అందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు పలుకుతూ వినమ్రంగా అందరికీ నమస్క రించడం ఆయన సంస్కారాన్ని విశదపరిచింది. ప్రజలందరినోటా 'మా బుద్ధప్రసాద్' అని పెద్దలు, మా ఎం.ఎల్.ఎ. గారని పిన్నలూ కొనియాడుతుంటే నిజమైన ప్రజాప్రతినిధి ప్రజల హృదయాలలో వసిస్తాడన్నది నిరూపణ అయింది. సభా నంతరం ప్రజలు అందరూ ప్రసాద్‌గారికి, నాగేశ్వరరావుగార్కి, శ్రీ రాళ్లబండి కవితా ప్రసాద్ గారికి జరిపిన అనురాగ, అభినందన సత్కారాలు మనసుని ఆర్ద్రతతో నింపాయి.

భారత దేశంలో మరెక్కడా లేని విధంగా, శ్రీ కృష్ణదేవ రాయల వారు కూర్చుని 'ఆముక్త మాల్యద' రచిస్తున్నట్లుగా వున్న కాంస్య విగ్రహాన్ని శ్రీకాకుళంలో ప్రతిష్ఠింపజేయడం, ఆ మారుమూల పల్లెనుండి తెలుగువాణిని రాజధాని వరకూ తీసుకెళ్లడానికి చేసిన ప్రయత్నం బుద్ధప్రసాద్‌గారి సంకల్ప బలానికి తార్కాణం. సత్‌సంకల్పం, వనరులు, వ్యక్తులను సమీక రించడం, సమన్వయంతో రచించిన ప్రణాళికను, ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించడం మండలి బుద్ధప్రసాద్‌గారి సామర్థ్యానికి ప్రతీకగా నిలుస్తుంది అలుపు ఎరుగని కార్యాచరణ, స్థితప్రజ్ఞత, నిండుగంభీర మూర్తిమత్వం కూడిన ప్రసాద్‌గారు తప్పక మరెన్నో విజయ పతాకలు ఎగరవేస్తారని అందరి నమ్మకం, ఆకాంక్ష, ఆశీర్వాదం. 'పదవులది ఏముందండీ, వస్తుంటాయి పోతుంటాయి, మన తెలుగు సాహిత్య సంస్కృతుల పరిరక్షణ కోసం మన కార్యాచరణ కొనసాగుతూ ఉండాలి. అలా నిరంతరం పనిచేసుకుంటూ పోవడమే మన పని అని నిరాడంబరంగా నవ్వేసే నిగర్వి. శ్రీ బుద్ధప్రసాద్‌గారు దివిసీమ బిడ్డ కావడం ఆ సీమ చేసుకున్న అదృష్టమనడం ఆత్మీయోక్తి తప్ప అతిశయోక్తి కానేకాదు. నేడు అమాత్యులుగా ఆంధ్ర దేశానికి ప్రియతమ నాయకులవడం మరింత ముదావహం. మే 26న శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి జన్మదిన సందర్భంగా మనః పూర్వక ఆత్మీయాభినందనలతో.

○

# భాషా, సాహిత్య సాంస్కృతిక వికాస కృషిలో శ్రీ బుద్ధ ప్రసాద్

- శ్రీ రామతీర్థ

ప్రపంచ మంతటా నదీతీరాలు నాగరకతల నిలయాలు. పారే నీళ్ళలోకి తొంగిచూస్తామా సామ్రాజ్యాలు, వీరగాథలు, మధుర వేదనలు, యుద్ధాలు, స్వర్ణయుగాలు, మహా నిర్మాణాలు, పెనువినాశనాలు, ఇన్నీ కళ్ళ ముందు కదలాడి, మనం ఉక్కిరి బిక్కిరి అయ్యేలా భావాలు ముప్పిరిగొంటాయి. నదులు ప్రవహిస్తున్న సత్యాలు.

థేమ్సు లండన్‌కూ, గంగ కాశీకి, వోల్గా మాస్కోకూ, పొటామాక్ నది వాషింగ్టన్‌కూ, అమెజాన్ మెక్సికోకూ ఎలాగో కృష్ణ అటువంటిదే విజయవాడకు. సాగరంలో కలిసేందుకు పారే నేలంతా, సాంస్కృతిక పాదముద్రలకు వదిలిపెడుతూ ప్రవహి స్తోంది కృష్ణా, గోదావరులను తలుచు కోవడం మహా నాగరకతల ఉజ్వల స్మృతులలో తరంగితము అవుతూ తేలిపోవడం.

నాగరకతకు కొలమానం అది ప్రతి బింబించే సంస్కృతి. ఆ సంస్కృతికి ప్రాతి నిధ్యం వహించే కళాకారుల జీవన కోలాహల ధ్వానం. తమ రచనలు, పదాలు, నృత్యరీతులు, గాన నైపుణ్యాలు, ఉలితాకి సాగిన శిలలో దాగిన నిక్షిప్త సంస్కృతిని అర్థం చేసుకోవ డానికి, కనులు మూసుకు ఆ శిల్పాల ముందు నిలబడాలి.

దివిసీమలో మనం వేసే ప్రతి అడుగు ఒక చరిత్రను చెప్తుంది. పీల్చే ప్రతి శ్వాసా సంస్కృతి భరితమై, మన ఉద్విగ్న హృదయాలకు ప్రాణ వాయువులు అందిస్తుంది. అయితే ఇదంతా యాదృచ్ఛికంగా జరిగే కార్యం కాదు. వేల ఏళ్ళుగా జరుగుతూ వస్తున్న రసోద్దీపనాన్ని రెండు చేతులా అందుకుని, కనులనిండా పొదువుకుని, తరువాతి తరాలకు అందించే మహా కార్యము ఒకటి జరుగుతూ వుండాలి.

ఈ మహాకార్య నిర్వాహకులకు కావాల్సింది సంస్కృతి మూలాలపట్ల ఎనలేని ఆసక్తి. ఎక్కడ ప్రతిభా స్ఫోరకము అయినా దానినిగమనించి, సరైన దోవలోకి మళ్ళించగల ధీశక్తి. వేల ఏళ్ళ సంస్కృతి దర్శనం ఎంత విపులంగా జరిగితే అంత పూనికతో రాబోయే తరాలు ఈ బాధ్యతను అందుకుని నిర్వహిం చేందుకు ముందుకు వస్తారన్న అవగాహనగల నిండు మనస్సు కావాలి. సంస్కృతి అధ్యయనం, పరిణామాల పరిశీలన, మానవ ప్రగతి యాత్రలో సాంస్కృతిక రాయ బారుల తిరుగులేని ప్రయోజనశీలత పట్ల అచంచల విశ్వాసం కావాలి.

సాంస్కృతిక వైవిధ్యం ఒక జాతికి ప్రపంచ పేరోలగంలో శోభను ఇస్తుంది. ఒక ప్రత్యేక మయిన హోదాను, తనదైన ముద్రను 'విపులా చ పృథ్వీ" అన్న భావనలో జోడించి, "నేను సైతం ప్రపంచపు తెల్ల రేకై పల్లవిస్తాను" అని ప్రపంచ నాగరకతల మహాపుష్పంలో నేనూ ఒక రేకునని గర్వంగా చెప్పుకునే స్థాయిలో వుంటుంది, మహాకవి సాక్షిగా, మొత్తం పూవును నేనే అవుతాను అని కాక ఆ పుష్పపు ఒక రేకు నవుతానని అనడంలోనే గొప్ప ఆంతరిక ప్రజాస్వామ్య స్పృహ వున్నది. ఇటు వంటి విశాల చింతన, ప్రపంచ సంస్కృతులను అర్థం చేసుకోవడంలో ఎంత అవ సరం. ఈ లక్షణం పుష్కలంగా వున్న సాంస్కృతిక కార్యకర్తలు, మహాకార్య నిర్వాహ కులుగా ఎదుగుతారు.

'దివిసీమ'ను స్వర్గతుల్య భూ ఖండంగా వ్యవహరించడం అతిశయోక్తి కాదు అనిపి స్తుంది ఇక్కడి కళా సంస్కృతీ విలసనం ఎంత ఎత్తులకు ఎదిగిందో గమనించినపుడు. ఇంత ఉన్నత సృజనను, దానికి కారణభూతులయిన విశిష్ట వ్యక్తిత్వాలను ఈ తరాలకు అందించే కృషి ఎంతో అమూల్యమైనది.

సంస్కృతీ పరిరక్షణ, ప్రాధాన్యత, ప్రాచుర్యం అవసరము గురించిన ఈ కొంచెం పెద్దదే అయిన ఉపోద్ఘాతం కృష్ణా జిల్లాలో ప్రస్తుతం ఏఏటికా ఏడు విస్తృతమవుతూ వస్తున్న సాహితీ సాంస్కృ తిక కార్యాచరణ గురించి కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవా ధ్యక్షులుగా, దివి సీమ ఐతిహాసిక పరిశోధన మండలి అధ్యక్షులుగా తన మిత్రులతో, పెద్ద ఎత్తున సంబంధిత కార్యాచరణం చేస్తున్న శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి గురించి.

పెద్ద ఎత్తున ప్రజలు స్పందించిన దివి మహోత్సవాలు, కృష్ణా మహోత్సవాలు జిల్లాలో నిర్వహించబడేందుకు సమన్వయ సహకారాలు అందించడమే కాకుండా, జిల్లాలోని దర్శనీయ స్థలాల పర్యాటక ప్రశస్తిని పెంచేందుకు ప్రజా ప్రతినిధిగా దోహదం చేయడమే కాకుండా, ఇక్కడ ప్రస్తావనకు వచ్చే అంశం మండలి బుద్ధప్రసాద్ గారి సాహిత్య సంబంధిత సేవ, సాంస్కృతిక క్రియాశీలత. వారు దివిసీమకు చెందిన సాహితీ, సాంస్కృతిక ప్రముఖుల జీవిత విశేషాలతో ప్రచురించిన "దివిరత్నాలు" ఒక ప్రాంతం పట్ల, అక్కడి ప్రతిభాశాలుర పట్ల

స్పష్టమయిన అవగాహన కలిగేందుకు ఉపకరిస్తుంది యాభయి మంది ప్రముఖుల సంగ్రహ వివరాలు, వారి ఛాయాచిత్రాలు ఈ పుస్తకానికి వన్నె తీసుకు వచ్చాయి. 2002లో ముద్రితమయిన ఈ "దివి రత్నాలు" ప్రాదేశిక చరిత్రలపై ఆసక్తీ, సాంస్కృతిక పరిణామాల అధ్యయనంపై అనురక్తీ వున్నవారికి ముఖ్యమైన సమాచారం అందచేస్తుంది.

దివి మహోత్సవ్ 2005 సందర్భంగా వెలువరించిన 'దివి వైభవ సంచిక' ఈ సుజలాం, సుఫలాం సస్యశ్యామలాం అయిన దివిసీమ గురించి కూలంకష పరిచయం చేస్తుంది. చరిత్ర పుటల లోకి తొంగిచూసి బౌద్ధం, శాతవాహన కాలంనుంచీ తన స్వీయ చరిత్రను పాఠకులకు అందిస్తుంది. విలువయిన ఎన్నో వ్యాసాల సమాహారంగా భాసిల్లుతున్న ఈ పుస్తకం, తెలుగువారికే గర్వ కారణం. ముప్పయి ఏడు మనోహర వ్యాసాలతో, సంబంధిత వివరాలు పొందు పరిచిన ఈ దివి వైభవ సంచిక ప్రచురణ కర్తల, సంపాదకుల నేర్పరితనాల సూచిక.

మండలి బుద్ధ ప్రసాద్ గారికి హైదరాబాద్ చింతల బస్తీలోని న్యూ గవర్నమెంటు కాలేజిలో తెలుగు నేర్పిన గురువులు డా॥ ఎస్.గంగప్ప (తదుపరి విశ్రాంతాచార్యులు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం) గారు "దివిసీమ సాంస్కృతిక వైభవం" పేరిట వెలువరించిన వ్యాససంపుటిని 2005లో దివి ఐతిహాసిక పరిశోధక మండలి ప్రచురించింది. అలనాటి సంస్కృతి ప్రస్థానాన్నీ, ఆన వాళ్ళనీ ఆసక్తి కరంగా అందించే ఈ వ్యాసాలు, చదివించే రీతిలో సాగుతూ పాఠకులను తమతో పాటే తీసుకునిపోతాయి. ఆచార్య గంగప్పగారి విషయపారీణత, ప్రసాదగుణం, వైదుష్యం, ఈ చిరుపొత్తంలో పాఠకులు రుచిచూడగలరు.

2002లో అయిదు ఆసియా దేశాలు దర్శించి వచ్చిన శాసన సభ్యుల బృందంలో ఒకరిగా, కేవలం సౌహార్దయాత్ర చేసి రావడమే కాక, 'ప్రజలు-ప్రగతి' పేరిట అయిదు ఆసియా దేశాల అనుభవాలను అక్షరబద్ధం చేశారు మండలి బుద్ధ ప్రసాద్. ఇది యాత్రాసాహిత్య రచనల్లో ఒక ప్రజా ప్రతినిధి దృక్కోణాన్ని పాఠకు లకు అందించే పుస్తకం. సాహిత్యం, సాంస్కృతిక చైతన్యం ఇరు పార్శ్వాలయిన రాజకీయ దృష్టి రాణిస్తుంది. ప్రజల మనిషిగా, దివిసీమలో అపార జనాదరణ గల బుద్ధ ప్రసాద్ ఈ పుస్తకాన్ని అంకితం ఇచ్చినతీరు చెప్తుంది. ప్రజలతో మమేమకమై నడిచే వారి కుటుంబపు సత్సంప్రదాయం ఆయనలో మూర్తీ భూతమై వుందని.

"అంకిత మ్మిత్తు నీ పొత్త మవనిగడ్డ
నా నియోజక వర్గ జనాళికెల్ల
చిరు కృతజ్ఞతన్ వారి ఆశీస్సుతోడ
దేశములు చూచి స్ఫూర్తి పొందితిని నేను"

ఇది బుద్ధప్రసాద్ వినయం అయితే ఇలా ఆసియా దేశాలు (చైనా, మలేషియా, దక్షిణ కొరియా, థాయిలాండ్, సింగపూర్) పర్యటించి వచ్చిన నలభైఆరుమంది శాసనసభ్యులలో కెల్లా, ఇటువంటి యాత్రానుభవాలను నమోదు చేసింది ఒక్క బుద్ధ ప్రసాద్ కావడం, ఆయన దృష్టి నైశిత్యానికీ, నమోదుచేసే బాధ్యతను గుర్తెరిగి, ప్రజలకు అందించే పూనికకూ ప్రబల నిదర్శనం.

విద్యాపర్వం, నగరపర్వం, గ్రామీణపర్వం అంటూ పన్నెండు పర్వాలుగా విభజించి, అయిదే దేశాల వివరాలనూ ఒకే శీర్షిక కింద అందించడం మంచి రచనా ప్రణాళిక.

దివిసీమలోనో, కృష్ణా జిల్లాలోనోకాక రాష్ట్రం ఎల్లెడలా బుద్ధ ప్రసాద్ తండ్రి గారయిన కీ.శే. మండలి వెంకటకృష్ణారావు గారి పట్ల గౌరవ భావం ప్రజలు కలిగివున్నారు. తెలుగువారి చైతన్యాన్ని ప్రోవుచేసి, ఒకచోట సమీకరించి, ఫోకస్ చేసేలా వారు ప్రపంచ తెలుగు మహాసభలను మొదటిసారిగా నిర్వహించడం ఒక కారణం అయితే-దివిసీమ ఉప్పెన సమయంలో వారి అకుంఠిత ప్రజాసేవా దీక్ష ఇంకొక ముఖ్య కారణం. వీరి జీవిత చరిత్ర "మానవ మాణిక్యం-మండలి వెంకట కృష్ణారావు" పేరిట గంధం సుబ్బారావు గారు రచించిన పుస్తక ప్రచురణ, ఈ కాలంవారికి అప్పటి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక విషయ పరిచయం చేస్తుంది. మండలి వారి కుటుంబం గురించి ఎన్నో ఆసక్తికర విషయాలు, వారి పూర్వీకుల సంగ్రహ జీవన వివరాలు, ముఖ్యంగా బుద్ధప్రసాద్‌గారి బాల్యం ఎలాగడచి వుంటుందో అనేదానిపై కొంత అవగాహన ఏర్పరచే అరుదయిన జీవిత చరిత్ర పుస్తకం ఇది.

ప్రజాసేవారంగంలో కృష్ణా తీర ప్రజలు, నిరుపేదలు మత్స్య కారుల వంటి బడుగు వర్గాల జీవన అభ్యున్నతికి, బొగ్గు బస్సుల కాలం నుంచీ పరిచయాన్నిస్తూ, మండలి వెంకట కృష్ణారావు గారి కాలంలో జరిగిన ప్రజా సంక్షేమ కార్యక్రమాల వివరాలు, స్థాయి, వారి ఆలోచనలు, కార్యాచరణలు విపులంగా తెలిపే పుస్తకం లంక వెంకట రమణ రచించిన 'దివిదీపం' పుస్తకం. నిస్వార్థ ప్రజా సేవలో ఎదురయ్యే ప్రతిబంధకాలు, వాటిని వాడే దక్షత, పలు ఉద్యమాల వేదిక అయిన కృష్ణా జిల్లాలో జరిగే భావజాల సంఘర్షణ, అభిప్రాయ భేదాలను మించిన పరస్పర గౌరవాలు ఇవన్నీ ఒకనాటి రాజకీయ వాతావరణాన్ని మన ముందుకు తీసు కొస్తాయి. ఉత్తేజపరిచే శీర్షికలతో వ్యాసాలు, చిరు పద్య చాటువు లతో ఒక పఠనానుకూల వాతావరణం ఏర్పరచడమూ, 1969లో గాంధీక్షేత్రం స్థాపన, 1975 ఏప్రిల్ 12 నుంచి 18 వరకు హైదరాబాద్‌లో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగిన నేపథ్యం, ఇలా ఇప్పటి వేర్పాటువాదాల సంక్షోభంలోకూడా సంస్కృతి సమైక్యవాదులకు ఈ పుస్తకం మంచివనరు.

1983లో రిజిష్టరు చేయబడిన కృష్ణాజిల్లా రచయితల సంఘం, కొంతకాలం తరువాత క్రియాశీలత తగ్గినా, తిరిగి రెండు మూడేళ్లుగా నూతన శక్తితో, జవజీవాలతో సాహిత్య రంగంలో

తన సమన్వయ సామర్థ్యాన్ని, నిర్వహణా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ అందరి అభినందనలకూ పాత్రమయ్యింది. మండలి బుద్ధప్రసాద్ గౌరవ అధ్యక్షులుగా, ఒకప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి కార్యవర్గ సభ్యులుగా సేవలందించిన శ్రీ గుత్తికొండ సుబ్బారావు అధ్యక్షులుగా, ప్రముఖ రచయిత డా॥ జి.వి.పూర్ణచంద్ కార్య దర్శిగా, అక్టోబరు 2006 ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవ నేపథ్యంలో తెలుగు భాష, సంస్కృతి, సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా, కృష్ణాజిల్లా రచయితల సంఘం జాతీయ తెలుగు రచయితల మహాసభలు నిర్వహించింది.

రెండు రోజుల పాటు జాతీయ స్థాయి సభలలో ముఖ్య ప్రసంగాలు, చర్చోపచర్చలు, పుస్తక ఆవిష్కరణలు జరిగిన మాట అటుంచి, ఈ సభలలో పలువ్యాసాల సంకలనంగా వెలువ రించిన "తెలుగు పసిడి" సమకాలీన సాహిత్యపు వివిధ అంశాలపై దృష్టి సారించే ముఖ్యమయిన పుస్తకం.

ఈ సభల వెనుక ఎంతో శ్రద్ధ, ఓపిక, దక్షత, వనరుల సమీకరణవెనుక మండలి బుద్ధ ప్రసాద్ గారి ప్రోత్సాహం, భాగ స్వామ్యం, దిశానిర్దేశం వున్నాయి. ఒక శాసన సభ్యుడు, రెండు రోజులపాటు ఉదయం నుంచి రాత్రి సభలు ముగిసేదాకా ప్రతి సదస్సులో వుండడమూ, శ్రోతగా అన్నీ వినడమూ, అందర్నీ పలక రించడమూ నేను మొదటిసారిగా చూసాను.

నాలుగు నెలలయినా కాక ముందే "దివిసీమ ఐతిహాసిక పరిశోధన మండలి-ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ సంయుక్త నిర్వహణ"లో, తన సహచరులయిన రచయితలు, ఆచార్యులూ, చరిత్ర పరిశోధకుల సహకారంతో, ఫిబ్రవరి 2007లో శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాలు నిర్వహిం చారు మండలి బుద్ధప్రసాద్. రాష్ట్రం నలుమూలల నుంచే కాక కర్ణాటక, మహారాష్ట్ర, తమిళనాడు, ఇతర ప్రదేశాల నుంచి వచ్చిన మేధావుల పరిశోధనా వ్యాసాలు, సాంస్కృ తిక ప్రదర్శనలు, దేశంలో ఎక్కడా లేని విధంగా ఆసీనుడై వుండి రాయలు ఆముక్త మాల్యద రచిస్తున్న భంగిమలోని కాంస్య విగ్రహ ప్రతిష్ట, జానపద కళాజాతలు, శ్రీకాకుళం గ్రామం స్వరూపమే మార్చి వేసాయి.

ఈ సభలలో సైతం తెలుగు సమితి ప్రచు రణగా 'శ్రీకృష్ణదేవరాయ వైభవం' పుస్తకం చారిత్ర వైభవం, వ్యక్తిత్వ వైభవం, సాంఘిక జీవిత వైభవం బాషాసాహిత్య వైభవం, కళా వైభవం అంటూ ఆరు విభాగాలుగా విభజించ బడి సభానిర్వాహకులు ప్రతిష్టాత్మక ప్రచుర ణగా వెలువరించారు మంచి వర్ణ చిత్రాలతో ఈ పుస్తకం ఎమెస్కోవారి ప్రచురణగా శ్రీ దూపాటి విజయకుమార్ అందించగా, సాంస్కృ తిక శాఖ డైరెక్టర్ శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్ వారి సమర్థ సహకారం, సమన్వయ శీలతతో ఈ సభలను చాలాకాలం గుర్తుండిపోయేలా నిర్వహించారు.

జర్మనీలోని అల్ట్‌లాండ్స్‌బర్గ్ మేయరుగా వున్న భారతీయులు గుజ్జల రవీంద్రగారి ఆహ్వానంపై జర్మనీ సందర్శించి వచ్చిన మండలి బుద్ధప్రసాద్ జర్మన్ ప్రజల సాంస్కృతిక దర్శనం చేస్తూ వెలువరించిన 'నా జర్మనీ యాత్ర" పుస్తకం విలువైన సమాచారాన్ని అందిస్తుంది. ఏదైనయాత్ర చేసినా, పెద్ద స్థాయిలో సభలు జరిపినా ఆ విశేష సంచికను వెలువరించడం మండలి బుద్ధ ప్రసాద్‌గారి విశిష్టత. శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాల అనంతరం-ఈ విశేష సభల నివేదికగా 'శ్రీకృష్ణదేవరాయ మహోత్సవ వైజయంతిక' పేరిట ఒక సావనీరు వీరు తాజాగా వెలువ రించిన పుస్తకం.

సాహిత్య, సాంస్కృతిక సంబంధిత కార్యాచరణ, పుస్తకాల ప్రచురణ, భాషోద్యమ నాయకత్వం, సమావేశాల నిర్వహణ వంటి కార్యక్రమ ప్రణాళికను లోతుగా తమ జీవితంలో రంగరించుకున్న వారు రాజకీయ రంగంలో అరుదుగా వుంటారు. ఇప్పటి మన రాష్ట్రపతి శ్రీ అబ్దుల్ కలాం, పూర్వ ప్రధానులు శ్రీ పి.వి.నరసింహారావు, శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి ఇటువంటి రచనా సంప్రదాయం కలవారే.

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రనూ, అంతకుముందరి భాషా ఆధారాలనూ ఇవాల్టి పలుధోరణుల ప్రగతిశీలతనూ, ద్వితీయ సహస్రపు ఆరంభ దశకంలో తదుపరి దశాబ్దాలలో తెలుగు సాహిత్యం, సంస్కృతి, భాష పొందే ప్రగతిని శ్రద్ధగా గమనించడం లోనూ ఇవాళ విశాల ప్రాతిపదికపై ఉదార భావాలుగల పరిణత వ్యక్తులపాత్ర ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకుని వుంది. సాంకేతిక శిఖరాలను సాహిత్యం, సంస్కృతి పరిచయం చేసుకుని ప్రయోజనాత్మకంగా వినియోగించుకోవలసి వుంది. ఈ విస్తృత నేపథ్యంలో శ్రీ మండలి బుద్ధప్రసాద్‌వంటి ప్రాజ్ఞులూ, జనామోదంగల నాయకులూ, సాహిత్య, సాంస్కృతిక రంగాల భవితవ్యానికి బంగరు బాటలు వేయగలరన్న బలమయిన విశ్వాసంతో, వారి సాహిత్య సంబంధిత కార్యాచరణను అభినందిస్తూ, ఇతోధిక కృషికి స్వాగతిస్తూ 26 మే, 2007వారి జన్మదిన సందర్భంగా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలుపుతున్నాను. వారి దిశానిర్దేశం, సమన్వయ సంపన్నతతో కృష్ణాజిల్లా రచయితల సంఘం భారత స్వాతంత్ర్యపు అరవై ఏళ్ళు పూర్తి అయిన నేపథ్యంలో ఆగస్టు 10-12 తేదీలలో తలపెట్టిన ప్రపంచ తెలుగు మహాసభలు, ఈ లక్ష్య సాధనలో మరింత ఉజ్జ్వల స్ఫూర్తి దాయకం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

○

# "విలక్షణ వ్యక్తిత్వం"

- శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్

"సహిబుద్ధి గుణేనైవె సుకృతామర్థ దర్శనం
కార్యసిద్ధి పథస్సూక్ష్మః స్నేహే నా పుపలక్ష్యతే"

అంటాడు మహాకవి కాళిదాసు. మహాత్ములు భావించిన ప్రయోజనాన్ని అంచనా వేయటం కేవలం బుద్ధికి అందరానిది. వాళ్ళ కార్య సాఫల్యమార్గం అతి సూక్ష్మమైంది. స్నేహ బలంలోనే ఆ మార్గాన్ని అంచనా వేయగలం అని ఆ శ్లోకభావం. మన స్నేహితులెవరో తెలిస్తే, మన వ్యక్తిత్వాన్ని అంచనా వేయ వచ్చునని మనస్తత్వ శాస్త్రవేత్తలంటారు. తల్లి దండ్రులు తమ పిల్లలకు నామకరణం చేసేటప్పుడు యేదో ఒక ప్రయోజనాన్ని, ఒక నమ్మకాన్ని కలిగి పేరు పెడ్తారు. అలాంటిపనే చేశారనిపిస్తుంది శ్రీ బుద్ధప్రసాద్‌కు తమ తల్లిదండ్రులు శ్రీమండలి కృష్ణారావు దంపతులు పేరు పెట్టే విషయంలో. ఆ ఆశయాన్ని అక్షరాల అమలుచేస్తూ, తండ్రికి తగ్గ వారసుడు అనిపించుకొని, ఆయన మార్గంలోనే ప్రయాణం చేస్తూ, తనదైన శైలితో దానికొక విలక్షణాన్ని జోడించారు శ్రీ బుద్ధ ప్రసాద్. అసలే దివి తాలూకా తీవ్రవాద భావాలకు ఆలవాలం. ఫాక్షనిస్టులకు నిలయం. అయినా జాతీయ భావాలకు ఆటపట్టు. ప్రగతి మార్గాలకు తొలిమెట్టుగా వుంది. విభిన్న మనస్తత్వాలు, భిన్న ధోరణులు, భిన్నస్వరాలు, మార్గాలు, మన జాతిసంస్కృతి, సంప్రదాయం, భాషలకు దివిటీలు పట్టే భావపరం పరలున్న ప్రదేశం. ఇదంతా మూఢాచారమని ఈసడించి, ఎదిరించి నిలిచే తస్మదీయం. ఇంత వైవిధ్యభరిత వాతావరణంలో రాజకీయం నడపటం, అందునా బుద్ధుని కరుణను, మహాత్ముని అహింసను, క్రీస్తు ప్రేమను, మహమ్మద్ సోదర భావాన్ని రంగరించి నడవటం అసిధారావ్రతమే. దాన్ని సాధించిచూపారు అప్పుడు తండ్రి, ఇప్పుడు తనయుడు బుద్ధప్రసాద్. మరి యింత విశాల దృక్పథం రావాలంటే మహాత్ములతో మైత్రి మాత్రమే మార్గదర్శనం చేయగలదు. అందుకే తండ్రి శ్రీ కృష్ణారావు కుమారుడు

బుద్ధ ప్రసాదు, వివిధ రంగాలలో నిష్ణాతులైన ప్రముఖులతో స్నేహంచేశారు. వారి నాహ్వా నించి, తమ ప్రాంత ప్రజలకు వారి భావధార అందజేశారు. జీవిత పరమార్థాన్ని గ్రహించేటట్లు చేశారు. ధర్మ బద్ధమైన, నియమాలతో కూడిన సేవా తత్పరత నిండిన మార్గాలను ఎన్నుకొని ఆచరిం చారు. ఆచరింపజేశారు. సేవకు ప్రతిరూపం మండలి కుటుంబం అని ప్రశంసలు పొందారు. గాంధీ క్షేత్రం ఏర్పాటు చేయటంలో దానిని అభివృద్ధి చేయటంలో దేశ విదేశాల సాయం పొందారు. ప్రతిరూపాయికి తగిన ప్రతిఫలాన్ని చేతల్లో చూపి సెబాసనిపించుకొన్నారు. రాజకీయం సంపాదనకే పరిమిత మైన కాలంలో దానికి భిన్నంగా కుల, మత, వర్గ, భాషా సంకుచి తత్వానికి అతీతంగా రాజకీయంలో వుంటూ, ప్రజాసేవ చేస్తూ, ప్రజలందరిచేత మన్ననలు పొందటం ఆషామాషీకాదు. అక్షరాల అలా ఆచరించి చూపి, ఇలా చేయటం సాధ్యమేనని నిరూపించిన వారు శ్రీ బుద్ధ ప్రసాద్. నిత్యం ప్రజలతో వుంటూ, సమస్యలు వింటూ, తెలుసుకుంటూ, పరిష్కారం చూపిస్తూ, ప్రజల శ్రేయస్సే తన శ్రేయస్సుగా అదే తన కుటుంబా నికి శ్రీరామరక్షగా భావిస్తూ ప్రజల మనిషిగా, వారి హృదయాలలో స్థిరస్థానం సంపాదిం చారు. గెలుపోటములను లక్ష్యపెట్టలేదు. ప్రజలకు ప్రభుత్వం కల్పించే అన్ని సదుపాయాలను వారికి అందేటట్లు చేశారు. అది ఏ రాజకీయ పక్ష ప్రభుత్వమైనా, ఆయన సేవలు అన్నిటికి అతీతంగా అందజేశారు. అన్ని పక్షాలతో సమదూరం, సఖ్యత పాటించారు. ప్రజా సమస్యల పరిష్కారంలో అందరిని కూడగట్టి ప్రజావాణిని వినిపించి, కార్య సాధనకు మార్గం సుగమం చేశారు. తక్కువ మాట్లాడటం, నిరాడంబంగా వుండటం, ఎక్కువ పని చేయటం, ప్రజలను చైతన్యవంతులను చేయటం, ప్రజాభీష్టాన్ని మన్నించే టట్లుగా ప్రభుత్వాన్ని ఒప్పించటం, ఎక్కడా ఘర్షణ వైఖరి అవలం బించక పోవటం, సామరస్యం, సుహృద్భావన, సర్దుకుపోవటం, ఆదర్శంలో రాజీలేకుండా వుండటం ఆయన ఎన్నుకున్న మార్గాలు. శాసన సభ సభ్యునిగా వుంటూ ఎంతైనా సంపాదించవచ్చు. ఎన్నో కాంట్రాక్టులు బినామీగా చేయవచ్చు. కాని వీటికి అతీతంగా నిలిచారు. సమైక్య ఆంధ్రవాది. అతని వస్త్ర ధారణలో, ఆయన శీలం, ప్రవర్తన అతి స్వచ్ఛమైనవి. అందుకే ఆ నవ్వులో అంత ప్రకాశం, అంత స్వచ్ఛత. ఆ కారణంగానే అందరికి ఆయనంటే ఇష్టం. ఆయనకు అందరూ ఇష్టం. అజాతశత్రువై ఆప్యాయతకు నెలవైనాడు. శీలసంపదకు కొలువైనాడు. నిర్భయత్వానికి, నిశ్చల త్వానికి, నిర్మలత్వానికి నిలయమైనాడు, స్నేహ ధర్మానికి మారుపేరై ఆప్యాయతకు నెలవైనాడు. ఆదర్శానికి మారుపేరై నాడు. హింసా దౌర్జన్యాలకు దూరమై నిలిచాడు.

ఎవ్వరూ ప్రకాశింపనిది కాని, ఒక్కడే ప్రకాశించేది కాని సభకాదు. సభ అంటే పరస్పరం ప్రకాశింపజేసుకుంటూ, అందర్నీ ప్రకాశింపజేసేది' అంటారు. ఈ మాటలను సాకారం చేసినవారు శ్రీ బుద్ధ ప్రసాద్. ఆయన నిర్వహించిన సభలు లెక్కపెట్టలేనన్ని రాజకీయ సభలను

వదిలేస్తే సంస్కృతి, సంప్రదాయం, భాషా విషయమై నిర్వహించిన సభలు కోకొల్లలు. ఆంధ్ర భాషకు పునర్వైభవం తేవటానికి, ప్రాచీన హోదా సాధించటానికి, ప్రతి తెలుగింటా, తెలుగు మర్చిపోకుండా మాట్లాడటానికి ఆయన చేబట్టని కార్యక్రమంలేదు, ఉద్యమంలేదు. ముందడుగేకాని, వెనక్కి తగ్గింది లేదు. అధికారంలో స్వంత పార్టీ ప్రభుత్వమే వున్నా, జంకింది లేదు. ప్రజల సమస్యలు రాజకీయంగా ఎంత ముఖ్యమో భాషా సమస్య అంతకంటె తీవ్రమైనది, ముఖ్యమని భావించి, అందర్నీ కలుపుకొని ఉద్యమంలో మమేకమై ఆ స్ఫూర్తిని చక్కని వాగ్ధాటితో అందరికీ అందజేస్తూ, చైతన్య పరుస్తూ, కర్తవ్యోన్ముఖు లను చేస్తూ నిరంతరం ప్రయాణించే అలుపెరుగని పథకుడు శ్రీ బుద్ధప్రసాద్. అవిశ్రాంత పోరాటపటిమ ఆయనది. నిండు కుండలా తొణకరు. నిశ్శబ్ద విప్లవంలా కన్పిస్తారు. చెరగని చిరునవ్వు. అలసట కనిపించని ముఖం. హడావిడి, కంగారులేని తత్వం, మాటలో కంటె కంటిచూపుతో పని చేయించగల దిట్ట. ఆయన వున్నచోట ప్రశాంత నిలయం. ఆలోచనల పుట్ట. ఆచరణల పట్టు. నెమ్మదిగా, ప్రసన్నంగా మాట్లాడి హృదయాలను స్పృశిస్తారు. ఆ ప్రభావంలో ఆయన వెంట నడవటమే తప్ప యింకో ఆలోచన రాదు. మన సంప్రదాయం, సంస్కృతి అంటె ఆయనకు వల్ల మాలిన అభిమానం. వాటిని నిరంతరం మననం చేస్తారు. ధ్యానిస్తారు. ఆరాధిస్తారు, బోధిస్తారు, ఆచరిస్తారు, ఆచరణ సాధ్యం కానిది ఆయన చెప్పరు. కాదు ఆచరించి, అందరి కంటె ముందుం టారు. దివిసీమ అంటే దివ్యసీమ అని భావిస్తారు. 'అచట పుట్టిన చివురు కొమ్మైన చేవ'గా ఆరాధిస్తారు. వృత్త రత్నాకరం వ్రాసిన కాకతి రాజ్యసేనాని 'జాయప నాయకుడు' అంటే పరవశిస్తారు. వ్యాజనిందాస్తుతి శతక కర్త కాసుల పురుషోత్తమకవి అంటే అవ్యాజ అనురాగం. వేటూరి ప్రభాకరశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, దాలిపర్తి పిచ్చిహరి, హరి నాగభూషణం, అమ్ముల విశ్వనాథం, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, సుసర్ల, వేటూరి, ఘంటసాల మున్నగు సాహితీ, సంగీత కళాకారులంటే ఆయనకు ఒళ్లు పులకరిస్తుంది. ఆ వూసులలో అదోలోకంలో విహరించేస్తారు. ఒకరని ఏమిటి? దివిసీమలో, కాదుకాదు కృష్ణాజిల్లాలో జన్మించిన ప్రతి కవి, విమర్శకుడు, చిత్రకారుడు, సంగీతజ్ఞుడు, శిల్పి, నేతకాదు ఆయనకు అభిమాన పాత్రులు. విశ్వనాథకు వీరాభిమాని. మల్లాది ఏకలవ్య శిష్యుడు. ఈ విధంగా భాషా, సాహిత్య, సంప్రదాయం, సంస్కృతిలపై అభిమానం, ఆరాధనాభావం, వ్యాప్తి చేయాలన్న తపన వున్న ఏకైక శాసన సభ్యుడు, మంత్రి మన బుద్ధ ప్రసాద్. పట్టాభి, ముట్నూరిలకు వారసుడిగా వుండాలన్న ఆదర్శమూర్తి. ఆయన పాల్గొనని సాహితీ వేదికలేదు. ఉయ్యూరు సాహితీమండలి, 2003వ సమావేశంగా ఏర్పాటుచేసిన 'తెలుగు భాషా సదస్సు కీలక ప్రసంగం చేసి వందలాది మందిని ఉత్తేజితులను చేశారు. ప్రభుత్వాలకే పట్టని 'నేతాజి శతజయంతి' ఉత్సవాన్ని అవనిగడ్డలో జరిపిన జాతీయాభిమాని. ఆ మహనీయుని భావధారను అత్యద్భుతంగా ప్రముఖ దేశభక్తులు,

మచ్చలేని నాయకు లలో ప్రవహింపజేసిన ప్రజానాయకుడు బుద్ధప్రసాద్. ఆధునిక చిత్రకారులలో పికాసోతో పోల్చదగిన మన కృష్ణాజిల్లా చిత్రకారుడు. అంతర్జాతీయకీర్తి పొందిన డాక్టర్ ఎస్.వి.రామారావును ఆహ్వానించి, అమెరికాలో తెలుగువారు చేస్తున్న సాహితీ, కళా సేవలను ప్రజలకు తెలియబర్చిన సేవాతత్పరుడు ఆర్.ఎస్.కె. మూర్తి నాయకత్వంలో భారతీయ సాహిత్య పరిషత్ ఆధ్వర్యంలో కృష్ణాజిల్లా రచయితల సభను అవనిగడ్డలో దిగ్విజయంగా నడిపినవాడు. మేధావి, కథారచయిత, పత్రికా సంపాదకుడు, కథాశిల్పం జీర్ణింప జేసుకొన్నవాడు, సైన్సును, భారతీయ జీవన విధానాన్ని తులనాత్మకంగా పరిశీలించి రసగుళికలలాంటి ఉపన్యాసాలను ఇవ్వగల శ్రీ వాకాటి పాండురంగారావు గారిని ఆహ్వానించి, స్ఫూర్తిస్ఫోరక ప్రసంగాన్ని విన్పింప జేశారు. అంతేనా! కాంగ్రెస్ పార్టీలో నిబద్ధతను, గాంధి ఆదర్శానికి, ఆచరణకు ఆనవాలుగా వున్న మాజీమంత్రి శ్రీ పురుషోత్తమరావు గారిని పిలిచి, స్వచ్ఛమైన జీవితంపై ప్రసంగింప జేశారు. బహుశః కాంగ్రెసులో వున్న ఏకైక ఋషితుల్యుడు శ్రీ పురుషోత్తమరావు. తెల్లని గడ్డం, స్వచ్ఛమైన తెల్లని ఖద్దరు వస్త్రాలు, కాంతులీనే ముఖ వర్చస్సుతో ఆయన కన్పిస్తే, మనసుకు ప్రశాంతత. మురికి రాజకీయాలకు ఆయన వ్యతిరేకం. కాంగ్రెస్‌ను గొప్ప థీరీటిషియన్. దివిసీమ ఉత్సవాలు, కృష్ణా మహోత్సవాలు, పుష్కరాలు, ఇవన్నీ బుద్ధప్రసాద్ కీర్తికిరీటంలో కలికి తురాయిలే. బుద్ధప్రసాద్‌కు తోడు శ్రీ రాళ్ళబండి కవితా ప్రసాద్. వీరిద్దరి జంట 'బుద్ధ కవితా ప్రసాదం'. జిల్లాలో సాహితీ పంట సిరులు కురిపించారు. అవధానాలలో అలరించారు. సాహిత్య సభలలో చైతన్యం తెచ్చారు. బడుగు, బలహీనవర్గాలకు ఆసరాగా నిలిచారు. వారిలోను సాహితీ స్పృహను పాదుగొల్పారు. అదొక స్వర్ణయుగంలా భాసింపజేశారు. జిల్లాకు ఏ కలెక్టరు వచ్చినా, వారి సహృదయ సహకారంతో చేబట్టని కార్యక్రమంలేదు, పూర్తికాని ప్రాజెక్టులేదు. కూచిపూడి కళాక్షేత్రం అభివృద్ధికి, అక్కడ జరిగే నాట్యోత్సవాలను, సిద్ధేంద్ర ఉత్సవాలను నభూతో నభవిష్యతిగా నిర్వహించటానికి వెన్నుదన్నుగా నిలిచింది బుద్ధప్రసాద్. రాష్ట్ర, రాష్ట్రేతర కళాకారుల నాహ్వానించి, తెలుగు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో జరిగిన ఆ ఉత్సవాలు చూసి పులకించనివారు లేదు. ఆహా! అని మెచ్చని వారులేరు. కళాభారతికి అవి ఎనలేని, విశిష్ట వైభవచిహ్నాలుగా చరిత్రలో నిలిచాయి. శ్రీకాకుళంలో ఆయన అధ్వర్యంలో జరిగిన శ్రీకృష్ణదేవరాయల మహోత్సవాలు, రాయల విగ్రహస్థాపన, ఆముక్తమాల్యద మండపం ఆయన భాషా, సాంస్కృతిక అభిరుచులకు నిలువెత్తు దర్పణాలు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులుగా శ్రీ బుద్ధప్రసాద్ చేసిన సేవలు నిరుపమానమైనవి. ఒక వ్యక్తి ఇన్ని పనులు చేయగలడా! అని ఆశ్చర్య పరచే విభిన్న కార్యక్రమాల సమాహారం. 2006 అక్టోబర్‌లో విజయవాడలో జరిగిన 'జాతీయ తెలుగు రచయితల సదస్సు'. ఒక రకంగా మినీ అంతర్జాతీయ సదస్సే అయింది. ఎందరెందరో లబ్ధ ప్రతిష్టులైన కవులు,

రచయితలు, నాటక స్రష్టలు సందేశాత్మక ప్రసంగాలతో వేలాది ప్రేక్షకులను మైమరపించారు. అపూర్వంగా కలకాలం దాచుకోదగిన 'తెలుగు పసిడి' సంకలనం అశేషజన సమ్మోదమైంది. విమర్శకుల హృదయాలను దోచింది. సంఘ కీర్తిని దిశాంతాలకు చేర్చింది. అధ్యక్ష, కార్యదర్శులైన శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ జి.వి. పూర్ణచంద్‌ల సేవాతత్పరతకు, సాహితీ ధురంధరతకు మారు పేరుగా నిల్చిన సభలవి, సంకలనం అది. తెలుగురాష్ట్రం ఏర్పడి 50 సంవత్సరాలైన సందర్భంగా తెలుగువాడి సర్వతోముఖ ప్రతిభను అన్ని కోణాల్లోనూ ఆవిష్కరించిన పుస్తక రాజం 'పసిడి'. దీన్ని స్ఫూర్తిగా తీసుకొని భారత స్వాతంత్ర్య వజ్రోత్సవ సందర్భంగా శ్రీ బుద్ధ ప్రసాద్ ఆధ్వర్యంలో ఆగస్టులో విజయవాడలో 'ప్రపంచ తెలుగు రచయితల సభలు' జరుపబోవటం, 'వజ్రభారతి' సంకలనాన్ని ప్రచురించటం, జిల్లా రచయితల సంఘానికి క్రొత్త పూపు, తూగు నిస్తాయి. ప్రపంచ వ్యాప్తమై తెలుగు తేజం విస్తరించ టానికి సువర్ణావకాశం లభిస్తోంది. చిరకాల తెలుగు ప్రజల ఆశ నెరవేరబోతోంది. చిరస్థాయిని పొందబోతోంది.

ఇవన్నీ గమనిస్తే మనకు తెలిసింది ఒకటే. శ్రీ బుద్ధ ప్రసాద్ అందరితోనూ ఆత్మీయంగా వుంటారు. అందర్నీ పరిశీలిస్తారు. అందరి మాట వింటారు. కాని ఆచరణలో తనదైన శైలిలో, ప్రత్యేకంగా, విశిష్టంగా, విలక్షణంగా కన్పిస్తారు. 'మార్గదర్శి'గా వుంటారు. సద్గురు శివానంద మూర్తిగారి లాంటివారి సాన్నిధ్యంలో స్ఫూర్తి పొందుతారు. విశ్వవిద్యాలయ ఆచార్యులతో వైస్ ఛాన్స లర్లతో సహజీవనం చేస్తారు. న్యాయమార్గ కోవిదులతో సంచరిస్తారు. కవులు, కళాకారులతో మమేకము అవుతారు. సంస్థలలో చెట్టపట్టాలేస్తారు. సన్నిహితంగా మెలగుతారు. ప్రవాస భారతీయులతో చెలిమి చేస్తారు. వారు అందించే సహాయ సహకారాలను జిల్లా, రాష్ట్ర అభివృద్ధికి దక్కేటట్లు చేస్తారు. మచ్చలేని మనిషిగా జీవించటమే ఆయన విలక్షణ వ్యక్తిత్వం. కోటి మందిలో ఒకడుగా, ప్రత్యేకంగా కన్పించటం, తండ్రినుంచి వచ్చిన వారసత్వం, దాన్ని ప్రతిక్షణం కాపాడు కుంటారు. గౌతమ బుద్ధుడు అనేవాడట "యోగాసనంలో నా శరీరం శుష్కించినా, చాలా దుర్లభమైనా, బుద్ధత్వాన్ని పొందకుండా వుండను" బుద్ధత్వం పొంది లోకాన్ని ఉద్ధరిస్తాను" అని భావం. ఇదే మన బుద్ధుని మనస్తత్వమూ.

శ్రీ బుద్ధ ప్రసాద్ జీవితంలో నిరీక్షణలో చాలా కాలం గడిచింది. శాసన సభ్యుడు అవటానికి నిరీక్షణ, అయిన తర్వాత మంత్రిపదవి పొందటానికి, తర్వాత ప్రజలకు ఉపయోగపడే శాఖ లభించటానికి నిరీక్షణ సత్ఫలితాన్నిచ్చింది. ప్రజలకోరిక నెర వేరింది. ఆయనకు సముచిత స్థానం లభించింది. "The success sometimes may come immediately, but we must be ready to wait patiently even for what we may look like an infinite length of time" అంటారు నిరీక్షణ పై వ్యాఖ్యానిస్తూ స్వామి వివేకానంద. తనపై తనకు నమ్మకం వుండాలి. దాన్ని మించి ప్రత్యేక వ్యక్తిత్వమూ ఉండాలి. ఈ రెండు పుష్కలంగా వున్న వారు శ్రీ బుద్ధప్రసాద్.

ఈ విషయంపై సామ్యూల్ జాన్సన్ 'There can be no friendship without confidence, and no confidence without integrity". అని అంటారు. కనుక ఆయనకు నల్లేరుపై నడకే, హాయిగా. 'జ్ఞానం, కళా, చరిత్ర' అనే 3 మొనలతో త్రిశూలంలాగా మెరిసే సంస్కృతి, మన సాహితికి నవజీవన మిస్తుంది' అంటారు మాజీమంత్రి, భద్రాచల రామాలయ జీర్ణోద్ధార కుడు, ధార్మిక జీవి స్వర్గీయ కల్లూరి చంద్రమౌళి. ఆ త్రిశూలాన్నే ధరించి తిరిగే మనస్తత్వం మన మాన్య మంత్రి మహోదయులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారిది. సంప్రదాయం అంటే 'Not only the pastness of the Past, but into presence' అన్నాడు ఆంగ్లకవి ఇలియట్. దాన్ని అందరం జ్ఞాపకం చేసుకోవాలి. సంప్రదాయం మహావృక్షం, శిశిరంలో అకులురాలి, గాలికి ఆకులు దూరంగా కొట్టుకుపోయినా, వృక్షం మాత్రం నశించదు. అందులోని జీవశక్తి కొత్త చిగుళ్లతో, జయపతాకాలు ఎగురవేస్తుంది. జీవశక్తి లేని వృక్షాగ్ర భాగాలు మాత్రమే నశిస్తాయి అన్న ఇలియట్ మాటలు మన మహర్షుల మాటల్లా మార్గదర్శకాలు. సంప్రదాయంపై మక్కువ వున్న వారికి ఆదర్శాలు, వేషం, భాష, నడవడి మనుగడ, అభిరుచుల్లో మన సంస్కృతి ప్రతిఫలించాలి. పరిసరాల్ని అందంగా, ఆనందమయంగా తీర్చి దిద్దుకొనే నేర్పే సంస్కృతి అని శ్రీ బుద్ధ ప్రసాద్ విశ్వశిస్తారు. ఆ మార్గంలో పయనిస్తారు. అందుకే ఆయనది విశిష్టమూర్తిమత్వం, విలక్షణ వ్యక్తిత్వం. చుక్కల్లో చంద్రుడు ఆయన. పశువర్ధన శాఖామాత్యులకు సర్వదిక్కులా విజయాన్ని ఆ పశుపతి పరమేశ్వరుడు అందించాలని మనసారా కోరుతున్నాను.

○

# "జ్ఞాని"

- శ్రీ బొర్రా వెంకటేశ్వరరావు

దివిసీమ ముద్దుబిడ్డవు. మృదుశాలివి నాన్నగారి అడుగు జాడలలో ఎదిగి మంచి జ్ఞానియైన బుద్ధుని పేరుపెట్టిన అమ్మగారి జన్మతరించినది. అందుచే మీకు దివి మత్స్యకారుల పేరు మీదగా మీసేవ నాన్నగారి సేవకు గుర్తుగా మీకు మత్స్యశాఖ వరించుట-మీ జన్మ దినోత్సవ సందర్భముగా తమరికి నా యొక్క ప్రగాఢ అభినందనలు. ఒడుదుడు కులతో కొనసాగుచున్న మత్స్యశాఖ మీ హయాములో దినదినాభివృద్ధి చెందవలెనని ఆకాంక్షిస్తున్నాను. ○

# కళాతపస్వి శ్రీ బుద్ధ ప్రసాద్

- డా॥ టి.శ్రీనివాసరెడ్డి
ఫోటో ఇండియా-విజయవాడ

మన సంస్కృతీ సంప్రదాయాల పట్ల, కళలపట్ల అందునా గ్రామీణ కళలపట్ల శ్రీ బుద్ధ ప్రసాద్ గారికి ఎంతో మక్కువ శ్రద్ధ. ఆయన తన నిజ జీవిత విషయాలలో కూడా అంత శ్రద్ధ చూపిస్తూ ఉంటారు. మాకు మేము ఎంతో గొప్పగా ఫోటోలు తీస్తాము అనుకుంటాము. కాని బుద్ధప్రసాద్ గారు ఫోటోగ్రాఫర్లకే సూచనలు ఇస్తుండటం చూసి ఆశ్చర్యపోతూవుంటాం. దివి సీమలోగాని, ఇతరత్రా గాని, ప్రకృతి వైపరీత్యాలలో ఆయా దృశ్యాలను చిత్రీకరించి యదార్ధ దృశ్యాలను అధికారులకు ప్రభుత్వానికి చూపించి ఆ బాధితులను ఆదుకొనుట ఆయన ప్రత్యేకత.

దివిసీమ చరిత్రను తెలుగు సంస్కృతీ సంప్రదాయాలను తెలుగు భాషా ప్రాచీనతను వెలికిదీయటంలో ఆయన పాత్ర అనన్య సామాన్యమైనది. ఆయా ఉత్సవాలలో సదస్సులలో ఆయన ప్రతి చిన్న విషయంలోనూ దగ్గర వుండి చూసుకొనుటలో ఆయన చూపే శ్రద్ధ అనితర సాధ్యం. ముఖ్యంగా ఆయా ఉత్సవాలలో ఆకర్షించేవి చరిత్రను అవగతం చేసేవి చిత్రాలు. అవి ఫోటోలు కావచ్చు. చిత్రకారులచేత చిత్రించిన చిత్రాలు కావచ్చు.

దివిసీమలో పుట్టి జాతి ఔన్నత్యాన్ని పెంపొందింప జేసిన మహామహుల దివిరత్నాల చిత్రాలను ప్రత్యేకంగా ఆయన విశదీకరించి వేయించినవి దివి ఉత్సవాలకే ఒక ప్రత్యేకతను తెచ్చిపెట్టాయి. గాంధీ మహాత్ముడు కస్తూరిబాతో కలసి దివిసీమ వచ్చుటకు కృష్ణానదిని దాటిన సుందర దృశ్యాన్ని నాడు ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణా పత్రికలో అద్భుతంగా వ్రాయగా దానిని చిత్రకారుడు ఆమంచి చంద్రశేఖర్‌కు వివరించి వేయించిన చిత్రం బుద్ధ ప్రసాద్ గారికి చరిత్రపై ఉన్న శ్రద్ధకు మచ్చుతునక. గాంధీ క్షేత్రంలోని దేశనాయకుల చిత్రాలు చూస్తుంటే వాటి వెనుకనున్న వీరి కృషి అవగతమవుతుంది. 1977 దివిసీమ ఉప్పెనలోని దయనీయ దృశ్యాలను ఆయా ఫోటోలతో ఏర్పరచిన ప్రదర్శన కళ్ళకు కట్టినట్లుంటుంది.

దివి ఉత్సవాలలో ఆయన తీయించిన ఫోటోల వెనుక ఉన్న కృషి ఏ నాయకునిలోనూ చూడము.

గాంధీక్షేత్రం పత్రికకు ఆయన జెండా వీరుడు తోట నరసయ్య బందరు కోనేరు సెంటరులో జెండా కట్టిన దృశ్యాన్ని, పింగళి వెంకయ్య జాతీయ జెండా రూపకల్పనచేసి విజయవాడ సభలో గాంధీజీకి చూపిన చిత్రాన్ని వేయించారు. ఇలా ఫోటోలు, చిత్రాలు గత చరిత్ర తెల్పేవి మధుర స్మృతులుగా మిగిలేవి ఎన్నో ఫోటోలను ఆయన జాగ్రత్త పరచటం ఒక గొప్ప కళగా నేను భావిస్తున్నాను. వీరికి మంత్రి పదవి వచ్చిన సందర్భంగా అభినందనలు అందజేస్తున్నాను.

○

# తెలుగుజాతి ఆశపెట్టుకోదగిన నాయకుడు శ్రీ బుద్ధప్రసాద్

- డా॥ సామల రమేష్‌బాబు

శ్రీ మండలి బుద్ధప్రసాద్‌తో నా పరిచయం అంతా ఏడేళ్ల లోపే. వారి తండ్రిగారు కీర్తిశేషులు మండలి వెంకట కృష్ణారావు గారితో బాగానే పరిచయం ఉండేది. ఆయుర్వేదోద్ధారకులు కీ.శే. ఆచంట లక్ష్మీపతిగారి వద్ద తొలిసారి పరిచయం; ఆ తర్వాత కీ.శే. కవిరాజ్‌మోహన్, కీ.శే. పసుపులేటి కృష్ణమూర్తి వంటి ఆయుర్వేదోద్యమ ప్రముఖుల వల్ల, అప్పట్లో శాసనమండలి సభ్యుడుగా వున్న కీ.శే. తాళ్లూరి జియ్యరుదాస గారి వల్ల, వారితో పరిచయం కొనసాగింపు జరిగింది. ఒక ఆయుర్వేద వైద్యుడుగానే, అప్పటి ఆయుర్వేదోద్యమ కార్యకర్తగానే ఆ పరిచయ మంతా. అప్పుడు బుద్ధప్రసాద్ గారితో నాకేమాత్రం పరిచయం లేదు. మండలి వెంకట కృష్ణారావు గారంటే నాకు చాలా గౌరవం నాటికీ, నేటికీ. నమ్మిన ఆశయాదర్శాలకు అంకితమై పనిచేసేవారిని చూస్తే మనకు సాధారణంగా కలిగే గౌరవభావమే ఆయన పట్ల నాకుంది. స్వాతంత్ర్యానికి పూర్వపు కాంగ్రెసు ఆశయాదర్శాలకు అంకితమై, గాంధేయ దృక్పతంతో ఆయన పని చేశారని నా అవగాహన.

మన రాజకీయ పార్టీలంటే అనేకమంది వలెనే నాకూ ఏ మాత్రం మంచి అభిప్రాయం లేదు. ఇప్పుడు మన రాజకీయ పార్టీలన్నీ దాదాపుగా - కొంచెం కుడి ఎడంగా - సిద్ధాంతాల నుంచి, హృదయాలనుంచి దూరంగా జరిగిపోయినవనే నేను అనుకుంటున్నాను. గత నలుబ దేళ్లుగా ఈ పతనం జరిగిపోతున్నది. ఇంకా ఎంతగా ఈ పతనం జరుగుతుందో తెలియదు. ఇలాంటి పరిస్థితుల్లో కూడా శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారూ, ఇప్పుడాయన కుమారుడు బుద్ధ ప్రసాద్ గారూ పద్మాల్లాగా ఎలా వికసించారనేది అందరూ విశ్లేషించుకొని, తెలుసుకోవలసిన విశేషం.

సైద్ధాంతిక బలాన్ని గాంధీమార్గం నుంచి వంటబట్టించుకున్న వెంకట కృష్ణారావు గారు ఆత్మవిశ్వాసంతో, పోరాటపటిమతో ముందుకుసాగారు. నాగరిక సమాజంలోనే వున్నా, పౌర సంబంధాల దృష్ట్యా కొంచెం మూలకు నెట్టివేయబడినట్లుగా వుండే దివిసీమ నుండి ప్రాతినిధ్యం వహిస్తూ ప్రధాన రాజకీయ స్రవంతిలో తొలివరుస నాయకుడుగా గుర్తింపును తెచ్చుకోవడం మహాసభలను నిర్వహించి ఒక జాతి ఆలోచనకు ఒక విస్తృత రూపాన్ని కల్పించడం అంత తేలికైన పనికాదు. తండ్రిగారినీ సన్నిహితంగా చూస్తూ ఆ సైద్ధాంతిక భావజాలాన్ని, పని పద్ధతిని, రాజకీయ నైశిత్యాన్ని, చతురతను సహజంగా పుణికి పుచ్చుకున్నవారు బుద్ధ ప్రసాద్. వారసత్వ కొనసాగింపు అంటే ఇదే.

దీనికితోడు స్వాభిమానం, వినయశీలం రెండూ విడదీయరాని విధంగా శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌లో కలిసి ఉన్నాయి. తన మూలాల్ని మర్చిపోకుండా తనదారిని తాను నిర్ణయించు కొని, తొణక్కుండా ముందుకు సాగిపోయే స్వభావం. ఎవరినీ నొప్పించకుండా, కలిసివచ్చే వారిని కలుపుకుపోతూ కార్యసాధన చేసే పద్ధతి ఆయనది. రాజకీయ చాతుర్యం కలిగివుంటూనే. వివాదాస్పదం కాకుండా ఉండటం బుద్ధ ప్రసాద్ ప్రత్యేకంగా అలవర్చుకున్న లక్షణం. అనవసరపు హడావుడి లేకుండా, కావలసినంత ఉద్యమ స్వభావాన్ని నిర్మాణంచేస్తూ, నిర్ణయించుకొన్న కార్యక్రమాన్ని అమలుచేసుకొంటూ ముందడుగు వెయ్యడంలో బుద్ధ ప్రసాద్ గారికి ప్రజ్ఞ ఉంది.

శ్రీ బుద్ధప్రసాద్ శీలవంతుడు, సుగుణసంపన్నుడు, సంస్కృతీ శోభితుడు. ఈ విశేషణాల్ని ఆయన్ని పొగడడానికి నేను ఇక్కడ ఉపయోగించడం లేదు. ఈ లక్షణాల్ని ఆయన కలిగివున్నారు గనుకనే నేను ఇలా వ్రాస్తున్నాను. వివాదాస్పదం కాకుండా, కాంగ్రెసు పార్టీలో నాయకుడుగా ఎదగడానికి బుద్ధప్రసాద్ గారిలో మూర్తిభవించిన పైలక్షణాలే ఆధారం. పన్నెండేళ్ల పాటు జిల్లా కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడుగా కొనసాగడం ఆయనకే సాధ్యమవుతుంది.

శాసన సభ్యుడిగా ఈ ఎనిమిదేళ్లలో శ్రీ బుద్ధప్రసాద్ ఎన్నో సాధించారు. అందులో కొన్ని అంశాలను ఇక్కడ ప్రసావిస్తాను.

★ పులిగడ్డ–పెనుమూడి వారధిని–దశాబ్దాలుగా ప్రజలు కలగంటున్న–దానిని దారి మార్చి ఎగువకు కట్టాలని జరిగిన ప్రయత్నాలకు నిరసనగా ఉద్యమం నిర్వహించి, శాసన సభ్యత్వానికి రాజీనామా కూడా సమర్పించిన సంగతిని జనం ఇంకా మరువలేదు. దానినిసాధించి, ఇప్పటి ముఖ్యమంత్రిచేత ప్రారంభోత్సవం చేయించిన ఘనత బుద్ధప్రసాద్ గారిది.

★ 2003లో కృష్ణాడెల్టా పరిరక్షణ సమితి కన్వీనర్‌గా అన్ని పార్టీలను కలుపుకొని వచ్చి, పదివేల మందితో ధర్నాను నిర్వహించిన సంగతి చరిత్రలో నమోదయింది. డెల్టా అనగానే

మూడు పూటలా తింటున్నారనే భావం సర్వత్రా ఉంది. ఒక పంటకే నీరు చాలని స్థితి ఏర్పడింది. వలసలు ఎక్కువయ్యాయి. ఆ పరిస్థితిని బయటి ప్రపంచానికి వెల్లడిచేసి, తమ పార్టీ ప్రభుత్వం వచ్చిన తర్వాత రెండు పంటలకీ నీరు వచ్చేట్లు చేసిన ఉద్యమకారుడు బుద్ధ ప్రసాద్.

★ పులిచింతల నిర్మాణం విషయంలో ఉద్యమించి, కోర్టులో ప్రతివాదులుగా కూడా చేరి సాధించి, ముఖ్యమంత్రిచేత శంకుస్థాపన చేయించిన ఘనుడు బుద్ధప్రసాద్.

★ పోలవరం ప్రాజెక్టు నుంచి 80 టి.ఎం.సి.ల నీరు కృష్ణాకు రావడానికి ఏర్పాటు కూడా శ్రీ బుద్ధ ప్రసాద్ కృషి అనే చెప్పుకోవాలి.

★ కృష్ణాడెల్టా ఆధునీకరణ ప్రాజెక్టు 1600 కోట్ల రూపాయలతో వచ్చే ఏడాది ప్రారంభం కానుంది. నిపుణుల కమిటీ నివేదిక రావడమే తరువాయి.

★ విజయవాడ నుండి పులిగడ్డ వరకు 70 కి.మీ. దూరం రెండులైన్ల రహదారి నిర్మాణం, ఇందువల్ల లంక ప్రాంతాల అభివృద్ధి జరిగింది.

★ హంసలదీవి దగ్గర కృష్ణాసాగర సంగమానికి రహదారి సౌకర్యాన్ని $1^{1/2}$ కోట్ల ఖర్చుతో ఏర్పాటుచేశారు. మొన్నటి పుష్కరాలకు లక్షమంది యాత్రికులు వచ్చారు. ఇప్పుడు రోజూ 400-500 మంది వస్తున్నారు. ఈ సౌకర్యం ఏర్పడక ముందు అది పూర్తిగా నిర్లక్ష్యం చేయబడిన ప్రాంతం.

★ సునామీ కలిగించే విధ్వంసం నుంచి ప్రజలకు రక్షణ కలిగించడం కోసం స్వచ్ఛంద సంస్థల్ని కలుపుకొని రక్షణ కేంద్రాన్ని (షెల్టర్‌లు) నిర్మింపచేశారు. సాధారణ సమయాల్లో ఇవి పాఠశాలలుగా పనిచేస్తాయి. ఒక్కొక్కటి 12 లక్షల రూపాయల ఖర్చుతో ఇటువంటివి 9 కట్టించారు. డా॥ గుజ్జుల రవీంద్ర (జర్మనీ) సహాయంతో 4, ఆంధ్రామోటార్స్ వారిచేత 1 కట్టించారు. ఇప్పుడీ పద్ధతిని రాష్ట్ర వ్యాప్తంగా (పాఠశాల+రక్షణ కేంద్రం) విస్తరించాలని ప్రభుత్వం సంకల్పించింది.

ఇవన్నీ ఒక రాజకీయ నాయకుడిగా, ప్రజల మనిషిగా ఆయన సాధించిన విషయాలు.

ఇటీవల మంత్రివర్గ విస్తరణలో చాలామంది మంత్రి పదవికోసం తహతహలాడారు, ఎన్నో పలుకుబడులు ఉపయోగించారు. కాని, బుద్ధ ప్రసాద్ గారిని ముఖ్యమంత్రి అభిమానించి మంత్రిపదవి ఇచ్చారు. రాష్ట్ర పశుసంవర్ధక, పాడిపరిశ్రమ అభివృద్ధి, మత్స్యశాఖలను ఆయనకు అప్పగించారు.

వ్యవసాయం కొంత బడిదుడుకులకు లోనవుతున్న పరిస్థితుల్లో-పాడిపరిశ్రమ రంగాన్ని అభివృద్ధి చెయ్యాలని ముఖ్యమంత్రిగారి ఆలోచన. అందుకోసం ఆయన ఇప్పుడున్న 330 కోట్ల బడ్జెట్టుగాక, ఈ ఏడాదికి 500 కోట్ల ప్రత్యేక ప్యాకేజీని ఈ శాఖకు ఇస్తున్నారు. ఆయన మనసులోవున్న పథకాల్ని పాడిపరిశ్రమ, మత్స్యశాఖల్లో అమలులోకి తేవడానికి నమ్మకస్తుడైన మంత్రి కావాలి. అందుకోసం ముఖ్యమంత్రి ఎంచుకొన్న మంత్రి శ్రీ మండలి బుద్ధప్రసాద్. ముఖ్య మంత్రి పథకం క్రింద ఈ ఏడాది ఒక లక్ష పాడిపశువుల్నీ, ప్రధానమంత్రి పథకం క్రింద ముప్పదివేల పాడిపశువుల్నీ రాయితీపై ఇవ్వబోతున్నారు. 30-40 వేల గొర్రెల మందల్ని కూడా ఇవ్వనున్నారు. పశువుల డాక్టర్లకు కొరత ఉంది. దాదాపు 400 పోస్టులు నిండాలి. పశువైద్య విశ్వవిద్యాలయంలో కొత్త కోర్సుల్ని ప్రవేశపెడతారు. జాలర్ల జీవనాన్ని మెరుగుపరిచే కార్యక్రమం, తీరప్రాంతాల్లో రక్షణ కోసం భవనాల నిర్మాణం, మత్స్యకారుల మహిళా సంఘాలకు ప్రత్యేక ప్రోత్సాహకాలు-ఇలాంటివెన్నో ఆయన ఆధ్వర్యంలో అమలుకానున్నాయి.

ఏ శాఖనిచ్చినా సమర్థవంతంగా నిర్వహించగలరని శ్రీ మండలిపై ముఖ్యమంత్రికి నమ్మకం. రెండేళ్లలో రానున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని రూపొందించిన మంత్రివర్గం కనుక, పార్టీకి ఓట్లు తెచ్చిపెట్టగల శాఖని శ్రీ మండలికి ఇచ్చినట్టు అర్థం చేసుకోవలసి ఉంటుంది. అవును, నేటి మన రాజకీయాల్లో ఎన్నికలకున్న స్థానం మరిదేనికీ లేదు. మన రాష్ట్రంలో ఉన్న పోటాపోటీ రాజకీయాల్లో రెండేళ్ల ముందుగానే ఎన్నికల వాతావరణాన్ని తలపింప చేస్తున్నారంటే నేటి రాజకీయ రంగాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలో! ఏది ఏమైనా-మన బుద్ధ ప్రసాద్‌గారి మీద ముఖ్యమంత్రిగారు పెద్ద బాధ్యతనే ఉంచారు. వెంటనే బుద్ధప్రసాద్ ఈ రంగం మీద మనసు పెట్టారు. తనశాఖకు గొప్పభవిష్యత్తును కలిగించాలని, ఆదర్శవంతంగా రూపుదిద్దాలని ప్రయత్నాలు ప్రారంభించారు. అందులో ఆయన పూర్తిగా సఫలీకృతం అవుతారు.

ఇక్కడితో ఆపేస్తే మనం బుద్ధప్రసాద్‌గారి గురించి ఏమీ చెప్పుకొన్నట్లు కాదు. బుద్ధప్రసాద్ గారు మంత్రి అవుతారని 2004 ఎన్నికల తర్వాత రాజశేఖరరెడ్డి గారు ముఖ్యమంత్రి కాగానే గట్టి ఊహాగానాలు వచ్చాయి. కాని, ఇన్నాళ్ళకు ఆయనను మంత్రిపదవి వరించింది. మంత్రి అవుతారనగానే-ఆయనకు విద్యాశాఖనో, సాంస్కృతిక శాఖనో ఇస్తారని అందరూ అనుకొన్నారు. కాని ముఖ్యమంత్రిగారి ఎంపిక మరోవిధంగా ఉంది.

బుద్ధప్రసాద్ గారికి తెలుగు భాషా సంస్కృతులపట్ల, విద్యావికాసం పట్ల వున్న ప్రేమ, అనుబంధం ముఖ్యమంత్రి గారికి తెలియనివికావు. కాని, ముఖ్యమంత్రిగారి ప్రాథాన్యాలు వేరు. విద్య, భాష, సాంస్కృతిక వికాసానికి ఆయన పెద్దపీట వెయ్యడానికి సిద్ధంగా లేరు. ఆయనకు బుద్ధప్రసాద్ గారు కావాలిగాని, బుద్ధప్రసాద్ ప్రియతమంగా భావించే అంశాలు కాదు. అందుకే

ఆర్థిక ప్రాధాన్యత కలిగి, ఎన్నికల్లో తమ పార్టీకి అనుకూలంగా ఓటర్ల అభిప్రాయాన్ని మలచగల బుద్ధ ప్రసాద్‌గార్కి ఆ శాఖను వప్పజెప్పారు. పాడిపరిశ్రమ అభివృద్ధి, పశు సంవర్ధనం, మత్స్య శాఖల్ని ఆయనకు ఇచ్చి, ఆ రంగాన్ని శక్తివంతం చేయగలనిధుల్ని, పథకాల్ని అంజేస్తున్నారు.

సాహిత్యం, సంగీతం, లలితకళలు–వీటికి సంబంధించిన కార్యక్రమాలెక్కడ వుంటే అక్కడ కార్యకర్తలు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌ను అతథిగా పిలవడానికి సిద్దంగా ఉంటారు. తెలుగు భాషా సంస్కృతులను అన్ని విధాలుగా రక్షించి, అభివృద్ధి చెయ్యాలని నిత్యమూ ఆయన కోరుకుంటారు. ఈ దిశగా ఆయన చేసిన, చేస్తున్న కృషి ఎంతో ఉంది.

2002 నవంబరు 1, 2 తేదీలలో కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో జరిగిన రెండు రోజుల భాషోద్యమ శిబిరానికి ప్రాణంపోసింది బుద్ధప్రసాద్‌గారే. ఆయన పూనికతోనే సమాఖ్య ఆలోచనకు అంకురార్పణ జరిగింది. సచివాలయ ముఖద్వారంపై తెలుగులో నామ ఫలకం లేనందుకు నిరసనగా జరిగిన ప్రదర్శనలో ఆయన కూడా పాల్గొని అరెస్టయ్యారు. పదవ తరగతి వరకు అన్ని తరగతుల్లోనూ తెలుగు బోధనను తప్పనిసరి చెయ్యాలంటూ శాసనసభలో ప్రయివేటు బిల్లును ప్రతిపాదించడంతో పాటు, ఇందుకోసం జరిగిన ఆందోళనల్లో పాల్గొన్నారు. తెలుగు బాష ప్రాచీనత గుర్తింపుకోసం జరిగిన కృషి అంతటిలో అగ్రపీఠం బుద్ధప్రసాద్ గారిదే. సమాఖ్యకు తొలుత ఉపాధ్యక్షుడుగా, ఇప్పుడు సలహామండలి సభ్యులుగా ఆయన నిరంతర సేవలు అందిస్తూనే ఉన్నారు.

కృష్ణాజిల్లా రచయితల సంఘానికి గౌరవాధ్యక్షులుగా ఆయన ఆధ్వర్యంలో గత ఏడాది జరిగిన జాతీయ తెలుగు రచయితల సమ్మేళనం, ఆయన అధ్యక్షతన ఉన్న 'తెలుగు సమితి' ప్రచురిస్తున్న అపురూప గ్రంథాలు–ఇదంతా ఆయన తెలుగు భాషామతల్లి సేవలో చేస్తున్న కృషిలో కొన్ని విషయాలు మాత్రమే. ఇటీవల కృష్ణాజిల్లా శ్రీకాకుళంలోనే–ఒకనాడ్ర రాయలు 'ఆముక్తమాల్యద'కు శ్రీకారం చుట్టినచోట ప్రభుత్వ సాంస్కృతికశాఖ సహకారంతో కంచు విగ్రహాన్ని ప్రతిష్టించి మూడురోజులు పెద్ద ఎత్తున కార్యక్రమాల్ని నిర్వహించడం ఇంకా తడి ఆరని చరిత్ర. శ్రీకృష్ణదేవరాయలు అచ్చ తెలుగువాడేనని ఈ సదస్సు ప్రకటించింది.

ఈ ఏడాది ఆగస్టులో పెద్ద ఎత్తున విజయవాడలో అంతర్జాతీయ తెలుగు రచయితల సమ్మేళనం ఆయన ఆధ్వర్యంలో జరుగనుంది. భారీ ఎత్తున ఏర్పాటవుతున్న ఈ కార్యక్రమం శ్రీ మండలి బుద్ధప్రసాద్‌కు ప్రపంచ వ్యాప్తంగా తెలుగు సంఘాల, రచయితల హృదయాల్లో శాశ్వతస్థానం చేకూర్చనున్నది.

భాషా వికాసం, తెలుగుజాతి ఐక్యత అనే అంశాలపట్ల మన రాజకీయ నాయకులు, మేధావులు సామాజిక ఉద్యమకారులు పట్టించుకోకుండా ప్రవర్తించిన ఫలితాన్ని ఇప్పుడు మన

జాతి అనుభవిస్తున్నది. ఈ తరుణంలో మనకు శీల సంపన్నులు, ప్రతిభా మూర్తులు అయిన నాయకులు అన్ని రంగాల్లో కావాలి. ముఖ్యంగా రాజకీయ రంగంలో కావాలి. రాజకీయరంగమే తక్కిన అన్ని రంగాల్నీ ప్రభావితం చేస్తుంది గనుక, తెలుగు జాతిని అన్నివిదాలా పరమ వైభవ స్థితి వైపుకు నడిపించగల నాయకత్వం ఆ రంగంలో వికసించాలి.

ఈ ఏడేళ్లుగా మండలి బుద్ధప్రసాద్‌గారితో ఏర్పడిన సాన్నిహిత్యం, ఆయనపట్ల నమ్మకాన్ని కలిగించింది. మనం ఆశపెట్టుకోదగిన శ్రీ మండలి బుద్ధప్రసాద్ మరింత శక్తివంతుడైన నాయకుడిగా ఎదగాలి. ఈ దిశగా, ఇప్పుడు లభించిన మంత్రిపదవి ఒక బలమైన మెట్టు మాత్రమే.

బుద్ధుడు ప్రవచించిన శీల సంపద అంతా బుద్ధప్రసాద్ గారిలో వుంది. ఇక కావలసింది ఇప్పటివరకు తాను ఆచరిస్తూ వున్న పద్ధతిలోనే ఈయన భవిష్యత్తు కృషిని కొనసాగించడం. శ్రీ మండలి బుద్ధప్రసాద్ జన్మదినోత్సవ శుభసమయాన తెలుగు భాషోద్యమంతో కలిసి నడుస్తున్న మిత్రులందరి తరఫున శుభాకాంక్షలు తెలుపుతున్నారు. ఆరోగ్యంగా, శక్తివంతంగా వుంటూ తెలుగుతల్లి సేవలో నిండునూరేళ్లూ ఆయన ప్రకాశించాలని ఆశిస్తున్నాను.

○

# నిలకడగా వెలిగే దివి దీపం

- శ్రీ పోలేటి పార్వతీశం

మంచి తండ్రి ఉండటం వలన కొంతమంది కొడుకులకి, కూతుళ్ళకి ఈ సమాజంలో గుర్తింపు వస్తుంది. అలాగే మంచి కొడుకులు, కూతుళ్లు ఉండటం వలన వాళ్ళ తల్లి తండ్రులకి గుర్తింపు వచ్చే సందర్భాలని మనం అనేకసార్లు గమనిస్తాం. కానీ తండ్రులను, వారి కొడుకులను కూడా వేర్వేరుగా వారి ప్రతిభా సామర్థ్యాలను అనుసరించి గుర్తించే సన్నివేశాలు మాత్రం ఈ సమాజంలో చాలా అరుదుగా వస్తుంటాయి. అలాంటి అరుదైన సన్నివేశం మన మండలి వారింట జరిగింది.

మండలి వెంకట కృష్ణారావు అన్న పేరు కేవలం దివిసీమ ప్రాంత ప్రజలకే కాదు, యావదాంధ్ర దేశ ప్రజలకు చిరపరిచితమైన పేరు. ఈ పేరు చెప్పగానే, ఆ నాటి ముఖ్యమంత్రితో కలసి కృష్ణార్జునుల్లాగా వారు నిర్వహించిన ప్రపంచ తెలుగు మహాసభలు గుర్తుకొస్తాయి. అలాగే వ్యక్తి వ్యవస్థగామారి, దివిసీమ ఉప్పెనలో నిరాశ్రయులైన వేలాది కుటుంబాలకు ఓదార్పు కలిగించిన ఒక సామాజిక కార్యకర్త గుర్తుకు వస్తారు. రాజకీయ రంగంలో తనదైన శైలిని ఏర్పరుచుకుని, విద్యారంగంలో తన దార్శనికతను ప్రస్ఫుటంగా ఆవిష్కరించగలిగిన, ఒక అమాత్యుడు గుర్తుకువస్తారు. మొత్తంమీద ఒక బహుముఖప్రజ్ఞాశాలిగా ఆయన దర్శనము ఇస్తారు.

ఆ మండలి వారి ఇంటపుట్టి, ఆ తండ్రికి తగ్గ తనయునిగా వారసత్వాన్ని పుణికిపుచ్చుకుని, తన ప్రతిభా సామర్థ్యాలతో, సమాజంలో తన స్థానాన్ని తానే సుస్థిరపరచుకో గలిగిన ధీమాన్యుడు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారు.

ఆకుచాటు పిందెలాగా ఉండే మనస్తత్వం కలిగిన బుద్ధప్రసాద్ తండ్రిచాటు కొడుకులాగే పెరిగారు. కానీ ఆయన వైలక్షణ్యం ఏమిటంటే, తనేమిటో తానే నిరూపించుకో గలిగిన ఘనత

ఆయనది. తండ్రికి వారసునిగా ఆయన రాజకీయ రంగ ప్రవేశం చేసి ఉండవచ్చునేమోగానీ, విలువలు కలిగిన నాటితరం రాజకీయ నాయకులకు ఉండవలసిన లక్షణాలను మాత్రం ఆయన పుష్కలంగా కలిగి ఉన్నాడు. ముఖ్యంగా అనేక రంగాలలో అనేకానేక అంశాలపై వారికి ఉన్న అవగాహన సంస్తుతి పాత్రం. నా తాలూకా, నా జిల్లా, నా ప్రాంతం అనే సరిహద్దులకు అతీతంగా, సంపూర్ణ ఆంధ్ర దేశం పైన వారికి కల అవగాహన మనకి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. నీటి పారుదల రంగంపైన ఎటువంటి అవగాహన ఉందో అందుకు సమాంతరంగా విద్యారంగం పైన అటువంటి అవగాహన ఉంది. ప్రజా సంబంధాలపైన ఎటువంటి అవగాహన ఉందో దానికి సమాంతరంగా, సాంస్కృతిక రంగంపైన అటువంటి అవగాహన ఉంది.

అలాగే సాహిత్యంపైన ఎంతటి అవగాహన ఉందో సమాంతరంగా సంగీతం పైనా అటువంటి మక్కువ ఉంది. తెలుగు బాష తీయదనాన్ని ఎంతగా వర్ణించగలరో దాని చరిత్రనూ అంతగా విశదీకరించగలరు. అంతర్జాతీయ క్రీడ క్రికెట్ గురించి ఎంతమాట్లాడగలరో సమాంతరంగా గ్రామీణ క్రీడల ఆవశ్యకతను అంతగా వివరించగలరు. అలాగే నాటి పౌరాణిక రంగ స్థలాన్ని గురించి ఎంతగా ఆకళింపు చేసుకున్నారో అంతకు సమంగా నేటి ఆధునిక యుగంలో వచ్చే టీ.వి., సినిమాల పరిజ్ఞానమూ కలిగి ఉన్నారు. ఇలా రంగాలకు అతీతంగా, తరాల సరిహద్దులకు అతీతంగా ఆయన సమకూర్చుకున్న పరిజ్ఞానం, వారి ధీమాన్యత్వాన్ని మనముందు ఆవిష్కరిస్తుంది. పలురంగాల్లో, పలు అంశాలపట్ల వారికి కలిగిన అభిరుచి గానీ, అభినివేశం గాని వారి ఆలోచనల్లోనూ వారి కార్యక్రమాల్లోను ప్రతిఫలిస్తు ఉంటుంది.

కృష్ణా జిల్లాలో కృష్ణాతీరంలో ప్రభుత్వ పక్షాన జిల్లాయంత్రాంగం కృష్ణా మహోత్సవాలు వైభవంగా నిర్వహించిన సందర్భాలలో, వాటికి అనుసంధించి, దివిసీమ ప్రాంతంలో దివి మహోత్సవాలు తాను స్వయంగా సారధ్యం వహించి నిర్వహించడం, ఆయన ఘనతకు నిలువెత్తు పతాకలు. ఆయా సన్నివేశాలలో ఆయన ఏర్పాటు చేసిన సదస్సుల ప్రణాళిక రచన, సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ, ప్రత్యేక సంచికల ఆవిస్కరణవంటి అంశాలలో శ్రీ బుద్ధ ప్రసాద్ ముద్ర ప్రచలితంగా కనిపిస్తుంది.

అలాగే మాతృభాషా ఉద్యమాన్ని రాష్ట్ర వ్యాప్తంగానే కాదు, పొరుగు రాష్ట్రాలలోకూడా సమర్థవంతంగా నిర్వహిస్తున్న భాషా సేవకుల్ని మనం లెక్కిస్తే, ఐదారు వేళ్ళు ముడిచే లోగానే ఆంధ్రదేశం లెక్కించే పేరు శ్రీ బుద్ధ ప్రసాద్. మాతృభాష పట్ల వారికుండే మక్కువ, దాని వ్యాప్తి కోసం తానొక కార్యకర్తలా అంకితం కాగలిగిన చిత్తశుద్ధీ ఆయనకీ గౌరవాన్ని సముపార్జించి పెట్టాయి. ఇటీవల శ్రీకాకుళంలో, శ్రీకృష్ణదేవరాయల సంస్మరణగా శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ నేతృత్వంలో నిర్వహింపబడిన ఉత్సవాలు వారి భాషాభిమానానికి నిలువెత్తు దర్పణాలు.

చరిత్రను త్రవ్వితీయాలని, దానిని పదిమందికి పంచి ఇవ్వాలనే కుతూహలం, శ్రీ బుద్ధప్రసాద్‌గారిలో చాలా అధికం. ఈ గుణానికి నిరూపణగా ఒక సన్నివేశాన్ని మనవి చేస్తాను. దివిసీమ ప్రాంతం పట్ల వారికి వల్లమాలిన ప్రేమాభిమానాలు ఉండటం సహజం. ఆయనది ఆ ప్రాంతమే కనుక. కానీ, ఈ అభిమానం సాకుతో ఆయన ఆంధ్ర దేశానికి ఒక మహోపకారం చేశారు. ఆధ్యాత్మికతకు ఆలవాలమైన ఆంధ్రదేశంలో దేవాలయాలు అధికంగా ఉండటంలో ఆశ్చర్యమేమీ లేదు. కానీ, చారిత్రకమైన, పౌరాణికమైన ప్రశస్తి కలిగిన దేవాలయాలు బహుశా దివిసీమ ప్రాంతంలో ఉన్నంతగా మరొక ప్రాంతంలో కనిపించక పోవచ్చు. స్థూలంగా ఈ విషయాన్ని పరిశీలించిన శ్రీ బుద్ధ ప్రసాద్‌గారు విజయవాడలోని దూరదర్శన్ కేంద్రానికి ఒక ప్రతిపాదన చేశారు. ఆ ప్రతిపాదనకు కార్యాచరణ రూపంగానే, అప్పట్లో విజయవాడ దూరదర్శన్ కేంద్రంలో పనిచేస్తున్న నేను వారి సహకారంతో దివిసీమ ప్రాంతాన్ని మా కెమెరా బృందంతో సహా పది పదిహేను రోజుల పాటు రెండు దఫాలుగా పర్యటించి, ఆ దేవాలయాలపై డాక్యుమెంటరీ చిత్రాలను నిర్మించడం జరిగింది. ఫలితంగా ఆ మధ్య జరిగిన కృష్ణానది పుష్కరాల సందర్భంగా పది పన్నెండు రోజుల పాటు విజయవాడ దూరదర్శన్ కేంద్రం పుష్కరాల ప్రత్యే ప్రసారాలను ప్రత్యేక ప్రాతిపదికన ఏర్పాటు చేసినప్పుడు, ఆ ప్రసారాలలో సింహభాగం, దివిసీమ ఆలయాల డాక్యుమెంటరీల ప్రసారమే. ఈ విషయాన్ని ఇక్కడ మనం గుర్తుపెట్టుకోవాలి. పరోక్షంగా దివిసీమ ఆలయాల చారిత్రక, పౌరాణిక ప్రాశస్త్యాన్ని ఆంధ్రదేశ ప్రజానీకానికి అందించడంలో శ్రీ బుద్ధ ప్రసాద్ ఒక ప్రముఖపాత్రను పోషించారు.

ఏదైనా కార్యదీక్ష, అంకితభావం కలిగిన ఒక నేతగా, విలువలెరిగిన మనిషిగా, వర్తమాన రాజకీయ రంగానికి, వర్తమాన సామాజిక సేవారంగానికి, వర్తమాన సాంస్కృతిక రంగానికి చిరకాలం గుర్తుండిపోయె వ్యక్తి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్. తీర ప్రాంతపు ఉప్పెన గాలులు ఎంత తీవ్రంగా వీచినా, నిలకడగా నిలచి వెలగగలిగిన దివిదీపం శ్రీ బుద్ధ ప్రసాద్.

O

# మానవత్వం పరిమళించే మండలి

- శ్రీ కొండవీటి ఈశ్వరరావు

తెలుగు బాషను, తెలుగు తేజాన్ని ప్రపంచ వ్యాప్తంచేసిన ప్రముఖ గాంధేయవాది ఆదర్శ రాజనీతిజ్ఞుడు, దివిసీమ అభివృద్ధికి మూలవిరాట్ అయిన శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి తనయుడైన శ్రీ బుద్ధ ప్రసాద్, తండ్రి అడుగుజాడల్లో పయనిస్తూ నేటి రాజకీయ ప్రస్థానంలో తనదైన శైలిలో ఒక విశిష్ట ప్రజానాయకుడుగా మరియు ప్రజా ప్రతినిధిగా గుర్తింపును సొంతం చేసుకున్నారనుటలో ఎలాంటి అతిశయోక్తి లేదు.

**విద్యార్థిగా :** విద్యార్థి దశనుండి ఆయనది ఒక ప్రత్యేకశైలి. ఒక సాధారణ విద్యార్థిగా కేవలం ప్రభుత్వ పాఠశాలలో, కళాశాలలో విద్యనభ్యసించడం, R.T.C. వాహనంలోనే ప్రయాణించడం, గురువులు, పెద్దల పట్ల వినయ విధేయతలు కలిగి ఉండటం, అందరితో సౌమ్యుడుగా మెలగడం ఆయన ప్రత్యేకతలు. రాష్ట్రమంత్రికి తనయుడననే దర్పం ఎప్పుడూ కనబర్చలేదు. ఎలాంటి ఆర్భాటం, పటాటోపం లేకుండా ఒక సాధారణవ్యక్తిగానే సార్థక నామధేయుడుగా పేరు గడించారు.

**కాంగ్రెస్ వాదిగా :** తండ్రి అడుగుజాడల్లో కాంగ్రెస్ పార్టీలో ఒక సామాన్య కార్యకర్త స్థాయి నుండి తన రాజకీయ ప్రస్థానం ప్రారంభించి కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా దాదాపు 12 సంవత్సరాలు పార్టీని ఒకతాటిపైన నడిపించి రాజకీయ ఉద్దండ పండితులు సైతం 'భేష్' అనే విధంగా కష్టకాలంలో కాంగ్రెస్‌కు వెన్నంటి వుండి 2004 అసెంబ్లీ ఎన్నికల్లో పార్టీని విజయ పథంవైపు నడిపించి జిల్లాలోని 17 అసెంబ్లీ సెగ్మెంట్లలో 15 నియోజక వర్గాలలో విజయ పతాకం ఎగురవేయుటకు 2 పార్లమెంటు నియోజక వర్గాల విజయానికి కృషి సల్పిన పోరాట యోధునకు తనంత తానై మంత్రి పదవి వరించి వచ్చి ఆయన వ్యక్తిత్వానికి మరింత శోభను చేకూర్చింది.

**తెలుగు భాషా సంస్కృతీ పరిరక్షకుడుగా :** ఒక సాధారణ విద్యార్థి స్థాయి నుండి అసాధారణ స్థాయికి చేరడం వెనుక ఆయనలోని కృషి, పట్టుదల, దీక్షలాంటివి ముఖ్య లక్షణాలు. పుస్తక పఠనం, పుస్తక సేకరణ, సాహితీసేవ ఆయనకు ఇష్టమైన నిత్య కృత్యాలు. ప్రయాణంలో సైతం పుస్తక పఠనం ఆయన అలవాటు. తెలుగు భాషా సంస్కృతుల పట్ల ఆయనకుగల మమకారం ఎనలేనిది.

గత కొన్నేళ్ళుగా తెలుగు భాషా పరిరక్షణకు నడుంబిగించి భాషోద్యమంలో ముఖ్య భూమిక పోషిస్తూ సంస్కృతీ సంప్రదాయాల పరిరక్షణకై కృష్ణా మరియు దివి మహోత్సవాల నిర్వహణా బాధ్యతను తన భుజస్కంధాలపై వేసుకొని మరుగున పడిన గ్రామీణ కళలైన కోలాటం, చెక్క భజన, డప్పు విన్యాసాలు, మొదలైన వాటిని ప్రోత్సహిస్తూ ఇటు కళాకారులకు చేయూతనిస్తూ, విద్యార్థులకు గ్రామీణ కళలపట్ల మక్కువ పెంచుకునే విధంగా బాలోత్సవ వేడుకలను నిర్వహించి బాలలపట్ల తమకు గల ప్రేమానురాగాలను చాటుకున్నారు. ఆంధ్ర రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో బాలల కార్యక్రమాలు ఏ విధంగా జరుపబడు తున్నాయని నిత్య అన్వేషణలో వుండే బాలబంధు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్.

**ప్రజా నాయకుడిగా :** ప్రజల శ్రేయస్సే తన శ్రేయస్సుగా కొన్నికీలక సమయాలలో తన ఆరోగ్యాన్ని, తన శాసన సభ్యత్వాన్ని సైతం లెక్కచేయక లక్ష్యసాధనకోసం చూపిన తెగువ ప్రశంసనీయం.

కృష్ణాడెల్టా పరిరక్షణకొరకు ఆమరణ నిరాహారదీక్ష, పులిగడ్డ-పెనుమూడి వారధి కొరకు శాసన సభ్యత్వం త్యజించుటకు సిద్ధపడం వంటివి ప్రజా సంక్షేమంపట్ల ఆయనకుగల ధృఢ సంకల్పానికి నిదర్శనంగా చెప్పవచ్చు.

ఇన్ని విశిష్ట లక్షణాలు గల ఆదర్శనీయుడైన శ్రీ బుద్ధ ప్రసాద్ గారికి సహాధ్యాయిగా, మిత్రునిగా, శ్రేయోభిలాషిగా మరియు అభిమానిగా ఈ సంచిక ద్వారా నా అభిప్రాయాలను వ్యక్తీకరించే అవకాశం కల్పించిన కృష్ణాజిల్లా రచయితల సంఘానికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

○

# దివిసీమ నవ్వింది

- శ్రీమతి కె. భూలక్ష్మీదేవి

దివిసీమ గాంధీ వంశోద్ధారకుడు ।
బుద్ధ విహార క్షేత్ర ప్రాంత బుద్ధుడు ॥
దివిసీమ గాంధీ ప్రసాదం, బుద్ధ ప్రసాద్ ।
దివిజనోద్ధరణకు నిజమైన విజయలక్ష్మి ప్రసాద్ ॥
చిరునవ్వే అలంకారము ।
చిరుత శక్తే లక్షణము ॥
దొంగ హామీలు లేవు, దొరలా ఆచరణ తప్ప ।
ఆరంభ శూరత్వాలు లేవు, అనుకున్న సాధన తప్ప ॥
జలాల సాధనతో రైతాంగానికి లాలన వేళ,
తక్షణ సేవా తపనతో సునామీబాధితులకు లాలన వేళ,
.....అందుకే పులకించి దివిసీమ నవ్వింది.
సంఘం శరణం అన్నాడా గౌతమ బుద్ధుడు,
సంఘసేవే వ్యక్తిత్వ లక్షణం అన్నట్లున్నాడీ మండలి బుద్ధుడు.
స్వచ్ఛందంగా సేవచేయడంలో శ్రేష్ఠుడు,
స్వచ్ఛంద సేవా సంస్థలకు అత్యంత ఇష్టుడు,
.....అందుకే పులకించి దివిసీమ నవ్వింది.
పశుగణాభివృద్ధి దేశాభివృద్ధి ।
బుద్ధ ప్రసాద్ గారి రీతి దివిసీమ అభివృద్ధి ॥
..... అందుకే పులకించి దివిసీమ నవ్వింది.

○

# యాత్రా రచనలో మేటి

- శ్రీ లంక వెంకట రమణ

నిర్విరామమైన కార్యక్రమాలు, క్షణం విరామం ఇవ్వని సందర్శకులు, ఉదయం బందరు, భోజనానికి అవనిగడ్డ, సాయంత్రం వేకనూరులో సభ...రాత్రికి హైదరాబాద్ ప్రయాణం. రాజకీయ నాయకులకు ఇలాంటివి నిత్యకృత్యంలో ఉండేవే! అయితే బుద్ధప్రసాద్‌గారు విలక్షణమైన నాయకుడు.

పద్మపత్రమి వాంభసాః.....అన్నట్టు వేటినీ అంటించుకోని విలక్షణతే ఆయనకు ప్రత్యేకత ఇస్తుంది. అలా కూడా చాలా మంది ఉండవచ్చు. అసలు తీరిక అంటూ వుంటే ఉన్నంతలో వీలు చేసుకొని ఎప్పుడు ఎలా చదువుతారో మంచి చదువరి ఆయన. సాధారణంగా కారు ప్రయాణాల్లోనే చదువుతారు. బహుశా అదికూడా తోడు ఎవరూ లేనపుడే! ఎవరైనా వుంటే ఏవేవో కబుర్లే సరిపోతాయి. ఆయనతో నాకున్న పరిచయంలో ఎన్నడూ ఆయన రాజకీయాలుగానీ, రాజకీయ వాసనగల అంశాలపైన చర్చించలేదు. ఏ సాహిత్య పరమైన, సంస్కృతి పరమైన అంశమో మాట్లాడేవారు; మాట్లాడించేవారు.

ఉత్తర సర్కారు జిల్లాలు, దివి సీమలపై ఈస్టిండియా ఆధిపత్యం, కాంగ్రేగుల జోగి పంతులు దౌత్యం గురించిబుద్ధ ప్రసాద్‌గారికి కొంత అవగాహన వుంది. ఆ అవగాహనకు కారణమైన జోగిపంతులకు, వర్తమాన రాజకీయ ప్రముఖునికి మధ్య సామ్యం గురించి మార్క్సిస్టు పార్టీ చేసిన వ్యాఖ్యానాలను బుద్ధప్రసాద్ తెలియజేశారు. చరిత్రపట్ల అభిరుచిగల నాకు ఈస్టిండియా కంపెనీ జోగి పంతుల మధ్యగల సంబంధాల గురించి గొప్పగా కాదుగానీ చాలా వరకు అవగాహన వుంది. అయితే బుద్ధ ప్రసాద్ గారు చూపించిన కోణం భిన్నమైనది, విచిత్రమైనది. ఆ కోణం నాకు చూపించి నన్ను కొత్త కిటికీలోంచి దివిసీమ చరిత్ర అధ్యయనానికి ప్రేరేపించారు.

ఉత్తమ పాఠకుడు ఎంత తక్కువ చదివినా దాని నుంచి గొప్పగా స్ఫూర్తి పొందుతాడు. బహు గ్రంథ పరిచయంగలవాడు పత్రిక పేరు నుంచి ఎడిటర్, ప్రింటర్ అండ్ పబ్లిషర్ వరకు చదవడు. ప్రారంభం, ముగింపు. అక్కడక్కడా చూస్తాడు. మెతుకు పట్టినట్టన్నమాట. లోపల సరుకు అవగాహనకు వస్తుంది. అనుభవం ఆ సామర్థ్యం ఇస్తుంది.

జోగి పంతులుకు, వర్తమాన రాజకీయ ప్రముఖునికి మధ్యగల సామ్యంపై మార్క్సిస్టు పార్టీ చేసిన వ్యాఖ్య బుద్ధ ప్రసాద్‌గారి దృష్టికి వచ్చింది. రాజకీయాలు ఏనాడూ మాట్లాడని ఆయన ఇచ్చిన ప్రేరణ నన్ను కొత్త అన్వేషణకు ప్రేరేపించింది. ఫలితం దివిసీమ చరిత్రలో ఏనాడూ వెలుగు చూడని 250 సంవత్సరాల విశేషాలు బయటపడ్డాయి.

ఉత్తమ పాఠకుడు తాను చదివిన అంశాలను పదిమందికి పంచుతాడు. తన విజ్ఞానాన్ని, సమాచారాన్ని పెంచుకొంటాడు. నిజం చెప్పాలంటే ఎంత గొప్ప వ్యక్తికి అయినా నిరంతరం చదవడం సాధ్యం కాదు. విజ్ఞానం సంపాదించిన చదువరులతో పంచుకోవడంలోనే పరిపుష్ట మవుతాడు.

ఇటీవల ఆయన చైనా, జర్మనీలలో పర్యటించిన తరువాత రెండు చక్కని యాత్రారచనలు వెలయించారు. ఆ రెండూ అమూల్యమైన సమాచార గర్భితమైనవి. రచనా ప్రణాళికగాని, విషయ విశదీకరణ పద్ధతిగాని, భాషగానిచాలా సరళమైనవి.

నాకు అర్థం కాని అంశం ఒక్కటే! ఎవరు ఎంత రాత్రి ఫోన్ చేసినా ఓ క్షణంలో అందుకొనేటంత నిద్రలేనివాడు. ఎంత సూర్యోదయానికి పూర్వమే ఫోన్ చేసినా అందుకొనేటంత మెలకువగల మనిషికి అంత తీరిక ఎప్పుడు దొరుకుతుంది? ఆ రెండు యాత్రా రచనలు చదివిన తరువాత రచయితకు-ముఖ్యంగా యాత్రా రచనలకు ఎంత 'హోమ్ వర్క్' అవసరమో అర్థమవుతుంది.

జర్మనీలో ఆయన పర్యటించినపుడు కలుసుకొన్న వ్యక్తులు, దర్శించిన ప్రదేశాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించేటప్పుడు, ఫోటోలు సంపాదించేటప్పుడు ఆయన రచయితగా భావించుకొని సేకరించారో లేక అంతా సేకరించిన తరువాత 'ఎడిట్'చేసుకొన్నారో నాకు ఇప్పటికీ అంతుపట్టలేదు. తాను సేకరించిన సమాచారాన్ని అంతటిని ఆ పుస్తకంలో ఇవ్వలేక పోయివుండవచ్చు. చెప్పవలసినదంతా చెప్పలేక పోయివుండవచ్చు. అది సహజమే! ఏ రచయిత అయినా పడే అవస్థ అది. చెప్పినది ఎంత హృదయంగమంగా, పాఠకుడి మనసును హత్తుకొనే విధంగా చెప్పగలిగాడా అన్న అంశంపైనే రచయిత విజయం ఆధారపడి వుంటుంది.

యాత్రా రచన చాలా క్లిష్టమైన విషయం. కలుసుకొన్న వ్యక్తులు, సందర్శించిన ప్రదేశాలు, పొందిన అనుభవాలను రంగరించుకొంటూ, వడబోసుకొంటూ రమ్యమైన చిత్రీకరణకు

అవసరమైన వర్ణనలకు లోటు రానివ్వకుండా రచనసాగించాలి. అంతేగాక అది సాధారణ పాఠకులనుద్దేశించి చేసిన రచన.

ఆయన జర్మనీ యానం రచన వస్తురీత్యా చాలా సునిశితమైన, ప్రమాదకరమైన రచన. ఆయన సునాయాసంగా కృతకృత్యుడయ్యారు. అది సునిసితము, ప్రమాదకరమైన రచన ఎలాగంటే........

నాజీల నుంచి క్షతగాత్రమైన జర్మనీ రెండుగా చీలిపోవడం చారిత్రక సత్యం. రెండు జర్మనీలను విభజిస్తూ ఒక గోడ కూడా కట్టారు. కొన్ని చోట్ల ఆ గోడ ఒక ఇంటిలో కొంత భాగం తూర్పు జర్మనీ లోకి, కొంత భాగం పశ్చిమ జర్మనీలోకి వెళ్లే విధంగా నిర్మితమైంది. ఇది మానవతకు అపచారమని నాగరక ప్రపంచం ఘోషించింది. అనివార్యమైన చారిత్రక పరిణామాల్లో ఆ గోడ కూలిపోయింది. ఉభయ జర్మనీల విలీనం జరిగింది.

ఇక్కడ సునిశితమైన విషయమేమంటే జర్మన్ సెంట్‌మెంట్ దెబ్బతినే అంశాలు పుష్కలంగా వున్నాయి. ప్రయాణానికి సిద్ధమవుతూ వుంటే ఎవరో తుమ్మితే, సినిమా తీస్తున్నప్పుడే సెన్సార్ కత్తెర కనిపించినట్టుగా జర్మన్ సెంట్‌మెంట్ ఈ రచనలో అడ్డం వస్తుంది. కాని, ఆ ప్రమాదం లేకుండా, రాకుండా నేర్పరిగా రచన సాగించారు.

తూర్పు జర్మనీ సిద్ధాంతానికి కట్టుబడిన అట్లాండ్స్‌బర్గ్ నగర సందర్శనకు సంబంధించిన ఆ రచనలో 'జర్మన్ సెంట్‌మెంట్' చాలా కష్టం. ఎంత కష్టమంటే హిట్లర్ వల్ల నష్టపోయిన, కష్టాలు పడిన జర్మన్ జాతిని విముక్తం గావించడంలో దాగిన సంక్లిష్టత అంతటిది. తిరిగి రెండు జర్మనీలను కలపడంలో దాగిన క్లిష్టత లాంటిది. మానిపోతున్న గాయాలను గుర్తుచేయడం లాంటి యాంటిసెంటిమెంట్ కు చోటులేకుండా యదార్థ చిత్రీకరణ ఆయన 'నా జర్మనీ యానం'.

బుద్ధ ప్రసాద్‌గారు నుంచి అలాంటి రచనలు మరిన్ని రావాలని కోరుకుంటారు నా లాంటి వాళ్లంతా !

O

# మా బాబు

- శతావధానిశేఖర డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

పెద్దకళ్లేపల్లి వేంచేసి యున్నట్టి
    నాగేశ్వరస్వామి యోగదీప్తి
మోపిదేవిని హితమూర్తి సుబ్రహ్మణ్యు
    కరుణాకటాక్ష వీక్షణ గణమ్ము
భావదేవరపల్లి భావనారాయణుని
    కృప సంగమేశ్వరు విపుల శక్తి
విమల హంసలదీవి వేణుగోపాలుని
    ప్రోత్సాహ పూరిత బుద్ధిగరిమ

సాధు నాంచారమయు విశ్వనాథపల్లి
నవనిగడ్డ లంకమ తల్లి ఆశిషములు
అందరిని మించి కృష్ణవేణమ్మ కరుణ
బాగుగా చూచుచుండు 'మా బాబు' నెపుడు 1

తనను మంత్రిగారనియొ బుద్ధ ప్రసాదు
గారనియొ పిల్చుగాక లోకమ్మదెల్ల
పసితనమ్ము నుండియు మాకు 'బాబు' పిలుపె
కొంత 'మా బాబు' గూర్చి వచింతు నిపుడు 2

అతడీనాడు సమున్నత స్థితి నమాత్య ప్రాభవం బందుటన్
నుతి ముంచెత్తుట కాదు నేనెరిగి ఎంతో సాన్నిహిత్యంబునన్
ఇతడిట్లంచును నక్షరాచ్ఛ సుమన స్సృష్టిన్ ప్రపంచించెదన్
బ్రతుకీ నాటిది నెత్తురెప్పటిదొ ఆంధ్ర ప్రాణి 'మా బాబు' కున్ 3

ఏబదేండ్ల వాడనుటది యేటిమాట
రెండు వేలేండ్ల పైవాడు పండు ముసలి
తెలుగుసంస్కృతి బాసయన్ తియ్యనైన
కుడుము చేతికిచ్చిన పండుగు పసివాడు 4

ఆయన జోస్యులాన్వయత నప్పుడె చెప్పె నెతింగి సూర్యనా
రాయణమూర్తి సద్గురుడు రమ్యగుణుండు సుధీవిధేయుడున్
నాయనగారి మించగల నాయకుడై వెలుగొందు నంచు నా
ప్యాయత నీ వికాసమును బాల్యమునందె ఫలించె మిత్రమా ! 5

చిన్నతనంబు నుండియును చేతులు కల్పి సమాజసేవతో
పిన్నల పెద్దలన్ గలసి వెన్నును తట్టు కళాభిమానమున్
కన్నుల సన్నలన్ సకలకార్యములన్ నడిపించు దక్షతల్
నిన్నిటు తీర్చిదిద్దినవి నిక్కముగా దివిసీమ రత్నమా ! 6

నాయకత్వ లక్షణమ్ముల నుగ్గుతో
పుణికి పుచ్చుకొను టపూర్వమైన
నందు సాత్త్వికత నిరాడంబరత తోడ
జనత నొక్కడైన ఘనత నీది 7

నా పసినాటన్ నేనే
దో పద్యము నాన్నగారు తొలిసారి అమా
త్యాపారవైభవము గన
నేపున వ్రాయవిని ప్రోత్సహించితివి సభన్ 8

రాజకీయ రభస రణగొణ ధ్వనిలోన
కస్సుబుస్సులును వికారములను
సాహితీ హితాళి సంభాషణములతో
సేదతీరెడి మరియాద నీది 9

తానై నీరిడి పెంచిన
ద్రుమానై అన్నమ్ముతినెడు మానిసిని గదా !
నేనేమిత్తును బాబుకు
ఆ నాయనగారు నితడు నమృత మనస్కుల్ 10

బుడిబుడి నడకల నాడే
వడివడిగా తండ్రి వెంట వ్యవహారగతుల్
నడకలు నేర్చి నెఱుంగుడు
నడమంత్రపు మంత్రి కాదు నడిపెడి మంత్రిన్ 11

మంత్రి తనము కన్న మన్నన కలిగిన
సభ్యుడితడు నేటి శాసన సభ
మంత్రియగుట నద్ది మాటల కెక్కిన
దంతె కాని అందు వింత లేదు 12

మాతృ భాషకొఱకు జాతీయ భాషకై
చేతివృత్తులందు శిక్షణమునకు
గాంధి క్షేత్ర మెల్ల కళకళలాడగా
కష్టపడిన కార్యకర్త ఇతడు 13

'గాంధీ క్షేత్రం' పత్రిక
సంధించిన బాణమనగ సంపాదకుడై
గాంధేయ వాద ఫలముల
నందించెను చిన్ననాడె ఆంధ్రావనికిన్ 14

శరతల్ప భీష్మ మూర్తిగ
నొరిగిన తన తండ్రిగారి ఊహలెఱిగి ఎ
ల్లరి తలలో నాల్కగ మేల్
తెరువున నడిచిన శ్రమలు ఫలించె హితముగా 15

కవులున్ గాయకులున్ సమాజహితమున్ కాంక్షించు సంస్కర్తలున్
వివిధోద్యోగులు నాయకోత్తములు నన్వేషించుచున్ వచ్చి మా
దివిలో మండలి కృష్ణారావు గని గాంధి క్షేత్రమున్ మెచ్చు న
ష్ట వెలింగెన్ మది లక్ష్యమిట్లు నడువన్ బుద్ధ ప్రసాద్ శైలికిన్ 16

ఆస్తికులో నాస్తికులో
మస్తుగ సొమ్మున్నవారో మరి పేదలో తా
నేస్తము కట్టును మండలి
వాస్తవమగు దీనజనుల బాధల దీర్పన్ 17

భౌగోళిక మార్థికమౌ
బాగోగులు సంస్కృతియును ప్రజలకు హిత మే
దో గట్టిగ తెలిసిన వా
డౌగద బుద్ధ ప్రసాదు అతనికి జయమౌ 18

శాసన సభ్యుడై జనుల శాంతి సుఖమ్ములు తీర్చిదిద్దగా
చేసిన చేయుచున్న ఇక చేయగలట్టి పనుల్ దలంచుచున్
ధ్యాస నొనర్చు సేవలు యథాతథమై కొనసాగ వాఙ్మయో
పాసన శ్రద్ధతో సలుపువానిని మంత్రి నొనర్చె వాణియే 19

ఏమి విచిత్రమో హరియు నీశ్వరు డొక్కని గొల్వ మెచ్చుచున్
కామిత మిచ్చు నింకొకడు కాకుళమందున నాంధ్ర విష్ణు పూ
జామతి నుత్సవమ్ములను సల్పగ మెచ్చిన రాజశేఖర
స్వామి అమాత్యుజేసె తన వాడనుచున్ మన గడ్డ వేల్పుగా 20

చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాడె
బాల లకాడమీ ప్రముఖుడయ్యె
నూనూగు మీసాల నూత్న యౌవనమున
తెలుగు మహాసభల్ వెలుగులరసె
సంతరించెను నిండు జవ్వనమున యందు
పెను ఉప్పెనన్ దీన జనుల సేవ
ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున చేసె
కోస్తాకు డెల్టాకు గొప్ప పనులు

సాధుమండలి బుద్ధ ప్రసాదు నిపుడు
మంత్రిగా చూచు భాగ్యమ్ము మనకు కలిగె
పసిడికిన్ తావి అబ్బిన పండుగయ్యె
ఆయురారోగ్య భోగ భాగ్యాళి రస్తు 21

ఏసైన ఈశుడైనను
భాసుర గోపాలుడైన పశు రక్షణమే
చేసిరి మన కర్తవ్యము
గా సిరులుప్పొంగ జేసి ఘనతం గనుమా ! 22

చేటపెయ్య చూపి చేపిన పాలన్ని
పిండుకొనెడు మనిషి దుండగమును
మౌనముగ భరించు మహనీయ జీవుల
సేవ బుద్ధుడొకడె చేయగలడు 23

పుట్టిగిట్టు వరకు పోదు నీటిని వీడి
బురద నంటబోదు పుక్కిలించి
శుభ్రపరచుచుండు చూడదు స్వార్థమ్ము
మత్స్య మితడు నట్టి మంచి నేత 24

వేదముల నుద్ధరింపగ విష్ణుమూర్తి
అవతరించిన జాతి మత్స్యంబుగాన
దాని రక్షణ మగును వేదముల రక్ష
మంత్రి మండలి కిద్ది క్షేమ ప్రదమ్ము 25

చరితయు బాసయున్ తెలుగు సంస్కృతి, సాహితి, ప్రాత క్రొత్తలో
తెలిగిన జ్ఞాన సంపద యదెట్టుల చేకురె ? పిన్నపెద్దలన్
మరువక గుర్తు పెట్టుకొన మాటలె? జ్ఞాపక శక్తి ఇట్టిదై
వరలెడు సాధుమూర్తికి శుభంబులు కోరని వారలుందురే ? 26

జయతు జయతు మంత్రీ మండలీద్యాబ్ధి చంద్రః
సురుచిర ఘనకీర్తేః కృష్ణరాయస్య పుత్రః
భవతు కనకదీప్త్యా వర్ధమాన శ్శతాయుః
విజయపథ విహారీ శ్రైతు బుద్ధ ప్రసాదః 27

# "మండలి" వారు - జ్ఞాపకాలు

- శ్రీ మండవ శ్రీరామమూర్తి

మా స్వగ్రామం నాగాయలంక. దివితాలూకాలో నాడు ఫిర్కా కేంద్రం. నేడు మండల కేంద్రం. శ్రీ మండలి వెంకట కృష్ణారావు (4-8-1926 - 27-9-1997) గారి స్వగ్రామం భావదేవరపల్లి. కృష్ణారావుగారి తండ్రి వెంకట్రామయ్య (1890-1969) గారు ఉపాధ్యాయుడు. మా తండ్రి మండవ పాంచయ్య (1890-1976) గారు గ్రామ పెద్దలలో ఒకరుగా వుండేవారు. కృష్ణారావు గారి సతీమణి ప్రభావతి తండ్రి, భోగాది వెంకట్రామయ్య గారు నీటిపారుదల శాఖలో ఉద్యోగం చేసేవారు. నాగాయలంకలో నివాసం ఏర్పాటుచేసుకొని పిల్లలను నాగాయ లంకలో చదివించారు. శ్రీ మండలి కృష్ణారావుగారితో ప్రభావతీదేవి వివాహం 1952 నాగాయ లంకలోనే జరిగింది.

మా పంట పొలాలు తలగడదీవి, కొత్తపాలెం, పెదపాలెంలో విస్తరించి వుండటం వల్ల - చివరిగా సాగునీరు అందేది. ఆ సమస్యను పరిష్కరించి సకాలంలో నీరు అందించే విషయం సంప్రదించటానికి శ్రీ భోగాది వెంకట్రామయ్య గారు మా నాన్నగారి వద్దకు వస్తూ వుండే వారు. రైతులకు సహాయకారిగా వుండేవారు. కృష్ణారావుగారు 1957లో బందరు లోక్‌సభకు ఎన్నికయ్యే వరకు నాగాయలంక, బందరు, హైదరాబాద్ - కాంగ్రెసు వాదిగా - ఆయన కార్య క్షేత్రాలు. కృష్ణారావు గారికి మా గ్రామంలో శ్రీ వుప్పల కుటుంబయ్య, శ్రీ తలశిల కృష్ణమూర్తి, శ్రీమండవ పిచ్చయ్య (మా రెండో అన్న) తమ సహకారాన్ని అందించే వారు. పార్లమెంటు సభ్యుడైన తర్వాతే అవనిగడ్డలో మకాం. పార్లమెంటు సభ్యుడుగా ఉన్న సమయంలో సన్నిహితులైన కాంగ్రెసు వాదులకు ఏ తేదీ, ఏ గ్రామం పర్యటించేది తెలిపి, పాదయాత్రలు చేసి సమస్యలు తెలుసుకొని, పరిష్కార మార్గాలు వెతికేవారు.

1957-62 వరకు మా గ్రామం నాగాయలంకలో విద్యార్థులు యువకులు కలసి యూత్‌క్లబ్ మరియు లైబ్రరీ నిర్వహించాము. దానిలో వామపక్ష భావాలున్న యువకులు కూడా

ఉండేవారు. 1959 మేలో లైబ్రరీ వార్షికోత్సవానికి యువ నాయకుడు, లోక్‌సభ సభ్యుడు మండలి కృష్ణారావు, 'రైతుపెద్ద' గొట్టిపాటి బ్రహ్మయ్య, మానవతావాది ఆవుల గోపాలకృష్ణమూర్తి (తెనాలి) గార్లను ఆహ్వానించాం. దేశాభ్యున్నతికి యువజనులు నిర్వహించవలసిన బాధ్యతను గురించి వక్తలు మాట్లాడారు.

నేను బందరు హిందు కలాశాలలో 1957-59లో బి.ఎ. చదువుచున్న రోజుల్లో- 'రైతుపెద్ద' గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్ఠిపూర్తి ఉత్సవం 31-12-1958 తేదీ శ్రీ మండలి ఆధ్వర్యంలో ఘనంగా జరిగింది. శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ కొండా వెంకట రంగారెడ్డి (నాటి ఉప ముఖ్యమంత్రి) శ్రీ దామోదరం సంజీవయ్య ప్రభృతులతో జిల్లా కాంగ్రెసు భవనం ఆవరణలో కొలువుదీరి బ్రహ్మయ్యగారి సేవలకు జేజేలు పలికారు సభకు హాజరవటం, అదే రోజు సాయంత్రం బందరు పార్కులో జరిగిన సన్మాన సభకు శాసనసభ సభాపతి అయ్యదేవర కాళేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు కవిసామ్రాట్ విశ్వనాథ, తెలుగులెంక తుమ్మల శ్రీరామచంద్రమూర్తి పాల్గొన్న వేడుకకు హాజరు అవటం నా జీవితంలో తీపి గురుతులు. మండలి కృష్ణారావు గారి కార్య దక్షతతో, పెద్దలను, స్వాతంత్ర్య సమరయోధులను, సమాజ సేవకులను, తెలుగు వెలుగులను గౌరవించే సత్‌సాంప్రదాయాలకు ఆనాడే నాంది పలికారు.

1972లో అవనిగడ్డ శాసనసభా నియోజక వర్గం నుండి శ్రీ మండలి ఏకగ్రీవంగా ఎన్నికై, శ్రీ పి.వి.నరసింహారావు మంత్రి వర్గంలో-సాంఘిక సంక్షేమ, మత్స్య పరిశ్రమ శాఖా మంత్రిగా, శ్రీ జలగం వెంగళరావు మంత్రివర్గంలో (1974) విద్యా, సాంస్కృతిక శాఖా మంత్రిగా, శ్రీ కె.విజయభాస్కర రెడ్డి (1982) మంత్రివర్గంలో సహకారశాఖ మంత్రిగా పనిచేశారు.

1972 - 85 వరకు శాసన సభ్యుడుగా అవనిగడ్డ నియోజక వర్గ సమగ్ర అభివృద్ధికి- వ్యవసాయం, నీటిపారుదల రంగంలో ఎంతగానో కృషిచేశారు. 1974లో అఖిల భారత తెలుగు మహాసభలు, 1975 ఏప్రిల్‌లో హైదరాబాద్‌లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించటం, 1975 సెప్టెంబరు 8వ తేదీ "అంతర్జాతీయ తెలుగు సంస్థ" కు రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ గారిచేత ప్రారంభోత్సవం చేయించటం-రాష్ట్ర విద్యా, సాంస్కృతిక శాఖా మంత్రిగా కృష్ణారావు గారి ప్రతిభకు, కార్యదక్షతకు నిలువెత్తు సాక్ష్యాలు. సాహిత్య అకాడమీతో పాటు, రాష్ట్ర ఉర్దూ అకాడమీని, బాలల్లో మనో వికాసం అభివృద్ధి చేయడానికి బాలల అకాడమీని స్థాపించారు. సాంస్కృతిక కార్య క్రమాలు, కవి సమ్మేళనాలు, సాహిత్య సమావేశాలు రాష్ట్రమంతటా జరిపించి, సాంస్కృతిక విప్లవానికి నాంది పలికారు.

మహాసభల్లో శంకరంబాడి సుందరాచారి "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" గేయాన్ని, టంగుటూరి సూర్యకుమారిచేత ఆలపింపచేసి, తెలుగుజాతిని ఉత్తేజితులను చేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో 19 నవంబరు 1977న ప్రకృతి ప్రళయ గర్జనలతో వికటాట్టహాసం చేసిన రోజు. ఉప్పెన, తుఫాను బీభత్సంలో దివిసీమను కబళించిన రోజు. వేలాది మంది ప్రజల నిండు ప్రాణాలు ఆ ప్రకృతి విలయతాండవంలో బలైపోయాయి. లక్షల ఎకరాలలో పంట పొలాలు నీట మునిగాయి. లక్షల సంఖ్యలోనే పశువులు చనిపోయాయి. కృష్ణా, గుంటూరు జిల్లాలలో జరిగిన అపార నష్టాన్ని 'బెల్ గ్రాహం" లాంటి ప్రముఖులు ఈ ప్రాంతాన్ని సందర్శించి "20వ శతాబ్దంలో ప్రపంచంలో జరిగిన ఘోరవిపత్తు" అన్నారు. ఆనాడే – మండలి మంత్రిగా వున్నా సహాయ పునరావాస కార్యక్రమాలు–జరిగిన ఘోర విపత్తుతో పోలిస్తే నత్తనడకగా సాగుతున్నాయి. ఒక దశలో – మంత్రి పదవికి – రాజీనామా చేయాలని తలచారు. నాటి మంత్రి భాట్టం శ్రీరామమూర్తి, రాష్ట్ర సహకార బ్యాంకు అధ్యక్షుడు బి. రత్న సభాపతి సలహా మేరకు రాజీనామా ప్రతిపాదన విరమించు కున్నారు. కృష్ణారావు గారిచ్చిన సమాచారంతో నాటి రాష్ట్రపతి సంజీవ రెడ్డి, ప్రధాని మొరార్జీ దేశాయ్, మాజీ ప్రధాని ఇందిరా గాంధీ, చంద్రశేఖర్, మదర్ థెరిస్సా లాంటి ప్రముఖులు దివిసీమ సందర్శిం చారు. పునరావాస కార్యక్రమాలు చేపట్టి తుఫాను షెల్టర్లు నిర్మించి, దేశ, విదేశాలలోని స్వచ్ఛంద సంస్థలు ఇచ్చిన సహాయ, సహకారాలతో బాధితులకు ఊరట కలిగించారు. మండలివారి ప్రజా జీవితంలో – 1977 నవంబరు సంఘటన – ఆయన శక్తియుక్తులకు అగ్ని పరీక్ష–ఆ పరీక్షలో నెగ్గారు ధన్యజీవి.

1978 శాసనసభ ఎన్నికలలో, 1983 ఎన్నికల్లో విజయ బావుటా ఎగరవేశారు.

1984లో జరిగిన కారు ప్రమాదంలో ఆరోగ్యం కోల్పోయి 1997లో కన్ను మూశారు.

శ్రీ బుద్ధ ప్రసాద్ 'తండ్రికి తగిన తనయుడుగా' – గత మూడు దశాబ్దాలుగా సామాజిక పరిస్థితులను ఆకళింపుచేసుకొన్నాడు, అందుకు తగిన రీతిలో అడుగులు వేశాడు. యువజన కాంగ్రెసు కార్యకర్తగా రంగంలో దిగి, "గాంధీ క్షేత్రం" మాస పత్రిక ఎడిటర్‌గా, దివి ఐతిహాసిక పరిశోధక మండలి అధ్యక్షులుగా, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులుగా, తెలుగు సమితి (హైదరాబాద్) అధ్యక్షులుగా, దివి మహోత్సవాల సంచాలకులుగా, కూచిపూడి నృత్య కళాశాల అభివృద్ధి, ఇటీవల (2007 ఫిబ్రవరి) ఘంటశాల మండలం, శ్రీకాకుళంలో జరిగిన శ్రీకృష్ణదేవ రాయ మహోత్సవాలు నిర్వహించటం – శ్రీ బుద్ధ ప్రసాద్‌కు మన జాతి చరిత్ర, సాహిత్యం, భాష సంస్కృతుల పునరు జ్జీవనం పట్ల గల ఆసక్తికి నిదర్శనం. సాహిత్యం, సాంస్కృతిక, కళా రంగాల వికాసం పట్ల శ్రీ బుద్ధ ప్రసాద్ నిరంతర కృషి, దివి మహోత్స వాల నిర్వహణ, 'దివి' ని 'దివ్యసీమ'గా రూపుదిద్దాలని, పర్యాటక కేంద్రంగా వికసింపచేయాలనే ఆకాంక్ష మరో రెండు సంవత్సరాలలో ఆచరణకు నోచుకుంటుందన్నదే నా నమ్మకం.

ఇంతటి వైవిధ్యమైన రంగాల పట్ల శ్రీ బుద్ధ ప్రసాద్‌గారి ఆసక్తి వారు నిరంతరం చేసే కృషి విజయ పథం వైపు సాగుతుందనే నా ప్రబల విశ్వాసం.

1998 డిశంబరులో కాంగ్రెసు పెద్ద, పద్మభూషణ్ శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి శతజయంతి సభలు హైదరాబాద్ 'గాంధీ భవన్'లోను, జూబ్లీ హాలులో శ్రీ బుద్ధప్రసాదు వైభవంగా నిర్వహించారు. ఆ సభల్లోనూ దివిమహోత్సవాలు (అవనిగడ్డ) కృష్ణదేవరాయ మహోత్సవాలు (శ్రీకాకుళం) కృష్ణాజిల్లా రచయితల మహాసభల్లో (2006) పాల్గొనటం నాకొక తీపిగురుతు.

సామాజిక సమస్యలపట్ల పూర్తి అవగాహన కలిగిన శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రిగా బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించి, ఉజ్వల భవిష్యత్తుకు నాంది పలుకుతారని ఆశిద్దాం.

శ్రీ బుద్ధ ప్రసాద్ మాటల్లో "మా దివిసీమ ఎందరో మహాను భావులకు పుట్టినిల్లు. తెలుగు సంస్కృతికి, సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు మా దివిసీమ వాసులు. సిద్ధేంద్ర యోగి, క్షేత్రయ్య, అనంతా మాత్యుడు మొదలుకొని వేటూరి, ముట్నూరి కృష్ణారావు, పింగళి, పువ్వాడల నుండి ఆచార్య బాలగంగాధరరావు వరకు-ఎందరో సాహితీ వేత్తలు, పండితులు, పరిశోధకులు, కవులు, కళాకారులకు జన్మస్థలి మా దివిసీమ".

ఈ వ్యాస రచయిత (మండవ) గురించి శ్రీ బుద్ధ ప్రసాద్ అంటారు-"శ్రీరామమూర్తిగారు స్నేహశీలి. వివిధ రంగాలలో లబ్దప్రతిష్టులైన అనేకమంది ప్రముఖులు ఆయన స్నేహశ్రేణిలో వున్నారు. సమాజంలో మార్పుకోసం, ప్రజల్లో నవచైతన్యం తీసుకు రావడానికి ఎలా దోహద పడగలమా అనే ఆలోచన ఆయనది... గాంధీజీ, నెహ్రూ, అంబేడ్కర్ వంటి మహనీయుల జీవిత చరిత్రలను రచించారు. వారి కృషిని గుర్తించి తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ రచయితగా సత్కరించింది"

ఇలా కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్‌లో పలువురి పండితులను, సాహితీ వేత్తలను, వివిధ రంగాలకు చెందిన ప్రముఖులను తన వారిగా చేసుకొనటంలో దిట్ట. కళాతపస్వి డా॥ సంజీవదేవ్, మహాకవి దాశరథి కృష్ణమాచార్య, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత సి. నారాయణరెడ్డి, ఆచార్య ఎస్. గంగప్ప గారి లాంటి ఎందరో పెద్దలు ప్రసాద్ గారికి హితులు, సన్నిహితులు.

స్వాతంత్ర్య సమర యోధుడు దరువూరి వీరయ్య (గుంటూరు); ప్రముఖ పాత్రికేయులు బి.ఎస్.ఆర్.కృష్ణ (మద్రాసు); గాంధేయవాది లవణం (విజయవాడ), తెలుగు సమాఖ్య అధ్యక్షుడు సి. ధర్మారావు (హైదరాబాదు) గారితో మాట్లాడుతూ శ్రీ బుద్ధ ప్రసాద్ ప్రస్తావన కాస్త - ఆయన చేస్తున్న కృషిని అందరూ అభినందించేవారే ! వారితో మనం కూడా కలుద్దాం.

○

# తండ్రికి తగిన తనయుడు - మా బుద్ధ ప్రసాద్

- శ్రీ శీలం వీరరాఘవయ్య

రాష్ట్ర పశుసంవర్ధక శాఖ, మత్స్య శాఖా మాత్యులు
చిరంజీవి **మండలి బుద్ధప్రసాద్** గారికి
హృదయపూర్వక శుభాకాంక్షలు.
ఆయన జన్మదిన స్వర్ణోత్సవ సందర్భంగా
ఆయనకు, శ్రీమతి చి॥ల॥సౌ॥ విజయలక్ష్మికి,
చిరంజీవులకు గుండె లోతుల నుండి నిండు దీవెనలు.

నిత్యస్మరణీయులు, నిరాడంబరులు, నిజాయితీపరులు, ప్రజాసేవను వృత్తిగా కాక ప్రవృత్తిగా, గాంధేయవాద నిబద్ధతతో, స్వచ్ఛమైన రాజకీయ జీవితంతో దివిసీమను దివ్యసీమగా గాంధీక్షేత్రంగా తీర్చిదిద్ది, ప్రపంచ తెలుగు మహాసభల అపూర్వ నిర్వహణతో సమైక్యవాదాన్ని పటిష్టంచేసి, విశాలాంధ్ర రాజకీయ చరిత్ర పుటలలో తనపేరును సువర్ణాక్షరాలతో సుస్థిరం చేసుకొన్న మహానుభావులు కీర్తి శేషులు మాజీ మంత్రి వర్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు, వారి కుటుంబ సభ్యులతో నాకు, నా కుటుంబ సభ్యులకు ఏర్పడిన ఆత్మీయాను బంధానికి అరవైఏళ్లు దాటాయి.

పందొమ్మిది వందల ఏభై ఒకటిలో చల్లపల్లి కోటలో జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు కృష్ణారావుగారి ప్రసంగం విని నేను ఆయన అభిమానినయ్యాను. ఆనాడు నుండి ఈనాటి వరకు మా ఆత్మీయత స్వచ్ఛంగా కొనసాగుతోంది. ఇకముందుకూడా మరింతగా వర్ధిల్లాలని నా ఆకాంక్ష.

ఆయన వయస్సులో నాకంటె మూడేళ్లు చిన్నవాడు-ఆ విధంగా మాది అన్నదమ్ముల అనుబంధం. ఆయన సంఘసేవా తత్పరత, కార్య దీక్ష, లక్ష్యసాధన నిరాడంబరత నన్ను ఆయన వెంట నడిపించాయి. అప్పటి నుంచి ఎన్ని సమస్యలు వచ్చినా, ఎటువంటి క్లిష్ట

పరిస్థితిలో నైనా కలిసేఉన్నాం. ఎప్పుడూ మా పరిచయాన్ని తన స్వార్థానికి ఉపయోగించుకోలేదు. నేను క్లాస్‌వన్ కాంట్రాక్టరుగా యనమలకుదురు లాకుల నుంచి సముద్రంవరకు మధ్యలో కాలువలు, లాకులు, కట్టలు, అక్విడక్టు పనులు మొదలైన ఎన్నో ముఖ్యమైన డెల్టా అభివృద్ధి పనులు దిగ్విజయంగా పూర్తిచేసి ప్రజానాయకుల ప్రభుత్వ అధికారుల అభినందనలు అందుకొన్నాను. ఆ నాటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు 'నేను శంకుస్థాపన చేసి నేనే ప్రారంభోత్సవం చెయ్యటం ఆశ్చర్యంగా ఉంద'ని మెచ్చుకున్నారు. నన్ను ఈ విధంగా నడిపించింది మండలివారు. అయినా ఎప్పుడూ నన్ను ఏమీ అడగలేదు. మా ఇన్నేళ్ల పరిచయంలో చివరిలో ఆయన అడిగింది ఒక్కటే. అవనిగడ్డ షిరిడీసాయి మందిరంలో బాబాగారికి వెండి కిరీటం చేయించమన్నారు. ఆయన కోరినదీ నేను ఇచ్చినదీ అదే.

కృష్ణారావుగారు కోరుకున్నది సంపాదించింది సంపదకాదు. మంచిపేరు. ఆ రోజుల్లో శాసనసభ్యులకు ఇచ్చే భూమిని తీసుకోలేదు. ఒక మనిషికి ఆరో నాలుగో అడుగులుచాలు అన్నారు.

1975లో ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణకు ప్రభుత్వం పై ఒత్తిడి పడకుండా సినిమా నటుల ద్వారా ప్రజల నుండి విరాళాలు సేకరించి దిగ్విజయంగా సభలు జరిపి మిగిలిన పధ్నాలుగు లక్షలు ప్రభుత్వానికి జమకట్టిన పరిపాలనా దక్షుడాయన.

1997లో అనారోగ్యంతో ఉన్న సమయంలో నేను వారిని చూడటానికి వెళ్లినప్పుడు 'నాతో ఎలా ఉన్నారో బాబుతో కూడా అలాగే ఉండాలి' అన్నారు. 'బాబుతోనే కాదు మీ పిల్లలందరితోనూ నేనూ నా పిల్లలుకూడా అలాగే ఉంటాం' అని మాట ఇచ్చాను.

కృష్ణారావుగారితో ఉన్న స్నేహం వదిలేది కాదు. ఆయన ఎదుటి వారి కష్ట సుఖాలు తెలుసుకునే స్నేహశీలి. మా అబ్బాయిలు చిరంజీవులు దివాకర్, రాధాకృష్ణమూర్తి వివాహాలకు అవనిగడ్డలో వారింట్లోనే పెళ్లికొడుకులను చేయించారు.

సెక్యూరిటీ, ప్రభుత్వ వాహనం లేకుండా ఆర్టీసీ బస్సులో ప్రయాణం చేయటం, పూల దండలు తిరస్కరించటం మొదలైన గాంధేయ సిద్ధాంతాలతో నిరాడంబరంగా మంత్రి పదవిని నిర్వహించి చరిత్రలో చిరస్థాయిగా నిలిచిన మండలి వారి పెద్దకుమారుడు, ఆయన వేసిన బాటలో నడుస్తూ తండ్రికి తగిన తనయుడుగా దేశవిదేశాలలో కీర్తి ప్రతిష్ఠలు గడిస్తున్న చిరంజీవి బుద్ధ ప్రసాద్ కొంత ఆలస్యమైనా జన్మదిన స్వర్ణోత్సవ సంవత్సరంలో మంత్రి పదవిని అందుకున్నందుకు నేను, పిల్లలు పొందుతున్న ఆనందాన్ని మాటల్లో చెప్పలేకపోతున్నాను.

బాబు లాంటి సాత్త్వికమూర్తులు ఈ తరం రాజకీయ నాయకులలో అరుదు. మితభాషి మాటలు తక్కువ పని ఎక్కువ. తండ్రి గారి లాగానే ఎవరినీ ఏమీ అడగడు. ఆయన తత్త్వాన్ని

అర్థం చేసుకో లేని వారు సరిగా మాట్లాడానుకుంటారు. నటనలు చేతకాని బోళా శంకరుడు బుద్ధప్రసాద్. ఇంటికి వెళితే ఆయన, శ్రీమతి విజయలక్ష్మి, పిల్లలు ఎంతో మర్యాదగా చూస్తారు. ఇదీ వారి కుటుంబ వారసత్వంలో భాగమే. చిన్న తనంలోనే ప్రజాసేవా రంగంలో అడుగు పెట్టిన బుద్ధ ప్రసాద్‌గారు పసితనం నుండి నాకు తెలుసు. నిరంతర పరిశీలన, కార్యకర్తృత్వం, నిర్వహణ ఆయనకు రక్తగతంగా అలవడిన నాయకత్వ లక్షణాలు. కనుకనే రాష్ట్ర రాజకీయ పటంలో ప్రత్యేకతను సంతరించు కొన్న కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా కష్టకాలంలో పార్టీని బలోపేతం చేసి విజయ పథంలో నడిపించగలిగారు.

దివిసీమలో, కృష్ణాజిల్లాలో, రాష్ట్రస్థాయిలో ఎన్నో సంస్థలకు అధ్యకుడుగా ప్రజాసేవా సాంస్కృతిక అభివృద్ధి రంగాలలో ఎడతెరిపి లేకుండా అలుపెరుగక కృషిచేస్తున్నారు. హంసలదీవి, అవనిగడ్డ శ్రీకాకుళం, చిలకలపూడి, కూచిపూడి మొదలైనచోట్ల కృష్ణా మహోత్స వాల వంటి ఉత్సవాలతో ప్రజలను చైతన్య పరచటం, ఆయా ప్రాంతాల అభివృద్ధికి కృషిచేయటం, డెల్టా అభివృద్ధి, తండ్రిగారి కలలను సాకారం చేసిన కోస్తారాస్తా పులిగడ్డ–పెనుమూడి వారధి, హంసల దీవి పర్యాటక కేంద్రం, విజయవాడ నుండి కరకట్ట రోడ్డు, శ్రీకాకులంలో శ్రీకృష్ణదేవ రాయల కాంస్యవిగ్రహ స్థాపనతో జరిగిన శ్రీకృష్ణ దేవరాయ మహోత్సవాలువంటి శాశ్వత కార్యక్రమాల కోసం కృషిచేసి సాధించిన విజయాలు చరిత్రలో చిరస్థాయిగా నిలుస్తాయి. మరింత ఉన్నతోన్నత పదవులను అందిస్తాయి.

మా స్వగ్రామమైన శ్రీకాకుళానికి ప్రపంచస్థాయిలో గుర్తింపు, పేరు తెచ్చిన ఘనత బుద్ధ ప్రసాద్ గారిది. ఆ క్షేత్ర అభివృద్ధికి మేమంతా చేతనైన కృషి ఆయన మార్గదర్శకత్వంలో చేస్తాం. ఆయన అందిస్తున్న స్ఫూర్తితో లండన్‌లో చదువుతున్న నా మనుమడు అశ్విన్ కుమార్ ఆంధ్ర మహావిష్ణువుకు వెండికిరీటం చేయించబోతున్నాడు. కళ్యాణ మండపం, అక్షరాభ్యాస వ్రత మండపం, వసతి గృహాలు నిర్మించాలని మా ఆకాంక్ష. అందుకు ఆ ప్రాంతవాసులు ధన్య వాదాలు తెలియచేస్తున్నారు. ఆయనకు ఎంతో ఋణపడి ఉంటారు. కరకట్ట రోడ్డు విస్తరణ త్వరలో జరిగేలా చూడాలని మా అభ్యర్థన.

బుద్ధ ప్రసాద్‌గారి పేరులోనే విశేషం ఉంది. బుద్ధుని లక్షణాలన్నీ ఆయనలో ఉన్నాయి. వివాదరహితుడైన ప్రజానాయకుడు ఆయన. నేను, మా అబ్బాయిలు దివాకర్, రాధాకృష్ణమూర్తి కుటుంబ సభ్యులు ఎప్పుడూ ఆయనతో ఉంటాం.

నా సహస్ర చంద్ర దర్శనోత్సవాన్ని బుద్ధ ప్రసాద్‌గారే పూనుకొని వైభవో పేతంగా జరిపించారు. నా భార్య పోయినట్లు తెలియగానే వెంటనే బయల్దేరి అర్థరాత్రి వచ్చి పలుకరించిన ఆయన ఆత్మీయత మరువలేనిది.

ఈ సందర్భంలో నేను ఆశీస్సులు, అభినందనలు ముందుగా అందించ వలసింది ఆయన శ్రీమతి చి॥ల॥సౌ॥ విజయలక్ష్మికి. ఆమె వెనుక ఉండి పిల్లల బాగోగులు, చదువు సంధ్యలు, అతిథి మర్యాదలు, పలకరింపులు చూసుకుంటూ ఉండబట్టే బుద్ధ ప్రసాద్‌గారు నిశ్చితంగా ప్రజాసేవ చేయగలుగుతున్నాడు.

చిరంజీవి బుద్ధ ప్రసాద్, వారి కుటుంబ సభ్యులు ఆయురారోగ్య భోగభాగ్యాలలో మరింత ఉన్నతోన్నత శిఖరాలు అధిరోహించి తండ్రి గారిని మించిన పేరు తెచ్చుకోవాలని ఎనభై అయిదేళ్ళ వృద్ధునిగా నా తుదికోరిక. నా బిడ్డల ఆకాంక్ష.

○

# "మండలి బుద్ధ ప్రసాద్"

- శ్రీమతి సింహాద్రి పద్మ

మండలి అనుపేరు తెలియనివారు
మండలంలోనే కాదు, భూమండలంలోనే వుండరు.
ఆయన పేరు, అంత పవరు !
ఖద్దరు ఇంటి పేరు, కాంగ్రెసు వంటి పేరు !
ప్రజాసేవ పూర్తిపేరు !
నిత్యం జనసంద్రంలో తేలియాడు పూలతేరు !
పత్రికా సంపాదకత్వం, పదవీ నాయకత్వం
నిర్వహించే సవ్యసాచి !
రాజకీయం, సాహిత్యం సేద్యం చేసే కృషీవలుడు !
పురాణ గాధల్ని, తత్త్వ శోధనల్ని,
మువ్వగోపాల పదాల మార్దవాన్ని,
కూచిపూడి నాట్య వైభవాన్ని
రంగరించుకున్న వ్యక్తిత్వం !
బహుముఖ ప్రజ్ఞ ఉన్న సాదా మనిషి !
మానవ ఇతిహాసాన్ని చాటే ఋషి !
తెలుగు భాషా పరిమళ గంధాన్ని
ప్రపంచమంతా గుబాళింపచేసే చందన వృక్షం !
బుద్ధ గాంధీ బోధనలు
పండించే "దివిసీమ రత్నం!"

○

# "నేటి యువతరం రాజకీయ నాయకులకు ఆదర్శప్రాయుడు మండలి"

- శ్రీ నరహరిశెట్టి నరసింహారావు

నేటి రాజకీయాలలో నైతిక విలువలు తగ్గుముఖం పడుతు న్నాయి. ఒకప్పుడు రాజకీయాలలోకి వచ్చే వ్యక్తులు, సమాజానికి ఏదో చేయాలి అనే సంకల్పంతో వచ్చే వారు. వారికి ఉన్న ఆస్తిని, మేదస్సుని, శ్రమని, సమాజ అభివృద్ధికి, వెచ్చించేవారు. ఉదాహరణకి : భారత స్వాతంత్ర్య ఉద్యమ సమయంలో, ఎంతో మంది తల్లులు, తమ బిడ్డలను దేశం కోసం త్యాగం చేసారు. ఆస్తులు, అమ్మివేసి ఉద్యమాలు చేసినారు భార్యలు తమ భర్తలను దేశం కోసం ఉద్యమాల కోసం, అర్పించారు, అయితే నాటి రాజకీయాలకు, నేటి రాజకీయాలకు మధ్యచాలా మార్పు వచ్చింది. ఆనాడు నేను దేశానికి ఏమి చేయాలని ఆలోచించే నాయకులు ఉండేవారు, నేడు దేశం నా కేమిచేసింది అని ఆలోచించే నాయకులు రాజకీయాలలోకి వస్తున్నారు. ఇటువంటి వ్యవస్థ మారాలి, నాటి గురజాడ స్ఫూర్తితో "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషు లోయ్" అనే ఆర్యోక్తిని నమ్మిన మన మండలి బుద్ధ ప్రసాద్.

ఆనాటి తరం నాయకుల మన్నలు, నేటి తరం నాయకుల ప్రశంసలు అందుకుంటున్న మేటి నాయకుడు, "మన మండలి". అంతే కాదు నాయకుడు అంటే రాజకీయాలే కాదు సమాజం, మన జాతి, సాంప్రదాయాలు, మన సంస్కృతి, పూర్వచరిత్ర, వాటి ఆవశ్యకత, అవగాహన నేటి తరానికి, నాటి తరాల చరిత్ర అవగాహన అవసరం అని నేడు ఎన్నో సంస్కృతిక కార్యక్రమాలు, చరిత్ర, అధ్యయనం ద్వారా, మన తెలుగు జాతి ఔన్నత్యాన్ని, ప్రపంచానికి చాటి చెప్పడానికి చేస్తున్న నిరంతర కృషీవలుడు, కార్యదీక్షాదక్షుడు మన మండలి గాంధేయవాదిగా, తనతండ్రి స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావు అడుగు జాడలలో నడుస్తూ తండ్రిని మించిన తనయుడిగా, కీర్తి ప్రతిష్ఠలు, ఇనుమడింపచేసి నేటితరం రాజకీయ నాయకుడు, వివాదరహితుడు మన మండలి.

మన ప్రియతమ ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డిగారు అప్పగించిన రాష్ట్ర పాడిపరిశ్రమాభివృద్ధి, పశుగణాభివృద్ధి, మత్స్యశాఖలకు మంత్రిగా వన్నె తెస్తారని, ఆ శాఖల ద్వారా, రాష్ట్ర గ్రామీణాభివృద్ధికి పూర్వ వైభవం తీసుకువస్తారని ఆకాంక్షిస్తున్నాను. ○

# దీక్షాదక్షతలు కలిగిన యువనాయకుడు

- శ్రీ ఉప్పలూరి మల్లికార్జున శర్మ

మాటలకన్నా చేతలే తన లక్ష్యంగా పదిమందికి పనికివచ్చే కార్యక్రమాలు నిర్వహించటంలో దిట్ట. అందరి మన్ననలు పొందగలిగే అరుదైన లక్షణాలు కలిగిన యువకుడు. తన తండ్రి మానవతావాది కీర్తిశేషులు మండలి వెంకట కృష్ణారావుగారి లక్షణాలు అన్నీ పుణికి పుచ్చుకొని సమాజసేవలో నిమగ్నమై ముఖ్యముగా మాతృసంస్థ కాంగ్రెస్ పార్టీ కార్యకలాపాలలో తనదైన శైలిలో అటు ప్రజలనుంచి, ఇటు నాయకుల నుంచి ఆశీస్సులు మన్ననలు పొందుతున్న నిగర్వి, నిరాడంబరుడు చిరంజీవి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌ను తన మంత్రి వర్గంలో చేర్చుకొని గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి ముఖ్య కార్యక్రమా లలో ఒకటైన పశుగణాభివృద్ధి, మత్స్యపరిశ్రమ శాఖను కేటాయించిన ముఖ్యమంత్రి శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డిగారి దూరదృష్టికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు.

శ్రీ మండలి బుద్ధప్రసాద్ చిన్ననాటినుండి సత్య ఖద్దరుధారి, తెలుగుభాష అన్నా, తెలుగు సంస్కృతి అన్నా, సాంస్కృతిక కార్య క్రమాలు అన్నా ఎంతో ఇష్టంగా ఆయా కార్యక్రమాలలో పాల్గొనటమే కాక వాటిని నిర్వహించే సంస్థలను ప్రోత్సహిస్తూ వస్తున్నారు. స్వర్గీయ మండలి కృష్ణారావుగారు ఆశించిన సిద్ధాంతాలను తూచా తప్పక తానుకూడా ఆచరిస్తూ సమాజసేవకు కంకణం కట్టుకున్న వ్యక్తి. ఏ విషయంలో తొందరపడకుండా అందరి ఆలోచనలను స్వీకరించి ఆయా కార్యక్రమాలు జయప్రదంగా నిర్వహించటమే తన లక్ష్యంగా ఎంచుకొని ఎన్నో అనితర సాధ్యమైన కార్యక్రమాలని సుసాధ్యం చేసిన కార్యశీలి శ్రీ బుద్ధప్రసాద్, రాష్ట్ర సమైక్య రక్షణకుకానీ, తెలుగుభాషా వ్యాప్తికికానీ, తెలుగు సాహితీలోకపు ఉజ్వల భవిష్యత్తుకు గానీ, తెలుగుజాతి చరిత్ర వ్యాప్తికి గానీ పురాతన తెలుగుభాష నిరూపణ ఉద్యమానికిగానీ, కృష్ణా జిల్లా రైతాంగ కష్ట సుఖాలని పారద్రోలటంలో కానీ, పులిచింతల మొదలైన ప్రాజెక్టుల

నిర్మాణానికి జరుగుతున్న జాప్యాన్ని ఎదుర్కోటంలో కానీ, ప్రతి నిమిషం తాను అహరహం కృషి చేయటమే కాక ఇంత చిన్న వయస్సులో మొక్కవోని దీక్షా దక్షతతో ప్రజల వెనుక నిలబడి ముందుకు నడుస్తున్న కార్యదీక్షాదక్షుడు.

**ఇంతింతై వటుడింతయై** అన్నట్లుగా బాల్యదశనుండి విద్యార్థిదశకు ఎదిగి, విద్యార్థిదశ నుండి సేవారంగంలో ప్రవేశించి సేవారంగంలో నాయకత్వ లక్షణాన్ని పెంపొందించుకొని ప్రజలలో మమేకమై వారి కష్ట సుఖాలలో పాలుపంచుకుంటూ మాతృ సంస్థ కాంగ్రెసుకు పెట్టని కోటగా నిలబడి యువతలో ఉత్సాహాన్ని నింపి ప్రజా ప్రతినిధిగా ఎన్నికై జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా రేయింబవళ్లు ప్రజాక్షేమంకోసం కృషి చేస్తున్న బుద్ధప్రసాద్‌కు ఇంకా ఉజ్వలభవిష్యత్తు ఉంటుంది.

ఒక్కసారి అతనితో పరిచయం అయిన వ్యక్తి ఆ స్నేహాన్ని వదులుకోలేడు. ఒక్కసారి ఆయనతో మాట్లాడిన తరువాత ఆయనతో అత్యంత సన్నిహితంగా మసలాలని కోరుకోకుండా ఉండలేరు. మంచి తనానికి మారుపేరు బుద్ధప్రసాద్. పట్టుదలకు, నీతికి, నిజాయితీకి, సేవాతర్పణకు, మరోపేరు. మల్లెపూవులాంటి స్వచ్ఛత కలిగినవాడు బుద్ధప్రసాద్.

కృష్ణాజిల్లాలో ఇద్దరు అమాత్యులు ఇప్పటికే ఉన్నప్పటికీ మూడవ అమాత్యునిగా జిల్లానుండి రాష్ట్రమంత్రి వర్గంలో ఎన్నికయ్యా దంటే, బుద్ధ ప్రసాద్ దీక్షాదక్షతలను గుర్తించిన మన ముఖ్యమంత్రిగారి ముందుచూపుకు మరొకమారు నా కృతజ్ఞతలు.

తనకు అప్పగించిన ఈ అమాత్య పదవికి నూటికి నూరు శాతం న్యాయంచేసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలోను తనశాఖ ద్వారా ప్రజలనుండి మంచి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి కృష్ణా జిల్లాకు ఖ్యాతితేవాలని తన తండ్రి అడుగు జాడలలో పయనించి కీర్తి ప్రతిష్ఠలు ఇంకా ఇనుమడింప చేయాలని భగవంతుడుని కోరు కుంటున్నాను.

ఒక వ్యక్తిగా, సంస్థా నిర్వాహకుడిగా రాజకీయ నాయకుడిగా, శాసనసభా సభ్యుడిగా, సంఘసేవా పరాయణుగా, సంస్కర్తగా, రచయితగా, సాహితీ ప్రేమికుడిగా, సాంస్కృతిక బంధువుగా ఇప్పటికే పేరు పొందిన శ్రీ బుద్ధప్రసాద్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రిగా మంచి యశస్సు, కీర్తి, గౌరవం పొందాలని తన కార్యక్రమాలలో ఎదురులేని తిరుగులేని రాష్ట్ర నాయకుడిగా వెలుగొందాలని ఆశిస్తున్నాను.

○

# జయం

- శ్రీ కె.ఎస్.బి.వి.కె. శివరావు

మన మండలి బుద్ధ ప్రసాదుగార్ని కృష్ణాజిల్లా రచయితల సంఘం సన్మానిస్తుందంటే - తెలుగుజాతి తన ఉనికిని మేల్కొంటూ తనను తానే సన్మానించుకుంటున్నట్టు జాతి భాషా కళా సంస్కృతులను కాపాడుకునేందుకు నడుము బిగించిన అనుభూతి గుండెలు నిండుగా పొంగి పొర్లుతున్నది.

1969 సంవత్సరము లగాయితు 1974వ సంవత్సరము వరకు రాష్ట్రం రెండు ప్రాంతాలలోనూ అనిశ్చిత రాజకీయ పరిస్థితులు నెలకొన్నాయి. 1975 మార్చిలో మాకు ద్రోణాచార్యులు అయిన వీరి తండ్రిగారు కీ॥శే॥ మండలి వెంకట కృష్ణారావుగారు నిర్వహించిన ప్రపంచ తెలుగు మహోత్సవ శీతల పవనాలు తెలుగుజాతిని తమ కౌగిట చేర్చుకొని ఏకోన్ముఖ ప్రగతి పథంలో నడిపించినవి. గాంధీగారు భరతజాతిని బంధించగల ఖాదీని సూత్రంగా ఎట్లా ప్రయోగించారో, అదేవిధంగా ఆంధ్రప్రదేశ్ నలుమూలలా గల చేనేత కళాకారుల వస్త్రాలతో, కళాఖండాలతో వేదికను అలంకరింపచేసి తెలుగు జాతి ఏక సూత్రతను ప్రపంచానికి చాటారు.

జాతిని ఏకతాటిపై నడిపించేది భాషా సంస్కృతులేనని వీరు గుర్తించారు. అందువల్ల ఆ ఉత్సవ వేదిక పైనుండే అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు గారితో అధికార భాషా సంఘం ఏర్పాటు, అధ్యక్షు లుగా ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు వావిలాల గోపాలకృష్ణయ్య గాని నియామకాలను ప్రకటింపజేశారు. తెలుగును పాలనా భాషగా ప్రవేశపెట్టుటకు అవసరమైన ముఖ్యపరికరాలు టైపురైటర్లు, ముద్రణ అచ్చుకూర్పు (లైనో టైపు) యంత్రాలు. వీటిని సాధించుటకు అధికార భాషా సంఘం అధ్యక్షుల పర్యవేక్షణలో ముద్రణా శాఖనందు పరిశోధన విభాగాన్ని ఏర్పాటు చేశారు. ఈ పరిశోధన విభాగం సమగ్ర తెలుగు వర్ణమాలతో రూపొందించిన తెలుగులైనో టైపు పథకానికి, అక్షర డిజైనులకు ఆమోదముద్ర వేయుటకు ప్రభుత్వం ఇంగ్లండుకు

ఒక సంఘాన్ని పంపుట కోసరం 1978 సంవత్సరములో ఉత్తర్వులిచ్చింది. ఆ సంఘంలో ఈ విభాగపు ప్రత్యేక అధికారి శ్రీ వణుకూరి నారాయణ రావు ఐ.ఎ.ఎస్.గారి పేరులేదు. వావిలాల గోపాలకృష్ణయ్యగారు విద్యా మంత్రి మండలి వెంకట కృష్ణారావు గార్కి నన్ను చూపించి నారాయణ రావును వదిలివేసి "ఈ మేకపోతును – లైనో మిషన్లు కోసరం లండను పంపుతున్నదయ్యా మీ ప్రభుత్వం" అనగానే వారు వెంటనే ఫైలు తెప్పించుకుని నారాయణరావుగారి పేరును చేర్చి ఉత్తర్వులు ఇప్పించారు. అప్పటి వారి ఈ చిన్న కృషి ఇప్పటి తెలుగు కంప్యూటర్లకు, ముద్రణా వ్యవస్థకు పునాది అయింది. వారి 'అడుగు జాడల'లోనే ముందడుగు వేస్తున్నారు బుద్ధప్రసాదుగారు.

కృష్ణా, గుంటూరు జిల్లా గ్రామాలను చేరువచేస్తూ "మండలి వెంకట కృష్ణారావు వారధి నిర్మాణం, తెలుగు వల్లభుడనని ప్రకటించు కున్నశ్రీ కృష్ణదేవరాయలు వారి విగ్రహప్రతిష్ఠాపన చిరస్మరణీయమైనవి.

స్వగ్రామం అవనిగడ్డలో వారి తండ్రిగారి విగ్రహ ప్రతిష్ఠాపన మా బోటి వారి గుండెలలో రూపుకట్టుకున్నది.

నిరంతరం రైతుల కష్టసుఖాలే తనవిగా భావించి వారి బాగోగులకు శ్రమించే మన బుద్ధ ప్రసాదుగారి కృషి మాతరంవారికి అమితానందాన్ని కల్గిస్తున్నది. ఆయుష్షును పెంచుతున్నది. వారు వేసే ప్రతి అడుగు చేపట్టే ప్రతి కార్యక్రమానికి జయం : జయం : జయం.

○

# మందార మణిహారాలు

- శ్రీమతి కోకా విమల కుమారి

చిరు దరహాసవదనులు నిస్వార్థ నిరుపమాన హృదయులు -
సహృదయ సదాశీలురు సౌహార్ద్ర సౌమ్యులు -
ఆత్మస్థైర్యం అభిమానధనం ఆయన సొత్తు
నిరాడంబరతకు నిలువెత్తు నిదర్శన మొక ఎత్తు -
స్నేహ వీచికలు వెదజల్లు చల్లని వెన్నెల రేడు -
సాటివాని క్షేమం తనక్షేమమని తలచి
అడుగకనే ఆదరించి సహాయమందించు సత్యమూర్తి !
సహనం మీ ఆయుధం, సర్వజనావళికి ఆమోదం మీ సాన్నిహిత్యం !
ఆశల సౌధాల కట్టవు. కోర్కెల కొలనులో ఈదవు -
కాని మంచిని పెంచి మమతల పంచు
చైతన్య కిరణాల నాహ్వానింతురెల్లప్పుడు మీరు !
అట్టి సదాశయా ! రాజ్య పరిపాలకా ! అందెను మీకు
సదవకాశము వరించె మిమ్ము మంత్రి పదవి
కాదు కాదు ఇది వెల్లువెత్తిన ప్రజా హృదయ పల్లవి
మాతృభాషాభిమానమును తెలుగు ప్రజలకు పంచి ఇచ్చి
భాషాభివృద్ధి పథంలో అంచలంచలుగా ఎదిగిన తెలుగు వీరుడా !
ప్రజా హృదిలో నీవు ఎగురవేసిన చైతన్య బావుటా
చెరగక మున్నె రారాజుకన్న మిన్న యగు మంత్రి పదవి
మిమ్ములంకరించి ఆదరించె -
శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి పుత్రరత్నమా !
పవిత్ర ప్రజా సేవలో తండ్రిని మించిన తనయుడివై
ప్రజాదరణలో పరవశమొంది ధన్యత చెందు మీ జన్మ !
శ్రీ మండలి బుద్ధప్రసాద్ మహాశయా! పశుసంవర్ధక, మత్స్య
శాఖల వంటి పలు శాఖామాత్యా!
మంత్రి పదవి మిమ్ములంకరించి మిమ్ములరించిన సందర్భమున మీకిదె
మా హృదయపూర్వక శుభాభినందనల నమస్సుమమాలికలు,
అభినందన చందన మందార మణి హారములు -
అందుకొనుడు ఆనంద డెందమున - ఆ సర్వేశ్వరుండెల్లప్పుడు
మీకు ఆయురారోగ్య ఐశ్వర్యముల బ్రోచుగాక

○

# అభినందన చందన మందార మాల

- శ్రీ మలినేని నారాయణ ప్రసాద్

తెలుగు భూమిని ప్రేమిస్తున్న బిడ్డ
తెలుగు వెలుగులు చిందిస్తున్న బిడ్డ
పాడి, పశువులను
సంవర్ధముగా పాలిస్తున్న బిడ్డ
కృష్ణవేణీ తీరమండలి బిడ్డ
అవనిగడ్డ అనుంగు బిడ్డ
తెలుగుతల్లి ముద్దుబిడ్డ
ఎవరయ్యా? ఇంకెవరయ్యా?
మన మండలి బుద్ధప్రసాద్ కాక
మరింకెవరయ్యా?

పల్లెసీమలు, పచ్చని పొలాలు
పాడి పశువులు, పాల ఉత్పత్తి
చిన్నకారు, సన్నకారు
కార్మికుడు, కర్షకుడు
శ్రామికుడు, పారిశ్రామికుడు
ఆయనకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు,

కృష్ణాతీరాన పెనుమూడి వద్ద
వారధికి నీవే సారధివి

ఇరు జిల్లాలకు సంబంధ బాంధవ్యాలు పెంచావు
సర్వజనావళి చిరకాల వాంఛను తీర్చావు
తీర ప్రాంత ప్రజలకు నీవే విజయసారథివి
దివిసీమకు కరకట్టపై
రాజబాటకు రూపులుదిద్దావు
అవనిగడ్డను విజయవాడ దరిచేర్చుతున్నావు
జిల్లా ప్రజలకు మహారథివి అవుతావు

బాల సాహిత్యములో అడుగుపెట్టి
తెలుగు సాహిత్యానికి చేయూతనిచ్చి
మన భాషను పరభాషలలో వ్యాప్తికి నడుంకట్టి
సాహిత్యాభిమానుల మనసులు దోచావు

ఆయన చిరకాల చింత పులిచింత
ఆయన కాంక్ష గోదావరిని కృష్ణకు తేవాలని
ఆయన ధ్యేయం కృష్ణాడెల్టా నవీకరణ
ఆయన ఘోష సాగునీరు కడవానికి అందాలని
ఆయన ధ్యానం దివిసీమ స్వర్గసీమ కావాలని
ఆయన ఎవరయ్యా? ఇంకెవరయ్యా?
మన మండలి బుద్ధ ప్రసాద్ కాక
మరింకెవరయ్యా?

○

# తెలుగుభాష ఆశీస్సులు.....

- శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి

తెలుగు భాషను నేను !
మెండుగ వెలుగు భాషను నేను ॥
అచ్చులన్నీ కలసి కార్యకర్తలై వుండి,
తెలుగు రచయితలంతా హల్లులై కలిసి,
మూడు ఉభయాక్షరాలు మేమున్నామంటూ...
అందర్నీ కలుపుకొని ముందు కెడుతున్నాయి ॥తెలుగు॥

నాటి మండల ప్రభువే ! నేటి మంత్రివర్యుడు !
అవనిగడ్డ ముద్దుబిడ్డడు ఉభయాక్షరాల మొదలు
పేదలపాలిటి కామధేనువే నంటారు,
"మండలి బుద్ధ ప్రసాద్" నామధేయుడితడు ॥తెలుగు॥

కృష్ణాజిల్లా ఒకటేకాదు...విశ్వమంతా తెలుగే ఖ్యాతి నిండాలంటూ
కలం పట్టి, గళం పెంచి...రచయితలందర్నీ పిలిచీ...
అందరం కలుద్దాం ! భాషను నిలుపుదాం ! అంటూ నినదించే
సుబ్బారావు ! పూర్ణచంద్‌లు మరో రెండు ఉభయాక్షరాలు ॥తెలుగు॥

మండలి వెంకట కృష్ణారావు వేసిన బాటే ఉపమానమంటూ
వ్యాకరణమంతా తెలుగు యువతేనంటూ...

ఛందస్సు ప్రాసలు తెలుగు అమ్మా నాన్నలుగా
దిట్టకవులందరు కలిసి నడిపిస్తున్నారు ॥తెలుగు॥

తెలుగు అమ్మా నాన్నలకు నేనున్నానంటూ,
ఏ చదువయినా తెలుగులోనే...! ఆంగ్లానికి హద్దునిస్తూ...
'మండలి' నేనున్నాను అండగా అంటుండగా...
ఆంగ్లమెందుకు మనకు...? కమ్మని తెలుగుని నేనుండగా ॥తెలుగు॥

తండ్రివేసిన బాటలో తనయుడు నడువగా !
తెలుగు గడ్డ గొప్పదనీ... తెలుగు భాష మిన్న అనీ...
రచయితలందరూ తెలుగే వెలుగై జేజేలు కొడుతుంటే...
విశ్వమంతా నేనై, తేజస్సుతో, గర్వంగా తిరుగుతాను!! ॥తెలుగు॥

"బుద్ధ మండలీ!" నీ కివే... నా ఆశీస్సులు !
తెలుగు భాషను నేను... చాటి చెప్తున్నాను... !
అవనిలో నా వునికి ఉన్నంత కాలం...
శాశ్వత మౌతుంది నీ పేరు ఈ తెలుగు గడ్డలో !!
తెలుగు భాషను నేను !
మెండుగ వెలుగు భాషను నేను ॥తెలుగు॥

# అక్షరాక్షతలు

- శ్రీమతి డి.సుజాతాదేవి
విటరసీ హౌస్, హైదరాబాద్

శుభము మండలి వంశవర్ధన
శుభము కర్షక జన సమర్థన
శుభము సుస్మిత వచన రచన
సర్వ శుభములు నీకు గావుత

స్నిగ్ధ సుమ పరిమళము
స్నేహ రుచి తరళితము
మధుర భావామృతము
పొదలుకొను సుహృన్మణి

తెల తెల్లటి వస్త్రాలు
చిరు నవ్వుల అస్త్రాలు
సతతము సేవానురక్తి
అనువంశిక స్వభావోక్తి

ఉప్పెనతో దివిసీమ
ముప్పున మునిగిన వేళల
అండదండగా నిలబడి
అన్నార్తుల గాచినావు

ఇల్లు లేని పల్లె లేని
తల్లి దండ్రి లేని వారి
నాదుకుని దారి చూపి
పునరావాసము నిచ్చిరి

యువనాయకులై నాడే
అనాధల కాశ్రయమీయగ
ఆ తండ్రికి తగిన కొడుకు
అని జనులానంద పడిరి

కన్న తండ్రి కృష్ణరావు
కను సన్నల మెలిగినావు
తల్లి ప్రభావతి సుగుణము
తమకు సహజముగ అబ్బెను

తల్లి భాష నందులకే
తలదాల్చితి వయ్యా నీవు
తెలుగు కూర్చు రచయితలను
తలుపు దీసి చేర్చినావు

ఎంతటి నాయకులైనను
ఎంతటి సంపన్నులైన
అమ్మ నాదరించి నటుల
ఔదల దాల్చిరె భాషను !

ఔరా నీ అనురక్తి
భాషయెడల నీ భక్తి
తెలుగు అక్షరాలెంతగ
తని వొందెనో నినుగాంచి

పుత్రుడనగ నీవెయని
పెద్దలు తని వొందినారు
పౌరుడనగ నీవే యని
పలువురు ప్రేమించినారు
మంత్రి యనగ నీవే యని
మాట మారుమ్రోగాలి
దివ్యులు దీవించాలి
ఆశీస్సుల అక్షతలై
పూలవాన కురవాలి
పుడమి పులకరించాలి

రైతు జన బాంధవుడ వార్యా
జయము జయమిక మంత్రి వర్యా !
సర్వ ప్రాణుల శుభోదయము
మానవాళికి మహోదయము. ○

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్రతో "మండలి" వారి అనుబంధం

- శ్రీ శీర్ల ధనంజయుడు
కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజలకి మండలి ... అనగానే గుర్తుకొచ్చేది దివి సీమ... శ్రీయుతులు మండలి వెంకట కృష్ణారావు గారు, మండలి బుద్ధ ప్రసాద్ గారు. నాటి విద్యాశాఖామాత్యులుగా స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావు గారి సేవలు శ్లాఘనీయములు. దివిసీమ మాణిక్యంగా కీర్తింపబడ్డారు. వారు తెలుగు భాషాభివృద్ధికి చేసిన సేవలు ఎనలేనివి.

భాషా ప్రాతిపదిక రాష్ట్రాలు స్వాతంత్ర్యానికి, జాతీయ భావ సమైక్యతకు మూలాధారమని, గుర్తించాలి. మన తెలుగు జాతి వికాస వైభవోన్నతికి మాతృభాష ఎంతగా తోడ్పడునో యే ఇతర భాష అంతగా తోడ్పడజాలదు. మన ప్రగతికి తొలిమెట్టు మన మాతృభాష, అదే తెలుగు భాష అనేది కృష్ణారావుగారి అభిప్రాయం.

అనందనామ సంవత్సర ఉగాది 24.03.1974 నుండి తాలూకాస్థాయి వరకు అన్ని కార్యాలయాల్లో తెలుగును అధికార భాషగా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం నిర్ణయించిన శుభ సమయంలో స్వర్గీయ మండలి పై అభిప్రాయం వెలిబుచ్చారు. అంతేకాదు ఇది రాష్ట్ర చరిత్రలో అపూర్వ సంఘటన, ఈ శుభతరుణం కోసమే రాష్ట్ర ప్రజలందరూ ఎన్నేళ్లనుంచో ప్రతీక్షించు చున్నారు. ఈనాడిది కార్యరూపం ధరించినదని అన్నారు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభతో స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావుగారికి ప్రత్యక్ష సంబంధాలు ఉండేవి. సభ తరఫున 1956 నుండి స్రవంతి పత్రిక ప్రచురింపబడుతూన్న విషయం సాహితీ ప్రియులకే కాదు సమస్త హిందీ ప్రచారకులకు, హిందీ తెలుగు అభిమానులకు తెలిసిన విషయమే.

దక్షిణాది రాష్ట్రాలలో హిందీ ప్రచారంతో పాటు మాతృభాషాభివృద్ధికై పాటుపడటమే దక్షిణ భారత హిందీ ప్రచార సభ లక్ష్యం. ఆ లక్ష్యంలోనుండి ఉద్భవించినదే స్రవంతి సాహిత్య మాసపత్రిక.

స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావు విద్యాశాఖామాత్యులుగానే కాక దక్షిణ భారత హిందీ ప్రచారసభ శ్రేయోభిలాషిగా హిందీ ప్రచార రంగంలో తనదైన శైలిలో సేవలందించారు. అంతేకాదు అవనిగడ్డ పట్టణంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ తరపున హిందీ ప్రచారక విద్యాలయం స్థాపించి తమ హిందీ అభిమానాన్ని చాటిచెప్పారు. 10.01.1975 నుండి 5 రోజుల పాటు నాగపూర్‌నందు నిర్వహించబడిన ప్రపంచ హిందీ మహాసభలలో శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు పాల్గొని విజయవంతం గావించుట ముదావహం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన హిందీ సమన్వయ సమితి అధ్యక్షునిగా నియమిస్తూ రాష్ట్ర ప్రభుత్వం జి.వో. (జి.వో. నం.1044/ఎడ్యుకేషన్, తేది 24.11.1975) జారీ చేయబడింది. హిందీ భాష గురించి వారు చేసిన సేవలకు ఇంతకంటే తార్కాణం యేమికావాలి ?

స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావుగారికి మాతృభాష తెలుగు పట్ల ఎనలేని ప్రేమ. ఆ ప్రేమే వారిని అఖిల భారత తెలుగు మహాసభలు హైదరాబాదు నగరంలో జరుపునట్లు చేసినది. ఆ తెలుగు మహాసభలలో దేశ విదేశాలకు చెందిన ప్రముఖులు పాల్గొని సభకు వన్నె తెచ్చిరి.

స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావు గారు 12 జనవరి 1974 నాడు ఆంధ్ర ప్రదేశ్ విద్యా, సాంస్కృతిక వ్యవహారాల శాఖామాత్యులుగా ప్రమాణ స్వీకారంచేశారు. మంత్రిత్వ శాఖల బాధ్యతలు స్వీకరించిన వెంటనే తనకుగల ఆస్తిపాస్తుల వివరాలు, డబ్బు నిల్వలతో సహా వివరాలన్నిటినీ ప్రజలకు, ప్రభుత్వానికి బహిరంగంగా ప్రకటించిన ప్రజలమనిషి ఆయన.

ఆయన వారసుడిగానేకాక తండ్రిని మించిన తనయుడిగా శ్రీ బుద్ధప్రసాదు గారు దివిసీమకే కాక ఆంధ్రావనికే ఆదర్శంగా నిలిచారు. మాన్యశ్రీ బుద్ధప్రసాద్ గారితో ఆంధ్ర సభ కార్యదర్శిగానే కాక వారి అభిమానపాత్రునిగా గుర్తించబడటం నా అదృష్టంగా భావిస్తున్నాను. తండ్రి మార్గంలోనే బుద్ధప్రసాద్‌గారు మాతృభాష తెలుగు–జాతీయభాష హిందీకి వారధిగా నిలిచి ఆదర్శప్రాయులయ్యారు.

సభ స్రవంతి పత్రికలో వారి వ్యాసాలు, శీర్షికలు ప్రచురింపబడుతుండేవి. తెలుగులో బాలల పత్రికలు పేరుతో శ్రీ బుద్ధప్రసాదుగారి వ్యాసం ఫిబ్రవరి 1975 సంవత్సరంలో ప్రచురింపబడి విశేష ఆదరణ పొందినది.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్రలో 1980 నుండి శ్రీ బుద్ధప్రసాద్ గారు చిరపరిచితులు. ఆంధ్ర సభ కార్యదర్శిగా 1996 నుండి పదవీ బాధ్యతలు స్వీకరించినప్పటి నుండి మాన్యశ్రీ బుద్ధప్రసాద్‌గారి సహాయ సహకారములు ఎల్లవేళలా లభిస్తుండడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

సభ తరపున నిర్వహింపబడు బి.ఎడ్. / ప్రచారక విద్యాలయాల నిర్వహణకు సంబంధించి అవాంతరాలు ఎదురైనప్పుడు ప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి-సహాయ సహకారములు అందించి సభకు బాసటగా నిలిచారు. అంతేకాదు ఆంధ్రసభకు ఎప్పుడు యే సమస్య వచ్చినప్పటికి తన చెరగని చిరునగవుతో పరిష్కారాన్ని సూచిస్తూ, వారు కూడా పాలుపంచుకొనుట వారి సహృదయానికి తార్కాణం. శ్రీ బుద్ధ ప్రసాద్ గారిని యే విధంగా అభినందించినప్పటికీ తక్కువే అవుతుందని నా దృఢాభిప్రాయం.

ఈ సందర్భంలో శ్రీ మండలి వెంకట కృష్ణారావు ధర్మపత్ని, బుద్ధప్రసాద్‌గారి మాతృమూర్తి శ్రీమతి ప్రభావతీ దేవిగారి సేవలను విశదీకరింపుట నాకు ఆనందం కలిగిస్తున్నది. స్థానిక గాంధీ క్షేత్రం, అవనిగడ్డలో ఏర్పాటు చేయబడిన సభవారి హిందీ ప్రచారక ప్రశిక్షణ మహా విద్యాలయ నిర్వహణ బాధ్యతలనువారు విజయవంతముగా నిర్వహించుచున్నారు.

ప్రశిక్షణ మహావిద్యాలయాలలో అవనిగడ్డకు ఒక ప్రత్యేక స్థానం కలదనడంలో అతిశయోక్తి లేదు. ప్రశిక్షణ పొందు విద్యార్థులలో అధికశాతం మహిళలే... వారిని సొంత బిడ్డలవలె చూడటంలో వారికి వారే సాటి... ప్రశిక్షణ పూర్తిచేసి రాష్ట్రంలోనే కాక దేశంలో ఎక్కడున్నప్పటికి శ్రీమతి ప్రభావతిగారిని తలవని విద్యార్థులుండరు. ఆంధ్రసభ తరపున వారికి హృదయపూర్వక ధన్యవాదములు తెలుపుకొనుచున్నాము.

రాష్ట్ర పశు సంవర్ధక, పాడి పరిశ్రమ, వెటర్నరీ, మత్స్యశాఖామాత్యులుగా నియమితులైన శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి అభినందనలను తెలుపుకొనుచూ, మాతృభాష తెలుగు, జాతీయ భాష హిందీ భాషాభివృద్ధికి మరింత సేవలందించాలని ఆశించుచున్నాము.

అంతేకాదు మాన్యశ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు (కేంద్రసభ) కార్యవర్గ సభ్యులుగా తమ సేవలందించుచున్నారు. వారి సహాయ సహకారములతో దక్షిణ భారత హిందీ ప్రచార సభ మరింత ప్రగతిని సాధించగలదని మా ప్రగాఢ విశ్వాసం.

O

# హర్షము

- శ్రీ పింగళి వేంకట కృష్ణారావు

శ్రీయుతుడు గుణగణ యశశ్రీ కలితుడు
శిష్ట మండలి వంశాబ్ధి శీతకరుడు
సరస సంగీత సాహిత్య నిరతుడితడు
మంత్రి బుద్ధ ప్రసాద్ ధీమాన్యుడితడు !

చిన్ననాట నుండియు ప్రజాసేవజేయు
దీక్షగలవాడు, దివిసీమ దీప్తి యితడు
ఇపుడు క్రొత్తగా నీతని కేమి యొరిగె !
మా ప్రజల దృష్టి నెప్పుడో మంత్రి యితడు !

తండ్రి జూపిన దారిన్ సదా చరించి
మెట్టు మెట్టెక్కె, పట్టము గట్టినారు
ప్రజలు తమ హృదయాల నీవరకె, మంత్రి
పదవి కీతడలంకార మదియె నిజము !

ఆంధ్ర భోజుని దివిసీమ నధివసింప
జేసి, భువన విజయ కీర్తి చివురు తొడగ
జేసినావు, నీకతనికి చెలిమి యెపుడొ ?
అట్టె నీవు మంత్రి వగుట హర్షమాయె !

శ్రీకాకుళస్వామి చిరునవ్వు సేసలై
దీవించె దివిసీమ దివ్వెగాగ
మువ్వగోపాలుడు ముదమార మన్నించె
కళలకు కల్ప వృక్షంబు గాగ
కృష్ణమ్మ నినుపెంచె కీర్తింపదగు ఘన
తన రాజకీయ మేధావిగాగ
అంభోధి నిను తీర్చె ఆటు పోటుల కొల్ల
బోవని గంభీరమూర్తి గాగ

తండ్రికి తగువారసుడవై తనరినావు
సిరులకే గాదు సంస్కార సరళి కెల్ల
చిరము, బుద్ధ ప్రసాద ! సు శ్రీపదముల
ఆయురారోగ్య విభవములందుమయ్య

○

# దివిసీమ-దివ్య రత్నానికి అభినందనలు

- శ్రీ కె. జితేంద్ర బాబు

సర్వేషాం యః సుహృన్నిత్యం
సర్వేషాం చ హితే రతః
కర్మణా మనసా వాచా
స ధర్మమ్ వక్తు మర్హతి'

అని మహాభారత సూక్తి. అందరి మేలును కోరేవాడు, ప్రతి వ్యక్తి పురోభివృద్ధికి ఏది శ్రేయోదాయకమో ఎరిగినవాడు-మనోవాక్కాయ కర్మలందు పరోపకారబుద్ధి కలవాడు, తనంతట తాను సత్పురుషుడు అయినవాడు మాత్రమే ఉత్తమ ధర్మాన్ని నిర్ణయించగలడని భావం. హైందవ రాజ్యతంత్రానికి మూలాధారం ధర్మం. ధర్మమే రాజ్యాధినేత. పాలకులు ధర్మానికి తాబేదార్లు. వారు ధర్మానికి బద్ధులై వ్యవహరించాలి. రాజరికం పోయి ప్రజాస్వామ్యం యుగం వచ్చింది. ప్రజాస్వామ్య యుగంలో, రాజకీయాలలో ధర్మబద్ధుడై పరోపకారబుద్ధి గలిగిన వారు శ్రీ మండలి బుద్ధప్రసాదు గారు. జీవితంలో అనుపదం, అనుక్షణం, అణువణువు ప్రజా సంక్షేమమే ఆయన కోరుకునే ఫలం. ఆయన ఆశించిన భోగం. తెలుగు భాష, తెలుగు జాతి, తెలుగు సంస్కృతికి యథోచిత సేవ చేయడమే బుద్ధప్రసాదు గారు సాధించిన యోగం. ఆ యోగాన్ని సఫలీకృతం చేయడానికి శక్తి వంచన లేకుండా సాధన చేస్తూ, తెలుగు జాతి పురోగమనానికి, రాజకీయ పురోభివృద్ధియే కాక, సారస్వత, సాంస్కృతిక రంగాలలో కూడా అభివృద్ధి జరగాలని భావించి కృషి చేస్తున్న నిత్య కృషీవలురు బుద్ధప్రసాదు గారు. బుద్ధ ప్రసాదు గారి గుణాతిశయం గురించి ఎంత చెప్పినా తక్కువే. వారి ఆకారము సౌమ్యగంభీరము. పలుకు వాత్సల్యామృతం. వారు ప్రజాసేవలో కలకాలం జీవిస్తూ, మరిన్ని ఉన్నత పదవులను అధిరోహించాలని ఆశిస్తూ........

# హంసల దీవిలో 'బుద్ధ' పూర్ణిమ

- శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్

సర్వదేవమయీం సాక్షాద్బ్రహ్మ విష్ణు శివాత్మికాం ।
ఫలదాం సర్వతీర్థానాం కృష్ణాత్వాం ప్రణతోస్మ్యహం ॥

సర్వదేవతాత్మకం, సర్వతీర్థ విశిష్టమైన కృష్ణానది మహారాష్ట్రంలోని సహ్యపర్వతాలలో ఉద్భవించి మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర రాష్ట్రాలలో 1400 కి.మీ. ప్రవహించి కృష్ణాజిల్లాలో దివిసీమలోని పవిత్ర హంసల దీవి వద్ద మహాసాగర సంగమం చేస్తోంది. కృష్ణా సాగర సంగమ స్నానం అత్యంత పుణ్యప్రదమైనదిగా ప్రాచీన కాలంనుండి ఎంతో ప్రాచుర్యాన్ని సంతరించుకొన్నది.

తనలో మునిగిన వారందరి పాపాలతో కాకిగా మారిన 'గంగ' హంసల దీవి సంగమంలో మునిగి హంసగా మారటం కారణంగానూ, పరమహంసలైన మహర్షులు ఎందరో ఇచట అదృశ్యంగా తపస్సు చేస్తున్న కారణంగాను ఈ ప్రాంతాన్ని "హంసలదీవి"గా పురాణాలు పేర్కొంటున్నాయి.

విజయవాడకు 110 కి.మీ. అవనిగడ్డకు 25 కి.మీ. దూరంలో హంసలదీవి గ్రామం ఉంది. ఇక్కడ చారిత్రాత్మకమైన శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవాలయం ఉన్నది. ఈ ఆలయం గాలిగోపురాన్ని దేవతలు నిర్మించారని ప్రతీతి.

పై కారణాలవలన హంసలదీవి సాగర సంగమం ప్రపంచ వ్యాప్తంగా ఎంతో వైశిష్ట్యాన్ని కలిగియున్నది.

దత్తపీఠాధిపతి అవధూత శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారు సంగమస్నానంచేసి 'తన జన్మధన్యమైన'దన్నారు. కృష్ణపుట్టిన చోట స్నానం చేసిన తాను సాగరసంగమంలో స్నానం చెయ్యాలని చిన్ననాటి నుండి అనుకుంటున్నాననీ ఆ కోరిక ఇప్పటికి నెరవేరిందనీ కృష్ణవేణి పాదాలను ప్రతిష్టించే అదృష్టం శ్రీ బుద్ధప్రసాద్‌వలన కలిగిందని అభినందించారు. దత్తపీఠ

కార్యక్రమాలు ఇక్కడకు విస్తరిస్తాయని ఆశీస్సులు అందించారు. కుర్తాళం పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామివారు సంగమస్నానంచేసి పాదుకలను పూజించి బుద్ధప్రసాద్ గారి కృషిని మెచ్చుకొని దీవించారు.

రాష్ట్ర గవర్నర్ డా॥ శ్రీ॥ రామేశ్వర ఠాకూర్ యాత్రిక విశ్రాంతి మందిరాన్ని ప్రారంభోత్సవం చేస్తూ శ్రీ బుద్ధప్రసాద్ చేస్తున్న కృషిని అభినందించి హంసలదీవిని ప్రముఖ పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దిన ఘనత ఆయనకు దక్కుతుందని ప్రశంసించారు. రాష్ట్ర మంత్రి శ్రీ ఎం.సత్యనారాయణరావు శ్రీరాముడు సముద్రానికి కట్టిన వారధిలా యాత్రికులకు బుద్ధప్రసాద్ ఎంతో శాశ్వత ఉపకారం చేసారని మెచ్చుకొన్నారు. మంత్రులు శ్రీ పొన్నాల లక్ష్మయ్య, శ్రీమతి జె.గీతారెడ్డి మొదలైన ప్రముఖులు ఎందరో హంసలదీవిని సందర్శించి మండలి కృషిని అభినందించారు.

ఇప్పుడు సముద్రం దాకా చక్కని తారు రోడ్డులో, రెండు యాత్రిక విశ్రాంతి గృహాలతో హంసలదీవి కృష్ణా సాగరసంగమం ప్రపంచ యాత్రికులు, పర్యాటకులు, సందర్శకులకు ఆత్మీయ స్వాగతాన్ని పలుకుతోంది. సాగరంలో ఎగిరిపడుతూ కనపడే డాల్ఫిన్లకు సంకేతముగా డాల్ఫిన్‌ల బొమ్మ, కృష్ణవేణి పాదాలు ప్రతిష్ఠించబడ్డాయి.

ఈ ప్రాంతం నుండి రోమ్‌తో వర్తక వాణిజ్యాలు నడిచినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. అయ్యవంశీయుల కాలంలో ఈ గ్రామం ఒక గొప్ప పట్టణంగా విరాజిల్లుతుండేది. అయ్య వంశజుడైన జాయప్ప సేనాని రచించిన నృత్తరత్నావళి ఆధారంగా ఈ దేవాలయం నిర్మించినట్లుగా చరిత్ర చెబుతోంది.

అయితే ఈ ప్రాంతాన్ని చేరటానికి ప్రజలు చాలా ఇక్కట్లు పడుతూ మాఘ పూర్ణిమనాడు మాత్రమే సంగమ స్నానాలు చేసేవారు. గ్రామంనుండి సంగమ ప్రదేశానికి చేరే సుమారు 3 కి.మీ. బురదలో ఇసుకలో చింకులు, కయ్యలు దాటుకొంటూ ఎంతో శ్రమపడేవారు.

దివిసీమ చరిత్ర భౌగోళిక స్థితిగతులు దివిసీమ ప్రాశస్త్యం పసితనం నుండి ఆకళింపు చేసుకొన్న బుద్ధ ప్రసాద్ ప్రపంచ పటంలో హంసలదీవిని పవిత్ర యాత్రాస్థలంగా ప్రముఖ పర్యాటక కేంద్రంగా, సందర్శనీయ స్థలంగా తీర్చిదిద్దటానికి కార్యోన్ముఖులయ్యారు.

హంసలదీవి గ్రామం నుండి కృష్ణాసాగర సంగమ తీరానికి చేరుకోవటానికి ముందు పనికి ఆహార పథకం క్రింద పద్నాలుగు లక్షలతో మట్టి రోడ్డును నిర్మించారు. తరువాత కంకర రోడ్డును ఆపై ఇప్పుడు ముచ్చటైన తారురోడ్డు సౌకర్యాన్ని ఒకటిన్నర కోట్ల ఖర్చుతో కల్పించారు. నెలరోజుల్లో ఒక వంతెన నిర్మాణాన్ని పూర్తి చేయించారు. ఈ సౌకర్యం వలన 2004 పుష్కరాలలో

లక్షమందికి పైగా యాత్రికులు అనాయాసంగా సంగమస్నానం చేయగలిగారు. పూర్వం మాఘపౌర్ణమికి మాత్రమే అష్టకష్టాలు పడుతూ వచ్చే యాత్రికులు ఇప్పుడు ప్రతిరోజూ అయిదారు వందల మంది హాయిగా కృష్ణాసాగర సంగమాన్ని సందర్శిస్తున్నారు. విదేశీయులు కూడా ఆసక్తితో భక్తి శ్రద్ధలతో తమ యాత్రను సఫలం చేసుకుంటున్నారు. సరాసరి వాహనాలలో సాగర సంగమ తీరానికి వెళ్ళి లక్షలాది మంది పుణ్యస్థానాలు ఆచరించే అవకాశం కలిగింది.

ఈ విధంగా ఇహపర సాధకంగా పవిత్ర యాత్రా స్థలంగా విశిష్ట పర్యాటక కేంద్రంగా పిన్నలకు, పెద్దలకు, కులమతాలకు అతీతంగా అందరికి ఆహ్లాదాన్నిచ్చే ఆకర్షణీయ ప్రాంతంగా హంసలదీవిని ప్రపంచం దృష్టికి తేవటం ద్వారా దివిసీమ అభివృద్ధికి అనేక కోణాల్లో అహరహం కృషిచేస్తున్న మంత్రివర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి హంసలదీవి వేణుగోపాలస్వామి వారు, కృష్ణవేణీ సాగరుల కరుణాకటాక్ష వీక్షణాలు ప్రజాభిమానరూపంలో సకల ఆయురారోగ్య భోగభాగ్యాలను, ఇతోధికాభివృద్ధిని అనుగ్రహించు గాక.....

○

# 'వారధి' పుట్టుపూర్వోత్తరాలు
# సారథి 'మండలి' సాధకబాధకాలు.....

- ఆముక్తమాల్యద

తడ-ఇచ్ఛాపురం కోస్తా జాతీయ రహదారి, కృష్ణానదిపై పులిగడ్డ-పెనుమూడి వంతెన నిర్మాణం ద్వారా ప్రజలకు కలిగే అనేకలాభాలను వివరిస్తూ కీ॥శే॥ మండలి వెంకట కృష్ణారావుగారు లక్ష్యసాధనకై ఎంతో శ్రమించారు. ఆయన కలలను సాకారం చేస్తూ ఇప్పుడు మన కళ్లముందున్న అద్భుతం కీ॥శే॥ మండలి వెంకట కృష్ణారావువారధి ఈ రూపుదాల్చటానికి అవనిగడ్డ శాసన సభ్యులు, మంత్రివర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ చేసిన కృషి అనన్యసామాన్యం. ఆ విధంగా పితృఋణాన్నే కాక, తనను ఎన్నుకొన్న నియోజకవర్గం ప్రజల ఋణాన్ని తీర్చుకొని కోస్తావాసుల అభిమానాన్ని శాశ్వతంగా పొందారు. నిర్మాణాత్మకమైన ఈ కృషి వెనుక ఉన్న ఆయన కార్యదీక్ష, పట్టుదల, పరిశ్రమ, గాంధేయమార్గ కార్యాచరణ శైలి ఉద్యమస్ఫూర్తిని పరిశీలిస్తే చరిత్రలో నిలిచి, భావితరాలకు స్ఫూర్తి నిచ్చే ఘట్టాలు ఎన్నో ఉన్నాయి.

పులిగడ్డ-పెనుమూడి వంతెనను వేరొకచోటకు మార్చటానికి అప్పుడు ప్రభుత్వం చేసిన ప్రతిపాదనలను వ్యతిరేకిస్తూ 2003 జనవరిలో ముఖ్యమంత్రికి లేఖ వ్రాసారు. దానిలో 1994 నుండి వంతెన నిర్మాణానికి ప్రభుత్వం ఇచ్చిన ఉత్తర్వులు, హామీల వివరాలన్నీ ఉటంకించారు. దశాబ్దాలుగా ఈ వంతెన గురించి జరిగిన నిర్ణయాలను, దానివలన ప్రజలకు చేకూరే ప్రయోజనాలను వివరంగా తెలియచేసే ఈ లేఖ ఒక ప్రజాప్రతినిధి తనబాధ్యతను ఎలా నిర్వర్తించాలో, ఎంత అవగాహన, జ్ఞాపకశక్తి ఉండాలో తెలియజేస్తుంది. శాశ్వతంగా భద్రపరచదగిన లేఖ ఇది.

అవనిగడ్డ నియోజకవర్గ ప్రజల చిరకాలవాంఛ, తన తండ్రిగారి చివరికోర్కె అయిన పులిగడ్డ-పెనుమూడి వారధి సాధించలేనప్పుడు శాసనసభ్యత్వం ఉన్నా లేకున్నా ఒక్కటేనని రాజకీయాలకు అతీతంగా ఆవేదనతో రాజీనామా చేస్తున్నానని ప్రకటించారు.కన్నీళ్లతో తన ఆవేదనను వివరించారు. అన్ని రాజకీయ పక్షాలను కలుపుకొని ఉద్యమాన్ని సమైక్యంగా నడిపిన కార్యదక్షుడు శ్రీ బుద్ధప్రసాద్. ఆయన రాజీనామా ప్రకటన ప్రభుత్వంలో కదలిక తెచ్చింది. ఈ విధంగా అందరినీ తనతో నడిపించగల ఆత్మీయత ఆయన ప్రత్యేకత. పార్టీ ముద్ర లేకుండా ప్రజా ఉద్యమంగా ప్రభుత్వం కళ్ళు తెరిపించి చిరకాల స్వప్నాన్ని సాకారం చేసిన శ్రీ బుద్ధప్రసాద్ ఇంటిపేరు మండలి అయినా ఆయన మాత్రం 'ప్రజామండలి'. ○

# అభినందన

- ఆచార్య ఎన్.ఎస్. రాజు

మాన్యులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్‌గారి గురించి రాయడం అంటే ఒక అపురూపము అసాధారణము అయిన వ్యక్తి గురించి పరిచయం చేయడం, గంభీర వదనం, కోమల హృదయం, అమృత వచనం ముప్పేటగా కలగలిసిన అపురూపమైన వ్యక్తి ఆయన. ఇది ఆయనతో ఒకపాటి మాట పరిచయం ఉన్నవారికి తెలియనిది కాదు. ఎంతటి సమున్నత స్థితిలో ఉన్నా, నేలను, నేలమీది సామాన్యుణ్ణి మరువని వ్యక్తిత్వమూ, ప్రతిపక్షంలో ఉన్నా అధికార పక్షంలో ఉన్నా, ఇటీవలే మంత్రి అయినా హెచ్చుతగ్గుల ప్రభావం ఏ మాత్రమూ అంటని వ్యక్తిత్వమూ, జమిలిగా కూర్చిన అసాధారణ సాధుపురుషుడు ఆయన. ఇది కూడా ఆయనతో సన్నిహిత పరిచయం ఉన్నవారికి తెలియనిది కాదు.

ఇదంతా ఒక ఎత్తు, ఆయన నిరుపమానంగా ఆచరిస్తున్న వారసత్వ సంప్రదాయం మరొక ఎత్తు. దీనికి స్వీయానుభవమే తార్కాణ. ఇది సుమారు ఆరు ఏళ్ల కిందటి మాట. తెలుగు భాషా దినోత్సవం ఆగస్టు 29 మర్నాడు, కార్యక్రమం గురించి తెలుసుకొన్న శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు నాతో మాట్లాడాలని అనుకొంటున్నారని నాకు కబురువచ్చింది. నేను, శ్రీ చెలంచర్ల భాస్కరరెడ్డిగారు కలసి వెళ్లాము. వారు మా పట్ల చూపిన ఆదరణ గౌరవాలు నా హృదయపు లోతుల్ని స్పృశించాయి. సమాజంలో తెలుగు భాషకు ఉండవలసిన స్థితిగతులను, మేము నిర్వహిస్తున్న కార్యక్రమాలను వివరించాం. భాషోద్యమ ఆవశ్యకాన్ని, ఇప్పటి కర్తవ్యాన్ని తెలియజేసే సిద్ధాంత భూమిక, 'తెలుగును కాపాడుకొందాం – అది మనల్ని కాపాడుతుంది'. అనే రచనను, ప్రణాళికను సూచించే పత్రాలను అందజేశాను. వివిధ అంశాలపై చర్చించాను. "ఎవరూ తలపెట్టని కార్యక్రమం ఇది. నేనూ మీ వెంట ఉంటా. మనం దీనిని మరింత విస్తృతంగా చెయ్యాలి" అని ఆయన కొండంత బలాన్ని ఇచ్చారు. ప్రథమ ప్రపంచ మహాసభలను నిర్వహించిన ఆయన తండ్రి కృష్ణారావుగారి స్ఫూర్తి వారిలో కనిపించింది. తెలుగు భాషాసంస్కృతుల గురించిన

ఆలోచనలతో కూడిన వారి నిబద్ధత నన్ను ముగ్ధుణ్ణి చేసింది. సమభావం కలవారం కాబట్టి అప్పటి నుంచి వారితో మైత్రి చెక్కుచెదరకుండా కొనసాగుతోంది. ఇది నాకు రెండవది. ఇటువంటి మొదటి సంఘటన ఇంతకు ముందు నేను, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు కలిసి సచివాలయంలో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య గారితో ముచ్చటిస్తున్నప్పుడు, ఆయన "భాషా సమస్య గురించి ఆలోచించడం నాతోనే ముగిసిపోతుందని అనుకొన్నాను. మీరు కనిపించారు. ఇక నా తర్వాత భాషోద్యమాన్ని మీరు కొనసాగించండి. మీరు ఉన్నారన్న సంతృప్తి నాకు ఎంతో ధైర్యాన్ని ఇస్తోంది" అని అన్నారు. నా అనుభవంలో ఇది మొదటిది.

శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు 2003లో కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో రాష్ట్రస్థాయి భాషాభిమానుల సదస్సును అపూర్వంగా నిర్వహించి భాషోద్యమాన్ని రాష్ట్ర వ్యాప్తం చేయ వలసిందిగా పిలుపునిచ్చారు. ఉద్యమానికి పదవి ఆశించని నాయకునిగా ఇటు సామాన్యులకు వెన్నుదన్నుగాను అటు ప్రభుత్వస్థాయిలో బాధ్యతాయుతంగాను నిలిచారు. శాసనసభలో ఒక వావిలాల వలే భాషాసమస్యకు ఏకైకప్రతినిధిగా నిరుపమానమైన పాత్ర నిర్వహించారు.

వారి వ్యక్తిత్వం గురించి ఒక్క విషయం చెప్పుకోడంలో సంతృప్తి ఉంది. ఒక సందర్భంగా వారి సేవాకార్యక్రమాలను అంతగా సంతృప్తి చెందని పై నాయకుల వ్యాఖ్యలకు శ్రీ బుద్ధ ప్రసాద్‌గారు కన్నీటి పర్యంతమయ్యారు. బహుశః ప్రజాజీవిత రంగంలో నిమగ్నమైనవారిలో ఇటువంటి సున్నితహృదయులు చాలా అరుదుగా ఉంటారు. ఇలా వారి గురించి చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు. ఇప్పటికి, వారి నిస్వార్థము, నిజాయితీ కలిగిన రాజకీయ జీవితానికి శ్లాఘనీయమైన భవిష్యత్తు ఉంటుందని అభినందించడమే మన కర్తవ్యం. వారికి జన్మదినోత్సవ శుభాకాంక్షలు. ఇదే విధంగా శతాధిక జన్మదినోత్సవాలు జరగాలని ఆశిస్తున్నాను.

# అక్షర యోధుడు - కలం కార్మికుడు 'మన' మండలి

- శ్రీ పి.ఎం.ఎస్. ప్రసాద్
సీనియర్ జర్నలిస్ట్, పామర్రు

నియమనిష్ఠలు లేని రాజకీయాలు సమాజాన్ని వంచించటమేనన్నారు మహాత్మాగాంధీ. కాని నేటి రాజకీయ సమాజంలో నీతి, నిజాయితీని రెండు చేతులుగా ధరించి ప్రజాసేవలో నిమగ్నమైన అరుదైన వ్యక్తి రాష్ట్రమంత్రి శ్రీ మండలి బుద్ధ ప్రసాద్. ఓ రాజకీయ నాయకుడిగా మండలిని పరిచయం చేయటం కన్నా ఆయన ఓ మానవతావాది, అక్షర యోధుడు, కలం కార్మికుడని బహుశా రచయితలకే తెలుసు.

1972వ సంవత్సరములో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమ సమయంలో సమైక్య వాదాన్ని చెప్పడానికి ప్రత్యక్ష కాంగ్రెస్ రాజకీయంలోకి తొలి అడుగువేసిన మండలి ఆనాడు ఆంధ్ర పత్రిక ప్రభ, జ్యోతిలాంటి వార్తా పత్రికలలో వ్యాసాలను రాసి అక్షరాలతో యుద్ధం చేశారు. అటు పిమ్మట తన అవనిగడ్డలోని గాంధీ క్షేత్రం నుంచి గాంధీ క్షేత్రం అనే పత్రికను సమాజానికి అందించి యువతలో భావోద్రేకాన్ని లేపారు. నైతిక విలువలను పెంపొందింప చేశారు. 1977-85 వరకు కృష్ణా జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షులుగా పనిచేశారు. ఆ సమయంలో దివిసీమ ఉప్పెనలో ఆపన్నులకు బాసటగా నిలిచారు. తనే స్వయంగా పత్రికలలో ఉప్పెన మిగిల్చిన విషాదాలు, సమస్యలపై వ్యాసాలు రాశారు. ప్రజల్లో సేవాభావాన్ని నింపి ఆపన్నులను ఆదుకోవటానికి ఉపయుక్తులైనారు. ఇక తెలుగు భాషా వికాసానికి నడుం బిగించి కలాన్ని చేత ధరించి అహర్నిశలు కృషి జరిపారు.

ఆనాటి ప్రభుత్వ సమాచార శాఖవారి ఆంధ్రప్రదేశ్ పత్రికల నుంచి నిన్న కృష్ణాతరంగం లాంటి ప్రభుత్వం ప్రచురించే ప్రతి పత్రికలో ఆయన సంపాదక వ్యాసాన్ని రాసి జర్నలిస్ట్‌లకు ఆదర్శ జర్నలిస్ట్‌గా నిలిచారు.

1993లో రాష్ట్ర స్థాయిలో పామర్రు విద్యావనంలో జరిగిన గ్రామీణ విలేఖరుల శిక్షణా తరగతుల సభలకు ఆయన అధ్యక్షత వహించి ఓ బోధకుడిగా జర్నలిస్టల విధినిర్వహణకు స్వయంగా సూచనలుచేసి జర్నలిస్ట్ సంఘాల నేతలతో సన్మానం పొందారు. దివిసీమ వర్కింగ్ జర్నలిస్టల యూనియన్, జిల్లా గ్రామీణ విలేకరుల సంఘ అభ్యున్నతికి ఓ కలం కార్మికుడిగా వారి కృషి జర్నలిస్టులు నేటికి మరువ లేరు.

2004 నుంచి 2006 వరకు వివిధ పత్రికలలో ఆయన కృష్ణాడెల్టా పరిరక్షణ సారధిగా పులిచింతల, పోలవరం ప్రాజెక్టుల ఆవశ్యకత, రాష్ట్ర ప్రభుత్వ జలయజ్ఞం పై పుంఖాను పుంఖానులుగా నిష్పక్షపాతంగా వ్యాసాలు రాసి రైతు బాంధవుడిగా ముద్ర వేయించుకున్నారు.

నేను ఓ రాజకీయ నాయకుడిగా పరిచయం అయ్యేకన్నా ఈ సమాజానికి ఓ రచయితగా, తెలుగు భాషోద్యమ సభ్యుడుగా పరిచయం అవ్వటంలో తృప్తి ఉందని సాక్షాత్తు ఈ వ్యాస రచయితతో అనటమేకాక శ్రీకాకుళంలో 2007లో జరిగిన శ్రీ కృష్ణదేవరాయ కాంస్య విగ్రహ ఆవిష్కరణ సభలో వెల్లడించారు.

మండలి గురించి రాసుకుంటూ పోతే మహాభారతం కంటే మరో పర్వం ఎక్కువే అవుతుంది. కనుక మహనీయుడైన మండలి పాళి నుంచి సమాజాభివృద్ధికి మరిన్ని రచనలు జాలువాతాయని, నేటి యువ రచయితలకు, తెలుగు భాషాపరిరక్షణ ఉద్యమ కారులకు ఆదర్శంగా నిలుస్తారని

అక్షరాభినందనలతో---

○

# నేనెరిగిన బుద్ధ ప్రసాద్

- శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్

ఆయన చిన్నప్పటినుండి తెలిసిన వాళ్ళలో నేనొకణ్ణి. మండలి కుటుంబంతో మూడు దశాబ్దాలకు పైగా నాకు సంబంధం వుంది. అది 1976వ సంవత్సరం. అప్పుడే బుద్ధ ప్రసాద్ నాయన మండలి వెంకట కృష్ణారావు రాష్ట్ర విద్యా సాంస్కృతిక వ్యవహారాల మంత్రి. ఆ ఏడాదిలోనే మార్చి 4 నాడు ఆంధ్రప్రదేశ్ బాలల ఎకాడమిని రాష్ట్ర ప్రభుత్వ సంస్థగా నెలకొంది.

'మండలి' వారు ఆ బాలల అకాడమీకి కార్యనిర్వాహక కార్యదర్శిగా మద్రాసులో వున్న నన్ను హైదరాబాదుకు వచ్చేలా చేశారు. అప్పటినుండి ఆ కుటుంబంతో సన్నిహితంగా మెలిగేవాణ్ణి. ఆ రోజుల్లో బుద్ధ ప్రసాదు కాలేజీలో చదువుతూ బాలానంద కార్యక్రమాల్లో పాల్గొంటూ దివిసీమ పిల్లలకు బాల వినోద, వికాస, సాహిత్య కార్యక్రమాలు చేస్తూ ఎంతో మందికి స్ఫూర్తి నిచ్చేవారు.

వాస్తవానికి నేను హైదరాబాదులో స్థిరపడడానికి మండలి కృష్ణారావు గారే కారకులు. 1976కు ముందు మద్రాసులో తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వ నిర్మాణ కార్యక్రమంలో సంపాదక వర్గంలో ఇరవై ఆరు ఏళ్లు (1950-76) పనిచేసిన సందర్భంలో చివరి నాలుగు సంపుటాలకు ముఖ్య సంగ్రహకునిగా వున్న నమయమది. రాష్ట్ర ప్రభుత్వం నెలకొల్పిన బాలల అకాడమిలో కొన్నాళ్లు పని చేయవలసినదని పట్టుబట్టి కృష్ణారావుగారు నన్ను రప్పించి సంస్థ బాధ్యతను అప్పగించారు. అందులకు వారికి ఋణపడి ఉన్నాను కూడ. పన్నెండేళ్లు అంటే 1976 నుంచి పదవీ విరమణ 1988లో చేసే వరకు మధ్య మధ్య బుద్ధ ప్రసాదు ఎన్నో సూచన లిచ్చి నన్ను ప్రోత్సహిస్తూ వచ్చేవారు. ఆయనకు బాల సాహిత్యం అంటే అభిమాన విషయం. తెలుగు పిల్లలకు వయసుకు తగ్గ పిల్లల సాహిత్యం అందించినప్పుడు నేటి బాలలు రేపటి పౌరులుగా ఎదగ గలుగుతారని బుద్ధ ప్రసాదు ఆలోచన. ఆయన సూచన మేరకే ఆ

పన్నెండేళ్ళు (12) లోనూ పిల్లల సాహిత్యాన్ని మూడు వర్గాలుగా వింగడించి బాలల అకాడమి అందించింది, ఆనాడు. అందులో ఆరేళ్ల లోపు పిల్లలకు చిన్నచిన్న పుస్తకాలు పెద్ద టైపులో డెబ్బయి శాతం బొమ్మలతో తయారు చేశాం. అవే 'బుజ్జి కథలు'. ఆ తరువాతి వర్గం 7-11 సంవత్సరాల వయసు పిల్లలకు బొమ్మల శాతం తగ్గించాం. అవి పంచదార చిలకలు, ఆ పైన 12 ఏళ్ల పైబడిన పిల్లలకు బొమ్మల శాతం బాగా తగ్గించాం. ఇందులో పిల్లల అందరి మన్నన లందుకున్న పుస్తకాలు. మన దేశ స్వాతంత్ర్య గాధను డి.రామలింగంచే ప్రత్యేకంగా రచింపజేసి అందించిన "స్వరాజ్యం నా జన్మహక్కు" మరొకటి.

తంద్రి కృష్ణారావు తనయుడు బుద్ధ ప్రసాదుల స్ఫూర్తితో బాలల అకాడమి నిర్వహించిన మరొక అపూర్వమైనదీ, వినూత్నమైనదే ఆంధ్రప్రదేశ్ దర్శన్ కార్యక్రమం. ఇది 1977 మే 11న ప్రారంభమై (డిస్కవర్ ఆంధ్రప్రదేశ్) జూన్ 12 నాడు ముగిసింది. ఇందులో రాష్ట్ర వ్యాప్తంగా ఒక పరీక్ష నెరపి 13-14 ఏళ్ళ బాలబాలికలను జిల్లాకు ఇద్దరు (ఒకరు పట్టణ ప్రాంతం మరొకరు గ్రామ ప్రాంతం) వంతున అప్పటి 22 జిల్లాల్లోంచి 44 మంది పిల్లల్ని రాష్ట్రమంతటా అన్ని జిల్లాల్లోని పర్యాటక స్థలాల్ని సందర్శింప చేసిన కార్యక్రమం అది. కృష్ణారావుగారు సమైక్యాంధ్ర వాది. అదిలాబాదు పిల్లలు చిత్తూరు సందర్శించి భావసమైక్యత చేకూర్చడానికి తలపెట్టిన కార్యక్రమం. అలాగనే శ్రీకాకుళం పిల్లలు అనంతపురం ప్రాంతాలను సందర్శించి ఒక సదవగాహన చేకూర్చడమే దాని లక్ష్యం ఇది ఈ సాంస్కృతిక విద్యాత్మక పర్యటన 30 రోజులకు పైగా 3500 కి.మీ. ఏకధాటిన జరిగిన కార్యక్రమం. ఈ పర్యటనను సినీ నిర్మాత పేకేటి శివరాం చలన చిత్రంగా రూపొందించారు. ఆర్.టి.సి. అందించిన రెండు సూపర్ డీలక్స్ బస్సులలో ఒక వైద్య బృందం కూడా వుండింది. ఈ రాష్ట్ర పర్యటనలో కవిరావు, మద్దిమల్లు వెంకట్రావు, పాలడుగు నాగయ్య, సూరిబాబు ప్రభృతులు అందించిన సహకారం మరువరానిది. పాల్గొన్న పిల్లలు ప్రతిరోజూ ఉదయం నాస్తా కాగానే ముందే సిద్ధపరిచిన కార్యక్రమం ప్రకారం ఆయా జిల్లాల్లోని పరిశ్రమలు, సుప్రసిద్ధ యాత్రా స్థలాలు, వ్యవసాయ క్షేత్రాలు, ఇలా ఎన్నో పర్యాటక అంశాలను తెలుసుకుని ఆనందోత్సాహాలు పొందేవారు. ఆనాడు పర్యటనా కార్యక్రమంలో పాల్గొన్న పిల్లలు ఇంజనీర్లు, డాక్టర్లు, సైంటిస్టులు, ఉన్నతాధికారులుగా ఈనాడు వెలుగొందుతున్నారు. ఇప్పటికే వీరిలో దేశంలో వున్నవారు పాతూరి లక్ష్మీనరసింహం చొరవతో సమావేశమై గత స్మృతులను స్మరించుకొంటూ వుంటారు.

మన కవుల చరితను పిల్లలకు పరిచయం చేయడానికి బొమ్మకంటి వెంకట శ్రీనివాసా చార్యులు అందించిన "మల్లెపూదండ' గానూ, ఎలక్ట్రానిక్ మీడియాలు భిన్న వయోవర్గాల పిల్లలకు పన్నెండు ఆడియో క్యాసెట్లు వాటికి అనుబంధంగా పుస్తకాలు పాటలు, గప్‌చిప్, కథ

కంచికి, అక్షరాభ్యాసం, కోలాటం పాటలు, చిలకమ్మ పెళ్లి వంటి ప్రయోగాలు బుద్ధ ప్రసాదు ఇవాళ ప్రోత్సాహ దోహదాలే కారణం.

తండ్రికి తగ్గ తనయుడుగా బుద్ధప్రసాదుకు గతదశాబ్ద కాలంలో ఎన్నో వినూత్న కార్యక్రమాలు చేపట్టి నిర్వహిస్తున్న సంగతి మన కందరికీ తెలుసు. కృష్ణారావు ఆనాడు అంటే మాకు ముందు దశాబ్దాల క్రితం ప్రపంచంలోని తెలుగు మాట్లాడే వారినందరిని ఒకే వేధిక పైకి తీసుకు రావడం జరిగింది. నాటి ప్రపంచ తెలుగు మహాసభల స్ఫూర్తిని కొనసాగించడానికే బుద్ధ ప్రసాదు మాతృ భాషాభిమానంలో ఎన్నో వినూత్న ప్రయోగాలు చేయడం ప్రారంభించారు. 2002లో శ్రీకాకుళంలో తెలుగు పెద్దలనందరిని సమీకరించారు. అది మొదలు విజయవాడలో జాతీయ తెలుగు రచయితల సభలు (2006)లో నిర్వహించారు. బుద్ధ ప్రసాదు అధ్యక్షతన "తెలుగు సమితి" (2005) ఏర్పడి ఇప్పటికి నాలుగు అపూర్వ గ్రంథాలను తెలుగు ప్రజానీకానికి అందించడానికి తోడ్పడ్డారు. అందులో "నా జీవిత యాత్ర" (టంగుటూరి ప్రకాశం), "నవ్యాంధ్ర నా జీవితం" (అయ్యదేవర కాళేశ్వరరావు), "నా యాత్రా స్మృతి' (దాశరథి కృష్ణమాచార్య) 'శ్రీకృష్ణదేవరాయ వైభవం' ఇప్పటి వరకూ వెలువడ్డాయి. 2007 ఫిబ్రవరిలో ఆయన పెద్దరికంలో నిర్వహించిన శ్రీకృష్ణదేవరాయ వైభవ ఉత్సవాలు బుద్ధ ప్రసాదు చారిత్రక దృక్పథం, భాషాభిమానం చాటి చెప్తున్నాయి. రెండేళ్ల క్రితం (2005) తెలుగు భాషకు "క్లాసికల్ లాంగ్వేజి" స్థాయి రాకపోవడంతో బుద్ధ ప్రసాదు నడుంబిగించి విస్తృత ప్రచారానికి నాందిపలికారు. ఆ సందర్భం లోనే 2006 ఫిబ్రవరి 21 నాడు "తెలుగు భాష - పరిణామక్రమం" అనే అంశంపై అరవయి పటాలను తయారు చేయించడానికి "తెలుగు సమితి" కి అప్పగించారు. నాటి తెలుగు భాషా చరిత్ర-శాతవాహన ప్రాకృత వాఙ్మయ కాలము నాటిది. అప్పటికి పురాణాలు, సంస్కృత భాష రంగప్రవేశము చేయలేదు. అంటే తెలుగు భాష 2000 సంవత్సరముల నుంచీ వివిధ సందర్భాలలో వాడుకలో వున్నట్లు తెలుస్తోంది. శాతవాహన చక్రవర్తి హాలుడు రచించిన 'గాథాసప్తశతి'లో తెలుగు పదాలు ఉపయోగించడం జరిగింది. ఇటువంటి విశేషాలన్నీ జనసామాన్యం దృష్టిలోకి రావాలన్నా, తెలుగు భాష, లిపి పరిణామాల పై సమగ్రమైన అవగాహన ఏర్పడాలన్నా, అందుకు దోహదం చేసేవి గతానికి చెందిన తీపిగురుతులే. తెలుగు సమితి కార్యదర్శిగా ఆ అరవై పటాలను డిజిటల్ ప్రింట్ (3' × 4') రూపకల్పన చేశాను. భద్రిరాజు కృష్ణమూర్తి, చేకూరి రామారావు, కె.కె. రంగనాధాచార్యులు, పుచ్చా పరబ్రహ్మశాస్త్రి, గారపాటి ఉమామహేశ్వరరావు, గాయత్రి, ద్వానాశాస్త్రి, వెలుదండ నిత్యానందరావు, వై.మల్లిఖార్జున్‌రావు ప్రభృతులు ఈ కార్యక్రమంలో సహకరించారు ఆ అంపటాలను "తెలుగు భాష-లిపి-పుట్టుక-పరిణామ క్రమంపై అవగాహన, చిత్రమాలిక-కొన్ని కొండగుర్తు"లుగా, ఆ గుర్తులు, ఆనవాళ్ళు, తెలుగులో నాటి శాసన పత్రాలు, తాళపత్రాలు, తామ్రపత్రాలు, కోణాల చిత్రాలు, తెలుగు

భాషపై చారిత్రక పరిశోధనా గ్రంథాలు, నిఘంటువులు, వ్యాకరణాలు, విజ్ఞాన సర్వస్వాలు వంటి భాషా పరికరాలతో "తెలుగు సమితి" ఒక ప్రదర్శన నిర్వహించినది. 2006 ఫిబ్రవరి 21, 22, 23 తేదీలలో హైదరాబాదు రవీంద్రభారతిలో రాష్ట్ర ప్రభుత్వం సాంస్కృతిక శాఖ, అధికారభాషా సంఘం, తెలుగు సిరి, తెలుగు భాషా శాస్త్రజ్ఞుల వేదిక సంయుక్త ఆధ్వర్యంలో జరిగింది. ఇవి బుద్ధ ప్రసాదు స్ఫూర్తి, ప్రోత్సాహముల వల్లనే జయప్రదమయ్యాయి. తదుపరి, ఈ పటాల సూక్ష్మ రూపాన్ని ఢిల్లీ తీసికొని వెళ్లి అక్కడ ప్రధాని మన్మోహన్ సింగ్, సాంస్కృతిక మంత్రి అంబికా సోనీ మున్నగు వారి ముందు పెట్టి తెలుగు బాషను ప్రాచీన శ్రేష్ఠ (క్లాసికల్) భాషగా పరిగణించడానికి అన్ని విధాల తగునని, బుద్ధ ప్రసాదు పాల్గొన్న బృందం వారు నివేదించారు.

"తెలుగు సమితి" అధ్యక్షులుగా బుద్ధ ప్రసాదు కొన్ని సూచనలు చేశారు. సమితి స్థాపక కార్యదర్శి భల్లమూడి మల్లిఖార్జున్‌రావు (మల్లిక్ స్వర్గస్తులైనారు) తలపెట్టిన తెలుగు పదసంపద (కార్పస్)ను మహా నిఘంటువుగా సమకూర్చి వెలువ రించాలన్న ధ్యేయాన్ని సాకారం చేయాలని బుద్ధ ప్రసాదు పట్టుదలతో ఉన్నారు. ఇందుకు ఇటీవల ఆయన రాష్ట్ర ప్రభుత్వంలో పశు సంవర్ధక శాఖామంత్రిగా చేపట్టిన తరుణంలో తెలుగుసమితి "పశుజ్ఞాన సంచిక" (ఎన్‌సైక్లో పీడియా ఆఫ్ ఏనిమల్ హజ్బెండరీ)ను నిర్మింపజేసి త్వరలో వెటర్నరీ యూనివర్శిటీ ద్వారా విడుదల చేయాలన్న లక్ష్యాన్ని బయట పెట్టారు.

బుద్ధ ప్రసాదు తండ్రి నుండి కొన్ని రాజకీయ సాంస్కృతిక విలువల్ని పుణికి పుచ్చు కున్నారు. ఈయన మూర్తిమత్వంలో రాజకీయ నాయకత్వ లక్షణాల కంటే రాజనీతిజ్ఞత పాలు ఎక్కువ వున్నట్లు కన్పిస్తుంది. విపక్షంలో వున్నా, స్వపక్షంలో వున్నా బుద్ధ ప్రసాదు తన నియోజకవర్గ జనావళి నాడిని పట్టి వారికి ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలు సజావుగా అందేటట్టూ, ఎవరితోనూ నొప్పిలేకుండ చేసుకుపోయే తీరు తెన్నులు ఆయన రాజనీతిజ్ఞతకు తార్కాణంగా నిలుస్తుంది !

# లక్ష్యనిబద్ధత - 'మండలి' ప్రత్యేకత

## మంత్రివర్యులతో ఇష్టాగోష్ఠి

- శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్

ఆంధ్రప్రదేశ్ పశుగణాభివృద్ధి, పాడిపరిశ్రమ, వెటర్నరీ యూనివర్సిటీ, మత్స్యశాఖా మాత్యులుగ ముఖ్యమంత్రి డాక్టర్ వై.ఎస్.రాజశేఖరరెడ్డి గారిచేత ఈ నెల 29న నియమింపబడిన నాటి నుండీ తన శాఖల పనితీరుపై దృష్టిట సారించి, తనదైన శైలిలో శ్రీ బుద్ధప్రసాద్ పనిచేస్తున్నారు. బుద్ధ ప్రసాద్‌కు పదవీబాధ్యతలు అప్పగించిన వెంటనే ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డి ఆ శాఖా అధిపతులతో సమీక్షా సమావేశం ఏర్పాటుచేసి ప్రభుత్వం రానున్న రెండు సంవత్సరాలలో అధిక నిధులు కేటాయించి ఈ శాఖలకు ప్రాధాన్యత సంతరింప చేయనుందని "కమిట్‌మెంట్" ఉన్న బుద్ధ ప్రసాద్‌కి అందుకే ఈ శాఖను కేటాయించడం జరిగిందని చెప్పారు.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను ప్రభావితం చేసే శక్తి, సత్తా, పాడిపరిశ్రమకు మాత్రమే ఉందన్న సత్యాన్ని గమనించిన ముఖ్యమంత్రి ఈశాఖకు 500 కోట్లు ప్రత్యేక ప్యాకేజిగ ఈ ఏడాది ఇచ్చారు. కేవలం వ్యవసాయంపై ఆధారపడి జీవించడం కష్టసాధ్యమవుతున్న తరుణంలో పశుపోషణ చేపట్టి, జీవన పరిస్థితులు మెరుగు పరచుకొనేలా చేయాలన్నది ముఖ్యమంత్రిగారి ఆశయం.

ముఖ్యమంత్రిగారి సదాశయాన్ని ప్రజల మధ్యకి తీసుకెళ్ళే బాధ్యతని శ్రీ బుద్ధప్రసాద్ భుజాల కెత్తుకున్నారు.

శాఖను చేపట్టిన వెంటనే శాఖాధిపతులను సమావేశపరచి తన లక్ష్యాన్ని వారికి వివరించారు. ఎన్నో సూచనలిచ్చి వారిని అబ్బురపరిచారు.

పశుగణాభివృద్ధి శాఖ ప్రత్యేక ప్రధాన కార్యదర్శి డాక్టర్ ప్రియదర్శిదాస్, పశుగణాభివృద్ధి శాఖ డైరక్టర్ డాక్టర్ ఎల్.మోహన్, మత్స్యశాఖ కమిషనర్ శ్రీ ఎన్.నరసింహారావు పాడి పరిశ్రమ అభివృద్ధి సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ అదర్ సిన్హా, అంధ్రప్రదేశ్ పశుగణాభివృద్ధి సంస్థ ముఖ్య

కార్యనిర్వహణాధికారి డాక్టర్ వై.ఈశ్వరయ్య ప్రభృతులుతో శ్రీ మండలి శ్రీ బుద్ధప్రసాద్ తరచు సమావేశాలు జరుపుతూ శాఖపురోభివృద్ధికి కృషి గావిస్తున్నారు.

తన స్వంత జిల్లా కృష్ణాజిల్లాలో మంత్రిగా జిల్లాకు వచ్చిన వెంటనే కలెక్టర్ శ్రీ నవీన్ మిట్టల్ ఆధ్వర్యంలో శాఖాధిపతులు సమావేశాన్ని నిర్వహించి జిల్లాలో తన శాఖద్వారా చేపట్టవలసిన కార్యక్రమాలపై ఒక ప్రణాళిక రూపొందించారు.

పశుగణాభివృద్ధి శాఖలో పనిచేస్తున్న అధికారులతో ఆ శాఖసంచాలకులు డాక్టర్ ఎల్.మోహన్‌గారి ఆధ్వర్యంలో విజయవాడలో సమీక్షా సమావేశం నిర్వహించారు.

మత్స్యశాఖ సంచాలకులు శ్రీ నరసింహరావుతో కలసి జిల్లాలోని పెనమలూరు, మోటూరు, పల్లెవాడలలోని మత్స్యవిత్తనాభివృద్ధి క్షేత్రాలను సందర్శించారు. కైకలూరులోని ఆక్వాలాబ్, బందరులోని ఫిషింగ్ హార్బర్‌ను సందర్శించి బోటు యజమానులతో సమావేశమై జూన్ నెలలో ఫిషింగ్ హార్బర్‌లో కార్యక్రమాలు ప్రారంభమయ్యేలా ఆదేశాలిచ్చారు. ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సమాఖ్య, గ్రామీణాభివృద్ధి శాఖలోని ఇందిరా క్రాంతి పథకంతో కలసి పనిచేయడానికి మే 17న జూబ్లిహాలులో ఒక వర్క్‌షాప్ నిర్వహించారు. గ్రామీణాభివృద్ధి శాఖామంత్రి డాక్టర్ చిన్నారెడ్డి కూడా ఈ సమావేశానికి హాజరైనారు. మే19న తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర పశువైద్య విశ్వవిద్యాలయాన్ని సందర్శించి వివిధ విభాగాల పనితీరుని పరిశీలించారు. విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ డాక్టర్ మన్మోషన్‌సింగ్ ఆధ్వర్యంలో జరిగిన సమీక్షా సమావేశంలో విశ్వవిద్యాలయ అభివృద్ధికి తనవంతు సహకారము అందిస్తానని వాగ్దానం చేశారు.

పశుగణాభివృద్ధి, పాడిపరిశ్రమ, వెటర్నరీ యూనివర్సిటి, మత్స్యశాఖలలో చేపట్టనున్న కార్యక్రమాల గురించి శ్రీ బుద్ధ ప్రసాద్‌గారి ఆలోచనలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

**ప్ర. ఈ ఏడాది ముఖ్యమంత్రిగారు ప్రత్యేక ప్యాకేజిగ ఇచ్చిన 500 కోట్లలో ఏమేం ప్రణాళికలు చేపట్టనున్నారు ?**

జ. ముఖ్యమంత్రిగారు మా శాఖలకు ఇచ్చిన 500 కోట్లలో పశుగణాభివృద్ధి శాఖకు రు.275 కోట్లు, ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్యకు రూ. 120 కోట్లు, మత్స్యశాఖకు రూ. 75 కోట్లు శ్రీ వెంకటేశ్వర వెటర్నరీ యూనివర్సిటికి రూ. 30 కోట్లు కేటాయించాం.

ప్ర. సబ్సిడి పై పాడిపశువులు ఇచ్చే కార్యక్రమం పెద్ద ఎత్తున చేపట్టే ఉద్దేశముందా ?

జ. ముఖ్యమంత్రిగారు రైతులకు ఆర్థిక ఆసరా ఇచ్చుటకు పాడిపరిశ్రమను పెంపొందించాలని, వ్యవసాయాభివృద్ధిలో పాడి పరిశ్రమ, మత్స్య పరిశ్రమలు కూడా గణనీయమైన పాత్ర పోషించాలని అభిప్రాయంతో ఉన్నారు.

ముఖ్యమంత్రి గారి పథకము క్రింద 25 శాతము సబ్బిడిపై లక్ష పాడి పశువులు; 23000 యూనిట్ల గొర్రెలు, మేకలు, 7000 పొట్టేలు పెంపకము యూనిట్లు ఇవ్వడానికి ఈ ఏడాది 100 కోట్లు ఖర్చుపెట్టనున్నాము.

ప్రధానమంత్రి పతకము క్రింద రైతుల సహాయార్థం, ఆత్మహత్యలకు పాల్పడిన జిల్లాల్లో ఆత్మహత్యల నివారణకై ప్రతి జిల్లాకు 2 వేల పాడి పశువులును 50 శాతం సబ్సిడి పై పంపిణీ చేయుటకు 48 కోట్లు కేటాయింపులు జరిగియి.

అలాగే దూడల పెంపకము, పశుగ్రాస అభివృద్ధికి 28 కోట్ల రూపాయలతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలకు నిధులు కేటాయించారు.

ప్ర. **పశు వైద్యశాలలకు చాలాచోట్ల భవనాలు లేవు. ఉన్నా శిథిలావస్థలో ఉన్నాయి. వాటి వాటి విషయమై ఏమి ఆలోచిస్తున్నారు ?**

జ. 26 కోట్లతో రాష్ట్రంలో 1000 పశువైద్యశాల భవనాలు నిర్మించనున్నాము. అలాగే మరమ్మత్తులను కూడా చేపట్టనున్నాం.

అంతేకాకుండా పశువైద్య కేంద్రాలలో రైతులకు ఉన్నత సేవలు అందించుట కొరకు కావల్సిన పరికరాలు, టీకా మందులు నిల్వయుంచుటకు శీతలీకరణ పరికరాలు ఏర్పర్చుటకు రూ. 30 కోట్లు కేటాయించడం జరిగింది.

ప్ర. **వ్యాధి నిరోధక చర్యలు ఏ విధంగా చేపట్టనున్నారు.**

జ. జిల్లా స్థాయిలోని 23 వ్యాధి నిర్ధారణ కేంద్రాలను ఆధునీకరించి, ప్రతి జిల్లాలో సంచార వ్యాధి నిర్ధారణ కేంద్రాలను ఏర్పాటు చేయనున్నాము.

సామర్లకోట, వి.బి.ఆర్.వి., హైదరాబాద్‌లోని టీకా మందుల ఉత్పత్తి కేంద్రాలను ఆధునీకరించి, కడపలో నూతనంగ ఆధునిక టీకా మందుల ఉత్పత్తి కేంద్రంను స్థాపించుటకు 31 కోట్లు వ్యయం చేయనున్నాం.

ప్ర. **గొర్రెల, మేకల పెంపకం దారులకుఏ విధమైన సహకారము అందిస్తారు ?**

జ. రాష్ట్రమంతట గొర్రెల భీమా పథకం పెద్ద ఎత్తున చేపట్టాము. గొర్రెల, మేకల సహకార సంస్థలను ఫెడరేషన్‌ను బలోపేతం చేయుటకు 25 కోట్లు ఖర్చు చేయనున్నానం. 25 శాతం సబ్సిడిపై 23 వేల యూనిట్ల గొర్రెల, మేకల యూనిట్లు ఇస్తున్నాం. 25 శాతం సబ్సిడిపై 7000 యూనిట్ల పొట్టేల్లు ఇవ్వనున్నానము. 50 శాతం సబ్సిడి పై పెరట్లో దేశవాళి కోళ్ల పెంపకము 10 వేల యూనిట్లు ఇవ్వనున్నాము. అలాగే ఫిష్ మార్కెట్ యార్డ్స్ నిర్మాణానికి 5 కోట్లు ఖర్చుచేస్తాము.

★ **ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య చేపట్టనున్న కార్యక్రమాలు గురించి వివరిస్తారా ?**

జ. సి.యం. ప్యాకేజి క్రింద 75 కోట్లతో 136 బల్క్ కూలింగ్ సెంటర్లు ఏర్పాటు చేయనున్నాము. ప్రధానమంత్రి ప్యాకేజి క్రింద 26 బల్క్ కూలింగ్ సెంటర్లు 6.24 కోట్లతో ఏర్పాటు అవుతున్నాయి. ప్రతి మండలంలోను బల్క్ కూలింగ్ సెంటర్ ఉండేలా చర్యలు చేపట్టనున్నాము.

బల్క్ కూలింగ్ సెంటర్లు మహిళలతో నిర్వహింపజేసి, వారి ఆర్థిక స్తోమత పెంచుటకు కృషి చేయనున్నాము. ఇందునిమిత్తమై ఇందిరా క్రాంతి పథకం మహిళా సంఘాలను ఫీడ్ సబ్సిడికి 10 కోట్లు, జిల్లా పాల డైరీలకు కోటి రూపాయలు చొప్పున 5 కోట్లు కేటాయించాం. హైదరాబాద్‌లోని మిల్క్ ప్రోడక్ట్సు ఫ్యాక్టరి ఆధునీకరణకు 10 కోట్లు, గోదావరి మిల్క్ యూనియన్ పునరావాసానికి 20 కోట్లు ఖర్చు పెడుతున్నాము.

★ **మత్స్యశాఖ ద్వారా మీరు చేపట్టనున్న కార్యక్రమాలు ?**

జ. ముఖ్యమంత్రి ప్యాకేజిలో మత్స్యశాఖ ద్వారా రు. 75 కోట్లు ఖర్చు చేయనున్నాము. 50 శాతం సబ్సిడిపై 15,000 మందికి పడవలు, వలలు అందజేయడానికి రూ. 375 కోట్లు ఖర్చుచేయనున్నాము. మహిళా మత్స్య సహకార సంఘాల ద్వారా జీవనోపాధి కార్యక్రమాలు అమలుచేయుటకు 20 కోట్లు ఖర్చు చేయబోతున్నాము. అలాగే సముద్ర తీర గ్రామాలలో 15 లక్షలతో 50 కమ్యూనిటి హాళ్లను, మంచినీటి మత్స్య పారిశ్రామికులు నివసించే ప్రాంతాల్లో 5 లక్షల వ్యయంతో 50 కమ్యూనిటి హాళ్లను నిర్మించబోతున్నాము. మినాఫిగ్ ల్యాండింగ్ సెంటర్లు, ఫిష్ మార్కెట్లు, ఆధునీకరణ, 75 శాతం సబ్సిడిపై 10 వేల మందికి విన్‌బాక్సులు సరఫరా, అలాగే సముద్రంలో వేటాడే నావికులకు లైఫ్ జాకెట్లు 75 శాతం సబ్సిడిపై ఇవ్వనున్నాము.

★ **శ్రీ వెంకటేశ్వర పశువైద్య విశ్వవిద్యాలయం ప్రజాభివృద్ధికి ఏ విధమైన చర్యలు చేపట్టనున్నారు ?**

జ. శ్రీ వెంకటేశ్వర పశు వైద్య విశ్వవిద్యాలయం ముఖ్యమంత్రిగారి మానసిక పుత్రిక 15-7-2005న దీనికి ప్రారంభోత్సవం చేశారు. పశువైద్య శాస్త్రము మరియు మత్స్య శాస్త్రంలోని వివిధ శాఖలకు సంబంధించి విద్యను బోధించుట, పరిశోధనలు చేపట్టుట, రైతులకు కావలసిన సమాచారం, పరిజ్ఞానం ఇచ్చుట ఈ విశ్వవిద్యాలయ ముఖ్యోద్దేశాలు.

రైతు సోదరులకు ఉపయోగపడే విధంగా 2.5 కోట్లతో ఒక హాస్టల్ నిర్మాణము చేపట్టనున్నాము. రైతులు ఈహాస్టల్‌లో ఒక వారం రోజులపాటు బసచేసి తమ

పరిజ్ఞానము పెంపొందించుటకు ఉపయోగపడుతుంది. అలాగే తిరుపతి, గన్నవరం, రాజేంద్రనగర్‌లలో రైతు సమాచార కేంద్రాలు ఏర్పాటు చేయనున్నాము.

నెల్లూరు జిల్లా రాపూరు, మెదక్ జిల్లా సిద్దిపేటలలో పశు సంవర్ధక పాలిటెక్నిక్‌లు అవనిగడ్డ ప్రాంతంలోని భావదేవరపల్లిలో ఫిషరీస్ పాలిటెక్కిక్ నెలకొల్పబోతున్నాము. రాష్ట్రంలోనే మొట్టమొదటగ ఏర్పాటు కానున్న మత్స్య పాలిటెక్నిక్,

కడప జిల్లాలో 100 కోట్ల బడ్జెట్‌తో అంతర్జాతీయ స్థాయి పశు పరిశోధనా సంస్థ స్థాపించనున్నాము.

రైతుల సలహా సంప్రదింపుల కోసం పశు వైద్యవిశ్వవిద్యాలయంలో ఉచిత ఫోను సౌకర్యం స్థాపించనున్నాము.

రాష్ట్రంలోని మూడు పశువైద్య కళాశాలల్లో సీట్ల సంఖ్య 175 నుండి 300 వరకు పెంచడానికి ప్రయత్నాలు చేస్తున్నాము.

పశువైద్య విద్యార్థుల ఉపకార వేతనాలు గణనీయంగా పెంచుతూ ఉత్తర్వులు జారీ చేయడమైంది.

B.V.S.C. స్టైఫండ్ రూ. 1200 లు నుంచి రూ. 2500 లు కు

M.U.S.C. స్టైఫండ్ రూ. 1800 లు నుంచి రూ. 3,500 లు కు,

Phd. స్టైఫండ్ రూ. 2 వేలు నుంచి 4 వేలకు పెంచడమైంది.

ఈ చర్యలవల్ల మన రాష్ట్రంలో పశువైద్యం అభ్యసించే వారి సంఖ్యగణనీయంగ పెరిగి, మన రాష్ట్ర అవసరాలకు తగినవిధంగ పశువైద్య పట్టభద్రులు తయారు కాగలరని విశ్వసిస్తున్నాము.

శ్రీ బుద్ధ ప్రసాద్ తన మంత్రిత్వ శాఖలకు కొత్త ఊపు-రూపు ఇస్తారనడంలో ఎటువంటి సందేహమూ లేదు. పదవిని స్వీకరించిన నెలరోజులలోపే అధికారులతో ఆయన జరిపిన కసరత్తులు, క్షేత్ర పర్యటనలు అందుకు నిదర్శనలు. హైదరాబాద్ ఎల్.బి. నగర్‌లో రెండేళ్ల క్రితం నిర్మించిన ఫిష్ మార్కెట్ ప్రారంభానికి నోచుకోని సంగతిని అధికారులతో ఆకస్మిక పర్యటన జరిపి 20 రోజుల్లో దానిని ప్రారంభింప చేయాలని అధికారులకు ఆదేశాలిచ్చారు.

ఇంతకాలం లేని ప్రాధాన్యతను పశుగణాభివృద్ధి మత్స్య శాఖలకు మంత్రి శ్రీ బుద్ధ ప్రసాద్ కల్పిస్తారు. జయోస్తు !

○

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.V.POIQ114 | Date | 17-3-2021 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | 216, | | |
| Missing Pages | NO | | |
| Prepared | G.Sonddevi | Scanned | Ramya |
| BOOK SIZE | H 8.4 W 5.5 | Pages | 261 |

218

సమాజ సేవలో

# ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్

ప్రముఖ పుస్తక విక్రేత, పబ్లిషర్, స్వర్గీయ ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు గారి స్ఫూర్తితో , 2003 లో జరిగిన వారి ప్రథమ వర్ధంతి నుంచి పేదలకు అన్నదానం, వస్త్ర దానం, వికలాంగులకు ట్రై సైకిళ్ళ పంపిణీ, పేద విద్యార్థులకు స్కాలర్‌షిప్పుగా ధన సహాయం, ప్రభుత్వ పాఠశాల విద్యార్థులకు డిక్షనరీలు, పాఠ్య పుస్తకాలు స్కూలు యూనిఫారాలు, నోట్ బుక్స్ పంపిణీ,పేద మహిళలకు కుట్టు మిషన్ల పంపిణీ, మెడికల్ క్యాంపుల నిర్వహణ, ఉచిత మందుల పంపిణీ వంటి అనేక కార్యక్రమాల నుంచి అయిదు సంవత్సరాలుగా నిరంతరం సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నది.



జననం : 06-11-1955  మరణం : 20-02-2002

కీ॥ శే॥ ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు గారు

మెనేజింగ్ ట్రస్టి : లయన్ ఇమ్మడిశెట్టి రామకుమార్ PMJF

**ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్**

డోర్. నెం. 11-16-32ఎ, సింగరాజు వారి వీధి, కొత్తపేట, విజయవాడ - 1.

116.V




డా॥ జి.వి. పూర్ణచంద్
రచన బ్రిటిష్ యుగం
కృతి స్వీకార సందర్భంగా....



న్యాయవాది
శ్రీ నరహరిశెట్టి
నరసింహారావు గారితో....



కవి
శ్రీ తాతా రమేశ్‌బాబుతో....




కాలచక్ర బౌద్ధ
మహాసభలలో....